# అమృతవాహిని

(౩౧౩ మహాపురుషుల సుభాషితములు)

## రెండవ భాగము



ప్రకాశకులు

సర్వోదయాశ్రమము

సర్వేలు, నల్లగొండజిల్లా

1969

# విజ్ఞప్తి

భగవత్కృపా విశేషమున ఈ ఆశ్రమ పక్షమున "అమృత వాహిని"-మొదటి సంపుటము "500 మహాపురుషుల సుభాషితము" లను పేరుతో ప్రచురింపబడినవి. ఇప్పుడు దీని కనుబంధముగా "3౧3 మహాపురుషుల సుభాషితము"లను పేరుతో రెండవ సంపుటము వెలువడుచున్నది.

ఇవిగాక "అమృత వాహిని - వేదోపనిషదాది సూక్తు"లను పేరుతో మొదటి సంపుటము, దీని కనుబంధముగా "అమృత వాహిని - పురాణ సూక్తు"లను పేరుతో రెండవ సంపుటము వెలువడినవి.

ఈ గ్రంథములో ప్రమాదవశమున దొరలిన పొరపాట్లను సవరించుకొని, ఇందలి సద్విషయములను గ్రహించవలసినదిగా పాఠకమహాశయులను కోరుచున్నాము. ఏ వేని దోసగులు కన్పించినచో వానిని మాకు తెలిపిన యెడల పునర్ముద్రణమున సవరించుకొనగలము.

ఈ గ్రంథములో చేర్చిన విషయములను ఈ ఆశ్రమ సభ్యులలో నొకరు సంకలనము చేసిరి. వారికిని, వీనిని సమకూర్చుటకును వ్రాయుటకును నివాసభోజనాదులతో సహా సకల సౌకర్యములు ఒనగూర్చిన శ్రీమాన్ జమ్నాదాస్‌థామ్‌జీ (భగవత్‌జీ) గారికిని మేము కృతజ్ఞులము. వీనిని గురించి అప్పుడప్పుడు తగు సలహాల నిచ్చి సహాయపడిన శ్రీయుతులు దివాకర్ల వెంకటావధానిగారికిని, వ్రాతప్రతులను శ్రద్ధతో పరిశీలించి సవరణలు సూచించి తోడ్పడిన శ్రీ పైడిమఱ్ఱి వెంకటసుబ్బారావుగారికిని, శ్రీమాన్ కోదాటి నారాయణరావుగారికిని, పులిజాల హనుమంతరావుగారికిని, శ్రమ అనక శ్రద్ధతో ప్రతులువ్రాసిన శ్రీ పి. రామచంద్రయ్యగారికిని కృతజ్ఞులము.

ఈ అమృతవాహిని సుభాషితములు రెండు సంపుటములు చక్కగా ముద్రించిన సర్వోదయ ప్రెస్ పనివారికి, దీని వ్యవస్థాపకులగు శ్రీమాన్ పాతూరి నాగభూషణంగారికిని, ఈ పుస్తకాల ప్రచురణ కార్యక్రమములో తోడ్పడిన తదితర మిత్రులందరకును మేము కృతజ్ఞులము.

సర్వేలు<br>
౧౦-౩-౧౯౭౯

ఇట్లు విధేయులు,<br>
సర్వోదయ ఆశ్రమం ట్రస్టీలు

# అనుక్రమణిక



ఓం సహనావవతు । సహనౌభునక్తు ।
సహవీర్యంకరవావహై । తేజస్వినావధీతమస్తు ।
మావిద్విషావహై॥
ఓం శాంతిః । శాంతిః । శాంతిః ॥

ఆ పరమాత్మ మనతోకూడ నుండి మనలను రక్షించుగాక !
ఆ పరమాత్మ మనతోకూడ నుండియే మనకు సుఖమును
కలిగించు గాక ! మన విద్యకు (అధీతి బోధలకు)
బలము కలుగునట్లుగా మనము కలసి ప్రయ
త్నింతము, మన అధ్యయనము ఆచరణ
ప్రచారములు కలుగునది అగుగాక !
మనము ద్వేషభావము లేనివారమై
ఉందుము గాక !

ఓం శాంతిః । శాంతిః । శాంతిః ॥

# అమృతవాహిని

## ౧ శ్రీ సౌభరి ఋషి

౧. ఋగ్వేదమునకు మూలపురుషుడును, దయామూర్తియు
నగు సౌభరి ఋషి చరిత్ర వేద పురాణ ఉపనిషాదులలో కలదు.
వీరు బృందావన సమీపములో కాళిందీ నదీతీరమున గల రమణ
ద్వీపమునందు నివసించుచుండెడివారు. ఇపుడు ఈ ప్రదేశము
"సునరఖ్" అను పేరుతో పిలువబడుచున్నది. సౌభరి మహర్షి
యమునానదీ జలములో సమాధిస్థుడై అనేక సంవత్సరములు తపస్సు
చేయుచుండెను. ఒకరోజు బాహ్యస్మృతి కలిగి, కండ్లు తెరచి
నంతనే ఆ ఋషికి అందు రెండు చేపలు సంగమము చేయుచుండుట
కానుపించెను. అట్టి కుసంగ ప్రభావమువలన అతని మనస్సు
చలించి కామపీడితుడై అయోధ్యా నగరాధీశుడగు మాంధాత
యొద్దకరిగి ఆతనికి గల ఏబదిమంది కుమార్తెలను వివాహమాడి
తన తపఃప్రభావమున స్వర్గతుల్యమగు నగరమును, దానికి తగు
సౌకర్యములను సృజించి అనేకసంవత్సరములు వారితో విషయభోగ
ములను పొందుచుండ గొప్పగా పంచసహస్ర (౫౦౦౦) పరివారము
పెరిగెను. అట్లు సంసార లంపటములో జిక్కుకొని అనేక దుఃఖముల
ననుభవించెను. తుదకు పూర్వస్మృతి కలిగి ఇట్లు విచారించెను.
ఔరా! నేనెట్టిపని చేసితిని? విషయలోలుపమగు మత్స్యముల
క్షణకాల సాంగత్యమువలన నేనుకూడ విషయలోలుడనైతిని.
విషయలంపటుల క్షణిక సాంగత్యముచే దుష్పరిణామము సంభ
వించెనని ఒక కేకవేసి ఇట్లు పలికెను.

౨. ఓ మానవులారా! ఈ నా పతనస్థితిని చూడుడు. నేను
వ్రతనిష్ఠలో తత్పరుడనై సచ్చరిత్రుడగు తపస్విగానుండి జలమధ్య

మున మత్స్యసంగమమును చూచి, వేల సంవత్సరములనుండి సంపా దించినట్టి నా బ్రహ్మతేజమును విషయసుఖమునకై పోగొట్టు కొంటిని.

3. ఓ సాధకులారా! విషయాసక్తులును, కామపీడితులు నగు వారి సాంగత్య మెన్నటికిని చేయకుడు. నిస్సంగమే ముక్తి మార్గము. సంగమే సమస్త దోషములకు మూలము. సత్సంగమే పరమునకు హేతువు. దుస్సంగమే పతనమునకు హేతువు అని పలికి దుస్సంగముచే యోగారూఢుడగు యోగికూడ పడిపోవుచుండ, నిక అల్పశక్తిగల జీవుల లెక్కేమి! అని విచారించి సర్వమును విడచి వానప్రస్థ సన్యాసాశ్రమముల ధర్మములను పాలించుచు తుదకు బ్రహ్మలో లీనమైరి.

## ౨ శ్రీ తులాధారుడను శూద్రుడు

౧ త్రేతాయుగమం దొక గ్రామములో తులాధారుడను పేరుగల శూద్రుడు సత్యవాది, నిర్లోభుడు, విరక్తుడు, భగవ ద్భక్తుడు. అతడు అతి దరిద్రుడై యుండియు, ఇతరులను యాచిం పక కాలము గడుపు చుండెను. అంత నొకరోజు భగవంతుడు ఆతని పరీక్షింప జ్యోతిషుని రూపమున ప్రత్యక్షమై అతనితో ఇట్లనెను. "వత్సా! సంసారములో ధన ఐశ్వర్యాదులే సారములు. ధనము ద్వారానే మానవుడు సుఖ సన్మానములను పొందును."

౨. అనిన విని తులాదారుడు - ఓ దేవుడా! నాకు ధనమం దాసక్తి లేదు. ధనము జీవుని బంధించునట్టి గొప్ప వలవంటిది. ధనేచ్ఛ గలవాడు ముక్తినొందుట కల్ల. ధనాసక్తిచే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాది దుర్గుణములు ప్రవేశించి పతితు డగును. ధనాఢ్యునిపై భాగ్యవంతులకు, దరిద్రులకు, దొంగలకు, రాజులకు, అధికారులకు ఈర్ష్యాద్వేషములు కలిగి అనేక ప్రాణ సంకటము లేర్పడును. కావున, స్వామీ! నాకు ధన మక్కరలేదు.

దరిద్రమే నాకు పరమసుఖము. ధనహీనుడనైన నేను గొప్ప ఆనందమును అనుభవించుచున్నాను. లోభి కెన్నటికిని శాంతి చేకూరదు. వానికి నరకద్వారము సదా తెరువబడి యుండును. లోభమే సర్వపాపములకు మూలము. ఇహ పరలోక సుఖములన్నియు అసత్యములు, అనిత్యములు. వాటిలో సుఖమున్నదని తలంచుట మోసము, వెర్రితనము. కావున, ఓ దేవా! మీరు నన్ను ఆ మోహ కూపములో పడద్రోయకుడు.

3. అకామమే స్వధర్మము. అక్రోధమే తీర్థసేవనము. దయయే మంత్రజపము. సంతోషమే పరిశుద్ధ ద్రవ్యము. అహింసయే పరమసిద్ధి. ఉంఛవృత్తియే ఉత్తమవృత్తి. ఉపవాసమే పరమతపము. శాకాహారమే అమృతము. దొరికినదానితో సంతోషపడుటే పరమసుఖము. పరస్త్రీ తల్లితో సమముగను, లేక విషసర్పముతో సమముగను, పరధనము విషముతో సమముగను భావించుట సర్వశ్రేష్ఠము. అడుసు త్రొక్కనేల, కాలు కడుగనేల అనునట్లు విషయములన్నిటికి దూరముండుటే ఉత్తమము. అని ప్రార్థించెను.

## ౩ బకదాలభ్యముని, అర్జునుల సంవాదము

౧. అర్జునుడు :-ఓ మునీ! నీవు నివసించుటకు కుటీరమును ఏర్పరచుకొనలేదెందులకు? అనిన-

ముని :- వత్సా! పత్నీ, పరిగ్రహము మహా గొప్ప కష్టదాయకములు. వీనిచే తృష్ణ పెరుగును. అది పాపమునకు మూలము, దాన అధోగతి ప్రాప్తించును. వీని పాలించి పోషించుటలో కర్తవ్యా కర్తవ్యములయొక్క విచారశక్తి నశించును. విచారశక్తియే లేనపుడు మోక్షమెట్లు లభించును?

౨. స్త్రీరూపమను పాశముచే బంధింపబడిన గృహస్థుడు సదా చింతామగ్నుడై యుండును. అతనికి ధర్మమార్గము దేమాత్రము

ధ్యానముండదు. కావున, నేను వివాహము చేసికొనలేదు. నివసించుటకు గుడిసెనుకూడా నిర్మించుకొనలేదు. ఎందుకన, నా ఆయువు అతి స్వల్పము. అనిన-

అర్జునుడు :- మహాత్మా! నీ ఆయుః ప్రమాణమేమి?

ముని :- అర్జునా! ఇంతవర కెందరు మార్కండేయులు, ఎందరు లోమషఋషులు నాముందర గతించిరో, వారిని సరిగ లెక్కపెట్టలేను. నేను ఇచ్చట కూర్చున్నప్పటినుండి ఇంతవరకు యిరువది బ్రహ్మలు మారిరి. అయినను నా ఆయువు అతి స్వల్పమనియే తోచుచున్నది. కావుననే నేను గుడిసెను కట్టుకొనలేదు. ఈ నశ్వరసంసారము మరిమరి నశించుచుండును. బ్రహ్మకు అంత్యకాలము సమీపించినపుడెల్లను జగత్తు జలమయమగును. కావున, ఓ అర్జునా! ఉత్తము పురుషుడు గర్వింపకూడదు. కర్తనను భావముండరాదు. నేనను అహంభావమే పతనహేతువు.

## ౪ శ్రీ భర్తృహరి సుభాషితము

నీతిమార్గము :

౧. తెలియనివానికి సులభముగ దెలుపవచ్చును. చక్కగ తెలిసినవానికి సమాధానము చెప్పుట మరింత సులభము. స్వల్ప జ్ఞానము కలిగి సర్వజ్ఞుడనని గర్వపడు వానిని సృష్టికర్తయగు బ్రహ్మయు రంజింపజేయలేదు.

౨. ప్రయత్నపడి ఇసుకనుండికూడ చమురు తీయవచ్చును. ఎండమావులందు సైతము నీటిని సంపాదించి త్రాగవచ్చును. తిరిగితిరిగి కుందేటి కొమ్మునైనను సాధింపవచ్చును. కాని, దురాగ్రహము గల మూఢుని మనస్సును మాత్రము సమాధానపెట్టుట సాధ్యముగాదు.

3. మదపుటేనుగును తామరతూటితో బంధింప జూచువాడును, దిరిసెనపువ్వు కొనచేత వజ్రమును గోయ జూచువాడును,

లవణసముద్రమునందలి నీటిని తియ్యగా జేయుటకు నం దొక తేనె బొట్టును విడుచువాడును, మంచిమాటలతో మూర్ఖులను సమాధాన పెట్ట దలచువాడును సమానులు.

౮. గంగానది ప్రథమమున ఆకాశమునుండి ఈశ్వరుని తల మీదను, అచ్చటినుండి హిమవత్పర్వతముమీదను, ఆ పర్వతము నుండి భూమిమీదను, భూమినుండి సముద్రమునకును, అచటినుండి పాతాళమునకును వచ్చెను. గొప్ప స్థితినుండి తొలగినవారి కిదే విధముగ పలువిధములగు పాట్లు సంభవించును.

౯. అగ్నికి జలము, ఎండకు గొడుగు, మదగజమునకు అంకుశము, ఎద్దు గాడిద మొదలగు జంతువులకు కఱ్ఱ, రోగమునకు వివిధములగు మందులు, సర్పవిషమునకు పలువిధములగు మంత్రములు, శాస్త్రములందు నివారకములుగ చెప్పబడి యున్నవి. కాని మూర్ఖుని మూర్ఖత్వమును పోగొట్టునట్టి ఔషధ మే శాస్త్రమునందును చెప్పబడలేదు.

౧౦. బ్రహ్మకు హంసమీద కోపము వచ్చునేని పద్మసరోవరములందు విహరింపకుండునటుల చేయగలడుగాని నీరక్షీరంబుల వేఱుపఱచుటయందు గల నేర్పును తీసివేయ జాలడుగదా!

౧౧. పురుషునకు విద్యయే రూపము. విద్యయే ధనము, విద్యయే సకలభోగములను, కీర్తిని, సుఖమును కలుగజేయును. విద్యయే గురువువలె అన్నియు బోధించును. పరదేశమునందు చుట్టమువలె సహాయపడును. విద్యయే పరమాత్మ. విద్యయే రాజపూజితము. ధన మిట్టిదిగాదు. ఇట్టి విద్య లేనివాడు పశుతుల్యుడు.

౧౨. ఓరుపున్న యెడల కవచ మక్కఱలేదు. కోప మున్న యెడల (ఉపద్రవము గలుగ జేయుటకు) శత్రు వక్కఱలేదు. దాయాది యున్న యెడల వేరే నిప్పు అక్కఱలేదు. మిత్రముండెనేని సిద్ధౌషధము లక్కఱలేదు. దుర్జనులుండిరేని సర్పము లక్కఱలేదు.

౯. సత్సహవాసము బుద్ధిమాంద్యమును బోగొట్టును. సత్య వాక్యములనే పలుకజేయును. మంచి గౌరవమునిచ్చును. పాపముల బోగొట్టును. మనస్సును బాగుచేయును. దిక్కులయందు కీర్తిని వ్యాపింపజేయును. వేయేల! అది చేయజాలని మంచి యే లోకమునను లేదు.

౧౦. చావు పుట్టుక లనునవి యెప్పుడును గల యీ సంసార చక్రమున జచ్చినవారందరును పుట్టువారే. అట్లు పుట్టినవారిలో నశింపనివారెవరు? ఎవని పుట్టుకవలన వంశము కీర్త్యాదులచేత వాసిగాంచునో వాడే జన్మించినవాడు. వాని జన్మయే గణనీయము.

౧౧. మాననీయుడగు విద్వాంసునకు పుష్పగుచ్ఛమునకు బోలె ఎల్లరచేత శిరసావహింపబడుటయో, లేక అరణ్యముననే మ్రగ్గుటయో ఈ రెండు గతులే తక్క వేఱువిధము లేదు.

౧౨. సింగము బాల్యదశయందుండినను, మదగజములమీది కురుకును. ఇది బలవంతుల స్వభావము. పరాక్రమ ప్రకటమునకు వయసు మొదలగువానితో పనిలేదు.

౧౩. లోకమునందు ధనము గలవాడే కులీనుడనియు, పండితుడనియు, శాస్త్రజ్ఞుడనియు, గుణావగుణముల నెఱింగినవాడనియు, చక్కని వాగ్ధోరణి గలవాడనియు, చూడదగినవాడనియు, రూపవంతుడనియు జెప్పబడును. ధన మొకటి యుండునేని పై గుణములు లేకపోయినను వానియందీ గుణము లున్నవని జనులు తలంతురు.

౧౪. దుర్మంత్రివలన రాజును, సంగమువలన యతియు, లాలించుటచే పుత్రుండును, వేదాధ్యయనము లేమిచేత బ్రాహ్మణుడును, కుపుత్రునివలన వంశమును, దుర్మార్గుల సేవవలన సదాచారమును, మద్యపానమువలన లజ్జయు, తరచుగ జూడకపోవుటచేత వ్యవసాయమును, దేశాంతర సంచారముచేత స్నేహమును, అను

రాగము లేమిచేత మైత్రియు, నీతి లేమిచేత సంపదయు, అపాత్ర దానముచేత ధనమును నశించును.

౧౫. రాజా! భూమి యను గోవునుండి ధనమును పితుక దలచితివేని ఆవు దూడను పోషించు విధముగ జనుల పోషింపుము. ఆ జనుల చక్కగ నీవు పోషించితివేని భూమి కల్పవల్లివలె కోరిన వాని నన్నిటిని ఫలింపజేయును.

౧౬. దుర్జనశిక్షణము, సత్కీర్తి, బ్రాహ్మణ పరిపాలనము, సత్పాత్రదానము, స్వచ్ఛందన విహారాది భోగములు, ఆపన్నులగు మిత్రాదుల రక్షించుట అను సద్గుణషట్కము లేని రాజుల సేవించుట వలన లాభమేమియు లేదు.

౧౭. తన నొసట వ్రాసినంత ధనము కొద్దియైనను గొప్పయైనను మరుస్థలమునందున్నను తప్పక లభించును. మేరువునందైనను అంతకంటె నధికముగ బొందదు. కావున ధనవంతులను జూచి దీనత్వమును గనబరుపకుము. కుండను బావియందు ముంచినను, సముద్రమున ముంచినను ఒకే పరిమాణములో జలమును గైకొనును.

౧౮. దయాహీనత, నిష్కారణమైన కలహము, పరుల ధనమునందును, పరస్త్రీలయందును ఆసక్తి - సజ్జనుల యందును, బంధువులయందును ఓర్పులేమి - ఇవి దుర్జనుల స్వభావసిద్ధ గుణములు.

౧౯. పాము శిరమునందు రత్నము కలదైనను భయంకరమగుటచేత దూరముగ నెటుల వదలుచున్నారో, అటులే దుర్జనుడు విద్యావంతుడైనను దూరముగ విడువదగినవాడు.

౨౦. లజ్జగలవాని మందునిగను, తపోవంతుని డంబముగల వానిగను, శుచిగలవానిని వేషధారినిగను, శూరుని దయాహీనుని గను, మునీశ్వరుని బుద్ధిహీనునిగను, ప్రియముగ మాటాడువానిని దీనునిగను, తేజోవంతుని గర్విగను, యుక్తియుక్తముగ బలుకు

వానిని వాచాలునిగను దుర్జనులు తలంతురు. ఎట్టి గుణవంతు నైనను దుర్జనులు ఏదో యొక వంకపెట్టి నిందింతురు.

౨౧. అత్యాశయున్న వేరొక దుర్గుణ మక్కర లేదు. పిశు నత్వ (కొండెములు చెప్పుట) ముండునేని వేరుపాపము లక్కర లేదు. సత్యమున్న తపస్సు చేయనక్కరలేదు. నిర్మలమగు మన సున్న తీర్థసేవ యక్కర లేదు. మంచితనముండెనేని స్వకార్య నిర్వ హణమునకు స్వజన మక్కరలేదు. గౌరవముండు నేని అలంకారము లక్కరలేదు. చక్కని విద్య యుండునేని ధనమక్కర లేదు. అప కీర్తి యుండునేని వేరుగ చావనక్కరలేదు.

౨౨. పగటియందు తేజోహీనుడైన చంద్రుడును, గత యౌవనయగు కామినియు, తామరలు లేని కొలనును, చదువులేని సుందరుడును, కేవల ధనాశగల భూపాలుడును, సర్వదా దరిద్రు డగు సజ్జనుడును, ప్రభువుసమీపమున నుండిన దుర్జనుడును ఈ ఏడుగురును శల్యమువలె మనస్సునకు దుఃఖమును కలుగజేయుదు రని నా అభిప్రాయము.

౨౩. పరుల పీడింపకయే గడ్డిచేత కాలయాత్రను గడుపు కొను జింకలు- మొదలయిన జంతువులకు బోయలును, నీటిచేత బ్రదుకు మీనములకు జాలర్లును, దొరకినదానితో సంతసించి కాల యాత్ర గడుపు సజ్జనులకు కొండెగాండ్లును అకారణ వైరులయి లోకమున గనంబడుచున్నారు.

౨౪. న్యాయమయిన వృత్తి నవలంబించుటయు, ప్రాణా పాయము సంభవించినను అకార్యము లొనర్పకుండుటయు, దుర్జ నుల ప్రార్థింపకుండుటయు, ప్రాణమిత్రుడైనను ధనహీనుడగు నేని వానిని యాచింపకుండుటయు, ఆపదలయందు ధైర్యము, మహా త్ముల కనుకూలముగ నడచుటయు అను ఈ అసిధారా వ్రతము సజ్జనులకు స్వభావముగ పట్టుబడినదిగాని ఒకరి యుపదేశముచేత రాలేదు.

౨౪. రహస్యముగ దానము సేయుటయు, గృహమునకువచ్చిన అర్థికి సంతోషముతో ప్రియము సేయుటయు, తానుచేసిన మేలును చెప్పకుండుటయు, తన కితరులు చేసిన మేలును సభలయందు బలుకుటయు, సంపదలు వచ్చినప్పుడు గర్వము లేకుండుటయు, ఇతరులను గురించి నిందగా మాట్లాడకపోవుటయు అను ఈ అసిధారా వ్రతము సజ్జనులకు స్వభావసిద్ధము.

౨౫. వృక్షములు ఫలకాలమున నమ్రములయి (వంగి) యుండును. నూతనాంబువులుగల మేఘములు క్రిందుగనే వ్రేలాడు చుండును. సత్పురుషులు సంపదలు వచ్చినప్పుడు గర్వమువహింపరు. ఇది పరోపకారపరాయణుల స్వభావము.

౨౬. తమకార్యముల విడిచి పరులకార్యములను చేయువారు సత్పురుషులు. తమకార్యమునకు భంగము లేకుండ పరులకార్యముల నొనర్చువారు మధ్యములు. తమ కార్యనిమిత్తమై పరులకార్యమును చెడగొట్టువారు మనుష్యులలో రాక్షసులు. తమకు నష్టము లేకపోయినను పరులకు నష్టము చేయువారల కేపేరు పెట్టవచ్చునో నాకు తెలియుటలేదు.

౨౭. పాలు తనయందు కలసిన జలమునకు తనగుణము లన్నియు నిచ్చెను. తనకిట్టి సాయమొనర్చిన క్షీరమునకు గలుగు తపనమునుగాంచి, జలము అగ్నియందు బడెను. తనకు మిత్రమగు జల మగ్నియందు బడుటను చూచి క్షీరములు తానుగూడ అగ్నియందు బడబోగా దానితో మరల జలము కలియుటచేత శాంతిల్లుచున్నది. సజ్జన సహవాసము ఇట్టిదే అని అర్థము.

౨౮. అధములు విఘ్నములు సంభవించునని కార్యము నారంభింప వెరతురు. మధ్యములు ఆరంభించి విఘ్నములు వచ్చినప్పుడు వదలెదరు. ధీరు లెన్నిపర్యాయములెట్టి విఘ్నములు వచ్చినను తాము పట్టిన కార్యమును విడువరు.

౩౦. నీతివేత్తలు, ధీరులు నైనవారు నిందించినను భూషించినను, సంపదలువచ్చినను పోయినను, మరణ మిప్పుడే కలిగినను కల్పాంతమునకు కలిగినను న్యాయమార్గమును వదలరు.

౩౧. ఎవని మనస్సు కామినుల చూపులను బాణములచే క్షతముకాదో, ఎవని హృదయమును కోపాగ్ని దహింపదో, ఎవని మనస్సు అత్యాశ యను పాశములచే లాగబడదో అట్టిధీరుడు ముల్లోకముల జయించును.

౩౨. ఎవడు సత్స్వభావము కలిగియుండునో, అట్టివానికి అగ్ని జలమువలె చల్లగను. మేరుపర్వతము చిన్న రాతివలెను, సింగము జింకవలెను, సర్పము పూలమాలవలెను, విషము అమృతమువలెను అగును.

౩౩. బృహస్పతి గురువై, వజ్రమాయుధమై, దేవతలు సేనలోని వారలయి, స్వర్గము కోటయై, విష్ణుమూర్తి అనుగ్రహముగలవాడై, ఐరావతగజమును కలిగి, ఈ విధముగ ఆశ్చర్యమును కలుగజేయు శక్తిగల ఇంద్రుడే శత్రువులచేత యుద్ధమునందోడిపోయెను. కావున దైవబలమే ప్రధానముకాని పౌరుష మెందుకును పనికిరాదు.

౩౪. చెండు (బంతి) క్రిందబడి మరల లేచునట్లు సజ్జనుడు హీనస్థితి నందినను, వెంటనే ఉన్నతస్థితినందును. మంటిముద్ద క్రిందబడి యట్లే యుండునట్లు దుర్జనుడు హీనస్థితి నందిన నట్లేయుండును.

౩౫. బంధింపశక్యముగాని గజసర్పవిహంగములయొక్క బంధనమును, సూర్యచంద్రాదులకుగల గ్రహపీడయు, బుద్ధిమంతుల దరిద్రమును చూడ నా మనస్సునకు దైవప్రభావము బలవత్తరమని తోచుచున్నది.

౩౬. ఎవనికెంతయని దైవము నిర్ణయించునో అయ్యది వానికి తనంతటనే దొరకును. దీనికై ఒకరి నాశ్రయింపనక్కరలేదు. నలుదిక్కుల వ్యాపించి మేఘము ప్రత్యహము వర్షించుచున్నను, చాత

కము నోటియందు సూక్ష్మబిందువులు రెండో మూడో పడునుగాని ఎక్కువ పడవు గదా !

౩౭. దేవతలకు నమస్కారము. వారు సైతము దైవమునకు లోబడినవారు గాన దైవమునకు మ్రొక్కెదను. ఆ దైవము కర్మాను సారముగ ఫలమునిచ్చును గాన కర్మకు నమస్కారము. ఫలము కర్మాధీనము కావున దేవతలతోడను దైవముతోడను మాకేమి దేవతలచేత దాట శక్యముగాని కర్మమునకే మ్రొక్కెదను.

౩౮. బ్రహ్మ దేనిచేత కుండవలెనుండు బ్రహ్మాండ మధ్య మున నుండ నియోగింపబడెనో, దేనిచేత విష్ణువు పది యవతారము లెత్తుటయను కష్టమునకు బాల్పడెనో, రుద్రుడు దేనిచేత పుర్రెను పాత్రగా గొని భిక్షుకుడై దిరిగెనో, దేనిచేత సూర్యుడు ఆకాశమున సర్వదా తిరుగుచుండెనో, అట్టికర్మకు నమస్కారము.

౩౯. ఓయి నేర్పరీ! నీవుకోరిన కోర్కెలను పొందదలచితి వేని దుర్జనులను సజ్జనులుగను, మూర్ఖుని విద్వాంసునిగను, శత్రు వుల మిత్రులుగను, ఇంద్రియాగోచరమును గోచరించుదానిగను, విషమును అమృతముగను, జేయజాలిన సత్కర్మము నారాధింపుము. ఇతర విషయములకయి పాటుపడకుము.

౪౦. పురుషునకు ఆకారముగాని, స్వభావముగాని, విద్యగాని, ప్రయత్నపూర్వకముగ చేసిన సేవగాని, ఫలమునొసంగవు. పూర్వ కృతమయిన తపస్సువలన కలిగిన భాగ్యమే వృక్షమువలె కాల మునకుఫలము నొసంగును.

౪౧. పురుషుని అడవియందును, యుద్ధమునందును, శత్రు వుల మధ్యను, నీళ్లలోను, నిప్పునను, మహాసముద్రముననను, కొండ చివరను, నిదురలోను, ...పులోను, అపాయముననను, పూర్వకృత సుకృతములు కాపాడును.

౪౨. ఎవనికి తొలుత సంపాదింపబడిన అధికమైన పుణ్య ముండునో, వానికి భయంకరమైన అడవియును భోగార్హమగు నగర

మగును. పెరవారెల్లరును బంధువులగుదురు. భూమి యంతయు రత్నపు గనులతోడను, మంచి వస్తువులతోడను నిండినదై యుండును.

శృంగార రసము :

౧. ఓ సంసారసముద్రమా! మధ్యన దాట నశక్యములయిన అతివలుండరేని, నీయావలిగట్టునకు బోవువారి కంతదూరము గాదు. స్త్రీలమూలమున యీ సంసారమునకు కట్టువడి యుండవలసినదికాని, వారు లేనిచో సంసారము విడుచుట అంతకష్టము గాకయుండును.

౨. స్త్రీలొకనితో ప్రేమమీరమాటాడుదురు. మరియొకని దళుకుబెళుకు నడతలతో జూతురు. మనస్సున మరొక్కనిని దలచుచుందురు. కావున వారి కిష్టుడొక్కడనుట లేదు.

3. ఈ మోహమనెడి అపస్మారరోగము మంత్రములకు వంగునదికాదు. ఔషధముచే గుదురునదికాదు. ఎన్ని శాంతి కర్మములు చేసినను నయముకాదు. పలుమారు మనస్సునకు భ్రమముగలిగించి, చేతులు కాళ్లు మొదలగు అంగములు వంకరపోవునట్లుచేసి, కన్నులు గిరగిర ద్రిప్పి భ్రమ గప్పునట్లు చేయుచున్నది. ఈ రోగమునకు నేదియుచికిత్స కనపడలేదు. ఏమిచేయుదును ?

౪. మగువలకు వాక్కునందు తేనెయు, హృదయమున హాలాహలమను విషమే యున్నది. కావుననే పురుషులు వారి మోవి బీల్తురు. రొమ్మును పిడికిళ్ళతో గ్రుద్దుదురు.

౫. మరుం డనెడి అంధకారము వ్యాపించుటచే నెప్పుడు తెలివి తగ్గునో, అప్పుడు నాకంటికి బ్రహ్మస్వరూపము ప్రపంచమెల్ల స్త్రీమయముగా దోచెను. మేలయిన వివేకమను కాటుక వేసికొనుటచే నా కన్నులమసక దొలగి, యిప్పుడు ప్రపంచమెల్ల బ్రహ్మస్వరూపముగా దోచుచున్నది. అవివేకులకు ప్రపంచము స్త్రీయే. వివేకులకు ప్రపంచము బ్రహ్మమే (యనుట).

౬. తలచినంత మాత్రమున వేండ్రము (తాపము) గలిగించును. చూచినంతమాత్రమున వెర్రిని గలుగ జేయును. తాకినంత మాత్రమున పొక్కించును. అట్టి మగువ నెట్లు ప్రియురాలనవచ్చును.

౭. సంశయముల కునికిపట్టును, అడకువ లేమికి పుట్టినిల్లును, తెంపులకు వీడును, పాపములకు పెన్నిధియు, పెక్కు వంచనలే మేనుగ గలదియు, అపనమ్మికలకు పుట్టుచోటును, స్వర్గపు వాకిలి నడ్డగించు గడియ మ్రానును, నరకపట్టణమునకు వాకిలియు, మాయల కన్నింటికి పెట్టెయు, ప్రాణులకు కట్టు త్రాడును, అమృతమువలె గాన్పించు విషము నైన యీ స్త్రీ యంత్రము నే మాయకాడు సృజించెనో! తెలియకున్నది.

౮. నిజము పరికించి చూడ స్త్రీల మోము చంద్రునివలె లేకున్నను, కవులు చంద్రముఖి, కలువకంటి, కనకాంగి యని వర్ణించుటచే, వివేకియు తాను వస్తుతత్త్వము నెరిగినవాడయ్యు కవుల మాటలకు మోసపోయి, మూఢుడయి చర్మము, మాంసము, యెముకలు గినుండు నీ మృగాక్షుల శరీరమును గొలుచుచున్నాడు.

౯. స్త్రీ మిక్కిలి యొప్పుగల రూపు గలదియు, మోవియందు తీపిగలదియునై యౌవన సమయంబున ముష్టిపండువలె నెంతయు సౌఖ్యంబుగా దోచినను, పిదప విషమువలె దుఃఖప్రదమగును.

౧౦. మరుడను జాలరి యీ సంసారమను సముద్రమున నాతియను గాలమును విసరివైచి యున్నాడు. ఆ గాలమున మోవి యను యెర్ర యున్నది. ఆ యెర్రయం దాశపడి యీ గాలమునకు జిక్కుకొన్న పురుషులనెడి చేపలను లాగి ఆ జాలరి వలపనెడి నిప్పునందు పచనము చేయును. కావున ఆ గాలమునకు జిక్కుకొనకుము.

౧౧. ఓ మనసనెడి బాటసారీ! బలితంపు పాలిండ్లనెడి గట్టులచే జొచ్చుటకు వీలుకాకయున్న క్రొగ్గంటి మేననెడి అడవి యందు దిరుగకుము. అచ్చట మరుడనెడి దొంగ యున్నాడు. అతడు నిన్నీడ్చుకొని పోవును సుమా!

౧౨. ఓ పండితులారా! స్త్రీ సంగమను క్షణ నశ్వరమగు సుఖమునుండి మనసును ద్రిప్పుడు. వారి వయ్యారముఁగాని, వారి అవయవములుగాని మిమ్ము నరకమునుండి లేవదీసి రక్షింపజాలవు.

౧౩. స్త్రీలు మిక్కుటమగు ప్రేమతో నెట్టిపనిని జేయ బూనినను, వారి నట్లు చేయనీయకుండ జేయుటకు సృష్టికర్తయగు బ్రహ్మకుకూడ అలవికాదు.

౧౪. క్రూరమగు మదనాగ్ని శరీరమందు ప్రవేశించి, వికారము గలిగింపకుండు నంతవరకే నరుడు పండితుడనియు, మహిమ గలవాడనియు, గొప్పకులమున బుట్టినవాడనియు, మంచి చెడ్డ లెరిగినవాడనియు పేరు పొందును.

వైరాగ్యము :

౧. నీచుల గొలుచుచు వారి దుర్భాషలెల్ల సైచితిని. పొరలివచ్చు కన్నీటిని లోలోన మ్రింగి మనసున లేని వెదనవ్వు నయితము నవ్వితిని. ధనగర్వముచే మతిమాలినవారికి దోసిలి యొగ్గితిని. ఆశా! నీ కోరిక యీడేరలేదు. ఇంక నన్నేమి ఆడించెదవు?

౨. నిక్షేపము దొరకునను నాశతో నేల త్రవ్వితిని. బంగారు కొరకై కొండలమీది మణిశిల మొదలగు ధాతువుల కరగించితిని. సముద్ర ప్రయాణముల గావించితిని. కష్టపడి వారి మనస్సు నచ్చు నట్లు నడచుకొని రాజుల సంతస పెట్టితిని. మంత్రారాధముల నొనర్చుచు శ్మశానములందు పెక్కు రాత్రులు గడపితిని. ఇంత చేసియు నేనొక గ్రుడ్డిగవ్వనైన గాంచనైతిని ఆశా! యింక సంతోషపడి యూరకుండుము.

౩. తామరాకునందలి జలబిందువులవలె చంచలములైన యీ ప్రాణములకొరకై మతిమాలిన మనము ధన మదముచే మతి మరచియున్న ధనికులచెంత సిగ్గు వదలి స్వగుణ సంకీర్తనమును పాతకమును నయిత మార్జించుకొంటిమి.

౪. అనుభవింపవలయునవెడు కోరిక అడుగంటినది. పురుషుడ ననుకొను బింకము చల్లారినది. ప్రాణసమానులైన తోడి చెలి కాండ్రు స్వర్గస్థులైరి. నేనా మూడుకాళ్ళ ముదుసలి నైతిని. కర్ర లేనిది నిలువజాలను. కనులు పొరలు గమ్మి అగుపడుట లేదు. అయ్యో! ఈ సిగ్గుమాలిన దేహ మిట్టి అవస్థలోనున్నను, ప్రాణములు వదలవలయునే అని భయపడుచునే యున్నదిగదా!

౫. మేడ చాల పెద్దది. కొడుకు లడకువగలవారు. సంపదలు మితిలేనివి. ఇల్లాలు మనసు మెచ్చినది. వయసు నిండు జవ్వనము. ఇట్లని అజ్ఞానముగల మనుజుడు మోహపడి విశ్వమెల్ల శాశ్వతమని తలచి సంసారమను చెరసాలలో జిక్కువడును. ధన్యులగువారిది యెల్ల క్షణభంగుర మని తలచి తృణీకరించి సన్యసించుచున్నారు.

౬. ఈ కడుపను బాన గౌరవమును తొలగించును. వెన్నెల తామరపూల ముకుళింప జేయునట్లు సద్గుణములనెల్ల సంకోచింప జేయును. గాఢముగా నల్లుకొన్న లజ్జయను తీవను చిరుగొడ్డలివోలె తెగద్రెంచును. దీనికి నిండుట యను మాట లేదు.

౭. భోగములు మెరుపువలె అతిచంచలమైనవి. ప్రాణములో ఉత్తర క్షణమున నుండునో యుండవో చెప్పజాలము. ప్రియురాండ్రతో ననుభవించు యౌవన సౌఖ్యములు మూడునాళ్ళ ముచ్చటలే. కాబట్టి హితబోధకులగు ఓ విబుధులారా! యీ సంసారమునెల్ల నిస్సారముగా గ్రహించి లోకానుగ్రహమున నిశ్చలమగు మనసుతో ప్రయత్నము కావింపుడు.

౮. తొలుత మలమూత్రములలో నొడలు సంకోచించుకొని అల్లాడుచు గర్భనరకము సైపవలెను. యౌవనమున ప్రియురాండ్ర వియోగము నోర్వజాలక దుఃఖపడవలయును. ముదుసలి తనమున చంచలాక్షులు ఏవగొని వెక్కిరించి నవ్విన అవమానము పాలు కావలయును. ఓ జనులారా! ఈసంసారమున నించుకేని సౌఖ్యము కలదేమో చెప్పుడు?

౯. పోయిన రాత్రియే మరల వచ్చును. పోయిన పగలే మరల వచ్చును. ఇది యెరింగియు అజ్ఞాను లూరకయే యేవో పను లారంభించి, పూనికతో యేమో మునిగిపోవుచున్నట్లు పరుగులిడు చుందురు. మరల మరల చేయబూనుకున్న పనులు, ఇదివరకు చేసి నవే. ఈలాటి సంసారముచే అవమానితులమై అజ్ఞానమువలన సిగ్గిలకున్నాము. ఓ మానవులారా! దేనికై యిట్లు పలుతిప్పలు పడెదరు? ఇంక చాలు, చాలింపుడు. మా మాట విని ఆశాపాశ ములు త్రెంపి నిర్మలమగు మనసును పరబ్రహ్మమున లయింప జేయుడు.

౧౦. నిష్కళంకమయిన విద్యను నేర్వలేదు. ధనమునార్జింప లేదు. మనసుతో తలిదండ్రులకు సేవకావింపలేదు. కాకులవలె పర పిండములకై తిరిగి కాలమును కోలుపోయితిమి.

౧౧. మనసా! ఆయాస పెట్టెడు నీ యింద్రియార్థము లనెడు అరణ్యమార్గము త్యజించి శ్రేయస్సునకు చేర్చునట్టియు సర్వ దుఃఖ నాశకమగునట్టియు సన్మార్గమున ప్రవేశింపుము ప్రశాంత భావ మును జెందుము. అతిచంచలమగు నిప్పటి వర్తనమును విడ నాడుము. అస్థిరమగు సంసారేచ్ఛను మరల జెందకుము. నైర్మ ల్యము నందుము.

౧౨. ఓ మనసా! సంసారమోహము నింక విడనాడుము. శంభునిపై అనురక్తిని, భక్తిని సంపాదింపుము. గంగానదీ తీర ప్రదేశముల నివసింపదలంపుము. అలలయందును, నీటి బుడగలం దును, మెరుపులందును స్త్రీలయందును, జ్వాలాగ్రములందును, సర్పములందును, నదీవేగములందును నమ్మిక ముండదగునా?

౧౩. పురుషుకు కోరికలదీర్చు సంపదలు గలిగిననేమి? శత్రు వుల నెల్ల నోడించిన నేమి? ఐశ్వర్యము నొసంగి మిత్రుల గారవిం చిన నేమి? కల్పాంతము చావులేక బ్రతికిన నేమి? సర్వము నిష్ప్ర యోజనము.

౧౪. మనసా! కుదిరిక లేక యెల్ల లోకముల దిరుగులాడె దవు. దారి తప్పియైన నిప్పుడును దేనిచింతనమువలన నిర్వాణము జెందెదవో అట్టి పరబ్రహ్మమును దలంపవేమి? మృత్యువునకు ముందే మోక్ష ప్రాప్తికై ప్రయత్నింపుము.

౧౫. గోచియును, బొంతయును, నిశ్చింతతయును, ఒకరి అపేక్షలేని భిక్షాన్నమును, అడవినో శ్మశానముననో నిద్రయును, స్వాతంత్ర్య విహారమును, ఎప్పుడును ప్రసన్నమైన చిత్తమును, సమాధి సంధానమున స్థైర్యమును చేకూరినచో త్రిలోకాధిపత్య మెందులకు?

## ౫ శ్రీతిరుక్కురల్ సుభాషితములు

౧. అపకారం చేసిన వారిని సహించడం అలవర్చుకో, అది మంచిది.

౨. తప్పుడుపనికోసం చెప్పే నిజం నిజంకాదు.

3. ప్రొద్దున నుంచి ఎవరికైనా బాధకలిగిస్తే మధ్యాహ్నానికి ఆ బాధ తిరిగివచ్చి మనకే చుట్టుకొంటుంది.

౪. ఆలోచనలు న్యాయమార్గం తప్పిన చిహ్నాలు కనబడితే దుఃఖం నీకోసం పొంచివుందని తెలుసుకో.

౫. న్యాయార్జితమైన సంపాదన మాత్రమే తరుగక, సంతానమును బాధలనుండి కాపాడుతుంది.

౬. తప్పుడు త్రోవలో దొరికిన ఆనందం తప్పక వెంటనే బాధ కలిగిస్తుంది. మంచిమార్గమే తెలివైన మార్గం.

౭. అయోగ్యులు తప్పకుండా ఆనందంగా ఉంటారు. యోగ్యులకున్నన్ని బాధలు, ఆతురత వారికి ఎక్కడుంటాయి?

౮. శత్రువుల బారినుండి తప్పించుకొనవచ్చు. కాని చేసిన దుర్మార్గం నిన్ను నిరంతరం వెంటాడుతూనే ఉంటుంది. దాని నుండి తప్పించుకోలేవు.

౯. పరుల కలిమికి పొరలి ఏడ్చే ఓర్వలేని మానవులను భాగ్యలక్ష్మి సహించదు. అట్టివారిని ఆమె తన పెద్ద అక్కగారికి అప్పగిస్తుంది.

౧౦. పైకి పుణ్యాత్మునివలెను అంతరంగమందు ధర్మవ్యతిరేకంగాను వ్యవహరిస్తే బాధలలోపడి అంతులేని దుఃఖములో పడిపోతావు.

౧౧. అజాగ్రత్తవల్లనైనా ఇతరులకు బాధకలిగించే పని తలపెట్టకు. నీవు దుర్మార్గానికి తలపడితే ధర్మం నీకు నాశనం కలుగచేస్తుంది.

౧౨. ఇతరుల దోషాలను చూచినట్లు తమ దోషాలను చూడ కలిగితే ఈ ప్రపంచంలో నుండి దుర్మార్గం తొలగిపోవడం తథ్యం.

## ౬ శ్రీఅవ్వైయార్ సుభాషితములు

౧. సముద్రములో నీరెంతో ఉంటుంది. కాని మన పాత్రను మించి నీరు లభించదు. అలాగే మన ప్రాప్తం కొద్దీ ఫలితం.

౨. జూదమూ, వాదమూ వేదనను కలిగిస్తాయి.

3. తోడబుట్టినవారు మాత్రమే మేలుచేస్తారని అనుకోవద్దు. మన శరీరంలో పుట్టిన వ్యాధి మనల్నే చంపుతుంది. కాని ఎక్కడో అడవుల్లో పుట్టిన మూలిక మనల్ని రక్షిస్తుంది.

౪. విడిపోయిన అధములు పగిలిన రాయిలా మళ్ళీ కలవలేరు. మధ్యములు బంగారంలా ఇతరుల ప్రయత్నం వలన కలసిపోగలరు. ఉత్తములు నీటివలె తమంతట తామే మరల కలుస్తారు.

౫. నీటి పాముకు విషం ఉండదు. కనుకనే అది భయం లేకుండా విచ్చలవిడిగా తిరుగుతుంది. విషపూరితమైన నాగుబాము అలా తిరుగలేదు. నిష్కల్మషచిత్తులవలె వంచకులు స్వేచ్ఛగా సంచరించజాలరు.

౬. నది ఎండిపోయినప్పటికీ ఊటనీరు ఇస్తుంది. అలాగే గొప్పవారు లేమిలో కూడా యాచకులకు లేదనరు.

౭. తనను నరికే వరకూ చెట్టు మానవునికి నీడనూ, ఫలాలను ఇస్తూనే ఉంటుంది. గొప్పవారు తాము మరణించే వరకూ దుర్జనులకు కూడా మేలు చేస్తూనే ఉంటారు.

౮. తప్పులెన్నడం మొదలిడితే చుట్టాలంటూ ఎవరూ ఉండరు.

౯. భిక్షమెత్తి అయినా మంచిపనులు చెయ్యి.

౧౦. వరిచేనుకు పెట్టిన నీటివల్ల కలుపుకూడా బ్రతుకుతుంది. అలాగే మంచివారివల్ల చెడ్డవారుకూడా బాగుపడతారు.

౧౧. పాలను ఎంత కాచినా రుచిపోదు. శంఖాన్ని కాల్చినప్పటికీ సున్నాన్ని ఇస్తుంది. గొప్పవారు కష్టాల్లో కూడా తమ గొప్పతనాన్ని కోల్పోరు.

౧౨. మంచివాడికి చేసేమేలు వ్యర్థం కాదు. కొబ్బరిచెట్టు వేరుకు నీరుపోస్తే తలతో ఫలితమిస్తుంది.

౧౩. మానవుడు ఆకలి అయినప్పుడు అభిమానం, కులం, విద్య, జ్ఞానం, తపస్సు, హోదా, అనురాగం అన్నిటినీ మర్చిపోతాడు.

౧౪. ఓ ఉదరమా! ఒక్కరోజు ఆహారాన్ని వదలమంటే నిరాకరిస్తున్నావు. రెండు రోజులు వదలమంటే దుఃఖిస్తున్నావు. నీతో కలసి జీవించటం చాలా కష్టం.

౧౫. ఆయువున్నవాడిని ఎవడు చంపగలడు? చావు మూడిన వాడిని ఎవడు బ్రతికించగలడు? నిరంతరం బిచ్చమెత్తేవాడిని ఎవడాపగలడు?

౧౬. జానెడు పొట్టనింపడానికి పట్టెడన్నం కోసం ఇతరులను సేవించి, ప్రార్థించి, పొగడి, ఏడు సముద్రాలు దాటి కూడా వెళ్తున్నాం! ఎంత బుద్ధి హీనత!

౧౭. ఓమూఢ మానవుల్లారా? అష్టకష్టాలుపడి సంపాదించిన డబ్బును దాచిపెడతా రెందుకు? ఊపిరిపోయిన తరువాత ఆధనాన్ని ఎవరనుభవిస్తారు ?

## ౭ శ్రీ మహేంద్రముని

[వీరు మహా గొప్ప సిద్ధపురుషులు, లోకములోని దుఃఖితులను శాంతింపజేయ తిరుగుచుండెడివారు. అంత నొకనాడు సన్న్యాసులను చూచి వారితో ఇట్లనెను.]

౧. ఓ అజ్ఞానులారా! మీరు సన్న్యాసము స్వీకరించినది పొట్టపూజకా? లేక మోక్షమునకా? మోక్షమునకే అగుచో, అది జ్ఞానముచే ప్రాప్తించును. ఆ జ్ఞానము శ్రవణముచే లభించును. ఆ శ్రవణము మహాత్ములను సేవించుటచేతను, జిజ్ఞాసచేతను, సంభవించును. కావున, సద్గురు శరణుజొచ్చి, శ్రవణ మనన నిధి ధ్యాసలను పొంది, పరిపక్వమై సన్న్యాసము స్వీకరించి ముక్తినిబడయుడు. కాని, పొట్టకూటికాశించి మీ జీవితములను, పవిత్రములగు ఆశ్రమములను నశింపజేయకుడు.

శ్రీ ఆళ్వారుల ఉపదేశము:

## ౮ స్వామి శ్రీ శుద్ధానంద్‌జీ సరస్వతి

౧. ఓ సహోదరులారా! భగవంతుని భజింపుడు. శ్రీకృష్ణుని గుణములనే గానముచేయుడు. ధనవంతులను స్తుతించి, మీ వాక్కును దురుపయోగపరచకుడు. ఆ ఆదినారాయణుని ప్రేమతో నిత్యము అర్చింపుడు. జగత్తును రచించువాడును, జగత్స్వరూపుడును నగు ఆ ఏకేశ్వరుని స్మరించి, అర్చించినచో మీ అమంగళములన్నియు అంతమగును. నాదేమియు లేదు, ఉన్నదంతయు నీదే అనుభావమే నిజమైన శరణాగతి.

## ౯ శ్రీ విష్ణుచిత్తుడను పెరాళ్వారులు

౧. ఓ జగత్తులోని జీవులారా! మీరు మోక్షానందము పొందకోరుదురేని, ఆ పరాత్పరుని ప్రేమింపుడు. ఆ సర్వవ్యాపకు

డగు నారాయణుని చరణకమలములందు తమను సమర్పించుకొనుటచే మీకు మేలు చేకూరును.

౨. భగవంతుడే మనకు రక్షకుడు తన యోగమాయచే సాధుల రక్షించుటకు, దుష్టుల శిక్షించుటకు సమయానుకూలముగా అవతరించుచుండును. నారాయణుని స్మరింపనివారు పాపమునే భుజించుచు పాపములోనే పడియుందురు. భగవంతుని తమ హృదయమందిరములో స్థాపించుకొని స్మరించుచుండువారు మృత్యుపాశమునుండి విడబడుదురు.

## ౧౦ శ్రీ అవలోకితేశ్వరుడు

౧. ఈ అవలోకితేశ్వరుడు గొప్ప అలౌకిక జీవితముద్వారా దేవతలలోను ప్రముఖస్థానము పొందెను. సర్వభూతములు భేద రహితములై సుఖపడవలయునని వీరి సంకల్పము. వీరు సదా దయా ధర్మములనే ప్రబోధించుచుండెడివారు.

౨. దయకు దానమే శ్రేష్టము. నిస్సంకోచముగా, తనను తాను సమర్పించుకొనుట ఉత్తమమైన దానము. దానమిచ్చుటలో తనకు కీడు సంభవింపనున్నను. వెనుకముందాడక దానమీయవలెను. ఎందుకన, నరకమున దుఃఖమనుభవించుట మంచిదే కాని, మనపై ఆశపెట్టుకొని యున్నవాని ఆశను త్రోసిపుచ్చుట మంచిది కాదు. అది మహాపాపము. అని చెప్పుచుండెడివారు.

## ౧౧ సంతు సంగాజి

౧. శ్రీ సంగాజి నిమాడను మధ్యప్రాంతమున మహా గొప్ప సాధుపురుషుడు, త్యాగి, జితేంద్రియుడు, మహా దరిద్రుడు నెలకు ఒకరూపాయి వేతనముతో కాలముగడుపుచుండెను. మొదటినుండియు వీరు విరక్తులు, ఆ విరక్తి తీవ్రముకాగా, ఆ మహానీయుడిట్లు యోచించెను. "అకటా! ఈ కోలాహలమయమగు విశాల సంసారములో నొక్కక్షణమైనను జీవుని వ్యాపారము ఆగదు.

మోహ, మాయా, తృష్ణాదులలోనే ప్రాణి ఆయువు గతించిపోవుచుగదా! అంతమునకు ఈశ్వరుడు తప్ప మరెవ్వరును దిక్కులేరు సుమీ!

౨. ఆహా! ఇక యిట్టి భయంకర సంసారవ్యాపారములో తగిలియుండిన లాభమేమి? హృదయములో ప్రేమగలవారికి, ప్రభువును బాహ్యమున వెదుకనవసరముండదు." అని చెప్పుచుండు వారు.

## ౧౨ ప్రేమీసంతు సర్‌మద్

౧. వీరు సర్వస్వమును త్యజించి ప్రభుప్రేమలో మత్తుడై దిగంబరిగా ఢిల్లీనగరమున తిరుగుచుండ, అసూయచే మౌల్వీలు దిగంబరముగా తిరుగుచుండు నెపమున వీరిని బంధించి, అప్పటి పాదుషాయగు ఔరంగజేబ్ దర్బారున ప్రవేశపెట్టిరి. అంతట ఆ పాదుషా, నీవు దిగంబరివిగా తిరుగుచుండుటకు కారణమేమని ప్రశ్నింపగా వారిట్లనిరి:

సర్‌మద్ :- ఓ ప్రభూ! ఎవడు నీకు ఈ రాజ్యాధికారము నొసంగెనో, వాడే నాకు ఈ దుస్తరమైన సామానొసంగెను. అతడెవనిని దోషిగా జూచెనో, వికారిగా గ్రహించెనో, అతనిని వస్త్రములను ధరింపజేసి అతని వికారములను కప్పిపుచ్చెను. ఎవనిని వికారరహితునిగా జూచెనో, నిర్దోషునిగా గ్రహించెనో వానిని వస్త్రములచే కప్పియుంచక దిగంబరావస్థలోనే యుండనిచ్చెను. (స్వతస్సిద్ధమైన ప్రకృతిదశలోనే ఉంచెను.)

౨. ప్రభూ! లోకములో మిత్రులెందరో నాకు శత్రువులై యున్నప్పటికిని ఆ ఒక్క పరమాత్మ మిత్రత్వ నమ్మకముపైననే సంతుష్టునిగాను, సుఖముగాను ఉన్నాను.

3. ద్వైతభావమను తెర తొలగిపోయినంతనే సమస్త భేదభావములు నశించెను. అనేకత్వమును విడచి, ఏకత్వమును పొంది

తిని. ఇక ఆ పరమాత్ముయే నేను, నేనే ఆ పరమాత్ముడు. ఆ పరమాత్మకు నాకు భేదమేమియు లేదు. అనిన విని "ఓ సర్మద్! పూర్తిగా కల్మ నుచ్చరింపక 'లా ఇ లా హ' మాత్రమే ఉచ్చరింతు వెందులకు?" అని పాదుషా ప్రశ్నింపగా, సర్మద్ ఇట్లనియె :

"ప్రభూ! నేను యింతవరకు అభావ సముద్రములోనే మునుగుచున్నాను. ఇంకను భగవత్సాక్షాత్కారము హద్దువరకు చేరనేలేదు. అట్టిపరిస్థితిలో నేను 'లా, ఇ, లా, హ, ఇల్ అల్లాహ' అని ఉచ్చరించుట శుద్ధ అబద్ధమగును. హృదయములో లేని మాట నాలుకతో పలుకుట అసత్యముగాక, మరింకేమగును?"

మౌల్వీలు అదివిని, క్రుద్ధులై యితడు 'కాఫర్' దండనార్హుడని అల్లరిచేయుచు, పాదుషాను ఒత్తిడిచేసిరి. అప్పుడు మౌల్వీల అభిప్రాయానుసారము పాదుషా 'సర్మద్'కు శిరచ్ఛేదన శిక్ష నొసంగెను. అందుకు సర్మద్ సంతోషించి - మృత్యువు నాకు కాదు, కాలమునకే మృత్యువు. చచ్చి మరల చావబోని నాకు మృత్యుభయమేల? యని భగవంతుని ప్రార్థించి సంతోషమున తల వంచెను. రాజాజ్ఞచే తలవరులు శిరము ఖండింపగానే, దేహము నుండి వేరగుచున్న శిరస్సునుండి 'లా ఇ లా హ ఇలల్లాహ' (భగవంతుడు తప్ప వేరేదియు లేదు) అను మహావాక్యము మూడుసార్లు వెడలెను. సర్మద్కు పరమాత్మ దర్శనమై అతనిలో లీనమగు నప్పుడే ఆ శబ్దములు ఉచ్చరింపబడెను.

## ౧౩ మహాత్మ కస్సప్

[మహాత్మ బుద్ధుని అనంతరము ఈ కస్సపుడు బౌద్ధులలో గొప్ప మహాత్ముడు, అకించనుడు. పెంటమీది గుడ్డపేలికలనే ధరించువాడు. దరిద్రుల యిండ్లలోనే యాచించి దొరకినదానితో సంతృప్తిపడువాడు. నివాసమునకు కొండగుహలే వీరికి ప్రీతి.

వివాహమైనను, భార్యాభర్తలిరువురును బాలబ్రహ్మచారులై వ్యవసాయవృత్తిచే జీవయాత్ర గడుపుచుండిరి. భూమి దున్నుట వలన పురుగులు మొదలగు చిన్నచిన్న జీవులు మరణించుట జూచి హింసగా దలంచి సర్వమును విడచి వల్కలను ధరించి స్వజనులు విలపించుచుండ అరణ్యములో ప్రవేశించి తపమొనర్చి ఈశ్వర ప్రాప్తి నొందెను. వీరి పత్నికూడ కుటుంబపనులలో హింస తప్పదని తలంచి సర్వ సంసారమును త్యజించి అడవిలో ప్రవేశించి తప మొనరించి ముక్తినొందెను.]

## ౧౪ సంత దేవ్‌జాన్ సక్లవి

౧. వీరు సికందరు (అలెగ్జాండరు) కాలమున, యూనాన్ దేశములో గొప్ప సిద్ధపురుషులు, విరక్తులు, బ్రహ్మచారులు. అరణ్యములో దిగంబరులై తిరుగుచు కాలము గడుపుచుండిరి. పిలచిన పలుకుచు, లేనిచో మౌనముగా నుండువారు. ఆకలి కలిగినప్పుడు ఆకలి తీరుటకు మాత్రము దొరికినదానిని తిని సంతృప్తిపడువారు.

౨ బట్టలెందుకు కట్టరని ఒకరు వీరిని ప్రశ్నించిరి. అందుకు వా రిట్లనిరి. ఎవనిలో వికారముండునో వాడు వాని వికారములను దాచుకొనుటకు బట్టలు కట్టును. కాని, ఏ వికారములు లేనివాడు ఏమి దాచుకొనును?

3. నీ నివాసమునకు యిల్లెందుకు కట్టవనియు, నీ మత మేదనియు ప్రశ్నింపగా దానికి వారిట్లనిరి. ఇల్లు లేనివాడే యిల్లు కట్టుకొనును. పరలోకములో శాశ్వతమైన నిత్య సత్యములైన యిండ్లను కోల్పోయినవారే ఇహమందు అశాశ్వతమైన అసత్యమైన యిండ్లను కట్టుకొనెదరు. కాని నా యిల్లెప్పటికిని పడిపోవునది కాదు. నిత్యశాశ్వతముగా నిలచియుండును. కాబట్టియే నేను యిల్లు కట్టుకొనలేదు. కాక ప్రపంచమంతయు నా యిల్లే. అందులో కోట్లకొలది జనులు విశ్రాంతి తీసికొనుచుందురు. భూమండలమంతయు నా గృహమునకు అంగణము. ఆకాశమే దానికి కప్పు. ఇంత

గొప్ప విశాలమైన యిల్లు నెవరు కట్టెదరు? దేవునిమతమే నా మతము, లేక సమ్మతమే నా మతము. ఏ మతము లేనిదే సమ్మతము.

౪. ఏమీ! నీవు దేవుని శరీరమువా? అని ప్రశ్నింప దానికి వారు 'శరీరమేకాదు - నేనే దేవుడను' అని బదులు చెప్పిరి.

౫. ఒకరోజు వీరు అరణ్యములో కాళ్ళు చక్కగా చాచుకొని పరుండి యుండగా సికందరు అటువచ్చి వీరిని చూచి యితనికి యింత గర్వమా అని కోపించి, కాలితో తన్ని, తొందరగా లెమ్ము. నేనొక దేశమును జయించితిని. అనిన విని వారిట్లనిరి. దేశమును జయించుట రాజుల పనియే కాని, తన్నుట మాత్రము గాడిదేల పని, అది మానవుల పనికాదు. అనిన విని, యింత నిర్భయము, నిశ్చింత నీకెట్లు కలిగినది? అని సికందరు ప్రశ్నింపగా, 'ఓర్పుచే, మరియు విషయవాసనలను త్యజించుటచే నిశ్చింత కలిగినది' అని బదులు చెప్పిరి.

౬. నీకెవరైన సంబంధులు కలరా యని ప్రశ్నింపగా 'సంసారములోని ప్రజలందరు తమ స్వార్థమునకే సంబంధ మేర్పరచుకొనెదరు. కావున నే నెవరితోను సంబంధ మేర్పరచుకొనను.'

౭ నీవు మరణించిన నీ దేహము నెవరు పూడ్చెదరని ఒకరు ప్రశ్నింప, వారిట్లనిరి. 'ఈ నా కళేబరము కుళ్ళి ఎవరికి కంపుకొట్టునో వారే నా దేహమును పూడ్చెదరు. ఇందులకు నాకు చింత యేల?'

౮. కారాగృహమనున దేది? అని ఒకరు ప్రశ్నింపగా దానికి వారిట్లనిరి. 'శరీరము, మాడ్పుముఖము, చింత, క్రోధము, దుఃఖము అనునవే ఆత్మకు కారాగృహములు.'

## ౧౯ భక్త నర్సింహ మెహతా

వీరు గుజరాతు దేశమున కాత్యావాడు ప్రాంతములోని జునాగఢ్ నగరమందు బ్రాహ్మణకుటుంబములో జన్మించిరి. వీరు

గొప్ప విష్ణుభక్తులు. సదా భగవద్భజనలో తల్లీనులై యుండు వారు.]

౧. భగవద్భక్తియు, సర్వభూతములందు విశుద్ధప్రేమయు కలిగి ప్రవర్తించువాడే ముక్తుడగును.

౨. వివేకదృష్టితో చూచితివేని నాకు సంసారము గోచరింపదు. మోహములోనే భోగము కనుపించును. ఇట్టి అనిత్యమైన దానికై యింత ప్రయాసయేల? ఇన్ని ఆడంబరము లెందులకు? సంసారమొక స్వప్నమువంటిది. కావుననే నేనేమియు చేయను.

౩. మానవా! ఆత్మసాక్షాత్కారము కోరుదువేని మొదలు యింద్రియ నిగ్రహముచేయుము. ఇంద్రియ నిగ్రహమునకై దుస్సంగముల త్యజింపవలయును. ఆత్మసాక్షాత్కారము కానిది, యేదియు అనుభవమునకు రానేరదు.

౪. నీవు నిర్గుణుని తెలిసికొనలేవు. సగుణుని సేవింపలేవు. ఈ రెండిటిలోజిక్కి నీ జీవితము వ్యర్థమగును. నామరూపము లన్నియు భగవత్స్వరూపములే కావున ఏదో ఒక స్వరూపమును నమ్మి దానిని ధ్యానింపుము. నీవు, నీ శరీరము, నీ మనోబుద్ధులు నీవికావు. వాటికి యజమానుడొకడుకలడు

౫. భగవంతుడు క్షరాక్షరముల రెంటికి అతీతుడు. అది, యిది అను చిక్కులలో పడుటెందులకు? నాది, నీది అను భావమును విడచితివా నిర్భయుడ వగుదువు. వేదశాస్త్ర పురాణేతిహాసములే స్వతంత్రములు కానపుడు ఇక యే ఆధారముపై భగవంతు డిట్లున్నాడని అనగలుగుదుము. కావున, భగవంతుడెట్లున్నను ఆయన భగవంతుడే!

౬. నీవు సంసారములో దగిలియున్న కారణముననే సంసారులు నిన్ను మంచివాడనియు, చెడ్డవాడనియు, చెప్పుకొనుచుందురు. అసంగుడైనవాని నెవరేమందురు?

౭. ఓ మూర్ఖుడా! క్షణికసుఖముకొరకు ఆ దయామయుని మరచితివా! ఏ సాంగత్యమువలన పాపవృత్తి జనించునో, ఆ సాంగత్యము వెంటనే త్యజింపుము.

౮. నీ సర్వస్వమును శ్రీహరి కర్పించినపుడే నీవు పరమ భక్తుడవగుదువు.

౯. జీవేశ్వరులయొక్క భేదము తెలిసికొనినంతమాత్రమున, సత్యము గోచరింపదు. నేను, నీవు అను భేదము మరచిపోయి నప్పుడే సత్యము తెలియును.

## ౧౬. శ్రీ కాత్యాయనుడు

౧. తపము, బ్రహ్మచర్యము, శ్రద్ధ ఈ మూడిటినుండి శక్తి పెరుగును. తపముచే వ్యక్తిగత నిష్క్రియత విడిపోవును. బ్రహ్మచర్యపాలనచే మానసిక, బౌద్ధిక దుర్బలతలు తొలగును. శ్రద్ధ, సద్భావములచే ప్రేరితులై ధ్యానము ప్రాప్తించును.

పై వాటిని ఆచరించుటకు ఈ క్రింది వాటిని త్యజింపవలెను.

౧. చెడుభావముతో ఏ స్త్రీనిగాని, పురుషునిగాని చూడ రాదు. ఆలోచింపను రాదు. ఇది చాలా పాపము.

౨. దేహేంద్రియ నియంత్రణకు, ఆత్మసంయమ మవసరము. బ్రహ్మచర్య వ్రతపాలనకు మనోనిగ్రహ మవసరము.

3. ఆకలి నెంతఅధికముగా సహింతువో అంత అధికముగా మనో విక్షేపములు తగ్గి మనస్సు శాంతించును. మన విచార ములననుసరించియే మన నిర్మాణమగును. త్యాగవైరాగ్యము లతో జీవితము గడుపుదుమేని ఆత్మతత్వము బోధపడును.

౪. తపస్సు, బ్రహ్మచర్యము, శ్రద్ధ, జ్ఞానము వీనిద్వారా ఆత్మానుభవము పొందినవాడు ఉత్తరాయణ మార్గమున సూర్య లోకముజేరి అమరుడగును.

౫ ఎవనిలో ఎంత భ్రమయుండునో వానిలో అంతే దుఃఖ మోహములుండును. దేహభావము నశింపగానే ఆత్మభావ ముదయించును.

౬ ఎంతవరకు మమతాభిమానములుండునో, అంతవరకు శరీరము నిలచియుండును. దేహభావమున్నంతవరకు జన్మ తప్పదు.

## ౧౭ పరమయోగి షోగిజీ మహారాజ్

[ వీరు ఇతరులచే సేవ చేయించుకొనువారితో, యేమియు తీసికొనువారుకారు. వీరికి గాలియు, నీరును ఆహారముగానుండెను. కాలినడక తప్ప మోటారు, రైలు, మొదలగు యెట్టివాహనములనైనను ఎక్కువారుకారు. అందరిని సమదృష్టితో చూచువారు. చప్రాసి (సేవకు)ని "గవర్నరు"ను సమముగా తలంచువారు.]

## ౧౮ స్వామి ఆనందాచార్య యోగివర్యులు

[శిష్యుడు: "ఆచార్య దేవా! యోగజ్ఞానములు భక్తికర్మలతో సమన్వయము నొందు ఏ విధానమున మీ రానందమొందుదురో దాని నుపదేశింతురని మిమ్ము ప్రార్థించుచున్నాను."

"శిష్య చూడామణీ! ఏ వివేకము- యోగజ్ఞాన భక్తికర్మల మూలమున నిన్నీశ్వర సన్నిధానమునకు జేర్పగలదో దాని నుపదేశింతు నాలకింపుము.]

౧. "ఈశ్వరతత్త్వముయొక్క స్వభావమునుగూర్చి ప్రప్రథమమున విచారింతము. మన ఆత్మలో నివిష్టుడైయున్న పరమాత్ముని మన మెరుగుకొరకే ఈ మన ఐహికజీవన ముద్దేశింపబడినది. ఆత్మ పరమాత్మల నెరుగుటయే మానవజీవిత లక్ష్యము.

౨. వత్సా! మహోన్నతము, మహోత్తమము అయిన జీవితము గడుపవలెనన్న దానికి రెండు త్రోవలున్నవి. ఒకటి లోతుగా ఆలోచించి నీ అంతరాత్మ శ్రేయమని చెప్పిన ప్రకారము జీవితపద్ధతిని నడుపుచు, జీవితసమస్యను నీకై నీవే పరిష్కరింప

యత్నించుట. ఇది కడు కఠినమైనది. ఇక రెండవది ఏమనగా, ఒక గురువును జేరి వారినుండి పరమసత్యము నెరుగు బోధలను విని దానిప్రకారము జీవితమును నడుపుట. ఇది శ్రేష్ఠమైనది. భారత దేశమున ఇదియే ఆచరింపబడును.

3. మనము ఎటనుండి వచ్చితిమి? ఎందుకు వచ్చితిమి? కొంచెము, కొంచెముగా నీ వర్ధముచేసికొన శ్రమింతువేని వెలుగు చిక్కగలదు.

౪. న్యాయముగా, ధర్మముగా, భక్తియుతముగా పని చేయుము. దానివలన నీ ఆత్మలో ఒకశక్తి ప్రభవించును. ఆ శక్తితో నీవు ప్రపంచములోని ఊహా ప్రవాహమును నడుపగలవు. నీ జీవితమును పరిశుద్ధమైన దానినిగా, ఉత్తమమైన దానినిగా, జ్యోతిర్మయముగా జేసికొనుము. నీవుండు తావున నీవొక ప్రదీప స్తంభమువంటివాడవు కావలయును. దానిచే ప్రసరించు కాంతి కిరణములు రాత్రివేళ దారినబోవు వారికి దారి జూపగలవు. నీ వెడ తెగక ధ్యానమగ్నుడవై ఈ విషయములు నిరంతరముగ తలంచు చుండువేని నీ తలంపులను ఇతరులు వినగలరు. మన తలంపులను మాటలతో చెప్ప పనిలేదు. మనము తీక్ష్ణముగా తలంచుచుండు మేని మన హృదయా క్రందనములు ప్రజలకు రహస్యముగా వినిపించును. ఆధ్యాత్మిక జీవితములోని రహస్య మిదియొకటి.

మంచివాడేది తలచునో అది ఇతరులకు వినిపించును. అందుచే మంచి తలపులనే తలచుచుండుము.

౫. అంతర్వాణిని వినగలవాడు సుఖజీవి. అంతర్వాణి ఎల్లపుడును మనకును, మానవాళికిమునకును ఏది క్షేమకరమైనదో దానిని రహస్యముగా వినిపించును. కావున నిరంతరమైన అ య్యంత ర్వాణిని అనుసరించిననే మానవునికి సౌఖ్యముకలదు.

౬. ఉన్నత జీవితమునకు ప్రథమ సోపానము లోభ క్రోధ ముల త్యాగము. లోభ క్రోధములను పరిత్యజించినంతనే నీవు

తద్వ్యతిరిక్త గుణములయిన దయను, క్షమను వృద్ధిచేసికొందువు. దయా, క్షమావంతుడే సమ్యగ్భావమార్గమున సుఖయాత్ర గడుపును.

౭. మనస్సు ఆత్మయొక్క సూక్ష్మరూపము. శరీరము మనస్సుయొక్క స్థూలరూపము మనము మూలమునకు అనగా ఆత్మచెంతకు పోయినచో మనశ్శరీరములు రెంటిని నిగ్రహింప గలము. మానవుని జీవితమున ఆత్మనిగ్రహమునకంటె మిక్కిలి ఆవశ్యకమైనది ఇంకొకటిలేదు. ఆత్మనిగ్రహమే యోగమునకు ఏకైకద్వారము. ఈ సుగుణమును సాధించుటకు సర్వశక్తిని వినియోగింపవలెను. ఆత్మనిగ్రహమును సాధించినవానికి శాంతము, న్యాయము, దానము, ధర్మము మొదలయిన అనేక సుగుణములు అప్రయత్నముగా అబ్బును. ఆత్మనిగ్రహముయొక్క తత్త్వమిది. ఆత్మను నిగ్రహించుట ఎట్లు అందువా? వినుము. ఆత్మయొక్క దుర్బలరూపములు మనశ్శరీరములు. అట్టి మనస్సును ఏకాగ్రముగా ఆత్మయందు నిల్పుటకు నిరంతరమైన, తీవ్రమైన, దృఢమైన యత్నమును చేయవలయును. ప్రపంచమున ఆత్మ కడు శక్తివంతమైన పదార్థము. ఆత్మశక్తిని గ్రహించినవానికి మనశ్శరీరములను నియమించుట పిల్లల ఆటగా నుండును. సర్వజ్ఞానము, సర్వవివేకము ఆత్మనిగ్రహపరునకు లభ్యములగును. ఆత్మనిగ్రహము కలవానికి ఏదియు గుప్తమై ఉండలేదు. న్యాయముగ జీవించుటలో, న్యాయముగ శ్వాసించుటలో, న్యాయముగ భుజించుటలో, న్యాయముగ శయనించుటలో, న్యాయముగ భావించుటలో ఆత్మనిగ్రహముకలదు. శాంతి సద్భావము ప్రపంచమునందెల్ల యెడల ప్రతిష్ఠనొందవలయునన్న ఆ పని ఆత్మనిగ్రహపరులు, ఆత్మసంయమపరులు, ఆత్మప్రబుద్ధులు అయిన వారిచేతనే సాధ్యము.

"ఈ గోళమునందంతట విశ్వశాంతి తప్ప మరియొక్కటి మేము కోరము." అని ఉదాటింపగల స్త్రీపురుషులు కొలదిమంది

మనకు లభ్యమైనవా రాత్మనిగ్రహపరమైన జీవితమును గడుప దొడంగిరా, భూలోకమంతయు నాకలోకమగుట కెంతోకాలము పట్టదు. యోగముయొక్క పరమార్థ మిదియే.

౮. ప్రతివాడును తన జీవితాంతమువరకే కాక తన పుత్రులకు తన పౌత్రులకు సరిపడగల ధనధాన్యములను ఆస్తిపాస్తులను ప్రోగుచేయుటకు ఆతురత వహించుచున్నాడు. ఈ ఆహార సంగ్రహగుణము, ఈ బ్రతుకుదెరువు దేవులాట - వీనిలో భావి మానవజాతినిగూర్చి ఆలోచించు యుక్తిగాని, బీజముగాని, మూలముగాని ఏమియులేదు. మానవజాతిని వినాశమొనర్చు విధానమే ఇందున్నది. మానవజాతికి సుఖశాంతులను సమకూర్చ గల శక్తులను ఆత్మలో పెంచు విధానమును యోగము బోధించునే కాని వర్తమానమున భోగమయజీవితమును గడుపు విధానమును బోధించదు.

౯. అస్థిరమగు, అసత్యమైన యింద్రియమార్గమున సుఖము లభించదు. ప్రపంచసుఖము స్వప్నసుఖమువంటిది. మనము స్వప్నమునబడి పోవుచున్న కొలది మనము చేయుచున్న ప్రమాదము పెద్దదగుచుండును. ప్రపంచమునందున్న దుఃఖమంతయు ఈ ప్రమాదముయొక్క ఫలితమే. ప్రతి మానవుడును తానొక్కడే జీవింపవలయునని తలచుచున్నాడు, అందుకై అతడు తన సోదరుని దోచుకొనుచున్నాడు. హత్యచేయుచున్నాడు. ఈ మానవులు సత్యమును దర్శింపలేదు. వీరు ప్రకృతిచే మూఢులుగా చేయబడిరి. సత్యము నవలంబించుచో అది మనకు సుఖసౌధమునకు బోవు త్రోవను చూపించును.

౧౦. యోగి అమరుడెందుకో తెలియునా? అతడు మరణ మెరుగని వానిని ప్రేమించును. మానవులందరు మరణించుచున్నా రెందులకో తెలియునా? వా రసత్యమైన వానిని మరణించువారిని ప్రేమించుచున్నారు. నీవు నీ హృదయమున ధ్యానమగ్నుడ

వమ్యోదవేని, ఈ ప్రపంచమందలి చీకటిబాటలపై వెలుగును ప్రసరింపజేయుటకు సిద్ధముగానున్న ప్రదీపమును గాంచెదవు. ప్రతి మానవుడు ఒక తమోగుహలో నివసించుచు దివ్యమహా దీప కాంతికి దూరుడై యున్నాడు. నీ వొక యోగివి కాగోరుదువేని, నీ హృదయగవాక్షములను తెరచియుంచుము. నీ ఆత్మద్వారములను తెరువుము. వెలుగు లోనికి ప్రసరించును. దేవుని కెల్లవేళల ప్రియులైన వారి కర్ణములజొచ్చు మహాగానమును నీవు వినగలవు. మనము ఏ ఇతరమును గాక దేవుని ఒక్కడినే ప్రేమించు వారమైనచో, మానవు లీ జీవితములో వేనికొరకు అనుదినము చచ్చి పోవు చున్నారో, అట్టి సహస్ర పదార్థములను, సమస్త భాగ్యమును, ఎల్లపదవులను ఎంత వింతగొల్పు వానినైనను మనము తాకబోము. జీవితములో సాగిపోవుచు నిర్జీవములైన రంగుబొమ్మలను నిరాకరించుచు, ఏకైక సత్యమైన, సర్వవ్యాపకమైన, శాశ్వతమైన, ప్రేమపూర్ణమైన పరమాత్మనే అన్వేషించెదము. ఆయనను ఈ జన్మలో కనుగొనకున్నను, తదన్వేషణములో మరణించుచున్నామను సంతృప్తిని జ్ఞానమును కలిగియుందుము. పారిపోవుట కంటె వీరునివలె పోరాడుచు మరణించుట వేయిరెట్లు శ్రేయస్కరము.

౧౧ భావము ప్రవర్తనపై ప్రవర్తన భావముపై ప్రసరించు చుండగా కొలదికాలములో ఆత్మయందొక నూతనశక్తి ఆవిర్భవించును. ఈ నూతనశక్తిని నడపించుటకు గొప్ప తెలివి, గొప్ప మెలకువ కావలెను. యోగి నిరంతర భక్తితత్పరుడు, నిరంతర ధ్యానమగ్నుడు, నిరంతరము తనను సృజించిన మహాస్రష్టి కర్తను మననము చేయువాడు. ఈ ప్రకారము యోగవిధానమున తన దోషములను నిర్మూలింప జేసికొనుటచే, దేవుని మహాగుణములను జీర్ణము చేసికొనుటచే, యోగి దేవుని సింహాసనము దరికి జేరును. కావున నిన్ను నీవు నిర్మించుకొనుటకు, నీ ప్రవర్తనను పునర్నిర్మించుట కొరకు, సద్భావమను పునాదిపై నీ దేశము

యొక్క పునర్నిర్మాణము చేయుటకొరకు నీ మనస్సులో నిశ్చయించుకొనుము. సద్భావమును పునర్నిర్మించుటకంటె మోక్షము లేదు. దేవుడు సత్స్వభావుడు. నీవు నిరంతరము దేవుని ధ్యానింతువేని, ఆయన సద్భావము నీ ఆత్మను స్పృశించును.

ఈ మాంసమయ జీవితము వెనుక ఆత్మయొక్క మహాజీవితమున్నది. అది పిడుగువలె బలముకలది. సముద్రమువలె విశాలమైనది. నీవు ప్రతిదినము ఆ శక్తి, ఆ దివ్యశక్తి, ఆ దివ్యజ్యోతి సమీపమునకు రమ్ము. ప్రతిరాత్రి ఆ శక్తి చెంతకు, ఆ జ్యోతి చేరువకు వచ్చుచున్నానని నీకు నీవే చెప్పుకొనుము. నీ అంతర్బహిర్జీవితమును మలిన మొనర్చిన నీ దోషములు శిశిరర్తువునందలి పండుటాకులవలె రాలి పడిపోవుచున్నవనియు, ఒక నూతన వసంతము వేవేగముగ నీ ఆత్మలోనికి చొచ్చుకొని వచ్చుచున్నదనియు దిన దినము గమనింపుము.

ఈ తమోమయ ప్రపంచమున ఆత్మకు సుఖ మిచ్చునదేదియులేదు. ప్రపంచములోని సువర్ణమెల్ల ఆత్మకు సంతోషమును కలుగ జేయలేదు. ఆత్మలోని అనంతైశ్వర్యమును విప్పి చూపని ఏ విజ్ఞానమునుగాని నేను అభ్యసింప గోరను. మనము ఆత్మాన్వేషకులము. చెడిపోయిన ఈ జగమును మార్చుటెట్లు? పాపముతో నిండిన ఈ జగమును తిరిగి బాగుచేయుటెట్లు? ఒకరి నొకరు సంతతము ద్వేషించుకొనుచున్న, చంపుకొనుచున్న ఈ నానా జాతుల మానవులు తిరిగి ఏకమగుటెట్లు? మరల ఏక కుటుంబ సభ్యులగుటెట్లు? ఇది మన విచారము. మనతో చేరువారు పునర్నిర్మాణ ప్రతిజ్ఞను గైకొనవలెను. ఒక సుఖమయమైన, భోగపూర్ణమైన జీవితమును గడపుటగాని, ప్రొద్దుపొడుపున వెన్నెవన్నెల బుడగలవలె ప్రొద్దులు పుచ్చుట గాని వారిపని కారాదు. వారిది తీవ్ర ప్రయత్నముతో, త్యాగముతో, ఏకాంతముతో కూడిన జీవితము కావలెను. ప్రతిదేశము ప్రపంచములోని ప్రజల

నెల్లరను పిలిచి ఇట్లు చెప్పగలదు. "ఓ సోదరులారా! ఇటురండు. ఏకతయొక్క ఆత్మయొక్క వైభవమును గాంచుడు. మీ విభేదములను మీ దుఃఖములను మరచిపొండు. ప్రేమభానూదయ కాంతులలో వినోద మొందుడు;" అని, నీ శక్తిని అంత ఉన్నత శిఖరమునకు ఎత్తకలిగినచో, "నే నేమియు వాంఛింపను. దేవుడు నాకిచ్చిన దానిని ప్రపంచ క్షేమమునకు వినియోగించెదను. నేను నా కాలమును, నా పదవిని, నా క్రియాశక్తిని ప్రపంచమును సంస్కరించుటకును, ప్రజలను ధర్మమార్గ ప్రవర్తకుల నొనర్చుటకును అర్పించెదను." అని నీవు చెప్ప కలిగినచో, యోగి బృంద మంతయు నిన్నాహ్వానించును. నీ హృదయము పరిశుద్ధమైన క్షణమే నీ హృదయము యోగి బృందముయొక్క హృదయముతో ఏకీభావమును పొందిన తత్క్షణమే నీకు రోమాంచము కలుగును. ఒక నూతనశక్తి నీ శరీరమును ప్రవేశించును. ఒక నూతన దృష్టి నీ కనుల కబ్బును. ఆ క్షణమునుండి నీవు పునర్జన్మ మెత్తుదువు. ఆ క్షణమునుండి ఈ జన్మలో చూడని వానిని కోట్ల సంవత్సరముల క్రిందటి వానిని నీ స్మృతినేత్రము నీ అంతర్నేత్రము చూచిన వానిని నీ కన్నులు చూచును. ఆ స్మృతి నేత్రమును, ఆ ఆత్మనేత్రమును విప్పుటకు ప్రయత్నింపుము. అది విచ్చెనా వ్యాధి, యుద్ధము, దుఃఖము, విచారము లేని కాలమొకటి ఉండినట్లు నీవు చూడగలవు.

ఒక్కసారి నీవిది చూచినచో నీవు పూర్ణహృదయముతో పనిచేయగలవు. నీ శరీరములో బంధింపబడి స్తబ్ధముగా నున్న శుద్ధ శక్తులు విముక్తులై ప్రపంచ విమోచనమునకు పాటుపడును. ఈ పనిని నిర్వర్తింపనిదే ఈ జీవితమునకు విముక్తి లేదు. ఈ ప్రపంచ విమోచనమునకైన మహాయుద్ధరంగమున నీ వ్యక్తిత్వమును ఉపయోగింపుము. మనఃపూర్వకముగ నిన్ను నీవు ఈ మహాకార్యమున కర్పించుకొందువేని, నీ ముక్తి సులభసాధ్యము. స్వాయ

ముగా ఆత్మార్పణము చేయుటకంటె దివ్యమైనది ఇంకొకటి లేదు. ఈ అర్పణము, ఈ త్యాగము చేతనే మనము విశ్వములోనున్న అమృతత్వమును తొంగిచూడగలము. దేవుని భావనవలె ఆశ్చర్యకరమైన దానినిగా తన భావనను మానవుడు పెంచుకొనినచో అతడెంతటి మహాకార్యములు చేయునో గదా! ఆలోచించుకొనుము. భావనను వృద్ధిచేయుటకు గల వీలును, త్యాగబుద్ధిని పెంచుకొనుటకు గల వీలును విచారించుకొనుము. అట్లు చేయుటలో కృతార్థుడవగుదువేని, నీవు నీ జీవితమును వ్యర్థము చేయలేదని గ్రహింపగలవు.

౧౨. చిత్తైకాగ్రతవలన దివ్యజ్ఞానము కలుగును. ఈ చిత్తైకాగ్రత అను శక్తిని వృద్ధిచేయుటకు శ్వాసను, శరీర చలనమును, రక్తములోని వేగమును, ఉష్ణోగ్రతను నిరోధించుట నేర్చుకోవలయును. చిత్తైకాగ్రతను నేర్చుకొనుటకు ఇంద్రియములిచ్చు జ్ఞానము ఆధారముకాదు. యోగి ఈ పంచేంద్రియములను స్తబ్ధముచేయును. అనగా తటస్థములనుగా నుంచును. అప్పుడు మనస్సుయొక్క సహజమైన అంతర్జ్ఞానము ఉదయించును. అప్పుడు విషయములను, అతీంద్రియములను ఇంద్రియములచేత చూడబడలేని వానిని గ్రహింపవచ్చును. మన ఆత్మ తెలిసికొనగోరిన దంతయు చిత్తైకాగ్రతా శక్తిని వృద్ధిచేసి తెలిసికొనవచ్చును. మరణానంతర మేమి సంభవించును? ఈ జన్మకు ముందు మన స్థితి యేమి? సూర్య చంద్ర నక్షత్రముల రహస్య మేమి? ఇట్టి ప్రశ్నల కన్నిటికి సమాధానములు పై విధానమున పొందవచ్చును. మానవుడు నైతికముగా జీవింపనియెడల ఈ అద్భుతమైన శక్తిని వృద్ధిచేసికొనలేడు. నైతిక శక్తులయిన న్యాయము, నిగ్రహము, దానము, ధర్మము మొదలయినవి ప్రజా సహాయార్థమై ఉద్దేశింప బడినవి గనుక వానిని పెంపొందించుకొనవలెను.

నెల్లరను పిలిచి ఇట్లు చెప్పగలదు. "ఓ సోదరులారా! ఇటురండు. ఏకతయొక్క ఆత్మయొక్క వైభవమును గాంచుడు. మీ విభేదములను మీ దుఃఖములను మరచిపొండు. ప్రేమభానూదయకాంతులలో వినోద మొందుడు;" అని, నీ శక్తిని అంత ఉన్నత శిఖరమునకు ఎత్తకలిగినచో, "నేనేమియు వాంఛింపను. దేవుడు నాకిచ్చిన దానిని ప్రపంచ క్షేమమునకు వినియోగించెదను. నేను నా కాలమును, నా పదవిని, నా క్రియాశక్తిని ప్రపంచమును సంస్కరించుటకును, ప్రజలను ధర్మమార్గ ప్రవర్తకుల నొనర్చుటకును అర్పించెదను." అని నీవు చెప్ప కలిగినచో, యోగి బృందమంతయు నిన్నాహ్వానించును. నీ హృదయము పరిశుద్ధమైన క్షణమే నీ హృదయము యోగి బృందముయొక్క హృదయముతో ఏకీభావమును పొందిన తత్‌క్షణమే నీకు రోమాంచము కలుగును. ఒక నూతనశక్తి నీ శరీరమును ప్రవేశించును. ఒక నూతన దృష్టి నీ కనుల కబ్బును. ఆ క్షణమునుండి నీవు పునర్జన్మ మెత్తుదువు. ఆ క్షణమునుండి ఈ జన్మలో చూడని వానిని కోట్ల సంవత్సరముల క్రిందటి వానిని నీ స్మృతినేత్రము నీ అంతర్నేత్రము చూచిన వానిని నీకన్నులు చూచును. ఆ స్మృతినేత్రమును, ఆ ఆత్మనేత్రమును విప్పుటకు ప్రయత్నింపుము. అది విచ్చెనా వ్యాధి, యుద్ధము, దుఃఖము, విచారము లేని కాలమొకటి ఉండినట్లు నీవు చూడగలవు.

ఒక్కసారి నీ విది చూచినచో నీవు పూర్ణహృదయముతో పనిచేయగలవు. నీ శరీరములో బంధింపబడి స్తబ్ధముగా నున్న శుద్ధ శక్తులు విముక్తులై ప్రపంచ విమోచనమునకు పాటుపడును. ఈ పనిని నిర్వర్తింపనిదే ఈ జీవితమునకు విముక్తి లేదు. ఈ ప్రపంచ విమోచనమున కైన మహాయుద్ధరంగమున నీ వ్యక్తిత్వమును ఉపయోగింపుము. మనఃపూర్వకముగ నిన్ను నీవు ఈ మహాకార్యమున కర్పించుకొందువేని, నీ ముక్తి సులభసాధ్యము. స్వాయ

ముగా ఆత్మార్పణము చేయుటకంటె దివ్యమైనది ఇంకొకటి లేదు. ఈ అర్పణము, ఈ త్యాగము చేతనే మనము విశ్వములోనున్న అమృతత్వమును తొంగిచూడగలము. దేవుని భావనవలె ఆశ్చర్యకరమైన దానినిగా తన భావనను మానవుడు పెంచుకొనినచో అతడెంతటి మహాకార్యములు చేయునో గదా ! ఆలోచించుకొనుము. భావనను వృద్ధిచేయుటకు గల వీలును, త్యాగబుద్ధిని పెంచుకొనుటకు గల వీలును విచారించుకొనుము. అట్లు చేయుటలో కృతార్థుడవగుదువేని, నీవు నీ జీవితమును వ్యర్థము చేయలేదని గ్రహింపగలవు.

౧౨. చిత్తైకాగ్రతవలన దివ్యజ్ఞానము కలుగును. ఈ చిత్తైకాగ్రత అను శక్తిని వృద్ధిచేయుటకు శ్వాసను, శరీర చలనమును, రక్తములోని వేగమును, ఉష్ణోగ్రతను నిరోధించుట నేర్చుకోవలయును. చిత్తైకాగ్రతను నేర్చుకొనుటకు ఇంద్రియములిచ్చు జ్ఞానము ఆధారముకాదు. యోగి ఈ పంచేంద్రియములను స్తబ్ధముచేయును. అనగా తటస్థములనుగా నుంచును. అప్పుడు మానస్సుయొక్క సహజమైన అంతర్జ్ఞానము ఉదయించును. అప్పుడు విషయములను, అతీంద్రియములను ఇంద్రియములచేత చూడబడలేని వానిని గ్రహింపవచ్చును. మన ఆత్మ తెలిసికొన గోరిన దంతయు చిత్తైకాగ్రతాశక్తిని వృద్ధిచేసి తెలిసికొనవచ్చును. మరణానంతర మేమి సంభవించును? ఈ జన్మకు ముందు మన స్థితి యేమి? సూర్య చంద్ర నక్షత్రముల రహస్య మేమి? ఇట్టి ప్రశ్నల కన్నిటికి సమాధానములు పై విధానమున పొందవచ్చును. మానవుడు నైతికముగా జీవింపనియెడల ఈ అద్భుతమైన శక్తిని వృద్ధిచేసికొనలేడు. నైతిక శక్తులయిన న్యాయము, నిగ్రహము, దానము, ధర్మము మొదలయినవి ప్రజా సహాయార్థమై ఉద్దేశింప బడినవి గనుక వానిని పెంపొందించు కొనవలెను.

ప్రకృతి వ్యష్టిమానవునే గాక సమష్టి మానవుని, సమస్త మానవజాతిని సంతతము భయపెట్టుచున్నది. (ఒకని జూచి ఇంకొకడు భయపడుచున్నాడు.) యథార్థముగా చూచినచో సర్వులు భయముతో బ్రతుకుచున్నారు. జీవితరంగమునుండి ఈభయమును, ఈ బాధను పారద్రోలుటయే యోగముయొక్క లక్ష్యము. కాని అది యెట్లు సాధ్యము? ప్రతిపక్షములను భావించుట దీనికి మార్గము. ఇది శాస్త్రోక్తము. లోభగుణము గలవాని నొకని నీ వెరిగినచో అతని బుద్ధిపై దానభావమును నీ చిత్తములో ఏకాగ్రముగా నిలుపుము. ఒకడు విపత్కరమైన పన్నాగములను పన్నుచున్నాడని నీకు తెలిసినప్పుడు అతని బుద్ధిపై ప్రేమభావమును కేంద్రీకరించుము. క్రూరుని హృదయము తారుతో పూయబడిన రత్నమనుకొనుము. ప్రకృతి సంబంధమైన మహావిపత్తు రాబోవుచున్నదని తోచినప్పుడు ఆకాశమున శాంతభావమును ఏకాగ్రముగా నిలుపుము. ఇట్లు చేయుచుండగా కాలక్రమమున నీ మనసున కెట్టి శక్తి కలుగునో తెలియునా? నీవు కల్లోలములను ఆపగలవు. తుపానులను నిగ్రహింపగలవు. మానవుల కామక్రోధములను అరికట్టగలవు. అందుచే తార్కికమైన విధాన మేమనగా నీ వ్యక్తిత్వముతో నీ వారంభము చేయవలెను. యోగ విద్యార్థి మొదట తన కామ క్రోధములను, తన లోభమును, తన ఆశను, తన అహంకారమును, తన ఈర్ష్యను, తన గర్వమును అరికట్టుట నేర్చుకొనవలయును. అట్లే శరీరము వ్యాధిగ్రస్తమగు అవకాశమును నిగ్రహింపవలెను. శరీరమును వ్యాధి స్పృశింపనట్టి విధమున నిత్యాభ్యాసము చేయుచు స్థితప్రజ్ఞుడు కావలెను. ఈ ఆరంభదశయందు సైతము క్రూరకర్ము డెవ్వడును, దుష్టబుద్ధి యెవ్వడైనను తన చెంతకు రాకూడదని దృఢబుద్ధితో వాంఛింపవలెను. ముఖ్యముగా పురుషుడు స్త్రీ విషయమున, స్త్రీ పురుషుని విషయమున జాగరూకత వహింపవలసి యున్నది. స్త్రీ పురుషులు చేరుట యోగ పథమున

వినాశకరము. స్త్రీల ఆకర్షణలకు వశులగు పురుషులు యోగా
భ్యాస మొనర్చుటకు అర్హులుకారు. స్త్రీలు సయితము అట్లే. శరీర
భ్రాంతి మిక్కుటముగా గల స్త్రీ పురుషుల బారినుండి తప్పి
కొనుము సుమా! వారి దైహిక భావములు నీ ఆత్మను క్రమ్మి నీ
భావములను దేహసుఖము వైపునకు మరలింపగలవు. తనవైపు
మానవుడు చూడవలె నని దేవుని కోరిక. కాని, అందులకు
మారుగా అతడు దేవుని కొమార్తెవైపు చూపును బరపుచున్నాడు.
శరీరమును ఆత్మకు బానిసనుగా ఒనర్చినచో నైతికశక్తులు వృద్ధి
నొందగలవు. ఈ జీవితములో గల కొలది సంవత్సరములను నీవు
ప్రజాసేవకు వినియోగింప గోరుదువేని నీ శరీరమును దేవునికి
బానిసనుగా చేయవలెను. ఒకసారి నీవు దేవునకు నీ శరీరమును
అర్పించితివేని అది మొదలిక నీ శరీరమును నీవు సేవించుటకు,
తలచుటకు, అలంకరించుటకు అధికారము కోలుపోవుదువు. ప్రతి
దినము ప్రాతస్సాయంకాలములయందు నీ శరీరముతో ఈ విధ
ముగా చెప్పుము: "ఓ దేహమా! నీవు దేవుని బానిసవు. నీవు
దేవుని బానిసవు సుమా!" అని. ఆ మాట నీ దేహము వినును.
ఇప్పుడు నీ ఆత్మ దేహమునకు బానిసగా నున్నది. కాని, నీవు ప్రతి
దినము నీ ఆత్మతో నిట్లు చెప్పుము: "ఓ ఆత్మా! నీవు దేహమున
కధినేతవు. దానిని దేవుని సేవించుటలో ప్రవేశపెట్టుము." దేహము
ఆత్మ రెండును ఎల్లప్పుడు దేవుని ఆజ్ఞలకై వేచియుండవలెను.
మహానియమ నిగ్రహములచే గాని దేహము దేవునికి బానిస
కాజాలదు. అప్పుడే మనము మన ఆత్మయొక్కయు, మానవలోకము
యొక్కయు విమోచనముకొరకు దేవునినుండి మనకై వచ్చుచున్న
సందేశములను పఠింపగలము (వినగలము).

౧౩. యోగాభ్యాసము చేయువానికి బద్ధకముగా నుండుట
తగదు. సోమరితనము ఆత్మను కృశింపజేయును. నీవు నడచు
చున్నను, తినుచున్నను, నిద్రించుచున్నను నిరంతరము విశ్వా

కాంతిని ధ్యానించుట నేర్చుకొనుము. బహిర్జగత్తులో జరుగుతున్న దంతయు స్వప్నమని తలంపుము. దేనికిని భయపడకుము. ఈ విద్యలో మొదటి మెట్టు మహాసహనము, అచంచల సహనము. నిన్ను రక్షించుచున్న దివ్యప్రేమను ఓడింపగలది గాని అతిక్రమింప గలది గాని ఈ విశ్వములో ఏ శక్తియు లేదని నిరంతరము విశ్వసించి యుండుము. ఈ దృఢమైన విశ్వాసమువలన నీ అనుభవము దృఢత నొందును. ఈ విశ్వాసము నుండియే ఒకానొక సుదినమున ప్రకృతి బాధనుండి శాశ్వతముగా లేవనెత్తుకొని పోవు విమోచనము సిద్ధించును. కాని ఎల్లప్పుడు జాగరూకుడవై యుండుము. ఎల్లప్పుడు దేవునిలో పూర్ణవిశ్వాసము నీకున్నట్లు నమ్ముము. జీవితరహస్య మనంతము సుమా! సదా భక్తియుక్తుడవై మెలంగుము.

౧౮. విద్యార్థి మొదట అంతఃపరీక్ష అను కళను నేర్చుకొనవలెను. అంతఃపరీక్ష అనగా నేమి? హృదయములో, ఆత్మలో, శరీరములో తనకై తాను చక్కగా చూచుట, లేక పరీక్షించుకొనుట. నేనేమి తలచుచున్నాను? నేనేమి కోరుచున్నాను? నేనేమి ఆశపడుచున్నాను? అని నిరంతరము నిన్ను నీవు పరీక్షించుకొనుచుండుటచేత, నీవు పరార్థ జీవితమును గడపుచున్నావో లేక స్వార్థ జీవితమును గడపుచున్నావో తెలిసికొనగలవు. ప్రతిదినము నేనేమి మంచిపని చేసితినని ఆలోచించుటతో మొదలుపెట్టుము. విద్యార్థులు పగలుచేసిన పని నంతటిని సాయంకాలమున గురువులచెంత చెప్పుట భారతీయ విద్యాసంస్థలలో ఒక ఆచారము. ప్రతి విద్యార్థియు గురువుచెంతకుచేరి తానేమి తలచినది, తానేమి చేసినది, తానేమి చేయగోరినది వివరించి చెప్పును. ఇంతేకాక తానేమి మరచినదియు, చేయక విడిచినదియు, తానేమి చెడ్డతలంపులు తలచినదియుకూడ చెప్పవలెను. గురువెప్పుడును శిక్షింపడు. శిష్యుడే తన తప్పును ఒప్పుకొని తనకు తానే శిక్షవిధించుకొనును.

శిక్ష అనగా ఇతరులకు ఎక్కువ సేవచేయుట అని అర్థము. అది ఇట్లుండును. దారి తెలియక బాధపడుచున్న ఒక గ్రుడ్డివానిని త్రోవలో చూచితిననియు, ఆ క్షణమున తాను ఆకలిచే బాధపడుచు సాయపడకయే పోతిననియు చెప్పును. ఇది చేయవలసినది చేయక విడిచిన నేరము. ఇందుకు శిక్ష ఏమనగా ప్రతిదినము తాను చేయు పనులతోపాటు నాటినుండి మరి నాలుగు విధులను స్వీకరించును. పల్లెలలోనికేగి ప్రతిఫలము గ్రహింపకయే మోపులు మోసియు, గృహములు చిమ్మియు తన శిక్షాకాలమును గడపును. ఇట్టి విద్యా విధానముయొక్క ప్రధానోద్దేశమేమనగా పిల్లవానిని చిన్నతనము నుండియు సద్భావములు భావించునట్లును, సత్కార్యముల నాచరించునట్లును అలవాటుచేయుట. అందుచే ఈ బాలకులు పెరిగి పెద్దవారై తమ గృహములకు తిరిగి చేరినప్పుడు సద్విద్యతో, పరోపకారము చేయవలెనను సద్భావముతో, నిస్వార్థజీవితము గడపవలెనను సద్వాంఛతోనుందురు. సనాతన కాలమునుండి భారత దేశములో పరంపరగా వచ్చుచున్న విద్యా విధానమిది. ఇప్పటి విద్యా విధానము దీనికి విరుద్ధముగా నున్నది. ఇరువది లక్షల సంవత్సరములనుండి ఈ ప్రపంచము ఈర్ష్యతో, మత్సరముతో, యుద్ధముతో బాధ ననుభవించుచున్నది. అందుచే విశాల మహాకాశమును భావింపుము. అది నీకు విశ్వసోదరజ్ఞానము నీయ గలదు. నేనాంధ్రుడనని, నేను భారతీయుడనని, నేను పురుషుడనని ఇట్టిభావములను నీలోనుండి పారద్రోలుము.

ఈ ప్రపంచమును సృజించి పెంచి నిలుపుచున్న ప్రేమను. న్యాయమును, సామరస్యమును ధ్యానింపుము. దీనిచే ప్రతి దేశమందలి ప్రజలతో స్నేహము చేయగలవు. మానవానీకమును సముద్ధరించుటకైన ఆధ్యాత్మిక సేవయే ప్రపంచమునకు సేవ. ఇదే యోగము. నిజమైన యోగము సత్త్వము. నిజమైన యోగము వివేకము, ప్రేమ, మానవత్వము. నీవు నిజమైన యోగి వగుచో

తోడి మానవుని ప్రేమింతువు. దేవుని ప్రేమింతువు. ఈ ప్రేమను నీ ప్రవర్తనమువలన ఋజువు చేతువు. నీవు విధేయుడవై, శాంతుడవై, భా[illegible]కయుడవై యుందువు. ఇవి యన్నియు యోగ గుణములు.

ప్రతిదినము నిన్ను నీవు ప్రశ్నించుకొనుము. నీవు యోగి వగుచున్నావో లేదో, నీవు సంవత్సరము క్రిందట ఉన్నట్లే ఉన్నావో మారినావో నీ ఆత్మ ఎదుగుము. యోగములో ఆగుట లేదు. క్రమాభివృద్ధి కలదు. ఎందుకనగా మన కాలము కొంచెము. విఘ్నములు అనేకములు. మనమీ గోళమును విడిపోవుటకుముందు పృథివీమాతకు కొంతసేవ చేసితిమని చెప్పగలిగి యుండవలెను. ఈ సమస్త మానవజాతియు నీ హృదయములో వసించుచున్నట్లును, నీ హృదయము ఈ మహామానవ కుటుంబమును ఆలింగనము చేసికొనుచున్నట్లును నీవొక్కసారి భావింతువేని జీవితసమస్య నీకంత మహాప్రళయముగ గన్పట్టదు. ప్రపంచసమస్యకిదే పరిష్కారము. ఇందుకే దేవుడు నిన్ను నీ తావునుండి ఇక్కడకు త్రోసి నాడు. దేవుడు నీవేది నేర్చుకొనవలయునని తలచునో దాని నంతటిని నేర్చుకొందువు. కష్టములు వచ్చును. మహా విపత్తులు సంభవించును. ఈ కష్టములలో, విపత్తులలో నీ హృదయము విశ్వాసమును వీడరాదు. జీవితాంతము నమ్మకముతోడనే నడచి పోవలెను. ప్రతిరాత్రియు, 'ఆమరణదీక్ష' అని పలికి నిద్రింపుము. భక్తికి మించినది నాకీ లోకమున మరియొకటి కన్పట్టదు. జీవితము యొక్క విలువ సేవలోకలదని స్మరింపుము. అనగా నీవు ప్రపంచమునకు చేయవలసిన సేవ పూర్తియయినప్పుడు అధోరవిందము ఊర్ధ్వారవిందము చేరుటకు వచ్చును. నీవు హృదయపూర్వకముగ ప్రపంచమును సేవించినప్పుడు నీ వ్యష్ట్యాత్మ పరమాత్మతో ఏకమగును. ఈ ప్రాపంచిక జీవనము పూర్తియయినపిమ్మట ఆవల ఏమున్నదో నే జెప్ప పనిలేదు. ఆ రహస్యమెల్ల కాలము రహస్యముగానే ఉండవలెను.

నిజమైన శిష్యుడు దానిని తెలిసికొనవలయునని ఆశపడ
రాదు. బ్రతుకుపై గల హద్దుమీరిన దురాశయే ఈ నేటి పైశాచిక
ప్రకోపము. ఈ భూతవిద్యలో ఏ ప్రమేయములు సహేతుకములో,
ఏవి కావో మనకు తెలియదని ఒక ప్రసిద్ధ తాత్త్వికుడు చాలకాలము
క్రిందట చెప్పియున్నాడు. మరణానంతరజీవితమును గూర్చిన
రహస్యములు ఎరుగుదుమని నటించునట్టివారి స్నేహము చేయ
వలదు. యోగి ఈ భూతవిద్యను పూర్తిగా విసర్జింపవలెను. సద్గుణ
సంపత్తి, తేజస్సు, ఔన్నత్యము అను మూడు సరులకు జన్మస్థాన
మైన మానవహృదయము ఈ అశరీరభూత సంబంధ యత్నమున
ఎండిపోవును. భక్తి శోషించును. ప్రాణారవిందముపై బుద్ధినిలిపి
అది ఆత్మారవిందము నందుకొనవలెనని ధ్యానము చేయుము.
మూలాధారమునందలి అరవిందము సహస్రారమునందలి అరవిం
దము చేరువకు రావలెనని ధ్యానింపుము. మూలాధారము భూ
లోకము, సహస్రారము సత్యలోకము. ఈ భూలోకము సత్యలోక
ముతో ఏకము కావలెనని నీవు ధ్యానింపవలెను. వైరుధ్యమును,
వాదభేదమును వీడి ఇతరులను సంస్కరింప యత్నించుటకు ముందు
నీ హృదయమును నీ ఆత్మను సంస్కరించుకొనుము. దేవుని సద్భా
వమునందు నీ ఆత్మకు అచంచల విశ్వాస మేర్పడి యుండవలెను.
దేవుని నీ ఆత్మను పవిత్రము చేయనిమ్ము. అదియే సర్వోత్తమ
పవిత్రము. ఆయన పని అనేకవిధముల నిర్వర్తింపబడునది.
ఆయన విధానములలో నీవు ప్రమేయము పెట్టుకొనకుము. వెలు
గును సాధింప యత్నింపుము. ఆ దివ్వెను చేత నిడుకొని తుపానులు
తప్పగాని అంధకారమయమైన ఈ పృథివిపై నడచిపొమ్ము. నీ
ఆత్మలోని దివ్వెను దేవునే వెలిగింపనిమ్ము. నీ జీవితమునకు తగిన
ఫలము ఆ దివ్వె అనియే భావింపుము. మరియొక ఫలము నాశింప
కుము. జీవితములో మరియొక నిశ్చయమునకు పోకుము. ఇతరము
లగు అల్పాదర్శములను అల్పాశలను నీవు విద్యాభ్యాసమునకు
పూర్వము పొందియున్న అల్పకాంక్షలను విడిచిపెట్టుము. యోగికి

అంతర్జ్యోతియే సర్వస్వము. దానిని మించి ఏమియు లేదు. ఏ వేళ యందైనను నీవీ యంధకారావృత వసుంధరాతలమున సంచరించు నప్పుడు, ఆ జ్యోతి తళుక్కున మెరయుటను గాంతువు. ఆ ధ్వని శబ్దించుచున్నట్లు వినుదువు. నీ యిచ్ఛవచ్చినచోటి కెక్కడి కేగినను ఈ రెండును నిన్ను వీడవు. నీ జీవితమును ప్రాతర్వికసిత పద్మము వలె పవిత్రముగా నుంచుకొనుము. నీ వాక్కును శ్రుతిబద్ధ తంత్రీ సమున్నద్ధ విపంచికవలె స్వచ్ఛముగా నుంచుకొనుము. నీ నేత్రము లను సంధ్యాతారకా గోళకములవలె శుభ్రముగా నుంచుకొనుము. నీ శరీరము, నీ జిహ్వ, నీ నేత్రములు ఈ మూడును అంతర్జీవిత మును బహిర్గమింపజేయు శక్తులు. వీనిని అపరిశుభ్రముగా నుంచు కొంటివా జ్యోతిర్మాలముపై నివి తిరుగుబాటు చేయును "నా జీవితము ఈ ప్రాతరాకాశము వలె శుభ్రముగా నుండుగాక! నా ఆత్మకాంతి ఈ ఉదయభాను ప్రభాసమానమై సముద్దీపించు గాక!" అని ఉదయించుచున్న ప్రాతఃకాల సూర్యుని చూచుచు అనుకొనుము. ఆకాశము, సూర్యుడు నీకు సహాయము చేయగలరు. ఆత్మాభివృద్ధికి దోహదముచేయు ఏ అవకాశమును నీవు జారవిడువ రాదు. పారిజాతవృక్షము ప్రక్కగా పోవునప్పుడు "నా జీవితము ఈ వృక్షమువలె మధురముగా, పరిమళవంతముగా, శాంతముగా, ఓర్పుతో విలసిల్లు గాక!" అనుకొనుము. జ్వలించుచున్న అగ్ని చెంత వసించునప్పుడు 'నే నీ అగ్నివలె శక్తివంతుడనై నా పాపము లను దహింతును గాక! ఈ అగ్నిసమిధలను కాల్చునట్లు నా అజ్ఞా నమును నేను దహింతును గాక!' అని యనుకొనుము ఒక సెల యేటి ప్రక్కన నిలచినప్పుడు 'నే నీ నిర్ఝరిణివలె వినయ విధేయతలను కలిగియుందును గాక!' అని యనుకొనుము. ఇవన్నియు నీకు సాయము చేయగలవు. భౌతికశక్తులను నీ వడుగుటయే నేర్చుకొన వలెను గాని అవి యన్నియు నీకు తోడుపడును. వినయముతో, విధేయతతో అడుగువానికి ఎవ్వనికిని ఈ విశ్వము కాదనదు. నీ స్నేహితుని రక్షింప దలచితివేని నీ స్వప్నాధిదేవతతో నీ స్నేహి

తుని జీవితమును రక్షింపుమని చెప్పుము. ఆ దేవత అట్టి పరిస్థితులు కల్పించును. ఏదియు నిర్జీవమని తలంపకుము. ప్రతిదియు సజీవమని వివేకవంతమని నిన్నర్థము చేసికొనగలదని భావింపుము. మానవుడు తప్ప మిగిలినదంతయు నిర్జీవ మనువాడు కేవలము మూఢుడు, అవివేకి. అట్లనుట ప్రకృతిని పరాభవించుట. శిశువు తనకంటె వివేకవంతమైన ప్రకృతి శక్తులచే కాపాడబడు చున్నది. ఈ విశ్వములోని భిన్నభిన్న శక్తులన్నియు నిన్ను సేవించుటకును, నీ ఉద్యమమునందు తోడుపడుటకును, నీ జీవితమును సుఖమయమును అద్భుతావహమును ఒనర్చుటకును సంతోషముతో ముందునకు వచ్చు దినములు రాగలవు. ఈ విశ్వశక్తులచెంత తుది సెలవుగ్గైకొని నీ వేగునప్పుడు అవి కన్నీరు గార్చుచు "మమ్మెంతో ప్రేమించిన మిత్రుడకటా మమ్ములను వీడిపోవు చున్నా"డని విలపించును.

౧౫. మానవునకున్నట్లు చెట్టునకు నరములున్నవి. మనసున్నది. చెట్లకుకూడ బిడ్డలున్నారు. చెట్లుకూడ భౌతికశక్తులయిన సూర్యకాంతిని, నీటిని, మట్టిని, గాలిని స్వీకరించి వానిశరీరములోని ద్రవ్యములుగా మార్చుకొనును. చెట్లుగాని, జంతువులు గాని అన్నియు ఒకేరీతిగా జీవించును.

నేను అను జ్ఞానము ఆత్మకు చిహ్నము. కాని అది ఆత్మకాదు. ఎందుకనగా శరీరము మరణించినను ఆత్మకలదు. కాని శరీరము మరణించిన పిదప నేను అను జ్ఞానము పోవుచున్నది. ఆత్మలేకున్నయెడల నేను అను జ్ఞానము లేదు. ఈ నేను అను జ్ఞానముచేతనే ఈ శరీర భాగములన్నియు మనస్సు ప్రేమానుబంధములు కూర్పబడి యున్నవి. ప్రాణముగల యీ శరీరము ఆత్మచే ప్రేరేపింప బడుచున్నది. అదేవిధమగ వృక్షములుగూడ ఆత్మచే ప్రేరేపింప బడుచున్నవి. ఎట్లనగా మనము అన్వేషించుచున్నట్లే అవికూడ స్వతాదాత్మ్యము, స్వక్షేమము, స్వావినాశము లను యీ మూడు విషయములను అన్వేషించుచున్నవి. ప్రతివాడు, ప్రతిజం

తువు, ప్రతివృక్షము తన తాదాత్మ్యమును నిల్పుకొనుటకు వాంఛించును. తాను జీవించుటకు ఎన్నిటినో వెదకుచుండును. ఇట్లు సహస్రవిధముల సృష్టిఅంతయు స్వక్షేమమును అన్వేషించుచున్నది. ఇక స్వావినాశము. తాను మరణించుట కెవ్వరును కోరరు. ఒక కసాయివాడు ఒక గొర్రెను చంపబోవుచున్నప్పుడు అది యెంత అనిష్టమును చూపునో, ఒక చెట్టును పడవేయునప్పుడు ఎంత కష్టమై అది పడుట కెంత అయిష్టమును చూపునో నీవు చూచియే యుందువు. నీవు చేపలు పట్టుటను చూచియుండినచో చేప చచ్చుట కెంత కష్టమును అనుభవించునో చూచియుందువు. ఇట్లే ప్రతిదియు తన జీవితమును దీర్ఘాయుర్వంతము కావలయునని వాంఛించును. ఇది స్వావినాశకాంక్ష. ఇది సృష్టిలోని ప్రతివస్తువునందున్నది. యీ అహంత లేక నేను అను జ్ఞానము, యీ మూడు భావములతో, జీవు లన్నింటిలో చేరి కదలించుచున్నది. ఇక వివేకవంతుడగు మానవుడు యీ శరీరములో నున్నను లేకున్నను అతని ఆత్మ అక్షరమై అమరమై దేవునితో చేరి తన తాదాత్మ్యమును నిల్పుకొన వలయునని ఆశపడును.

ఊరక బ్రతుకుటకాక, సద్గుణములు కలిగి, జ్ఞానము నార్జించి, దేవుని ప్రేమించి ఆత్మ నెరుంగుటయే స్వక్షేమమని అతడు భావించును. ఇక మరణము సంభవించినను, దురదృష్టము పైబడినను అతని ఆత్మ ఎన్నటికిని నాశము నొందదని, దుఃఖము నెన్నటికిని అనుభవింపదని అతని విశ్వాసము.

ప్రకృతియొక్క ప్రధాన లక్షణము విచ్ఛేదము. ఈ విశ్వము లోని దంతయు ప్రతిక్షణము విచ్ఛేదము నొందుచున్నది. ద్రవించి పోవుచున్నది. పుట్టినవన్నియు గిట్టును. ఆరంభించినవన్నియు అంత మొందును. కలసి వసింపగోరి వచ్చిన వారందరు తుదకు ఎడబాటు నొందుదురు. ఈ మన ప్రకృతి హృదయాంతరాళమున దుఃఖమే కలదు. అందుకే మనము దుఃఖముతో నిండియున్నాము. పడుచున్న

వృక్షము, జారుచున్న నక్షత్రము, మృతకళేబరము, కన్నీరుగార్చుచు వాలిపోవుచున్న మన శీర్షము ఇవి మన మెరిగిన విషయములు. ప్రతి మానవుడు ఈ వియోగబాధ ననుభవింపవలసియే యున్నది. ఒకానొకనాడు మన పలుకులు, మన సంబరములు మృత్యువులో అణగారిపోవును ప్రకృతిచరితము ఇది. కాని ఆత్మరూపులమయిన మనను అది తాకదు. అగ్ని కాల్చదు. నీరు కరిగింపదు. మన విధి భిన్నమైనది. మననుండి ఈ శరీరము దాని సర్వేంద్రియములతో జారిపడిపోయిన పిమ్మట మనమేమో, ఎట్టి అనుభవమును పొందుదుమో, ఎట్లుందుమో ఊహించుటయే దుర్లభము. మరణానంతర స్థితి ఊహింపలేకపోవుటయే భయహేతువు. ఇట్టి స్థితిలో యోగ మక్కరకు వచ్చును. ఈ శుద్ధసత్యము నెరుగుటకు యోగము మనకు శాస్త్రీయమార్గమును చూపుచున్నది అది రెండు తీరులు. మొదట యోగి ప్రకృతి విషయములకు, ఆధ్యాత్మిక విషయములకు భేదమును తెలిసికొనును. 'నేను పృథివిని కాను, ద్రవ్యమును కాను, పంచభూతములతో చేయబడిన శరీరమును నేనుకాను.' అని అతడు ప్రకృతి పదార్థములనుండి తనను వేరుగా చూచును. అటుపిమ్మట ఆధ్యాత్మిక విషయములతో తనకు తాదాత్మ్యమును సాధించుకొనుట నేర్చుకొనును. ఈ నా ఆత్మ శుద్ధమైనది, శాశ్వతముగా నిలచునది అని విశ్వసించును. కాని ఈ వివేకము సర్వవస్తువులలో ఆత్మను గుర్తింపని వానికి వచ్చునది కాదు. జిజ్ఞాసగల శిష్యుడు ఎక్కడెక్కడ ఆత్మ కలదో అక్కడ ప్రాణ మున్నదనియు, ఎక్కడెక్కడ ప్రాణమున్నదో అక్కడ బాధానుభవ మున్నదనియు గుర్తింపవలయును. అందులకే యోగి తనను తాను ప్రేమించు రీతి సర్వవస్తువులను, సర్వపదార్థములను, సర్వప్రాణులను ప్రేమించును. అందుచేతనే యోగి మనోవాక్కర్మలలో నిగ్రహముగల జీవితమును గడపును. ఎవరికిని హాని చేయడు. ఎవరికిని బాధ కలిగింపడు. ప్రతి వానినుండి నేర్చుకొనును. ప్రతిచోట ఆత్మయే కలదు. కాబట్టి

ప్రతిదానిని వస్తువని తలంపక ఆత్మ అనియే భావించుట నేర్చుకొనుము. నీ దేశమునందలి ప్రతిబిడ్డయు ఆత్మభావన చేయుట నేర్చుకొనినచో, ప్రతివస్తువును జీవాత్మనుగా భావించుట నేర్చుకొన్నచో, నీ దేశ మొక స్వర్గసీమ కాగలదు. నీ దేశమునుండి ఇతర దేశములన్నియు నేర్చుకొనును. ఎందుచేత? అందరు ఆత్మజ్ఞానమునకై పరితపించు చున్నారని యెరుగుము. మానవులందరు ఆత్మ ఎల్లకాలము ఉండుననియు మరణింపదనియు గ్రహించినచో ఎన్ని పాపములు, ఎన్ని హింసలు తొలగిపోవునో యోచింపుము. అప్పుడు ఒకని ప్రాణము నొకడు తీయడు. యుద్ధములు ఆగిపోవును. కాని యిప్పటి కాలమున దేశ ప్రజల కన్నులలో దుమ్ము నిండినది, వా రాత్మను చూడలేకున్నారు. వా రాత్మను గూర్చి తలచుటకు శక్తిహీనులుగ నున్నారు. విద్యాలయములలో పాఠ్యగ్రంథము లన్నియు ఆత్మయొక్క అస్తిత్వములో విశ్వాసములేని వారిచేత వ్రాయబడుచున్నవి. ఇందుచే యుద్ధము, హత్య, సర్వపాపము వచ్చుచున్నది. ఇందువలన ఒక పెద్ద అసహనము ఆదర్శ మనునది పూర్తిగా లేకపోవుట, సద్గుణము అనున దొక్కటియు లేకుండుట సంభవించినవి. కాబట్టి నీ ఆత్మను ధ్యానించుట నేర్చుకొనుము. నీ ఆత్మనుండి శుద్ధసత్త్వ మావిర్భవించును. చిచ్ఛక్తి పుట్టుకొని వచ్చును. ఈ రెండు దేవతామూర్తుల సహాయముతో ఈ మలిన భూమిపైకి కొంత స్వర్గసౌందర్యమును కొని రాగలుగుదువు. నే నాత్మనుగాని శరీరమును కాదు, నేను కాంతినిగాని చీకటిని కాదు. నేను ప్రేమనుగాని ద్వేషమును కాదు. అని నిరంతరము నీలో నీవాలోచించుకొనుము. భారతీయ మహర్షులు యీ విశ్వమును ఒక మహారవిందమునుగా భావించిరి. ఈ విశ్వారవిందమే పరమాత్మ.

౧౬. 'నేను రక్షకుడను. నన్నెవరు ప్రేమించినను వారు రక్షింపబడుదురు.' ఇది దేవుడు స్వయముగా చేసిన ప్రతిజ్ఞ. నన్ను

ప్రేమించువారలు నేను - కాని దానిని ప్రేమింపరాదు. ప్రేమకు పరీక్ష భక్తియొక్క ఏకాగ్రత. 'నీవు నన్నే ప్రేమింపుము. నేను - కానిదానిని ప్రేమింపకుము'. అని దేవుడు శాసించినాడు. నేను కానిది అనగా ప్రకృతి ద్రవ్యము. ఈ నేను - కానిది మనకు బాధను, మరణమును కలిగించును. అయినను పసితనమునుండి వృద్ధాప్యము వరకు మానవుడు ఈ నేను - కాని ప్రకృతి పదార్థమునే ప్రేమించుచున్నాడు. వార్థక్యమువచ్చి అతడీ జీవితమును వీడవలసి యున్నప్పుడు 'నేనీ ధనమును, గృహమును, పరివారమును ప్రేమించుచుంటిని. కాని ఇవి అన్నియు నన్నీ మృత్యువు నుండి ఇప్పుడు రక్షింప లేకున్నవే' అని యనుకొని నిరాశాహతుడై ప్రాణములు విడుచును. అతడు రక్షింపబడలేదు. అతడు దేవుని వాక్యమును అనుసరింపలేదు. దేవుని ప్రేమింపలేదు. ప్రకృతిపై దృష్టితప్ప ఇంకొక దృష్టి అతనికిలేదు. అందుచే అతని ప్రేమ అంతయు ప్రకృతి పదార్థములగు శరీరము, గృహము, ఆహారము, పరివారములమీదనే కేంద్రీకరింపబడినది. కాబట్టి ప్రకృతి అతని కిచ్చిన సంతోషమంతటికి బదులుగా అతనిపై అది తెచ్చిపెట్టిన బాధను అనుభవించుచున్నాడు. ప్రకృతి ప్రవాహతరంగములచే త్రోయబడి జనన మరణములను బొందుచున్నాడు. అట్టి మానవులు కేవలము ప్రాకృతికాణువులు. ఇట్లెందుకు జరుగుచున్నది? ఆలోచనాపరుడైన ప్రతివాడు జాగ్రత్తగా ఆలోచింపవలసిన విషయమిది. మానవునకు తాను శరీరమే అని అనుకొనుట సహజమగుచున్నదెందుచేత? 'పూరణము' అను ప్రకృతిధర్మము ననుసరించి ఇట్లు జరుగుచున్నది. నీవు ఎపుడు ధనము సంపాదించుట కాసింతువో అప్పుడు నీలో ఈ పూరణక్రియ వేవేగముగ పనిచేయును. లేక ఇతరుల విజయమును జూచియో వైభవమునుజూచియో తీవ్ర కాంక్షను పెంచుకొందువో అప్పుడు నీ వాంఛ ప్రకృతిని ఒత్తిడి చేయును. ఆ ఒత్తిడికి నీలోని ఆధ్యాత్మిక జీవితప్రవాహ నాళికలు ఎండిపోవును.

"నేనాత్మను నేనమరుడను", అని భావించు యోగి విశ్వాసనీయముగా దేవుని ప్రేమించినప్పుడు తనను తాను దేవుని కంకితము చేసికొనును. ప్రకృతిపదార్థములన్నింటిని త్యజించును. వినయ పూర్ణుడగును. శుద్ధహృదయుడగును. సత్యజ్ఞానము పెంపొందినకొలది న్యాయజీవనమునే గడపును. ఎవ్వానికిని బాధ కలిగింపడు. అప్పుడతని ఆత్మ ఒక స్వతంత్రసత్యముగా భాసించును. ప్రకృతి సంబంధములేని శుద్ధసత్యముగా తేజరిల్లును. స్వేచ్ఛ కంటె గొప్పదిలేదు. మన హృదయమునందు హత్తుకొనిన ప్రతి దానిని తీసియిచ్చి మనము స్వేచ్ఛను కొనవలెను. నీవు విశ్వము విడిచిన దేవుడు వచ్చును. స్వార్థ త్యాగమునకు కొరత ఏమియు పనికిరాదు. నిద్రను త్యజించినగాని ఆత్మకు స్వేచ్ఛలభింపదు. ప్రకృతిధర్మము నిద్ర. ఆత్మధర్మము మెలకువ. ఒకసారి మనము బాటపై ప్రయాణము నారంభించితిమా గమ్యస్థానము దూరము కాదు. యోగి మోక్షమను గమ్యస్థానము చేరుట తథ్యము. దేవుడు తన భక్తులకు తోడుపడుచుండును. ఆయన భక్తులనెన్నడును విడిచిపెట్టడు. యోగికి దేవుడు ఒక్కడే ఒక్కడు స్నేహితుడు కలడు. ఇది అలంకారికభాషకాదు. కావ్యభాషకాదు. సత్యవిషయము. ఇది నా జీవితానుభవములో సత్యముగా తేలిన విషయము. నేనభ్యసించినట్లు నీవును కష్టించి యోగము నభ్యసింతువేని నీకును అట్టి నిదర్శనములు కలుగును. ఏ క్షణముననైనను ఈ శరీరము రాలిపోవచ్చును. నీ తలిదండ్రుల శరీరములు అట్లే రాలిపోయినవి. ఇక మిగులునదేమి? ఈ ప్రశ్నకు సమాధానము దాని ప్రతిధ్వనియే. ఇక మిగులునదేమి? ధ్యానమొక్కటియే మిగులు దానినిగూర్చిన విశ్వాసమును కలిగించును. ఒక వేయి సారులు నేను ఆత్మ మిగులునని చెప్పినను నీకు విశ్వాసము కుదురదు. నీ ఆత్మ మిగులునని నీకు అనుభవము రావలెను. దేవుడు మిగులునని నీవు చూడగలుగవలెను. కాబట్టి యోగి గురువాక్యముపై ఆధారపడి కొండలలో తిరిగి, గుహలలో కూర్చుండి

చేతుతో యోగము నభ్యసించును. అటువిమ్మట హఠాత్తుగా ఒకనాడు అతని మనసునుండి 'ఇదిగో ఆత్మ, ఇదిగో దేవుడు' అని సత్యము ఉద్భాసించును. ఆ పాఠము నాతడు మరువడు. దేవు డతనిని విడువడు. ఇప్పటినుండి ఆ జ్ఞానము నార్జించుటకు కృషి చేయుము. ఈ విశాల ప్రపంచమున ఆత్మజ్ఞానము, దైవభక్తితప్ప యత్నించి సంపాదింపవలసిన వేవియు లేవు.

౧౭. వెలుపలికి చూచు మనస్సు లోపలికి చూచునట్లు చేయు విధానము కడు ముఖ్యమైనది. బాహ్యప్రపంచ వస్తుజాతమును ఉపయోగించుకొనవలె ననెడి ఇచ్ఛను నిరోధించవలెను. నీ ఇచ్ఛాశక్తి ఏమి చేయుచున్నదో నీవు వివరముగా తెలిసికొనవలయును. అప్పుడు నీలోని దోషము లేవియో నీకవగతములగును. ఇచ్ఛాశక్తి అనునది వెనుక ముందు చూడక అమిత వ్యయము చేయు భార్యవంటిది. కేవలము ఇచ్ఛించుట వలననే ఈ ఇచ్ఛ తనకు తానే వ్యయమగుచున్నది. నీవు రూపొందించు ప్రతి వాంఛయు నీ శక్తిలోని ఒక ఖర్చుపద్దు. నీవు చూచిన ప్రతి దానిని ఉపయోగించు కొనుటకు వాంఛింతువు. నీ పిత్రార్జితమయిన గృహమును నీ పొరుగువా రాక్రమించినట్లు ఎంచుదువు. వెంటనే నీ కాగ్రహము హెచ్చును. దానిని తిరిగి పొందుటకు న్యాయస్థానమున కేగుదువు. నీ ఇచ్ఛ దేనిని ఇదివరకు ఉపయోగించుకొనెనో దానిని ఇతరులు ఇచ్ఛించుటను తిరస్కరించుచున్నది. ప్రతిమానవుడు ఇతరుల ఇచ్ఛలను తిరస్కరించుటలో తన యిచ్ఛాశక్తిని వ్యయముచేయు చున్నాడు. భూమివైపు చూచుచున్న రెండు కండ్లు, వినుచున్న రెండు చెవులు భౌతిక ద్రవ్యముపై ఆసక్తములైనవి. ఇచ్ఛ వాని ప్రాబల్యమున ఆకర్షితమైనది. ప్రకృతి ద్రవ్యమునకు అంటుకొనినది. అప్పుడా యిచ్ఛను లాగి యథాస్థానమునకు ప్రవర్తింప జేయుట కడు కష్టము. ఆధ్యాత్మిక పతనమున కిదే కారణము. భౌతిక ద్రవ్యాసక్తము లయిన మనస్సులు కలవారు యోగా

భ్యాసము చేయుట దుర్లభ మనుటకు ఇదే కారణము. కేవలము ఇచ్ఛించకుండుట వలననే మన ఇచ్ఛాశక్తిని రక్షించుకొనగలము. మానవులు అధికేచ్ఛచే అంతశ్శరీరము దెబ్బతినునట్లు చేయు చున్నారు. ప్రాపంచిక వస్తు సంగ్రహము చేయుటకు తీవ్రముగా ఇచ్ఛను పనిచేయించుటచే అనేకుల అంతశ్శరీరములు దెబ్బతిని కోలుకోలేకున్నవి. దానివలన వారు జీవితాంతము బాధ పడుదురు. యోగమట్టివారికి కాదు.

యోగి మొదట ఒట్టు పెట్టుకొనవలయును. లేక లోపల నిశ్చయము చేసికొనవలయును. లోన దృఢమైన నిశ్చయము చేసికొనుట ఇచ్ఛకుగల ఆశను అణచుటకు మిగుల సాయపడును. 'అశాశ్వత మయిన సంపత్తిని సంగ్రహించుటకు నా యిచ్ఛ కృషి చేయదు.' అని నిశ్చయించుకొనవలెను. నీ నాలుకను ఎక్కువ మాటలాడునట్లు విడిచితివేని ఎక్కువ అబద్ధము లాడునట్లును, ఎక్కువ నిందలు చేయునట్లును, ఎక్కువ పరుషవాక్యములు పలుకునట్లును అవకాశ మిచ్చితివని గ్రహింపుము. వీనివలన బయలుదేరు దుష్ట కంపమునకు యోగి ఎప్పుడును తావీయరాదు. కాబట్టి యోగి తీసికొనవలసిన మొదటి ప్రతిజ్ఞ వాఙ్నియమము. రెండవది మనోనిగ్రహము. దుష్టములైన విషయముల పైకి ఊహలను పోనీయ రాదు. కాంతా కనకాదుల యొక్కయు ఇతర భౌతిక వస్తువుల యొక్కయు మూలమున ఏ భోగములను శరీరము గతకాలమున అనుభవించి యుండెనో, వానిపైకి మనస్సును ప్రసరింప జేయ రాదు. మనోభావములను గట్టిగా ఆత్మవశమునం దుంచవలెను. ఇక మనస్సు భవిష్యత్తులో ఏవో భౌతిక భోగములను పొందవలెనను ఆశతో భావిపథమున సంచరింపనేరదు. ఇట్టి భవిష్యదూహలు విపత్కరములు. ఎట్లనగా! విలాసము మనలో ఎట్టి చిత్రములను నిర్మించునో అట్టి ప్రకృతి సీకలవడును. సద్గుణ సంపత్తి జారిపోవును, దివ్యత్వము నష్టమగును. కావున మనోనిగ్ర

హము రేబవళ్లు అభ్యసింపదగినది. నీ భావముల నెప్పుడు నిగ్రహిం
తువో అప్పుడు నీ స్వప్నములు కూడ నిగ్రహింపబడును. ఇక నీవు
చేయు కర్మలను నిగ్రహింపవలెను. ఏ కర్మ చేయుటకైనను నీ
చేతులను గాని, కాళ్ళను గాని, శరీరమునందే భాగమును గాని
నీ వాజ్ఞాపించుటకు పూర్వము అనేక పర్యాయము లాలోచింప వల
యును. ఒక వృత్తిని నీ వెన్నుకోవలసి వచ్చినప్పుడు నీవు కడు
జాగ్రతతో యోచింప వలయును. సారాయి మొదలయిన వానిని
తయారు చేయుట గాని, విషపదార్థములు అమ్ముట గాని, ఇతరు
లను నొప్పించి ధనము గొనుటగాని, చెట్లను, జంతువులను బాధిం
చుటగాని ఇట్టివి కూడవు. నీవు ప్రతిదానిని నీ ఆత్మతో తుల్య
మయిన విలువగల దానినిగా తలపవలెను. నీ వెన్నుకొను వృత్తి
వలన న్యాయమార్గమున నీ జీవన భృతిని నీవు సంపాదించుకొను
టయే కాక ఇతరులకు బాధగాని, పరాభవము గాని, దాస్యముగాని
సిద్ధింపరాదు. ఈ ప్రకారము వాక్కాయకర్మలను నిగ్రహించుట
వలన క్రమముగా లక్ష్యము అంతర్ముఖముగా తిరుగును. మిత
వ్యయము ప్రకృతిలోని గొప్ప ధర్మము. యోగి దైహికశక్తిని
మితముగా వ్యయము చేయును. నీ ఇచ్ఛాశక్తిని నీవు మితముగా
వ్యయము చేయుటకు నేర్చుకొనవలయును. అప్పుడు నీలో
పరిణామము యొక్క రెండవదశ ఆరంభమగును, ఇచ్ఛ పని
చేయుటను ఆపినప్పుడు నీవు గొప్ప మనశ్శాంతిని అనుభవింతువు.
అందుచే యోగమునకు నిగ్రహము సింహద్వారము. నీ స్వభావము
లోని సహనమును కూడ నిరోధింపవలెను. అనగా చెవులను
నిందావాక్యములను విననీయకుము. నీ కండ్లను అశుచి వస్తువులను
చూడనీయకుము. నీ శరీరమును దుష్టమయిన దాని ఒత్తిడిపాలు
గానీయకుము. నీవు మంచివాడ వయినచో కర్మణ్యమయిన నీ
ఇచ్ఛను నిగ్రహింప గలవు. కాని మంచివారు సామాన్యముగా
చేయు పొరపాటేమనగా అకర్మణ్యమయిన ఇచ్ఛను నిగ్రహించు
టలో నిర్లక్ష్యము చేయుదురు. ఇది మిగుల అపాయకరము. నిన్ను

గురించి ఎవ్వడయినను నిందావాక్యములు పలుకుచున్నచో ఆ ప్రదేశమును వెంటనే విడిచిపొమ్ము. ఆ వాక్యములలో ఒక్క అక్షరమైనను నీ చెవుల బడనీయకుము. అట్లే నీ కండ్ల విషయమున గూడ. శరీరావయవముల ప్రతిదాని విషయమునగూడ ఇట్లే. కావుననే దీనిని ద్వివిధ నిగ్రహమందురు. మన స్వభావములోని కర్మణ్యములు, అకర్మణ్యములు నయిన రెండు భాగములను నిగ్రహించుటయే ద్వివిధనిగ్రహము. నీ శక్తుల నన్నింటిని నిగ్రహించుట నేర్చుకొనుము.

ప్రతి ప్రాతఃకాలమునను పెందలకడ లేచి ఏ ఆలోచనము లను చేయక నీకు వీలయినంత కాలము కూర్చుండుము. ఏ కోరికలను మనసులోనికి రానీయకుము. శరీరమును కదలింపకుము. మనశ్శాంతిని పొందుటకు యిది చాల ముఖ్యమైన అభ్యాసము. బాహ్యప్రపంచమున తమ అదృష్టము నందుకొనుటకు లోనుండి వెలికి వచ్చుచున్న ఈ సహజశక్తుల నన్నింటిని ఎందుకు నిగ్రహింప వలయును? అని నీవడుగ వచ్చును. నిజమే. ఈ శక్తుల నిగ్రహహింప కుండుట సహజమే. కాని అట్లయిన అవి బాధామరణముల త్రోవకు లాగును. నిగ్రహింపక ఆ శక్తులను అనుగ్రహించితిమా అవి భావశూన్యతను కలిగించును. భావశూన్యత విపత్తును, మృతిని తెచ్చిపెట్టును. నిగ్రహములేని మానవుడు గడుపు జీవితమునకు లక్ష్యముండదు. నీవు నిగ్రహమును నేర్చుకొనుచో నీ ఆవేశముపై ప్రేమపై ఊహపై ఆత్మకు పెత్తన మిచ్చుచో నీ అంతశ్శరీరములోనికి గొప్ప జ్ఞానమును, శాంతిని ప్రవేశ పెట్ట గలుగుదువు. అప్పుడు నీ ఆత్మనిగ్రహము మూలమున తమ ఆత్మలను నరకకూపముల ద్రోయుచున్న అనేకులను నిగ్రహింప గలవు. ఆత్మజ్ఞానము నిగ్రహపరులకే లభించును. నిజమయిన నిగ్రహము కలవానిలో నిజమయిన ప్రేమ నిండియుండును. పైన జెప్పిన ద్వివిధనిగ్రహము మూలమున ఎవడు భౌతిక భోగానుభవమునకు విముఖుడగు

చున్నాడో అతడు జ్ఞానముచే పోషింపబడు రెండవ శరీరమున జీవించుచున్నాడు.

నీ లోనికి విరుద్ధభావములు, విరుద్ధప్రేమలు, విరుద్ధేచ్ఛలు ప్రవేశింపనీయకుండునట్లు జాగరూకుడవై యుండుము. ఈ లోకమున గాని పరలోకమున గాని నిన్నుగూర్చి దయారహితమైన తలపు లెవ్వరును తలచకుండునట్లు వర్తింపుము. అది యోగమునకు గొప్ప అంతరాయము. కాబట్టి నీకీ లోకమునగాని పరలోకమున గాని ఎవ్వరయినను శత్రువు లున్నయెడల వారితో సంధి చేసికొనవలయును. నీవు యోగ మభ్యసించుటకు ముందు అదివర కెవ్వరికైనను మనోవాక్కర్మలచేత అపకారము చేసి యుంటివా వారిని క్షమాపణ కోరుము. విశ్వములోని సమస్తాణువులతో స్నేహమును పొందకున్న యోగము సిద్ధిపొందుటకు అవకాశము లేదు. మానవుడు స్నేహద్వారమున తన చెంతకు రావలెనని దేవుని అభిలాష. ఆత్మ సత్యమును దర్శించుట నిగ్రహవర్తన గలవానికే సాధ్యము. నీవు వనవాటిలో చరించుచున్నప్పుడు ఒక రెమ్మనుగాని, ఆకును గాని త్రుంపకుము. వేళ్లపై అడుగులు వేయకుము. అది వాని కిష్టముండదు. అవి బాధపడును.

నీవు వసించు ప్రదేశ మాధ్యాత్మిక వాతావరణమును కలిగియున్నదా లేదా చూచుకొనుము. నీవు ఒక ప్రదేశముయొక్క స్థితిని కనుగొను మనశ్శక్తిని పెంపొందించుకొనవలయును. అవినీతికరములైన భావములచేత గాని కర్మలచేతగాని కలుషితమైన వాతావరణముగల గదిలో యోగాభ్యాసము చేయువా డెన్నడును నివసింపరాదు. నిద్రింపరాదు. అట్టివి ఆత్మకు తాకి మాలిన్యము నంటించును. జంతుహింస జరుగుచోట నివసింపరాదు. ఎట్టి పరిస్థితిగాని నీ లోభమును, కామమును, క్రోధమును పెంచునదిగా ఉన్నచో నీవు ముందుపోవుట కాశ ఉండదు. అందుచే నీ వెల్లప్పుడును అప్రమత్తతతో జాగరూకుడవై యుండవలెను. నీ అజాగ్రత్తచే

ఆత్మనాశమును తెచ్చిపెట్టుకొందువేని మోక్షమును పొందుటకు నీకీయబడిన ఈ అవకాశమును ఈ జన్మను జారవిడుచుకొనిన వాడవగుదువు. ప్రాపంచిక విజయముల గూర్చిన శారీరక భోగముల గూర్చిన భావములెవ్వరివయినను నీమీద తమ ప్రభావమును జూపరాదు. మానసికముగా గాని భౌతికముగా గాని ఎవ్వరిపైనను నీ ఆధిపత్యము నిల్పుటకు యత్నింపకుము. ప్రతిదినము ఆత్మయొక్క స్వభావమును దాని ఏకాంతతను దాని స్వేచ్ఛను దాని ప్రశాంతిని అనుభవములోనికి తెచ్చుకొనుము. నీలోని అరవిందములో (హృదయకమలము) సచ్చిదానందశక్తి కలదని విస్మరింపకుము. దేవుడు లోపల ఉన్నాడు కాని వెలుపల కాడు. మన నిజమైన ఆత్మ ఆ దివ్యమూర్తి కౌగిటిలో నున్నట్లుండును. ఈ జన్మకు ఇంకొక జన్మకు దూరము శూన్యము. ఆత్మ రెండులోకముల మధ్య నున్నది. ఆ రెండవ లోకముయొక్క జీవిత ప్రమాణము వకు ఈ లోకపు ప్రమాణము సరిపోవుట లేదని తెలివిగల యోగి తాను వసింపబోవు లోకపు ప్రమాణమునకు అర్హమగునట్లు జీవితము నెరపును. ఏ మానవుడు పేరునకు మాత్ర మీలోకమున నున్నను నిజముగా పరలోకమున నివసించు చున్నాడో వానికి భయమనునది లేదు. ఉచ్చజీవితమును గడుపవలెనను ఇచ్ఛయే మరియొక జీవితముయొక్క స్థితిని ముందుగా సూచించును. మానవుడు తన శరీరములోనికి ప్రకృతియందలి జడపదార్థములను నింపుకొనిన కొలది పరలోకమునందలి విశ్వాసమును పోగొట్టుకొనును. భౌతిక జీవితము భోగము కాదు. అవసరము రాబోవు కాలమున దుర్భరపాపము లొనర్పక జీవించుట దుర్లభము కాగలదు. ఏ మేమి జరుగుచున్నదో మన మెరుగుదుము. మానవానీకముపై ఏమి విపత్తు పడుచున్నదో మనకు తెలియును. వారి దుష్టజీవనము అనాత్మేచ్ఛయే దీనికి కారణము. భౌతికతను విడనాడు కళను దేశ ప్రజలు నేర్చుకొనుటయందు ఆదర్శవీరులు తోడ్పడవలెను. ఎందుకన మృత్యుపీడితులు, దుఃఖపీడితులు, బాధాపీడితులు అయిన

మానవుల క్షేమము కొరకు ఈ భౌతిక జడపదార్థములతో తమను తామిట్లే నింపుకొనుచు పోయినవారు బరువెక్కి పోదురు. ప్రకృతి ధర్మము ననుసరించి బరువెక్కువై సుకుమారమైన జీవితకోశము ప్రబద్ధలగును. కాబట్టి నేను చెప్పిన పనిని బహు ఆసక్తితో ఆరంభింప వలసియున్నది. విధేయతతో ప్రేమతో పనిచేయు ఎవ్వనికైనను భారతీయ యోగి బృందము ఆశీర్వదించి తోడ్పడును.

౫౮. తాను చేసిన పాపకార్యములకు శిక్ష ననుభవించి తీరవలయునని మానవుడు నిశ్చయించుకొనినప్పుడు అతడా పాపకార్యముల నుండి వెనుకకు తగ్గును. పుణ్యకార్యములు చేసినయెడల రాబోవు జన్మలో తనకు తగిన బహూకృతి లభించునని అత డెరిగినచో సత్కార్యాచరణమునకు అత డమితముగ ఉత్సాహమునుపొందును. ప్రపంచమున నేడు కావలసినది నిస్వార్థముగా పనిచేయువారు ముందునకు వచ్చుట. ఈ పునర్జన్మను గూర్చిన బోధ ఒక్కటియే ఈ జన్మలో ఫల మాసింపక నిస్వార్థముగ పనిచేయుటకు మానవుని ప్రబోధింప గలదు. జన్మలను గూర్చిన జ్ఞానమును పొందుటకు నీవు యోగజీవితమును గడుపవలెను. అనగా నిజముగా నీవు అను దాని కర్థముగా నిలిచినట్టియు అనంతమూర్తి అయినట్టియు నీలోనున్న జ్యోతినిగూర్చి నీవు నిరంతరధ్యానమును చేయుచుండ వలయును. ఇంద్రియ విషయభోగముల నుండియు, బాధాకర క్రీడలనుండియు నీవు దూరమగుచున్న కొలది ఆత్మ సమీపమునకు చేరుచుండ గలవు. ఆధ్యాత్మిక జీవితము గడుపవలయునను లక్ష్యము నీకుండ వలెను. దానిచే ఉత్తమజన్మ వచ్చును. నే నిప్పుడు నీకు చెప్పున దేమనగా,- నిరంతర ధ్యానము చేయుము. నిరంతరము ఓర్పు వహించి యుండుము. నిరంతరము సన్మార్గమున చరింపుము. తాత్త్విక ప్రశాంతి, నిరవధిక త్యాగము, నిరంతర క్షమ- వీనితో నిర్మితమయిన సత్పథమున నీవు నెమ్మదిగా ప్రయాణ మొనర్తువేని నీ విప్పు డెవడవో పూర్వ మెవడవో ముం దెవడ వగుదువో దర్శింపగలవు.

౧౯. దేవుని కనేకులు తమను సమర్పించుకొన లేకున్నారు. ఎందులకు? ఇతర మానవుల ప్రాణములతో సంప్రతింపులకు దిగుటతో తమ శక్తి సంతటిని వ్యయ పరచుచున్నారు. కాని యోగి దేవునికి తనను అర్పించుకొనినప్పుడు అతని మనసు శూన్యమగును. నిశ్శబ్ద నిశ్చల ప్రదేశము వలె నగును. ఆ సమర్పణ కాలమున అతడు దేవునిలోనికి పోయినట్లుండును. ఇది కొందరు విశ్వసింప లేరు. అయినను సత్యము. ఈ సమర్పణము మూడు మార్గముల జరుగును. దేవుని ప్రేమించుట వలన, దేవునియందు లక్ష్యమును నిల్పుటవలన, దేవుని తెలిసికొనుటవలన, యోగిమనస్సు ప్రేమతో నిండినప్పుడు దేవు డతనిని తనవైపున కాకర్షించును. యోగి మానవునికొర కెట్టి కార్యము నిర్వర్తించుచున్నను ఆ కార్యము దేవుని కొరకయినదిగానే భావించును. అది సేవకంటెను గొప్పది. అదియొక అనుభూతి. ప్రతివాడును నిరంతరము ఆత్మను వ్యర్థము చేయుచున్నాడు. వ్యయపరచు చున్నాడు. దిగలాగు చున్నాడు. కావున నేను చెప్పున దేమనగా- 'మిక్కిలి ఆసక్తితో ఆలోచింపుము. ఈ మృత్యు వాతావరణమునుండి నీ వెట్లు పైకి పోగలవో ఆ మార్గమును గూర్చి భావింపుము. పరిస్థితులు నీ కెంత ప్రతికూలముగ నుండునో వాని నధిగమించుటకు నీ కంత బలవత్తరమయిన నిశ్చయ ముండవలయును. ఆ సంఘర్షణ కఠినముగా నున్నయెడల అది నీకొక శక్తి నిచ్చును.

౨౦. సత్యభాసితములయిన నేత్రములు, విశ్వాసతప్తమయిన హృదయము ఈ రెండును యోగికి చిహ్నములు. వా డేది చూచినను దానిలో సత్యమును చూచును. వా డేది చేసినను విశ్వాస ప్రేరితుడై చేయును. తోడి మానవులతో అతని సంబంధబాంధవ్యములు నీతిశాస్త్రమున అతనికిగల విశ్వాసమునుండి ఉద్భూతములై యుండును. విశ్వ ప్రకృతి ధర్మమునకు మానవకర్త ధర్మమునకు గల సంబంధము నెరుగుట ఆవశ్యకము. ఎందుకనగా మన

సౌఖ్యము నిస్స్వార్థములయిన కర్మ ధర్మములపై ఆధారపడి యున్నది. నిస్స్వార్థములయిన భావములు విశ్వనైతిక సూత్రముచే నిశ్చయింప బడుచున్నవి. ఇతరులకు మంచి చేయుటయే చాలదు. ఇతరులకు చేయు మంచి సార్థకము కావలయునన్నచో మనము చేపట్టు ప్రకృతిశక్తుల పూర్ణజ్ఞానముపైన ఆ మంచి ఆధారపడి యుండవలయును. ఈ భూమిపై గల వస్తువులను కావలసినవారికి యోగి విశ్వాసపూర్ణుడై యిచ్చును. అనగా, అతడు దేనిని యిచ్చు చున్నాడో అది అతనిది కాదు. అట్లు ఈయబడుటకే అది అతనికి పంపబడినది అని అతని విశ్వాసము.

ఒక మానవునియెడ మరియొక మానవుని బాధ్యత గొప్పది. ఎగతాళికైనను ఇతరునికి దుఃఖము కలిగించుటకు ఎవ్వనికిని అధి కారము లేదు. మనకుగాని ఇతరునికి గాని దుఃఖమును కలిగింప కయే మనము జీవింపవలెను. మరణింపవలెను. నీవు దుఃఖముతో నుండవలయునని వాంఛింపవు కదా! కావున నీ జీవితములో ప్రతి క్షణము అజ్ఞానముచేత గాని అజాగ్రత్తచేత గాని ఇతరులకు దుఃఖ మును గాని, బాధను గాని కలిగింపకుండునట్లు చూచుట నీ ముఖ్య ధర్మమై యుండవలయును. తాను చేసిన కర్మకు ఫలితము రావలయు నను వాంఛ లేకయే ఆచరించుచో ఆ కర్మకు బహుమానకృతిగా నిజ మయిన విశ్వాస మబ్బును. ఏదో స్వార్థమును పొందు దృష్టితో సత్కార్యాచరణ మొనర్చినచో నిజమయిన విశ్వాసము నీ ఆత్మలో ప్రవేశింపనేరదు. విశ్వాసము లేనిది జ్ఞానము లేదు. కాబట్టి నీవొక సత్కార్యమును చేయుచున్నప్పుడు నీవొకరికి సహాయము చేయు చున్నప్పుడు ఒకరికి దానము చేయుచున్నప్పుడు నీకేదో ప్రతి ఫలము రావలయునన్న భావముతో నెన్నడును చేయకుము. ఈ మానవరూపమును స్వీకరించుటలో మన లక్ష్యము దేవునియందు విశ్వాసమును పొందుటే యని మనము ముఖ్యముగా స్మృతియం దుంచుకొనవలయును. మానవుడు తన జీవితమంతయు సరియైన

పనిని సరియైన కాలమున చేయుటకు అలవాటును చేసికొనిన యెడల అతని ఆత్మ అతని శరీరమును సరియైన వేళలో విడచును. అందు వలన ప్రాతఃసాయములందు ధ్యానము చేయుము. ఆ వేళలలో యోగులు నీకు ఏ గంటలో ఏ ప్రవాహము ప్రవహించునో తెలిసికొనుటకు సాయపడుదురు. ఈ శాస్త్రప్రకారము నీ వాచరించితివా నీ వనేక విపత్తులను అనేక దుఃఖవిషయములను తప్పించు కొనగలవు.

మంచిచెడ్డల సమస్యను ఎవనికి వాడే పరిష్కరింపవలసి యున్నది. కనుక నీవు ప్రతిదినము దేవుని చేరువకు వచ్చునట్లుగా బ్రతుకుము. అట్లు నీ వాయన సన్నిధికి రానియెడల ఆయన ధ్వనిని వినలేవు. ఆయన ధ్వనిని వినకున్న నీ సంశయము లెన్నటికిని విడ జాలవు. కాని ఓర్పు కావలయును. ఈ జీవితములో కృతార్థుడవు కాకున్న రాబోవు జీవిత పరిణామముకొరకు సంతోషముతో వేచి యుండవలయును. ఓరిమి లేకుండుట అల్పబుద్ధుల పాపఫలము. పవిత్రాత్మచేయు ప్రార్థనము భగవానుని కర్ణములకు సోకునని రూఢిగా నమ్ముము. దేవుడు గురువులలోని కెల్ల గురువు. నీ హృదయమునుండి అసంతుష్టికరములగు భావములను పార ద్రోలుము. నీ గతమును పూర్ణముగ మరచిపొమ్ము.

అమృతరహస్యము :

౨౧. మానవుని ఆత్మ అమర్త్యము. అది దేవునికంటె వేరు కాదు. మానవానీక మంతటియొక్క ఆత్మకు దానికి విభిన్నత లేదు. ఆత్మకొక గుణము ఒక లక్షణము లేదు. ప్రకృతి ద్రవ్యమునకు గుణమున్నది, లక్షణమున్నది. ఆలోచించుట, ఇచ్ఛయించుట, అనుభవించుట ఇవి మనస్సుయొక్క గుణములు. కాని మనస్సు ఆత్మకాదు. మెదడు మనస్సుకాదు. వ్యాధి, మరణము శరీరమున కాపాదించును. మనస్సున కాపాదించునవి కర్మ, నైతికశక్తి.

క్రిములు శరీరమును బాధించును. కర్మ మనస్సును బాధించును. ఆత్మ రుజామరణములకు కర్మకు అందక ఆవల ఉండునది.

ఆత్మకు ఏ లక్షణము లేనప్పుడు మనము ఆత్మను ధ్యానించుట ఎట్లు? ఇది క్లిష్టమయిన సమస్య. ప్రతి సమస్యను ఛేదించుమార్గ మున్నది. మొదట నీ దేహమునుగూర్చి తలంచుకొనుము. అది ఈ ప్రకృతి గతములయిన పంచభూతములతో చేయబడినదని భావింపుము. అటుపిమ్మట గాఢముగా ఆ పంచభూతములయిన పృథివ్యాప స్తేజోవాయ్వాకాశములను భావింపుము. ఈ పంచభూతముల కలయికవలన ఈ భౌతికశరీరము నిర్మింపబడినది. పిదప ఈ శరీరము కాలములో పుట్టి కాలములో అంతమగునని భావింపుము. తరువాత కాలములో పుట్టి కాలములో అంతమగునది యేదియు సత్యమైనది కాదనియు అది ఆత్మ కాజాలదనియు భావింపుము. ఈ భావనా విధానమును ప్రకృతిగత భూతములైదింటికిని సమన్వయముచేసి నీ లక్ష్యమును ప్రతి భూతమందును వేర్వేరుగా నిలుపుము. అప్పుడు ఈ పంచభూతములు కాలమున పుట్టి కాలములో అంతమగునని తలచి అట్లే కాలమున పుట్టి కాలములో అంతమగు ప్రతివస్తువును సత్యముకాదని భావింపుము. అటుపిమ్మట నీ భావనను ఒక నూతనమైన ఉన్నతస్థాయికి ఎత్తుము. కాలమును ధ్యానింపుము. కాలమనగా నేమి? విచారింపగా భావనలు చేయుచున్న అహంకారము విశ్వమును అర్థము చేసికొనుటకు కాలమును సృజించుచున్నదని ఎరుగుదువు. అప్పుడు నీవు కాలముపై మనస్సు నేకాగ్రముచేయుచో ఆ కాలము అహంకారమును విశ్వప్రకృతిని కలుపు కొక్కెముగా తోచును. అహంకారము కాలము లేనిదని భావింపుము. ఈ భౌతిక ప్రపంచముయొక్క అస్తిత్వము కాలభావము పైననే ఆధారపడి యున్నది. కాని అహంకారము కాలరహితముగా నున్నట్లు తనకు తాను భావింపగలదు. ఈ రీతిగా ధ్యానముచేయు స్థితి ఉన్నతమైనది. ఈ స్థితిలో కాలమునకు, ప్రకృతికి, శరీరమునకు అంటక అహంకా

రము ఉండగలదని యోగి గ్రహించును. ఇది అద్భుతమైన పరిణామము. కాని ఈ స్థితికి వచ్చుటకు చాలకాలము పట్టును. ఇంతలో వ్యాధిగాని, శరీర బాధగాని, మరణముగాని సంభవించును. ఈమూడు దౌర్భాగ్యములు నిద్రించుచున్న మానవుని మేల్కొల్పుటకు ప్రయోగింపబడిన వానినిగా భావింపవలెను. ఈ ఆత్మ ఒకనాడీ అశాశ్వతమైన గూటిని వీడి మాయాసముద్రమును దాటి దివ్యసీమ నధివసించుటకు సిద్ధముగా నుండవలయునని జ్ఞాపకము చేయుటకు వచ్చు మిత్రులని యోగి తన చెంతకు వచ్చు వ్యాధిమరణములను భావించును. ఇందుల కతడు దేవునికి తన నర్పించుకొనును. ఈ శరీరము, ఈ ప్రకృతిలోని సర్వద్రవ్యములు అశాశ్వతములని నీవు నిశ్చయించుకొనినప్పుడు శాశ్వతముకాని వస్తువులను ప్రేమించుచు ఆధ్యాత్మికశక్తిని వ్యయపరచుకొనుట శ్రేష్ఠముకాదని నీవు నిశ్చయించుకొనినప్పుడు నీవు ఉత్తమోపదేశమును నేర్చుకొనినవాడవగుదువు. వైరాగ్యము నభ్యసించుటవలన వస్తువుల నిజరూపములు చూడ నేర్చుటవలన ఇది సిద్ధించును. ఒకసారి నీవీ ప్రపంచము ఆత్మ కాదని భౌతికమని నీవు లక్ష్యము నిల్పదగినది కాదని తెలిసికొనినప్పుడు నీ ప్రేమ దానివైపునకు ప్రసరింపదు. ప్రకృతిని ఇట్లు జయింపవలెను. వ్యాధిని, బాధను, మరణమును జయించు మార్గమిది.

అందుచే ప్రతిదినము నీ లక్ష్యమును ఆత్మపై అదియే ఏకైక సత్యమని ఏకైకానందమని నిన్నెన్నడును వీడని ఏకైక మిత్రమని తలచి నిలుపుము. క్రమముగా నీవు అహంకారమునకు సర్వాత్మకు భేదమును గ్రహింతువు. పంచభూతములకంటె అహంకారము భిన్నమైనదని నీవు గ్రహించినపుడు, అహంకారము మరియొక శాశ్వతమైన, సత్యమైన, విశ్వమయమైన దానిపై నాధారపడియున్నదని గ్రహింపగలుగుదువు. అహంకారమనగా, "నేను" అని భావించుట. కావున దీనిని నీవు ధ్యానించుచున్నావు. అప్పుడు నీ మనోగగనమున ఒక జ్ఞానము తళుక్కున మెరుపువలె ఉద్భవించును. ఈ నేనుకూడ

సత్యముకాదని అదృష్టమునకే నేను యజమానిని కాదని వెనుక నున్న దేనిచేతనో ఇది నిదలింపబడుచున్నదని ఆ జ్ఞానము చెప్పును. అంతట అహంకారమునకు వెనుకనున్న శక్తిని కనుగొనుటకు నీవు నిశ్చయము చేసికొందువు. ఇదే ప్రకారము బౌతిక ప్రకృతినిగూడ పరీక్షింతువు. ఎంతకాలము బహిరాకాశగత వస్తువులపై నీ మనస్సు నిల్పబడునో అంతకాలము నీవు ఈ మహోద్భుత తత్త్వరహస్యమును గ్రహింపజాలవు. నీ ఆత్మలోని దీపమును వెలిగింపుము. నీ నేత్రముల కా మహాసత్యసందర్శనము కాగలదు. అప్పుడు ఒక నామముతో ఒక రూపముతో నుండు వ్యష్టి జీవితమనునది వట్టి మాయయని నీకు వ్యక్తమగును. ఒకానొకనాడు గాఢధ్యానములో నీ ఆత్మ ప్రకృతి బంధములను త్రెంపివేయును. విశ్వాత్మలో విలీనమగును. విశ్వాత్మను నీవు దర్శింపవలసిన విధి యున్నది. విశ్వాత్మను దర్శించు టయే జీవితలక్ష్యము. ఒకసారి మానవుడు తనలోని విశ్వాత్మను దర్శించెనా అతడు యుగములకు కన్పట్టు ప్రదీపము కాగలడు. ఇతరులకు మోక్ష మిట్టే అబ్బును. మోక్షమనగా నేమి? జననము యొక్క, జీవితముయొక్క, మరణముయొక్క బాధనుండి తప్పించు కొని స్వేచ్ఛ నందుటయే మోక్షము. అందువలన విసుగునొందని హృదయముతో ఆగని ఉత్సాహముతో గట్టిగా కృషి చేయుము. నీ హృదయమును అశాంతిప్తమునుగా నుంచుకొనుము. నీ మార్గమం దపజయములేదు. ప్రపంచమునకు యోగి అవసరము, యోగులు కానివా రనేకులున్నారు. వారు కీటకములవలె పుట్టుచుందురు. చచ్చిపోవుచుందురు. నీ చైతన్యమునకు పునర్నిర్మాణమును కల్పింపుము. ఈ చైతన్య మిప్పుడు మాయాజాలములో చిక్కుకొని యున్నది. అందుచే నీవు సత్యమును చూడలేకున్నావు. చైతన్య మొక అద్దము వంటిది. ఆ యద్దమును నీవు నిర్మలముగా కాంతివంత ముగా నుంచకుంటివా నీ ముఖమును నీవు చూడలేవు. ఆ చైతన్యము ప్రకాశమానముగా, స్వచ్ఛముగా, నిర్మలముగా నుండెనా నిజమైన ఆత్మను నీవు చూతువు. విశ్వాత్మను తెలిసికొనుటలోని ఆనందము

వర్ణనాతీతము. ఈ తత్త్వము భూలోకములోగాని, స్వర్గలోకములో గాని సర్వోత్తమ మయినది. మానవుని ఉద్ధరించునది ఈ తత్త్వ మొక్కటియే.

౨౨. అహంకారమునకు ఆత్మ విశ్రమస్థానము. మనము నిద్రించునప్పుడు ఆత్మచెంతకు పోయి అహంకారమును మరచి పోదుము. మేల్కొనినప్పుడు మన మాత్మనుండి ప్రపంచమునకు తిరిగి వత్తుము. మనము మన తల్లిని, తండ్రిని మానవానీకమును ప్రేమించు నప్పుడు నిజముగా వారిని ప్రేమించుటలేదు. మన లోనను, వారి లోనను గల ఆత్మయొక్క ప్రేమను అనుభవించుచున్నాము. మన మొక వస్తువును కోరినప్పుడు మనము నిజముగా ఆ వస్తువును కోరుట లేదు. ఆత్మయొక్క ఆనందమును అనుభవించుటకు కోరుచున్నాము. మనః ప్రపంచమును భరించునది భౌతికజగత్తును మోయునది ఆత్మయే. అయినను అది కదలదు, నెమ్మదిగా నుండును. చలన మెరుగదు, కలతనొందదు. గాఢ ధ్యానములో లోతులలో నీవాత్మను దర్శించితివా దేని నెరుగవలయునో దాని నెరిగినవాడ వగుదువు. ఈ తత్త్వమును పఠించినవారు మానవానీకమును ప్రేమింతురు. వారికి సేవ చేయుదురు. వారు ఇతర మతములనుగాని ఇతర ప్రవక్త లనుగాని విమర్శింపరు, ద్వేషింపరు. మానవులందరిలో ఆత్మ కలదని వా రెరుగుదురు. అందుచే వారు ప్రపంచమందలి సర్వమతములను సర్వతత్త్వములను గౌరవముతో పఠింతురు. విందురు. కాబట్టి నీవు సమస్తములైన ప్రాచీన నవీన మతతత్త్వ కళాసిద్ధాంతములను ప్రేమతో పఠింపవలయును. వానిలో గల బోధలయొక్క సారమును సంగ్రహించుట నేర్చుకొనవలయును. ప్రతి యుగములో, ప్రతి జాతిలో, ప్రతి మానవునిలో గల శ్రేష్ఠతమము నగు విషయమును నీవు గ్రహింప నేర్చుకొనవలయును. ఇతరమతములలో ఇతర జాతులలో ఇతర మానవులలో గల దోషములచే ద్వేషములచే నీ హృదయము నకు నొప్పి కలిగినప్పుడు మౌనము వహింపుము. దేవుని విన్యాసములు

పలుతీరులని నీలోని ఆత్మతో రహస్యముగా చెప్పుము. చెడుగుచే ఆకర్షింపబడి నీ ఆత్మయొక్క నెమ్మదిని వీడకుము. ఇంకను వెలుగు రావలెననియు, ప్రేమ గెలుపొందవలెననియు, న్యాయము జయింపవలెననియు, ఆంతరంగికముగా ప్రార్థన చేయుము. నీ మనసులో ఆదర్శమును - సత్యాదర్శమును, దయాదర్శమును, సౌందర్యాదర్శమును శాంత్యాదర్శమును నిర్మాణము చేయుము. నీ మనసును ఆదర్శముపై ఎంత ఏకాగ్రముగ నిల్పుదువో అంత వింతగా నీ ఆదర్శము సత్యము కాగలదు. యోగి నేడు దేనిని ఆదర్శముగ కలగనునో అది రేపు సత్యమగును. కావున ప్రపంచములో నేటి చెడుగు యొక్క విజృంభణమును జూచి నిరుత్సాహపడకుము. చెడుగును జూడకుము, చెడుగును వినకుము, చెడుగును తలపకుము. మానవునకు మూడవ కన్నున్నది. మూడవ కంటిని తెరచుటకు యత్నింపుము. అప్పుడు నీవు మంచినే చూతువు. మంచి అప్పుడు భౌతిక రూపమున భాసించును.

యోగజీవితమున దేవుని సన్నిధికి పోవు బాటలు మూడు కలవు. మొదటిబాట కర్మమార్గము. ఏదిచేయుటవలన నీ హృదయము పవిత్రము ఉత్తమము అయిన సంతోషము నొందునో అది కర్మ.

కర్మ అహంకారమును పరోపకారముచేయుటయందు ఉత్సాహము ననుభవించునట్లు చేయును. వ్యష్టి మనస్సులో విశ్వాత్మ భావమును అభివృద్ధిచేయుటకే కర్మయోగి కర్మలాచరించును. నీవు స్వయముగా స్వార్థత్యాగముతోకూడిన కర్మ లాచరించుచు మరియొక మానవుని హృదయములో విశ్వసౌభ్రాతృత్వ జ్ఞానమును ఉద్బుద్ధము చేయగలిగినచో అప్పుడు దేవుడు కర్మ నెందుకు సృజించెనో ఆ లక్ష్యమును సార్థకము చేసినవాడవు కాగలవు. మానవానీకములోని భిన్నభిన్న జాతుల మధ్య మిక్కిలి సమన్వయమును మిక్కిలి సామరస్యమును తీసికొనివచ్చుటయే ఈ కర్మ

చరణముయొక్క లక్ష్యము కావలయును. ఒక మహాకర్మ చేయునప్పుడు జాగ్రత్త గైకొనవలసిన చిన్నచిన్న కర్మలను ఓర్పుతో సుందరముగా నిర్వర్తించుట నేర్చుకొనవలయును. ప్రతిదియు కర్మయే. నీవీ కర్మ జీవితము నారంభించునప్పుడు కర్మయే పూజ, దేవుడు కర్మకు అధిపతి అని నీ ఆత్మతో రహస్యముగా చెప్పుము. నీ దినచర్య ముగిసినప్పుడు పూర్తిచేయబడని కర్మలకు, దోషములున్న కర్మలకు క్షమాపణ ఉండునా? నా కర్మను దేవుడంగీకరించునా? అని తిరిగి చెప్పుము. ఈ ప్రకారము చేయుచో నీవు నీ కర్మరంగమున దేవునే మార్గదర్శకునిగా గైకొందువు కాని ఒకటి గుర్తుంచుకొనుము. ఆత్మ కర్మనాచరింపదు. అది అకర్మకముగాను ఉండదు. దేశకాలములయందున్న నీ భౌతిక ప్రకృతియే కర్మల నాచరించుచున్నదని స్మృతియందుంచుకొనుము. కాబట్టి చింతనచేత, పవిత్రతచేత, అనుభవమునకు తెచ్చుకొనుటచేత జీవనోపాధికై నీవు కర్మ లాచరించుచున్నను, శాంతిసాధనకై దేవుని దయ ప్రసరించినంతకాలము నీవీ భూమిపై నుందువు.

ఇక రెండవమార్గము భక్తిమార్గము. నీ హృదయమునకు విశ్రాంతిలేనప్పుడు కర్మయొక్క తాపము నీ ఆత్మశక్తిని శోషింపజేసినప్పుడు దేవుడు తప్ప నీకు వేరు ఆశ్రయము లేకుండును. మన భౌతిక జీవితముయొక్క స్వభావమేమనగా, ఇతర కర్మలు ఎంత గొప్పవైనను ఎంతకొద్దివైనను చేయబడకయో, అసంపూర్ణముగా చేయబడియో నిలచిపోవును. అప్పుడు మన హృదయము చేదుగ, మన జీవితము శూన్యముగ నగును. అప్పుడు మన హృదయమును దైవభక్తితో నింపవలయును. తల్లికై పసిబిడ్డ ఏడ్చునట్లు మనము దేవునికై ఆక్రందించుట నేర్చుకొనవలయును. దేవుడే తనను సరిగా పూజించు పద్ధతిని నేర్పును. ఆయనయే తనను ప్రేమించుటను సయితము నేర్పును. ఈ భక్తితత్త్వము ఏ దేవాలయమునందుగాని ఏ గ్రంథములోగాని ప్రకృతిలో ఎక్కడైననుగాని

నికిష్టమైలేదు. ఇది ఒక దివ్య విషయము. అందుకొనలేని ఉన్నత శిఖరమున నున్నదిభక్తి. ఎవడు తన నేత్రములనుండి నిద్రా మోహమును దులిపివైచునో, ఎవడు దివ్యగానముతో తన జీవనమునకు శ్రుతిగలుపునో, ఎవడు సర్వవ్యాపకుని ఇచ్ఛకనుగుణముగా తన ఇచ్ఛను మలుపుకొనునో వానికి దైవభక్తి దత్తమగును. ఎవడు జీవితమును ప్రేమించునో వాడు దేవుని ప్రేమింపలేడు. ఏ హృదయము స్వార్థముపై దృష్టిని నిలుపునో అచ్చోట ప్రేమలేదని నమ్ముము. అహంకారమును ఎవడు వర్జింపలేడో అతడు ప్రేమింపలేడని నమ్ముము.

మనము సంపూర్ణముగా దేవుని హస్తములోనికి మనలను సమర్పణము చేసికొనినప్పుడే ఈ ప్రేమ వచ్చును. వచ్చి మన హృదయమునకు తాకి వేడి కలుగజేయును. కాబట్టి దేవుని ప్రేమింపగలుగుటకు మనము జీవితమును త్యజింపవలెను. మన మాయనకు మనలను సమర్పించుకొనుట నేర్చుకొనవలెను. మనము పూర్ణముగ అహంకార వాసనను పరిత్యజింపవలెను. మన హృదయములోనికి ప్రేమ ప్రవేశించినప్పుడు జీవితము ఒక దివ్యకవితా ప్రబంధముగానగును. దానిలో భక్తుడు నక్షత్ర ప్రపంచమున కావల దాగున్న సర్వవిజ్ఞానమును పఠింపగలడు. నిరంతరముగా శ్రద్ధతో నీ హృదయాంతరాళమున నీ భక్తిని పెంపొందించుకొనుము. ఇది ఎట్లో సంపాదించుకొనునదికాదు. ఎవనిపై దేవుడు కరుణ ప్రసరించునో అతడే భక్తిని పొందగలడు.

ఇక మూడవమార్గము ఆత్మజ్ఞాన మార్గము. ఎవనిలో విశ్వచైతన్యము సర్వాత్మబోధ ఉన్నతస్థాయిలో వృద్ధి చేయబడునో అతడు దేవుని సాక్షాత్కరించుకొను మార్గమున నడువగలడు. ఈ మార్గ మన్నిమార్గములకంటె కఠినమైనది. దీనికి నిశితమైన వివేచనశక్తి, గొప్ప ఆలోచనశక్తి, సర్వశ్రేష్ఠమైన ఏకాగ్రత కావల

యును. ఇది మహోన్నతము మహోత్తమము అయిన యోగము. కాని నీవీ మూడు మార్గములను కలిపి నీ ఆత్మలో ఏకము చేసికొనవలెను. నీవు దేవునికొరకు కర్మచేయవలెను. దేవుని భక్తితో ప్రేమింపవలెను. దేవుని నీ ఆత్మ కేంద్రమునం దుండునట్లు చేసికొనవలెను. అట్లు చేసినచో నీయభివృద్ధి నిక్కముగా జయప్రదమగును. నీ సమస్తాశలతో మానవానీకముయొక్క ఆశలు ముడివడియున్నవి. నీ వేది వాంఛించినను అది సర్వమానవానీకము యొక్క వాంఛయై యుండునా అని పరీక్షించుకొనుము. "నేను కోరుచున్న ఈ కోరిక సర్వమానవానీకముచే మంచిదని నిర్ణయింపబడునా లేదా?" అని నిన్ను నీవు ప్రశ్నించుకొని పరీక్షింపుము. నీకు సంతృప్తి కలిగెనా నీ వాంఛ సద్వాంఛ అని యెరుగుము. యోగ జీవితము నిత్యజీవితమునుండి వేరుచేయుటకు వీలుకానిది. నీ వేమి చేయుదువో ఏమాలోచింతువో ప్రతిదినము ఏమనుభవింతువో నీ యోగకర్మలలో ప్రతిబింబించును. కాబట్టి ఎల్లప్పుడు ఎందు కొరకు నీ జీవనశక్తిని శ్రమింప జేయుచున్నావో జాగ్రత్తగా చూచుకొనుము. ఎల్లప్పుడు దేవునికి నిన్ను నీవు సమర్పించుకొనుము. అట్లొనర్చినచో నీవు చేయు సర్వశుభ కర్మలయందును దేవుని ఆశీర్వచనము మానవానీకము యొక్క సానుభూతి ఉండగలదు.

నీ వెవడవో, జీవితములో నీ విధ్యుక్త మేమియో స్మృతికి తెచ్చుకొనుటకు యత్నింపుము. సోమరితనముతో కూడిన విలాసములలో ఒక్క రెప్పపాటైనను వ్యర్థము చేయకుము. ఆధ్యాత్మికములు గాని తలపు లూహించుటలో నిరర్థకములయిన పనులలో కాలమును పాడుచేయకుము. జీవితము పరుగిడుచున్నది. స్వప్నమునకంటె ఎండమావులకంటె కూడ జీవితము మాయామయమైనది. సర్వప్రపంచమునందలి నీ సోదరులతో ఏకత్వము ననుభవింపుము. మన జీవితమునకు మన ప్రపంచమునకు ఎవడు ప్రభువో, ఎవడు జనకుడో, ఎవడు రక్షకుడో, అట్టి పరమాత్మతో ఏకత్వము

ననుభవింపుము. ఆయన ఇచ్ఛను తెలిసికొనుటకు యత్నింపుము. సంకుచిత భావములనెల్ల పారద్రోలుము. ఈ బోధ గాఢముగా నీ ఆత్మలో నాటుకొన జేయుము. ఇట్లు చేసితి వేని, ఇది ఉన్నత జీవిత క్షుధతో బాధపడువారలకు సంతృప్తి నీయగలదు.

ఆయుష్మంతుడా! నే నిప్పుడు నీకు సంగ్రహముగా ఆత్మోద్ధరణ శాస్త్రసారమును బోధించితిని. అది దివ్యమైనది, పవిత్రమైనది. లోక క్షేమముకొరకు నీకు చెప్పితిని. దీనివలన నీవలయినంతగా బాగుపడుము. నిరంతరము దేవుని ధ్యానింపుము. ఆ ధ్యానమువలన ఈ బోధ జ్ఞానవంతులకు ఉత్తములకు పరిశుద్ధులకు చేరుగాక!

## ౧౯. శ్రీ అలీ సంతు

౧. జపముచేతను, తపముచేతను, వ్రతముచేతను పరమపదము లభింపదు. అది పరిశుద్ధమగు హృదయముచేతను, ఔదార్యము చేతను పొందనగును.

౨. నీకు సంపద కలిగినచో దానిని ఔదార్యముగా వ్యయపరచుము. దానముచే సంపద తగ్గదు. మరింత పెరిగిపోవును. దానమిచ్చుటలో ఆలస్యము చేయరాదు. ఆలస్యము చేయుదు వేని, ఆ యాచకుని కోరికలను తీర్చుటలో విలంబము ఏల చేసితివని భగవానుడు అడుగును. అప్పుడు ఏమి సమాధానము చెప్పగలవు?

౩. తన సుఖముకొరకు కూడ వ్యయము చేయకుండ తన కోరికలను తీర్చుభారము ఇతరులపై వేసి ధనమును దాచుకొనువాడు పిసినిగొట్టువాడు. తాను కోరినదానిని ఒక యాచకునకు భగవదర్పితముగా సమర్పించుచో యథార్థమగు ఔదార్యముగా పరిగణింపబడును. కావున ఎల్లప్పుడు ఔదార్యము కలిగియుండుట యుక్తము.

౪. స్వార్థమును విడనాడి పరునికొరకు పాటుపడువాడే నాకు అత్యంత సంతోషము కలుగజేయును. ఈ సందర్భమున, ఒక కథ చెప్పెద వినుడు.

"బశరుహాఫీ" అను ఒక సంతు మహోదారుడు ఉండెను. అతడు కాలముచేయు సమయము సమీపించెను. ఆ సమయమున ఒక యాచకుడు ప్రార్థించెను. అపుడు అతని వద్ద ఏమియు లేని కారణమున తాను కట్టుకొనిన బట్టను తీసి అతని కిచ్చెను. తదుపరి ఒక క్షణములో అతని ప్రాణము పోయెను. ఆ సమయమున ఒక బుద్ధిమంతుడు ఇట్లు పలికెను. "బశరుహాఫి" నగ్నముగానే ఇచ్చటకు వచ్చెను. నగ్నముగానే పరలోకమునకు వెళ్ళెను.

౫. ధనము అను సర్పమును ఆడించుటకు అయిదు మంత్రములు.

1. ధర్మకార్యముల కొరకును, శరీరనిర్వాహణకొరకును ధనము సంపాదించవలెను.
2. పాపము చేయకుండను, నిష్కపటముగను ధనము సంపాదించవలెను.
3. కర్తవ్యకార్యమునకు మించిన ధనమును సంపాదించరాదు.
4. జీవితము సంయమముతో గడుపవలెను. ధనమును విషయ భోగములలో వ్యయపెట్టరాదు. ఔదార్యముగ తగినంత దానము చేయబడునట్లు చూడవలెను.
5. చిత్తవృత్తులను ఎల్లప్పుడును ధర్మమార్గమున జాగ్రత్తగ నుంచవలెను.

ఈ అయిదు మంత్రములను లెస్సగ ఆచరించువాడు భూమండల మందలి ధనమునంతను సంపాదించినను అతనికి హాని కలుగదు. ఈ విధముగ ధనసంపాదన వలన లాభమే కలుగును కాని, అధిక వైరాగ్యము కలవాడు ధనమును సంపాదించరాదు. అది అతని విక్షేపమునకు కారణమగును. ధనము, దైవభక్తి రెండును ఒకచోట నుండనేరవు.

## ౨౦ శ్రీ అలీ సాహెబు

౧. ఖలీఫాగా వేయి సంవత్సరములు సేవచేయుటకంటె జీవితమును దేవుని సేవలో ఉపయోగించుట ఎంతయో మంచిది. దేశాధిపత్యముకంటె మనస్సుపై ఆధిపత్యము మంచిది.

౨. ఓ జనులారా! మీరు పరలోకపు దండననుండి ముక్తిని పొందదలచినచో వృద్ధులను తండ్రితో సమానముగా చూచుకొనవలెను. యువకులను బంధువులుగను, బాలురను వాత్సల్యముతోను, స్త్రీలను సోదరీసములుగను, మాతృసములుగను చూడవలెను.

౩. దేవుడనిన భయపడవలెను. అప్రమత్తతతో మెలంగుడు. ప్రజలకు మేలుకోరుడు. మీ రాజ్యములో ఏ ఒక్కడైనను ఆకలితో అన్నములేక ఆ రాత్రి నిద్రను కోల్పోయినచో అతడు దేవుని దర్బారులో మీ పైన ఫిర్యాదు చేయును.

## ౨౧ మహాత్మ గజ్జాలీసాహెబు

౧. నిన్ను నీవు తెలిసికొనుము. భగవంతుని తెలిసికొనుము. మాయను తెలిసికొనుము. పరలోకమును తెలిసికొనుము.

౨. నిన్ను నీవు తెలిసికొనుటయే భగవంతుని తెలిసికొనుటకు మార్గము.

౩. తన పరలోకమును బాగుపరచుకొనుటకే భగవంతుడు జీవుని సృష్టించెను.

౪. భగవద్దర్శనము కోరువాడు భగవంతునివైపు ముఖము త్రిప్పవలెను. దానికొరకు సంసారమునుండి అనాసక్తుడు కావలెను. ఇంద్రియములను జయింపవలెను.

౫. మానవునిలో భోగాభిలాష, తృష్ణయుండుట పశుస్వభావ సూచకమే.

౬. ఎంతవరకు ఇంద్రియములు శాంతింపవో అంతవరకు సూక్ష్మానుభూతి కలుగదు.

౭. మనస్సును, కోరికలను తన స్వాధీనము చేసికొననివాడు మహానీచుడు, పశువుతో సమము.

౮. భోజనపదార్థ మెంతరుచికరమై యుండునో పరిణామములో అది అంత దుర్గంధమై యుండును.

౯. దానమిచ్చుట మహాఉత్తమము. లేనివారికి అడుగనిదే ఇచ్చుట సర్వోత్తమము.

౧౦. సర్వసాధనలయొక్క ఫలము భగవద్భజనయే!

౧౧. అసత్యవాది కపటముచే మోసముచేయును.

౧౨. నీకు ఇష్టముకాని, పనికిరాని వస్తువును ఇతరులకీయకుము.

౧౩. ఇతరులను నిందించవలదు. వారి నిందలను వినవలదు. ఇతరులపై విరోధమును ద్వేషమును చూపరాదు.

౧౪. మాట ఇచ్చి, దానిని తప్పక పాలింపుము.

౧౫. ఇతరుల దోషములను ప్రకటింపకుము.

౧౬. దరిద్రులను ప్రేమతో సేవింపుము. కష్టపడియైనను, వారికి సుఖము చేకూర్పుము.

౧౭. స్త్రీలను, స్త్రీల చిత్రరువులను, స్త్రీరూపప్రతిమలను, స్త్రీల వస్త్రములను చూచుట చేతను, వారితో సంభాషణ, వారిని గురించి విచారణ చేయుటవలనను కామముత్పన్నమగును. కావున జిజ్ఞాసువులు వారిజోలికి పోరాదు. వారిని చూడరాదు. వారి మాటలను వినరాదు. వారి విషయమై అతిజాగ్రతతో మెలగవలయును.

౧౮. అందరితో యథాశక్తి ఉదారతతో, సద్భావముతో మెలంగుము.

## ౨౨ సంత జాఫర్ సాదిక్

౧. ఏ పాపారంభమున ఈశ్వరుని భయము, అంతమున ఈశ్వరునితో క్షమాయాచన చేయబడునో, ఆ పాపముకూడ

సాధకుని ఈశ్వరుని జేర్చును. కాని ఏ తపస్సారంభమున అహంభావము అంతమున అభిమానముండునో, ఆ తపస్సు తపస్సంపన్నుని ఈశ్వరునినుండి దూరము జేయును.

౨. ఏ మానవుడు జీవించుటకు నీతి నియమములతో వ్యవహరించునో వాడు ఈశ్వరమహిమను తెలిసికొనును. కాని, ఎవడు ఈశ్వరుని నిమిత్తమే జీవించునో వాడు ఈశ్వరుని పొందును.

3. ఎప్పుడు లోకులు ఉన్మత్తుడనియు, మత్తుడనియు నన్ను నిందింతురో అప్పుడే నా మనస్సులో అగాధమైన తత్త్వజ్ఞానము ఉదయించును.

४. మిథ్యావాది సాంగత్యమున మోసము కలుగును. మూర్ఖుని సాంగత్యమున అహితము కలుగును. కృపణుడు తన స్వార్థముకొరకు పరులకు హాని చేకూర్చును. నీచుడు ఆపత్తికాలమున ఇతరులను నాశముచేయును. కావున ఈ నలువురితో కదాపి సాంగత్యము చేయరాదు.

## ౨౩ సంతు ఆవిస్

౧. రుచిగల భోజనము, సుందర వస్తువులు, ధనికుల సహవాసము, ఈ మూడింటిని ప్రేమించు వారికి నరకము అతి సమీపమున నుండును.

౨. శ్రేష్ఠుడు కాదలంచుకొనువాడు వినమ్రుడు కావలెను. పురుషార్థి కాగోరువాడు సత్యవ్రతుడు కావలెను. గౌరవము పొందగోరువాడు ఈశ్వరభీతి కలిగియుండవలెను. మహత్త్వము పొంద దలచువాడు ధైర్యవంతుడు కావలయును. శాంతిని కోరువాడు విరాగి కావలయును. వైరాగ్యమును, సంపత్తినికోరువాడు పరిశ్రమి కావలయును.

## ౨४ సంతు అబూ ముర్తజా

౧. ధర్మాచరణమే నరక దుఃఖములనుండి తొలగించి స్వర్గమునకు గొనిపోవును.

౨. ప్రభుప్రేమ బాధకములగు ఈ సంసారమందును, బాహ్యజీవితమందును ఆసక్తి విడిచినప్పుడే ప్రభుకృప ప్రాప్తించును. ప్రభుప్రేమకు యిదియే మంచి ఉపాయము.

3. లౌకికభోగ విముక్తి, ఈశ్వరాజ్ఞను పాలించుట, ఈశ్వరేచ్ఛానుసారము ప్రాప్తించిన దానితో సంతోషించుట, యివి ప్రభుప్రేమకు నిజమైన లక్షణములు.

౪. ధైర్యము, ప్రేమ ఈ రెండే వ్యవహారమును పరిశుద్ధము చేయ కలుగును.

## ౨౫ సంతు అబూ అలి మహమ్మదు

౧. తన మహత్త్వముపై దృష్టి నుంచనివాడే అధికుడు.

౨. వైరాగ్యము ఈశ్వరప్రాప్తికి మహా గొప్పఉపాయము. దానిని రహస్యముగా నుంచవలెను. ప్రకటించుకొనువాని వైరాగ్యము క్షీణించును.

3. 1) లోకముయొక్క ఉచ్చ నీచములు నీహృదయములో ప్రవేశింపరాదు. మట్టివలె బంగారమును త్యజించుటకు నీలో క్షమ కలిగియుండవలెను. 2) లోకాప వాదముపై దృష్టి నుంచకుము. లోకప్రశంస కుప్పొంగకుము. లోకనిందకు అప్రసన్నుడవుగాకుము. 3) నీ హృదయములో లౌకిక విషయవాంఛలు నిశ్శేషముగా తొలగి పోవలయును. ఈ మూడు సాధు లక్షణములు.

౪. నిందాత్యాగము, నిర్మల సంతోషము, ఈశ్వరాజ్ఞా పాలనము ఈ మూడు సహనశీలతకు ముఖ్యలక్షణములు.

౫. ఏ మానవుడు కుదృష్టినుండి నేత్రములను, విషయ భోగములనుండి ఇంద్రియములను కాపాడునో నిత్య ధ్యానయోగముచే అంతఃకరణమును నిర్మలము చేసికొని, తన చరిత్రమును పరిశుద్ధము చేయునో, ధర్మపూర్వకముగా ఆర్జించిన అన్నముతో జీవయాత్ర గడుపునో అట్టివాని జ్ఞానములో ఏమాత్రమును లోటుండబోదు.

## ౨౬ సంత హాతిమ్ హాషమ్

౧. అహంకార లోభములనుండి సావధానుడై మెలంగవలయును. అహంకారి తనకంటె తుచ్ఛుని తలంపబడిన లోకులు చేయు అవమానముల సహించిన పిదపనే మృతినొందును. లోభి మానవుడు ఎంతవరకు లోకములో ఆకలిదప్పులచే పీడింపబడడో అంతవరకు ప్రకృతి వానిని లోకమునుండి పోనీయదు.

౨. పీనుగ, రోగి, సోమరి, స్వస్థత అను నాలుగు విధముల మనస్సుండును. అందు ధర్మద్రోహి యొక్క మనస్సు పీనుగ సమము. పాపాత్ముని మనస్సు రోగగ్రస్తము. లోభి, స్వార్థపరుల మనస్సు సోమరిపోతు. భజన, సాధనలలో తత్పరుని మనస్సు స్వస్థముగా నుండును.

3. నీవు ఏ పని చేయుచున్నను ఈశ్వరుడు చూచుచున్నాడను భావమును మరువకుము. నీవు చెప్పుచున్నది ఈశ్వరుడు వినును. మౌనముద్ర వహించినను దాని కారణమును మరువకుము. ఎందుకన, ఈశ్వరునకు అదికూడ తెలియును.

౪. అనుభవించుట, పలుకుట, చూచుట అను స్పృహ మూడు విధములు. విషయభోగము లనుభవించు సమయమున ఈశ్వరుడు చూచుచున్నాడని భావింపవలయును. పలుకునపుడు సత్యము వినాశము గాకుండా చూడవలెను. చూచునపుడు సాధుత్వము దూషితము గాకుండ దృష్టి నుంచవలెను.

౫. నిష్కపటముగా పనులు చేయుచున్నాను కదా! నిస్స్వార్థభావమున పలుకుచున్నాను కదా! దానమునందు, ఉపకారమునందు ప్రతిఫల మాశించుట లేదుకదా! కృపణతచే ధనము సంపాదించుటలేదు కదా! అని ఈ నాలుగు కార్యములందు ఆత్మ పరీక్ష చేసికొనుచుండవలయును.

## ౨౭ సంతు ఇబ్రాహిం ఆదమ్

౧. ఓ మానవుడా! పాపులకు నరకమే గతియని తెలిసి యుండియు, నీవు దానినుండి తొలగుట కుపాయ మాలోచింపవు మృత్యువు నీ తలపై తాండవ మాడుచున్నను నీవు దాని నెదిరిం చవు కదా! నీవు స్వయముగ నీ చేతులతో నీ తలి దండ్రులను పుత్ర మిత్రులను బొందలో పాతిపెట్టితివి. అయినను యిట్టి అనిత్య సంసారమునుండి శిక్షపొందుట లేదెందులకో? నీవు స్వయము పాప ప్రపంచములో లీనుడవై ఉండికూడా పరులదోషముల వెదకు చుందువేల? ఇక నీవంటి మానవుని మాట భగవంతు డెట్లు వినునో నీవే చెప్పుము. కావున, మానవుల మాట అటుంచి కేవ లము ప్రభువును నిత్యము నిరంతరము భజింపుము.

౨. ఓ మనుష్యుడా! నీవు ధనమును, సద్గుణములను బంధించి యుంచితివి. వాటిని దాన, భజనాదుల కొరకు వదలుము. స్వేచ్ఛగా విడచిన జిహ్వను, అజ్ఞాన లోభ మోహాదులను బంధింపుము.

## ౨౮ సంతు అహమద్ హవర్వ

౧. నాకు వీలగుచో, నన్ను నిందించు వారికి గొప్ప బహు మానము లిత్తును. ఎందుకన, వారి నిందా ద్వేషములచే నాకు మేలే చేకూరును.

౨. ఈశ్వరుడు, సదా సర్వత్ర కలడని నమ్మి స్మరించుచు ఆతని ఆజ్ఞను పాలించుచుండవలయును. ఈ మాయావి సంసారము ఇంతవరకు అసంఖ్యాక జనులను నాశముచేసెను. అటులే నీవు కూడా నాశముగాకుండ జాగ్రత వహింపుము.

## ౨౯ సంతు బాయిజీద్ బస్తామి

౧. నలువది సంవత్సరములవరకు నేను లోకప్రజలను ఈశ్వ రుని వైపునకు రండని పిలచుచుంటిని. కాని ఎవరును రారైరి. తుదకు, అట్టి బాహ్య కార్యమునుండి విసిగి వేసారి, ప్రభుమంది

రము పొచ్చితిని. అచ్చట నాకంటేముందే అనేకులు చేరియుండిరి. వారిపై ప్రభుకృప నాపైకంటె అధికముగా నుండెను.

౨. ఎవడు ఈశ్వరునిగాక ఇతరవస్తువు ననుసరించునో వాడు విచారహీను డనబడును.

3. బాహ్యమున కనపరచునట్లు లే అంతరమును చక్క పరచు కొనుము. లేదా అంతరమెట్లో బాహ్యమున అట్లే ప్రవర్తింపుము.

౪. ఎవడు తన బలముమీాదనే ఈశ్వరుని పొందగోరునో, వాడు మృత్యువాత పడును.

౫. ఈశ్వరాజ్ఞను పాలింపనివాడు చచ్చినవానితో సమానుడు.

౬. నేను కర్తనను అహంభావములేని తపస్సే సత్యమైన తపస్సు.

౭. దుష్టస్వభావము గలవానితో పని కలిగినప్పుడు, నీ మంచి స్వభావముతో వాని నీచస్వభావమును గప్పిపుచ్చుము. దీని వలన నీకు సంతోషము కలుగును.

౮. ఎవడేని నీకు దానమిచ్చుచో, మొదలు దేవునికి కృతజ్ఞుడవు గమ్ము. పిదప ఆ ఉదారహృదయుడగు దాతకు ధన్యవాద మిమ్ము.

౯. నీకు ఆపత్తి కలిగినపుడెల్ల వినీతభావముతో ఆ ఆపత్తిని సహించుశక్తి కలుగుటకు ప్రభువును ప్రార్థింపుము.

౧౦. ఈశ్వరునకు నూరుడై తన దేహమం దాసక్తుడైన కారణముననే ఆడంబరము, అభిమానము కలుగును.

## ౩౦ సంత్ అల్‌హుశేన్ నూరి, బగ్దాది

౧. ఇతరులకొరకు స్వార్థమును త్యజించుట నా ధర్మము.

౨. ఎవడు మనోమాలిన్య రహితుడో, లోకజంజాటము నుండి ముక్తుడో, అలౌకిక తృష్ణనుండి విముఖుడో అతడే నిజమైన సూఫీ అనబడును.

3. ఎవడు లోకములోని ఏ వస్తువును తన అధీనములో నుంచడో, తాను స్వయముగ దేనికిని అధీనుడు కాడో వాడే సూఫీ.

౪. ముక్తుడుగా నుండుట, వీరుడగుట, బాహ్యసౌఖ్యములకు దూరముగా నుండుట, ఈశ్వర ప్రాప్తికై పశువృత్తిని నిర్మూలించుట అనునవి నిజమైన సూఫీయుల స్వభావము. ఇట్టి ఉత్తమ స్వభావము వలన లోకస్నేహము వదలి, ఈశ్వర స్నేహము సంపాదించుటకు ఉత్తమశక్తి లభించును.

## ౩౧ సంత్ హుసేన్ మన్సూర్

౧. ఎవనిదృష్టి సదా ఈశ్వరునివైపు కలదో, ఎవడు లోకము నుండి విరక్తుడో వాడే ఋషి.

౨. ఎవడు లోకుల అత్యాచారములకు వ్యథితుడు కాడో వాడే మహాపురుషుడు.

## ౩౨ సంత్ అబూబకర్ సబ్లి

౧. పరమాత్మను మరియు తన స్వరూపమును సరిగా తెలిసికొనుటే నిజమైన జ్ఞానము.

౨. ఏ మానవుడు ఈశ్వరుని తప్ప ఏ పదార్థములోను సంతోషింపడో, వాడే నిజమైన త్యాగి.

3. వైరాగ్యమే నివృత్తి, సంసారమే శూన్యము. ఆ శూన్యము నెడ వైరాగ్యము నొందుటే నివృత్తి.

౪. ప్రభుస్మరణ కొరకు సంసారమును మరచిపొమ్ము. పరలోక విషయమునుకూడ వినకుము.

౫. లోకవస్తువుల యెడ, లోక ప్రజల యెడ ఆసక్తులగుట నీచము.

## ౩౩ సంత్ అబూ ఈసాక్ ఇబ్రాహిమ్, గార్జోని

౧. ఎవని మనస్సు తిని త్రాగుటలోను, సొమ్ము సామందాల లోను దగిలియుండునో వాని స్థితి పశువుకంటె హీనము.

౨. మానవు డెంతవరకు లోకముయొక్క తుచ్ఛము, క్షణికము, మరియు అధోగతిపాలు చేయునట్టి రుచిని విడువడో, అంతవరకు వాడు ఈశ్వరగుణా స్వాదముయొక్క ఉత్తమము, ఉన్నతి దాయకమునగు రుచిని పొందలేడు.

౩. ఎవని మనస్సులో కామవాసన ప్రబలముండునో, వాడు వివాహము చేసికొనుట ఉచితము. దీనివలన వాడు యితర పాపముల నుండియు, సంకటముల నుండియు దూరమగును.

౪. సావధానుడవుగమ్ము. పరస్త్రీ వైపు దృష్టి నుంచకుము. ఆ దృష్టిలో దయ్యము నివసించును.

౫. ఎవడు నీ యెదుట ఇతరులను నిందించునో, వాడు నిన్ను ఇతరుల యెదుట నిందింపక తప్పడు. కావున, అట్టివాని మాటలకు లొంగకుము. లొంగితివా కీడు చేకూరును.

## ౩౪ సంత్ అబ్దుల్లా ఖఫీఫ్ (పార్శీ)

౧. ఏ వస్తువులు నిన్ను ఈశ్వరునినుండి దూరముచేయునో వాటినుండి నీవే వైదొలగుము. ఇదియే నివృత్తి.

౨. ఏది నీవద్ద లేదో దానిని పొందుటకును, ఏది నీవద్ద కలదో దానిని యిచ్చుటకును ఉదారత్వము, నిష్కామ స్వభావము పొందుటే నిజమైన ధైర్యము.

౩. సంసార సంపత్తిని విడచి, పరమాత్మలోని పరమ శాంతిని పొందుటే నిజమగు వైరాగ్యము.

## ౩౫ సంత్ అబూ హాఫిజ్ ఖురాసాని

౧. ఏ మానవుడు, విపత్తిలోకూడ తనపై ఈశ్వరకృప కల దని తలంచునో, వాడు ఎప్పటికిని మృత్యువునకు అధీనుడు కానేరడు.

౨. ఈశ్వర సేవతో శరీరములోను, శ్రద్ధతో పంచప్రాణముల లోను జ్యోతి ప్రకటమగును.

3. శరీరమును నిలుపుకొనుటకు అపేక్షించుట కంటె దానిని విడచుటలోనే అధికరుచి, ఆనందము కలదని తలంచుట ఈశ్వర ప్రేమ గలవాని లక్షణము.

౪. అన్నము, నీరు లేక దుఃఖపడుచుండు వానికి సేవచేయుటలోనే సార్థకము, మహత్త్వము గలదు. అది నిన్ను ఈశ్వరుని వైపు తీసుకొని పోవును.

౫. ఎవడు ఆత్మ నిరీక్షణ చేయక తనను తాను నిర్దోషిగా తలంచునో వానికంటె గొప్ప అహంకారి మరొకడుండడు.

౬. ఈశ్వరుని భయము మనస్సునకు దీపము. ఆ దీప ప్రకాశముతో మానవుడు తన గుణదోషములను చక్కగా చూడ గలుగును.

౭. పుచ్చుకొనుటకు బదులు ఇచ్చుటలోనే ఎవనికి అధిక సుఖము కనుపించదో, వాడు నిజమైన ఫకీరు కానేరడు.

౮. సంసార పదార్థము లభించినను త్యజించువాడే శ్రేష్ఠుడు. ఎవడు పుచ్చుకొనుచు కూడ ఇచ్చుచుండునో, వాడు మధ్యముడు. ఎవడు కేవలము పుచ్చుకొనునో వాడు అధముడు.

## ౩౬ శ్రీ మంకోజీ బోధలా

[శ్రీ మంకోజీ బోధలా, బరార్ ప్రాంతములోని ప్రసిద్ధనగరమైన ధామల్ గ్రామమునకు పటేలు. గొప్పధనవంతుడు. సదా అతిథులను సత్కరించువాడు, ఒకప్పుడా దేశమున క్షామమేర్పడెను. అప్పుడు తన యావదాస్తిని వినియోగించి, అన్నార్థులకు అన్నమును, వస్త్రహీనులకు వస్త్రములను యిచ్చి సత్కరించుచుండిరి. ఇంటిలోని పాత్రసామానుకూడా విక్రయించి అన్నసత్రము జరిపిరి. తుదకు యేమి లేనిస్థితిలో తాను, తన పత్నియు కూలినాలి చేసి బీదలకు పంచియిచ్చి ప్రసన్నులగుచుండిరి.]

౧. త్యాగానందమే ప్రసన్నత చేకూర్చును. భోగానందము మత్తును కలిగించును. దుర్గుణములను పుట్టించును. ఆ క్షణిక సుఖము తుదకు కష్టము, రోగము, శత్రుత్వము, నరకము చేకూర్చును. త్యాగానందమే సత్యానందము. ఇది హృదయమును నిర్మలము చేయును. దానిచే సమస్త సద్గుణములు మేలుకొనును. అది జీవుని భగవంతుని చరణసన్నిధిని జేర్చును.

## ౩౭ బాబా మోకర్‌పూర్‌జీ

౧. మోకర్‌పూర్‌జీ గంగాతీరమునగల మోకర్ పురమను గ్రామ బాహ్యప్రదేశమున ఒక చిన్న పూరిగుడిసెలో నివసించుచుండిరి. వీరివద్ద ఒక మట్టికుండ, ఒక కటివస్త్రము, ఒక కౌపీనము తప్ప మరేమియు లేకుండెను. వీరు అందరిని "గురువు" అని పిలచుచుండువారు. శౌచమునకు పోవునపుడు. గోతినిత్రవ్వి అందు మలమూత్రముల విడిచి వెంటనే మట్టిని గప్పుచుండువారు. చాలా పవిత్రముగా ప్రవర్తించుచుండెడివారు.

౨. ప్రజలు పండ్లు మొదలగునవి యేవి తెచ్చిపెట్టినను, వాటి నన్నిటిని ఇతరులకు పంచిపెట్టుచుండెను.

౩. రైతుల సంపాదన పవిత్రమైనదే కాని వారి మనస్సులో కోరికలుండును. నిష్కామభావమున ఒకానొకరు వచ్చుచుందురు అని అనుచుండెడివారు.

౪. పవిత్రముగా సంపాదించిన ధనముచే, పరిశుద్ధముగా తయారు చేయబడిన, నిష్కామభావముతో పెట్టిన అన్నమే పవిత్రాన్నము.

౫. వీరు యెవరిని తిరస్కరించువారుకారు, అవమానించరు. వీరిచే ఎవరికిని అసువిధ ఏర్పడకుండునట్లు ప్రవర్తించుచుండిరి.

౬. ఈ దేహము మలమూత్రపు తిత్తి. ఇది ఎప్పుడైనా పరిశుద్ధమగునా? అని పదే పదే అనుచుండువారు. దీనియెడ అసహ్యము కలుగుటకొరకే ఈ శౌచాచారము.

## ౩౮. శ్రీ భట్ దేవుజీ

[వీరు పదునాలుగు వందల యెనుబదవ శకసంవత్సరమున కామరూపజిల్లాలో పింగలాయను గ్రామమున జన్మించిరి. బాల్యము నుండియు భగవద్భక్తులు. నిత్యనిరంతరము భగవన్నామము భజించువారు.]

౧. బద్ధుడెవడు? విషయాసక్తుడు. నరకమేది? దేహాభిమానము, విషయాసక్తి. స్వర్గమునకు మార్గమేది? అహింస, ప్రేమ. శత్రుడెవడు? తన యింద్రియములే. దరిద్రుడెవడు? అతి తృష్ణ గలవాడు. శ్రీమంతు డెవడు? అధికసంతోషి. సుఖ సాధనమేది? ఆశా నివృత్తి. భవపాశమేది? మతాభిమానములు. మదాంధు డెవడు? కామాతురుడు. దీర్ఘ వ్యాధి యేది? సారములేని సంసారము. దీనికి ఔషధమేది? తత్త్వవిచారము. హేయవస్తువులేవి? కామినీ కాంచనములు. బ్రహ్మప్రాప్తికి సాధనము లేవి? సత్సంగము, సంతోషము, ఇంద్రియ నిగ్రహము, తత్త్వవిచారము. మోహపాశమెట్లు తెగును? వైరాగ్యముచే. మూర్ఖుడెవడు? వివేకహీనుడు. మానవుని ముఖ్య కార్యమేది? విష్ణుభక్తి. విద్యయనయేది? బ్రహ్మప్రాప్తి సాధన. ధీరుడెవడు? స్త్రీల రూపవిలాసములకును, తళుకు బెళుకు చూపులకును లోనుకానివాడు. ఉత్తమోత్తమమైనదేది? సచ్చరిత్రము. పశుతుల్యుడెవడు? స్వధర్మహీనుడు. నరకమునకు భూషణమేది? పవిత్ర స్వభావము.

## ౩౯. శ్రీ రమావల్లభ దాస్‌జీ

[వీరు 1645 శకసంవత్సరమునందు దేవగడములో బ్రాహ్మణ కుటుంబమున జన్మించిరి.]

౧. నీ విచారములను విడిచి సదా భగవద్విచారములనే చేయుచుండుము.

౨. నిత్యనిరంతరము భగవత్ప్రేమలోనే నిమగ్నుడవై యుండుము.

౩. భేదరహితుడవై ప్రవర్తింపుము.

౪. లౌకిక విషయములు మాట్లాడక, పారలౌకిక విషయములే మాట్లాడుము.

౫. అందరిని సన్మానింపుము.

౬. అబోధ బాలునివలె జీవయాత్ర గడుపుము.

౭. స్వతంత్రుడవు గమ్ము.

౮. నామరూపములను చిక్కులో బడకుము.

౯. ముక్తికంటె భక్తినే ప్రేమించుము.

౧౦. అహంకారమును నిర్మూలింపుము.

౧౧. సర్వము అతడొకడే, నీవుకూడ అతని వాడవే, నిన్ను నీవు మరచిపొమ్ము.

## ౪౦ స్వామి చరన్‌దాస్‌జీ మహారాజు

[వీరు 1760 విక్రమ శకమున జన్మించిరి. అష్టాంగయోగముల సాధించి మహమ్మదుషాః పరిపాలనాకాలమున ఢిల్లీనగరములో పదునాలుగు సంవత్సరములవరకు సమాధ్యవస్థలో నుండిరి. ఈ సమాధిస్థానము యిప్పటివరకు ఢిల్లీనగరమున కలదు. వీరికి యోగసాధనలచే శాంతిలభింపక, శ్రీకృష్ణునియెడ ప్రేమజనించి బృందావనమునకు వెడలిపోయిరి.]

౧. ఇంద్రియముల జయించినవాడే బ్రహ్మజ్ఞాని యనియు, సన్యాసియనియు, ఉదాసీను డనియు, జీవన్ముక్తుడనియు అనబడును. మనస్సును సత్సంగమునందు, చెవులను హరిస్మరణమునందు నియమింపుము.

౨. న్యాయార్జితమైన సాత్విక పదార్థములను మితముగా భుజింపుము.

౩. నీ వలన యే జీవికిని హానికలుగకుండ జీవింపుము. నిర్వైరుడవై అందరికి హితము చేకూర్పుము. మృదుమధురముగా మాట్లాడుము.

౪. అందరిని ఆత్మస్వరూపులనుగా తలంచుచు భగవన్నామము జపించుచుండుము. పరమ పదము పొందుటకు యిదొకటే సరళ సహజోపాయము.

౫. కామ, క్రోధ, లోభాదులను జయింపనిదే సాధన సిద్ధింపదు. కావున వాటిని మొదలు వశపరచుకొనుము.

౬. ప్రారబ్ధానుసారము తటస్థించిన కార్యములను భగవదాజ్ఞగా భావించి నిష్కామమున వాటిని పూర్తిచేయుము.

౭. చర్మదృష్టి నశించి సర్వమందు బ్రహ్మదృష్టి కలిగినవాడే జీవన్ముక్తుడు.

౮. నీవు స్వయము కీర్తి, ప్రతిష్ఠ సన్మానముల విడిచి యితరుల సన్మానింపుము.

౯. అధికార భేదముచే, సర్వసాధనలు ముక్తిదాయకములే.

## ౪౧ సంత్ బుల్లాసాహెబు

[వీరు పదునెనిమిదవ విక్రమార్క శకములో కాపుకులమున జన్మించిరి. వీరు నిరక్షరకుక్షులు, కడు దరిద్రులు, కాయకష్టము మీదనే జీవించుచుండెడివారు. సదా సర్వదా భగవత్స్మరణలోనే లీనమై యుండువారు. నామజపమే సాధనకు గొప్ప ఆధారమని చెప్పుచుండెడివారు.]

౧. హృదయగుహలో జరుగుచుండు అజపాజపముతోపాటు నీ మనస్సును జోడించినప్పుడే హృదయధ్వని నీకు వినబడును.

౨. సంసారములోని సర్వవస్తువుల యందు సంపూర్ణముగ విరక్తిగలవాడే నిజమైన భక్తుడు. సాధకుడు అంధవిశ్వాసియై భజించినపుడే భక్తి కుదురును. భక్తిమార్గములో శరీరమునుకూడ అర్పింప

వలసివచ్చును. కావున సర్వాభిమానముల విడిచి తన్నుతాను సమర్పించుకొనవలయును.

3. భగవంతుని యెడ భక్తికలిగనేని హృదయములో సహజముగ ప్రీతి జనించును. ఈ ప్రీతియే సాధనకు మూలము. ప్రేమ జనించిన పిదప వేరొకసాధన అవసరముండదు. ప్రీతియే ప్రభువును దర్శింపజేయును.

## ౪౨ సంత భీఖాసాహెబు

[వీరు రెండువందల సంవత్సరముల క్రితము ఆజంగఢ్ జిల్లా కాన్‌పూరు, బోహనా యను గ్రామములో చౌబెజాతి బ్రాహ్మణ కుటుంబములో జన్మించిరి. వీరి మొదటి పేరు భీఖానందుడు. వీరు బాల్యమందే సంసారమునుండి విరక్తులై భగవద్భక్తులైరి.]

౧. సావధానమే సాధనము. సంసారములో సారవంతమైనది కేవలము హరిస్మరణయే. తక్కినవన్నియు నిస్సారములేనని మహాత్ములు మరిమరి ఉపదేశించిరి.

౨. సంగ్రహ, పరిగ్రహ చిక్కులలో పడినవాడు తన నిజస్వరూపమును మరచి ముక్తుడు గానేరక బద్ధుడగును.

3. కుటుంబాదులందలి మోహమమతలను త్యజించి ఏకాంతములో నివసించి దృఢనిశ్చయముతో నామస్మరణ చేయుచుండవలెను.

౪. నామాధారమే ముక్తికి ముఖ్యము. ఇది లేని జీవితము వ్యర్థము.

## ౪౩ సంత గులాల్ సాహెబు

[వీరు క్షత్రియకులమున జన్మించి గాజీపూర్ అను గ్రామములో వ్యవసాయ వృత్తిలోని జీతముతో జీవయాత్ర గడుపుచు భగవద్భక్తిలో తల్లీనుడై యుండువారు.]

౧. జగత్తునుండి విరక్తుడు కానిదే ప్రభు చరణములందు అనురాగము లభింపదు.

౨. ప్రభుభక్తి లేని యోగ, యాగ, జపతపాది క్రియ లన్నియు నిరర్థకములే.

౩. భగవన్మార్గము ననుసరించు వాడెన్నటికిని నిరాశుడై తిరిగి రానేరడు.

౪. మానవుడు సంసారాసక్తిలో బద్ధుడై తన కర్తవ్యమును మరచి పతితు డగును.

౫. పాలించి పోషించు జన్మదాతను మరచుటే సర్వదుఃఖములకు కారణము.

౬. ఇంద్రియముల నిగ్రహించి, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాదులను విడచి, సర్వదోషములనుండి విముక్తుడై సదా శ్రీహరిని స్మరించువాడే జీవన్ముక్తుడు.

౭. సంపూర్ణముగా సమర్పణము కానిదే ద్వంద్వములు తొలగవు. సర్వార్పణమే సమర్పణ మనబడును.

## ౪౪ స్వామి కృష్ణదాస్‌జీ పయోహారి

[వీరు గొప్ప సిద్ధపురుషులు, విరక్తులు, ఉదారులు. జైపూరులో గల్తాయను ఆశ్రమమున నివసించుచుండిరి. జీవితాంతము పాలనే త్రాగి కాలముగడపిరి. కావున, వీరికి పయోహారి యను నామ మేర్పడెను. బాలబ్రహ్మచారులుగా దివారాత్రములు భగవద్భజనలోనే లీనులై యుండువారు. సంసారమను సాగరములో, కామినీ కాంచనములను రెండు భయంకర సుడిగుండములు గలవు. అవి జనులందరిని నీటముంచును. కావున, వాటికి ప్రతి మానవుడు దూర ముండవలయునని బోధించువారు. ఎల్లప్పుడు అతిథి సత్కారము చేయుచుండువారు. ఒకరోజు వీరు నివసించుచుండు గుహ ముందరికి ఒక పెద్దపులి వచ్చెను. దానిని అతిథిగా దలంచి తన తొడ యందలి మాంసమును కోసి ఆ పులికి ఆహారముగా నొసగెను. ఆ మాంసమును తిని ఆ పులి వెడలిపోయెను. అహింసా సిద్ధాంతమును

అవలంబించి ప్రపంచమునకు చూపిరి. ఇట్టి ధర్మపాలన రూపమగు సత్యమును చూచి, పరాత్పరుడు అనుగ్రహించి వీరికి దర్శనమొసంగి మస్తకముపై హస్తము నోపినంతనే సర్వదుఃఖములు తొలగి కృతార్థులైరి.]

## ౮౫ మహాత్మా పైథాగొరస్

[వీరు క్రీస్తుకంటె ఆరువందల సంవత్సరముల పూర్వము గ్రీకు దేశములో జన్మించిరి. వీరికి నాద బ్రహ్మమునందు కడు విశ్వాసము. ప్రణవనాదమును నిరంతరము వినుచుండెడివారు. వీరికి పశుపక్ష్యాదుల భాషయు తన పూర్వజన్మ స్థితియు తెలియును.]

౧. మానవుని మనస్సు తాను భుజించు పదార్థములపై ఆధారపడియుండును. భోజనమెట్లో మనస్సట్లే యగును. కావున న్యాయార్జితమైన శుద్ధ సాత్త్వికాహారమునే మితముగా తినవలయునని శిష్యులకు బోధించువారు.

౨. మౌనవ్రతమే శ్రేష్ఠమని ఉపదేశించువారు.

## ౮౬ శ్రీ జ్యోతిజీ మహారాజు

౧. సంపూర్ణప్రేమ ఉదయించనంతవరకు స్వరూపానుభవము కలుగదు.

౨. నీతిని, అహింసను అనుసరించుచు దైవకృపకు యెదురు చూచుచుండుటే మానవుని కర్తవ్యము. ఇది సాధనకు ప్రథమ లక్షణము.

3. సేవ, శుశ్రూష, తల్లిదండ్రులయెడ ప్రేమ, ఈశ్వరాజ్ఞగా దలంచి కర్తవ్యమును పాలించుట అనునవి నీతి స్వరూపములు.

## ౮౭ స్వామి ఆత్మదేవ్ కృష్ణాజీ మహారాజ్

సాధుసాధకుల నియమములు:

౧. ధనము, స్త్రీ ఈ రెండిటితో సంబంధముగలవాడు సాధువే కాడు. సాధుకు, సంగ్రహ పరిగ్రహములు రెండును పాప

ములే. సాధువు యెవరిపైనను భారము మోపక దొరకినదానితోనే సంతృప్తి జెందవలెను.

సంసారులకు తగినవస్తువులు సాధులకు తగవు. (నిషిద్ధములు.) ఇంద్రియముల వశపరచుకొనవలయును. సాధువు తన పనులను తాను స్వయముగ చేసికొనవలయును. ఇతరుల కధీనుడై వారి కృపకు పాత్రుడు కారాదు.

౨. నిన్ను పీడించువారిని ప్రేమతో సేవింపుము. ఇతరుల నొప్పించుట, వారిచే నొప్పింపబడుట ఈ రెండును సాధువుకు పాపములే. కఱ్ఱ చేతనెత్తి కుక్కనుకూడ బెదరింపరాదు. కోరికల చేతనే సంసారులతో సాంగత్యము పెరుగును. సాధువు సర్వదా నిస్సంగుడై యుండవలెను. కేవలము విరక్తులైన మహాత్ముల సాంగత్యముననే కాలము గడుపవలయును. విరక్తుడయ్యు భోగ సామగ్రుల సంగ్రహించువాడు పతితుడగును.

3. నిద్రించు నంతవరకు లేక చనిపోవు నంతవరకును బ్రహ్మచింతనలోనే కాలము గడుపుము.

౪. పంచేంద్రియములను అంతర్ముఖ మొనర్చి సంసారాతీతుడవై ఆత్మస్థితుడవు కమ్ము.

౫. సంసారమువైపు దృష్టిగలవాడు మాయలోజిక్కి భ్రష్టుడగును.

గృహస్థ నియమములు :

౧. బ్రహ్మముహూర్తమున లేచి, భగవంతుని స్మరించి, తల్లి, తండ్రి, గురువు. పెద్దలకు నమస్కరించి, కాలకృత్యములు తీర్చుకొని, పరమాత్మని ప్రార్థించి, అతిథి అభ్యాగతుల సత్కరించి పిదప సాత్వికాన్నమును మితముగా భుజింపుము. అన్యాయమును విసర్జించి, న్యాయముగా సంపాదింపుము. సంపాదించిన దానిలో అందరకు హక్కుగలదని తలంచి అందరిని ప్రేమతో పాలింపుము. అతిథులను దయతో సత్కరింపుము. యథాశక్తి దానమిమ్ము.

ఇరుప్రక్కల వారిని, గ్రామవాసులను ఆదరించి సేవింపుము. కర్మము లన్నిటిని సుందరముగా, న్యాయముగా, శ్రద్ధతో పూర్తి చేయుము.

౨. ఏ జీవికిని అపకారము, అహితము, తిరస్కృతి నొనర్ప కుము. మనోవాక్కాయముల పవిత్రతగాంచి, వినయశీలుడవై ప్రవర్తింపుము. నీ కర్మముల వలన, ఏ ప్రాణికిని ప్రమాదము కలుగకుండ నాటక సూత్రధారివలె కర్తవ్య బుద్ధితో సావధాను డవై మెలంగుము.

౩. విలాసములకు లోనుగాక, నీ స్వార్థమునకై ఖర్చును తగ్గించుకొని, మిగిలిన డబ్బును బీదలసేవకై వినియోగింపుము. ఇతరుల ఆధారముపై జీవింపక స్వావలంబుడవు గమ్ము. సోమరి పోతువై పనికిరానివాడవు గాకుము. అన్యాయమైన సొత్తును, ఇత రుల హక్కు (వస్తువు)ను నీ ఇంటిలోనికి రానీయకుము.

౪. కర్మములన్నియు భగవంతునివేయని తలంచి, నిష్కామ భావమున నెరవేర్పుము.

౫. జీవితలక్ష్యము భగవత్ప్రాప్తికొరకే కాని, భోగించు టకు కాదను నిశ్చయమును మరువక, సర్వకర్మములు ఈ లక్ష్య సిద్ధికొరకే చేయుచుండుము.

## ౪౭. శ్రీ రామదాస్‌జీ మహరాజ్ (రామాయణీ)

౧. ప్రశ్న : ఏ సాధన ద్వారా సుగమముగా, శీఘ్రముగా శాంతి చేకూరును ?

ఉత్తరము : నామస్మరణ ద్వారా సుగమముగా శాంతి చేకూరును. కాని దానికొక నియమము కలదు. అది నామమును భజించువాడు యే యితర వ్యక్తి వస్తువుల బలముపై ఆధార పడి యుండరాదు. కేవలము భగవచ్చింతనయే ఇహపరలోక సుఖప్రాప్తికి సుగమసాధన.

## ౪౯. స్వామి కృష్ణానందజీ అవధూత్

౧. నామసంకీర్తనపరులు తమ జాతి, కుల, దేహాభిమానము లన్నిటిని త్యజించి తమను తృణముకంటె తుచ్ఛులనుగా తలంప వలయును. తిరస్కార అవమానములనుకూడ భగవత్ప్రసాదములుగా భావించి వృక్షములవలె అత్యంత సహనశీలురై దీనభావమున ప్రభువుయొక్క ప్రతి విధానముపై ప్రసన్నులై ప్రవర్తింపవలయును.

౨. సంకీర్తనపరులకు భావము, ఆచారము, శరీరము ఈ మూడిటి పరిశుద్ధత ముఖ్యావసరము.

౩. సంకీర్తనపరులు కీర్తి, ప్రతిష్ఠ, ఈర్ష్య, ద్వేషము, లోభము మున్నగు మలిన భావములను విడచి కేవలము ప్రభు ప్రేమాభిలాషులై ప్రవర్తింపవలయును.

౪. పవిత్రాచరణము లేనివాడు భగవన్నామ ముచ్చరిం చుట కధికారుడు కానేరడు.

౫. తమ సంస్కృతిని విడచి ఇతర సభ్యతను అనుకరించి భక్ష్యాభక్ష్యముల విచారింపక భక్షించుచు, ప్రభుభక్తులమని చెప్పు కొనుచు, స్వధర్మమును తిరస్కరించువారి చిత్తము పవిత్రమెట్లగును? అపవిత్ర చిత్తముగలవారికి భగవన్నామమందు ప్రీతి యెట్లు జనించును ?

౬. సంకీర్తనపరులకు దేహపరిశుద్ధతతోపాటు భోజనపానాది నియమములుకూడ ముఖ్యావసరములు. లేనిచో మనస్సులో తమో గుణములు వృద్ధియై పతనమునకు హేతువగును. రజస్తమోగుణములు గలవారు ముట్టిన పదార్థములనుకూడ తినకూడదు.

## ౫౦. స్వామి జయేంద్రపుర్‌జీ మహారాజ్

౧. జీవుని ప్రధాన కర్తవ్యము స్వస్వరూప సాక్షాత్కారము. స్వస్వరూప సాక్షాత్కారము కానిదే పరమానంద ప్రాప్తియు, శోక

మోహాదుల నివృత్తియు కదాపి కానేరదు. బ్రహ్మసాక్షాత్కారమైనచో, తెలిసికొనవలసిన దేదియు నుండదు.

౨. ఆత్మసాక్షాత్కారము కానిచో, స్వర్గసామ్రాజ్యము, యింద్రత్వము ప్రాప్తించినను, జీవుని కర్తవ్యము నెరవేరకపోవుటయే గాక, దీనత, పరాధీనత, మూర్ఖతలుకూడ తొలగనేరవు. ఎందుకన, త్రిలోకాధిపత్యము కలిగియున్న యింద్రుని దైన్యము, అజ్ఞానములే నివృత్తికానప్పుడు ఇక సామాన్య మానవునకు, నివృత్తి యెట్లు కలుగును ?

3. సామ్యరూపమున ప్రపంచము గ్రహింపబడుచున్నను, ఆత్మసాక్షాత్కారము కానంతవరకు సర్వప్రపంచము విశేషరూపమున గ్రహింపబడదు. ఆత్మచింతన వలననే లౌకిక శుభకార్యములు సిద్ధించును.

## ౫౧ స్వామి భాగవతానంద్ జీ మహారాజ్

౧. ప్రశ్న : విషయవాసనలతో కూడుకొనిన కలుషిత ప్రాణులు, శాంతి సుఖాన్వేషణకై యిటునటు తిరుగుచును శాంతిని, సుఖమును పొందుట లేదెందులకు ?

ఉత్తరము : అసాధనలోనే శాంతిసాధన గలదను భ్రమ వలననే శాంతిని, సుఖమును పొందలేకున్నారు. విషయభోగములచే యింద్రియములు శాంతింపవు మరియు భోగేచ్ఛకూడ సమాప్తము కానేరదు. సాంసారిక సాధన శాశ్వతమైన సుఖసాధన కాదు. కేవలము భగవత్సంకీర్తనయే సుఖసాధన. శ్రద్ధచేతనే సత్యస్వరూపుడగు పరమాత్మ ప్రాప్తించును.

౨ జడములగు చెట్లు, గుట్టలు, నదీనదములు కూడ తమ విచిత్రమైన రచనలద్వార మా నిర్మాత ఆ జగదీశ్వరుడేనని ఆ భగవంతుని గుణగణములను కీర్తించుచుండును.

జడజగత్తే భగవంతుని కీర్తించుచుండ మనము చైతన్యులమై యుండి మానవులమైకూడ ఆయనను కీర్తింపకుండుట మనకు ఉచితమా? కదాపికాదు.

3. సంసారమునుండి విరక్తులై మోక్షమును కోరునట్టి యోగులకు శ్రీహరినామ సంకీర్తనయే శ్రేష్ఠమని అనుభవముగల వయోవృద్ధులైన విద్వాంసులు నిశ్చయించిరి.

౪. మోక్షప్రాప్తిసాధన లన్నిటిలో భక్తియే శ్రేష్ఠమైన సాధన. భక్తియొక్క అంగమే కీర్తన. కావున కీర్తన సర్వశ్రేష్ఠమని స్థిరపడెను.

౫. భగవన్నామ సంకీర్తనవలన ఫలమేమి సంభవించునని తలంచుట పాపము.

౬. ఎవని జిహ్వాయందు శ్రీ కృష్ణభగవానుని నామముండునో, వాని కోటానుకోట్ల మహాపాపములు కూడా భస్మమగును.

౭. మానవుడు భగవన్నామోచ్చారణ చేసినంత మాత్రముననే కాలమును జయించును. ఇది సత్యము, సంశయ పడరాదు.

౮. ఓంకారమే పరమాత్ముని నామము. ఓంకారమే ఈశ్వర వాచకము. ఓంకారార్థమే ఈశ్వరుడు.

౯. "హరే రామ హరే రామ, రామ రామ హరే హరే, హరే కృష్ణ హరే కృష్ణ, కృష్ణ కృష్ణ హరే హరే" అను మంత్రమును యెవడు సదా జపించునో, కలియుగము వానికి హాని చేకూర్పలేదు.

## ౫౨ స్వామి మహేశ్వరానందగిరి, మహామండలేశ్వరుడు

### బ్రహ్మవిద్యయే మోక్షమునకు సర్వశ్రేష్ఠసాధన

౧. పరమాత్మను తెలిసికొనియే, ముముక్షువు మృత్యువునతిక్రమించును.

౨. మానవకల్యాణమునకై ఆత్మజ్ఞానము తప్ప వేరొకమార్గ మేదియు లేదు. తల్లిదండ్రులకంటె అధికముగా, మన హితమును కోరునట్టి భగవతి శ్రీ శ్రుతిమాతయొక్క ఆదేశ మిదియే!

3. సర్వభూతములలో స్వప్రకాశుడగు ఒక అద్వితీయ బ్రహ్మమే ఆత్మరూపమున విరాజమానుడై యున్నాడు. అవిద్యచే ఆవరింపబడిన కారణమున జీవులు ఆయనను తెలిసికొన లేకున్నారు.

ర. సర్వవ్యాపకుడగుట వలన జీవులతో ఆయనకు సంబంధము తప్పదు. సమస్త చరాచర భూతములకు సాక్షియై అంతరాత్మ స్వరూపుడగుటచే ఆయన జీవులతో భిన్నుడుకూడ కానేరడు. అందుకే ఆయనను మాయాస్వరూపు డందురు.

౫. కన్నులచే చూడబడున దంతయు, చెవులచే వినబడున దంతయు ఆత్మ అనియే భావింపుము. ఇట్లు నీ దృష్టిని అద్వైతాత్మ జ్ఞానమయ మొనర్చి సమస్త విశ్వమును బ్రహ్మమయముగా జూడుము.

బ్రహ్మవిద్య యన నేమి:

౧. సంశయము, విపరీత భావములచే రహితమై "అహం బ్రహ్మాస్మి", నే నే పరిపూర్ణ బ్రహ్మము నను అఖండ బ్రహ్మాకార వృత్తియే బ్రహ్మవిద్య యనబడును. ఈ విద్యయే అవిద్యను నశింప జేసి ముముక్షుని ముక్తునిజేయును. శ్రవణ మనన నిధి ధ్యాసలు పరిపక్వము లగుటచేతనే అఖండ బ్రహ్మాకారవృత్తి లభ్యమగును.

౨. దృఢమైన శ్రద్ధచేత "అహం బ్రహ్మాస్మి", "సర్వ ఖల్విదం బ్రహ్మ", "వాసుదేవ సర్వమితి" యను అభ్యాసము సర్వదా చేయుచుండవలెను. దీనివలన మెల్ల మెల్లగా ద్వైత భావము నశించి అద్వైతబ్రహ్మ తత్త్వము ప్రకాశించును.

3. అహం బ్రహ్మాస్మి యను భావము, శుద్ధాహంకారము. అది బంధనకు కారణము కానేరదు. ఈ దేహమే నేనను మలినాహంకారమే బంధనకు కారణమగును.

౪. ఎవడు అందరిని బ్రహ్మరూపులనుగా తలంచునో వాడే అనేకులను ఏకములో విలీనము చేయకలుగును.

## ౫౩ నారద, సనత్కుమారులు

భూమావిద్య (వ్యాపకము)

నారదుడు: భగవన్! నేను అతివాదిని కావలంచు కున్నాను. కావున మీరు నన్ను అతివాదిగా నొనర్చుడు.

సనత్కుమారుడు: నారదా! సత్యభాషణాది సాధనలచే సంపన్నుడైన మానవుడు సత్యపరమార్థవస్తు విజ్ఞానముచే అతివాది యగును.

నార: దేవా! సత్యవస్తువు యొక్క విజ్ఞాన మెట్లు ప్రాప్తించును?

సనత్: నారదా! మననముచే విజ్ఞానము ప్రాప్తించును. ఏకాగ్రతతో విచారించుటే మనన మనబడును.

నార: ప్రభూ! మనన మెట్లు సిద్ధించును?

సనత్: నారదా! శ్రద్ధవలన మననము సిద్ధించును. శాస్త్రమునందు, ఆచార్యుని వచనమునందు యథార్థబుద్ధి నుంచుటే శ్రద్ధ యనబడును.

నార: దేవా! శ్రద్ధాప్రాప్తికి సాధన యేది?

సన: నారదా! శ్రద్ధకు నిష్ఠయే సాధన. బ్రహ్మచర్యము, గురుసేవాదులను పాలించుటే నిష్ఠ యనబడును.

నార: ప్రభూ! నిష్ఠ యెట్లు ప్రాప్తించును?

సన: నారదా! కృతి (ప్రయత్నము)చే నిష్ఠ ప్రాప్తించును. ఇచ్చట శమ దమాదులే కృతి యనబడును.

నార: ప్రభూ! కృతికి సాధన యేది?

సన: నారదా! అఖండ సుఖప్రాప్తికై, తీవ్ర యిచ్ఛయే కృతికి సాధన. తీవ్రేచ్ఛ కలుగుటకు సుఖముయొక్క వాస్తవిక స్వరూపమును తెలిసికొనవలయును.

నార: దేవా! ఆ సుఖ స్వరూపమును తెలుపుడు?

సన: నారదా! భూమా యను వ్యాపక చైతన్యతత్త్వమే సుఖ స్వరూపము. అల్ప (స్వల్ప)ములో సుఖము లేదు. అల్ప వస్తువు అధికముగా తృష్ణకు హేతువగును. తృష్ణయే దుఃఖమునకు కారణము. నీవు అశాశ్వతమగు అల్పవస్తువునందలి మమత (స్నేహము)ను పరిత్యజింపుము. (భూమా) వ్యాపక వస్తువునందు నిష్ఠను సంపాదించుటకు ప్రయత్నింపుము. మానవుడు చూచునది, వినునది, తెలిసికొనునదంతయు అల్పమే కాని, వ్యాపకము కాదు. (భూమా) వ్యాపకము అమృతము. అల్పము మృతము.

నార: ప్రభూ! ఆ (భూమా) వ్యాపకము దేనిలో ప్రతిష్ఠింపబడినది. దానికి ఆధారమేది?

1 సన: నారదా! అది దాని నిజమహిమ (నిజస్వరూపము) లోనే ప్రతిష్ఠితమైయున్నది. దాని స్వస్వరూపమే దానికి ఆధారము. దానికి ఏ యితరాధారమావసరము లేదు. కాని సర్వమునకు ఆధారమదియే! అది సర్వాత్మకలదు. దానికంటె మించినది వేరొకటి లేదు. ఎవడు ఇట్లు తన ఆత్మను చూచునో, మననము చేయునో, అనుభవించునో, వాడు ఆత్మారాముడై ఆత్మలోనే నిరంతరము రమించుచుండును. వాడు అఖండాత్మానందుని పొంది కృతకృత్యుడై పూర్ణతృప్తి నొంది ఆ ఆత్మలోనే లీనుడగును. ఆ ఆత్మయే సర్వమునకు మూలకారణము. అదే నీవు. అదియే నేను. సర్వము అదియే, అదితప్ప వేరొకటేదియు లేదు.

2 నారదా! పవిత్రాహారము వలన అంతఃకరణము పవిత్రమగును. పవిత్రాంతఃకరణ వలన పరబ్రహ్మ తత్త్వము నిరంతరము స్మరణయం దుండును. ఆహారశుద్ధి రెండు విధములు 1) శ్రోత్రాది యింద్రియములయొక్క శబ్దాది విషయములు. 2) భోజనము. ఈ రెంటికి శుద్ధి అవసరమే రాగద్వేషయుక్తమగు శబ్దాది విషయములను గ్రహింపరాదు. ఇంద్రియ ద్వారములనుండి మనస్సులో ప్రవేశించు విచారములు నిర్మలములై యుండవలెను. ఇదియే అంతరింద్రియ ఆహారశుద్ధి అనబడును. కేవలము పవిత్రభోజనము వలననే అంతఃకరణము శుద్ధికానేరదు. భోజనముతోపాటు శబ్దాది విషయములుకూడ పరిశుద్ధములు, పవిత్రములు కావలయును. విషయశుద్ధియే ఆహారశుద్ధియొక్క ముఖ్యార్థము. అయినను న్యాయార్జితమగు పవిత్ర భోజనము వలన హృదయ నిర్మలతకు విశేషసహాయము లభించును.

3 ఆహారపదార్థములు కూడ జాతి, ఆశ్రయ, నిమిత్తములను ఈ మూడు దోషములచే దూషితములగును. 1) ఉల్లి యల్లి మొదలగు ప్రకృతి పదార్థములు స్వభావముచేతనే అపవిత్రములు. ఇది జాతిదోష మనబడును. 2) దురాచారుని సంపర్కమువలన కూడ భోజనము దూషితమగును. ఇది ఆశ్రయదోష మనబడును. 3) వెంట్రుకలు, పురుగులు, చీమలు, ఈగలు మొదలగు చెడుపదార్థముల సంబంధముతోకూడ భోజనము దూషితమగును. ఇది నిమిత్తదోష మనబడును.

4 మోక్షముయొక్క వాస్తవిక స్వరూపము పూర్ణత్వములోనే కలదు. సంపూర్ణబ్రహ్మ భావప్రాప్తియే పూర్ణత్వ మనబడును.

నారద: ప్రభూ! ముక్తి యెటు ప్రాప్తించును ? ముక్తుని లక్షణము లెట్టివి ?

సన: నారదా! దేనియందు దిచ్ఛలేని వాడే అకాముడు. వాడే ముక్తుడు. ఇది శ్రుతివాక్యము.

నార: దేవా! అకాము డెట్లగును? (కామమునుండి ఎవడు ముక్తుడు కాగలుగును?)

సన: నారదా! ఎవని దృష్టిలో బ్రహ్మస్వరూపముకంటె భిన్నమగు రెండవవస్తు వేదియు లేదని దృఢనిశ్చయ మగునో, వాడే కామనాముక్తుడగును. ఆత్మకంటె భిన్నములైన కామనావస్తువులు అభావమగుటచేతనే, వాడు ఆత్మకాము డనబడును.

బ్రహ్మములో లీనమగుటే బ్రహ్మ నిర్వాణమునకు అర్థము.

## ౫౪ స్వామి గంగేశ్వరానంద్‌జీ మహరాజ్

౧. సోదరా! అందరిలో ప్రభువే కలడని భావించి కనిపించు దానికెల్ల మనస్సుతో ప్రణామము చేయుచుండుము. భగవన్నామము నిరంతరము జపించుచు ప్రభుస్వరూపమును ధ్యానించుచుండుము.

౨. నాటకములో నటి నటించునట్లు సంసారములో శరీరముతో పనిచేయుచు, మనస్సును భగవంతుని చరణకమలము లందుంచుము.

౩. భగవానుని స్మరించుచు, సంసారమును మరచి ప్రభు ప్రేమలో తల్లీనుడవుగమ్ము.

౪. ఎన్నికష్టములు సంభవించినను మనస్సు స్థిరముగానుండునట్టి పరిస్థితిని సాధించుకొనుము. ప్రాప్తించిన కష్టములన్నిటిని తపముగా నెంచి భగవంతుడే నీ చేత తపస్సు చేయించుచున్నాడని తలంచుము. తపములేనిది మానవుని నిష్ఠ పరిపక్వము కానేరదు.

౫. ప్రయత్నించుచున్నను మనస్సు స్థిరపడనిచో దిగులు జెందక, దృఢనిశ్చయుడవై యేమైనను కానిమ్ము. మనస్సును

నిరోధించుటకే ప్రయత్నించుచుందువేని, ఒకానొక దినము మనస్సు నిస్సంకల్పమై స్థిరపడును.

౬. శ్రీకృష్ణా శ్రీకృష్ణాయని, నిత్య నిరంతరము స్మరించుచుండుము. చాలు! యిదే సారము. శ్రీకృష్ణుడే నిన్నుద్ధరించును.

౭. నీ భావమును సదా ఉన్నతము చేయుచుండుము. కాని, నీచము చేయకుము.

౮. సాలెపురుగు తనలోనుండి వెడలిన తంతువుద్వారానే క్రిందికిదిగి, తిరిగి, పైకెక్కును. అటులే నీవుకూడ లౌకిక నామరూపాసక్తులచే క్రిందబడితివి, కావున తిరిగి భగవన్నామ రూపాశ్రయములద్వారా పైకెక్కుము. నిత్య నిరంతరము భగవన్నామము స్మరించుచు, ఆయన స్వరూపమును చింతించుచుండుము.

౯. సోదరా! చూడుము. ప్రభువు నిరాకారుడైకూడ భక్తులకొరకు సాకారరూపముదాల్చి దర్శనమొసంగును. ఈ విశ్వముకూడ ప్రభుసంకల్పమే కావున విశ్వమును ప్రభుమయమని తలంపుము.

## ౫౫ ఏకాంతవాసియైన ఒక మహాత్ముడు

### (యోగచతుష్టయము)

౧. మంత్రయోగము :

౧. యోగసాధనకు నాలుగు వేరువేరు పద్ధతులు కలవు. అందు మంత్రయోగము ప్రథమము. దానికి నారదుడు, పులస్త్యుడు, గార్గేయుడు, వాల్మీకి, భృగు, బృహస్పతి మొదలగు మహాఋషులు ఆచార్యులైరి.

౨. పరమాత్మచే భావము, భావముచే నామరూపములు, తద్వారా సృష్టియేర్పడి దానిచే సమస్తప్రాణులు సంసారబంధనలో జిక్కుకొనిరి. ముక్తిని పొందగోరుచో మొదలు నామరూపాశ్రయ

మున భావమును, భావముచే భావగ్రాహియగు పరమాత్మయందు చిత్తవృత్తి లయించినప్పుడే ముక్తిలభించును. సృష్టినామరూపాత్మక కారణమగుటచేత, నామరూపముల సహాయముచేతనే సంసార బంధమునుండి విడివడి ముక్తిపొందవచ్చును. ఇదే మంత్ర యోగసిద్ధాంతము.

౨. హఠయోగము :

౧. మంత్రయోగ సాధనలో నామరూపముల కెట్లు విశేషము కలదో అట్లే హఠయోగసాధనలో కేవలము స్థూలశరీర సహాయమున చిత్తవృత్తిని నిరోధించుటకు ప్రాధాన్యతకలదు.

౨. పతంజలి మహర్షి రచించిన యోగదర్శనములో యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధుల అను ఈ యెనిమిది సాధనలు భగవంతుని చేరుటకు సోపానములని చెప్పబడెను.

౩. బహిరింద్రియ నిరోధము యమమనబడును. అంతరింద్రియ నిరోధము నియమమనబడును. శరీరమును అదుపులో నుంచుట ఆసన మనబడును. ప్రాణాపానవాయువుల నిరోధించుట ప్రాణాయామ మనబడును. మనస్సును బాహ్యమునుండి త్రిప్పి అంతరమున పెట్టుట (మనోనిగ్రహము) ప్రత్యాహార మనబడును. మనస్సును అంతరములో నిలుపుట ధారణమనబడును. మనస్సును భగవంతునియందే స్థిరపరచుట ధ్యానమనబడును. మనస్సు భగవంతునియందు లీనముచేసి తనను మరచుట సమాధి యనబడును. ఇదే అష్టాంగయోగసారము.

౩. లయయోగము :

౧. ఆంగీరస, యాజ్ఞవల్క్య, కపిల, పతంజలి, వశిష్ఠ, కశ్యప, వేదవ్యాసాది మహాఋషుల కృపచే, మంగళకరమైన మనోవాచకములకు అగోచరమగు బ్రహ్మపదప్రాప్తికి కారణభూతమై

నట్టి ఈ లయయోగ సిద్ధాంతము ప్రపంచమునందు ప్రకటింప బడెను.

౨. ప్రకృతి, పురుషుని శృంగారమువలన ఉత్పన్నమైన బ్రహ్మాండ పిండాండములు రెండును ఒకటే! సమష్టి మరియు వ్యష్టి సంబంధముచే బ్రహ్మాండము, ఏకత్వ సంబంధముచే పిండాండము యుక్తమైయున్నది. అనగా జడచైతన్యమంతయు సమాన రూప మున బ్రహ్మాండ పిండాండములోనే కలదు. పిండాండజ్ఞానముచే బ్రహ్మాండజ్ఞానము కాగలదు. శ్రీ గురుదేవుని ఉపదేశముద్వారా శక్తిసహితము పిండజ్ఞానముపొంది పిదప సుకౌశల పూర్ణక్రియ ద్వారా ప్రకృతిని పురుషునిలో లయమొనర్చుటచే లయయోగ మందురు. పురుషుని స్థానము సహస్రారమునకలదు. మరియు కుండలిని మహాశక్తి ఆధారపద్మమున నిద్రించుచున్నది. అది నిద్రించుచున్నందుననే బాహ్య సృష్టిక్రియజరుగును. యోగము ద్వారా దానిని మేలుకొలిపి పురుషుని వద్దకుజేర్చి లయింపజేసిన యెడల యోగి కృతకృత్యుడగును. దీనినే లయయోగ మందురు.

౪. రాజయోగము :

౧. సృష్టి స్థితి లయములకు అంతఃకరణము కారణము. ఈ అంతఃకరణముద్వారా చేయబడు సాధనలను రాజయోగ మందురు. మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారము అనునవి అంతఃకరణముయొక్క నాల్గు భేదములు. అంతఃకరణము దృశ్యము. ఆత్మ ద్రష్ట, ఈ ద్రష్ట దృశ్యములయొక్క సంబంధమే సృష్టి. చిత్త వృత్తి చాంచల్యమే దీనికి కారణము. రాజయోగసాధనలో విచార బుద్ధికి ప్రాధాన్య ముండును. విచారశక్తియొక్క పూర్ణత్వమున రాజయోగ సాధన సిద్ధించును.

౨. రాజయోగ ధ్యానమును బ్రహ్మధ్యానమనియు, రాజ యోగసమాధిని నిర్వికల్పసమాధి యనియు, రాజయోగమువలన సిద్ధిపొందిన మహాత్ముని జీవన్ముక్తుడనియు అందురు. మహాభావ

(మంత్రయోగ సమాధి) పొందిన యోగి, మహాబోధ్ (హఠయోగ సమాధి) పొందిన యోగి, మహాలయము (లయయోగ సమాధి) పొందిన యోగి, తత్వజ్ఞాన సహాయమున రాజయోగ భూమికలో శ్రేష్ఠులగుదురు. యోగసాధన లన్నిటిలో రాజయోగమే శ్రేష్ఠమైనది. ఇదియే సాధనకు తుదిమెట్టు. ఈ కారణముననే దీనిని రాజయోగమందురు.

3. రాజయోగ సాధనములుకూడ శాస్త్రములలో పదునారు అంగములుగా విభజించి వర్ణింపబడినవి. సప్తజ్ఞాన భూమికానుసారము యేడు అంగములు కలవు. ఇవన్నియు విచార ప్రధానములు. వాటి సాధనలు అనేక ప్రకారములు గలవు.

4. ప్రకృతిధారణమనియు, బ్రహ్మధారణమనియు ధారణకు రెండు అంగములు, విరాట్ ధ్యానమనియు, ఈశధ్యానమనియు బ్రహ్మధ్యానమనియు ధ్యానమునకు మూడు అంగములు గలవు. ఇవన్నియు బ్రహ్మధ్యానములోనే పరిసమాప్తి జెందును. మరియు రెండు సవిచారములనియు, రెండు నిర్విచారములనియు సమాధికి నాలుగు అంగములు కలవు. ఈ విధమున రాజయోగమునకు గల పదునారంగము (విధము)ల సాధనద్వారా రాజయోగము కృతకృత్యమగును. మంత్రయోగము, హఠయోగము, లయయోగము ఈ మూడింటిలో సిద్ధిపొందిన అనంతరమే కాని, లేకయే ఒక దానిలోనైన సిద్ధిపొందిన పిదపనే కాని సాధకునకు రాజయోగమునకై పూర్ణాధికారము ప్రాప్తించును.

5. రాజయోగసాధన మొదట ధారణాధ్యానములతో ప్రారంభమగును. మరియు రాజయోగసాధనలో, సమాధికే ప్రాధాన్యత కలదు. సమాధిభూమికలో మొదట వితర్కము, తదనంతరము విచారము ఉండును. దానిపై "ఆనందానుగతావస్థ" గలదు. దానికి పైన అస్మితానుగతావస్థ గలదు.

౬. విశేషలింగము, అవిశేషలింగము, లింగము, అలింగము ఈ నాలుగు భేద దృశ్యములుగలవి. అలింగము వరకు త్యజించుటకు యోగ్యము. నేను బ్రహ్మము నను భావముకూడా నిర్వికల్ప సమాధిలో నుండదు. ద్వైతభావముగాని లేక వికల్పముగాని నిశ్శేషముగా లేనిదే తురీయావస్థ. అపరోక్షానుభూతిగల, జీవన్ముక్తుడైన గురుదేవుడే ఆ తురీయావస్థ భేదము చూపకలుగును.

## ౫౬ స్వామి శివానంద్ జీ

యోగసోపానము :

౧. సాధకుడు మొదలు తన యింద్రియములను వశపరచుకొని తనను తాను పవిత్రునిగా జేసికొనవలయునని యోగశాస్త్రము తెలుపుచున్నది.

౨. జప తప సంకీర్తనముల జరుపుచు, నిరంతరము నిస్స్వార్థ సేవనొనర్చుచు, సంపూర్ణముగా పరిశుద్ధుడైనప్పుడే కుండలిని స్వతః మేల్కాంచి సహస్రారకముల నివాసియగు ఆనంద శివస్వరూపుడైన భగవంతుని దర్శించుటకు వెడలును.

3. కర్మయోగి సతతము నిష్కామకర్మ ద్వారా తన చిత్తమును పరిశుద్ధము చేయును. ప్రతి కర్మయందు తన భావమును నిశ్చయమును పరీక్షించును. దానిని స్వార్థరహితము చేయును. కర్మయోగి సర్వజగత్తును ఈశ్వరమయముగా భావించును. కాన తనకు సర్వత్ర ఈశ్వరస్వరూపమే కనుపించును. అతడు సమస్త విశ్వము విశ్వపితయొక్క ఆవిర్భావమని తలంచును. ప్రతి పరిస్థితికి అనుకూలుడగుటకు అభ్యసించును. తనకు గల తను మన ధనము లన్నింటిని అందరకు పంచిపెట్టును. కర్మములను, కర్మఫలమునుకూడ బ్రహ్మార్పణ మొనర్చి తనను భగవద్దాసునిగా తలంచును. ఆయన యిచ్ఛానుసారమే ప్రవర్తించును. దీనిచే కర్మబంధము నుండి ముక్తుడగును. నిష్కామకర్మ ద్వారా కర్మయోగి చిత్తము శుద్ధమగును. చిత్తశుద్ధివలన ఆత్మజ్ఞానము కలుగును. దేశసేవ, సమాజసేవ, దీనుల

సేవ, తల్లిదండ్రులసేవ, గురుసేవ, సత్పురుషులసేవ ఈ సేవలన్నియు కర్మయోగములే.

## ౫౩ ఆచార్య బాలకృష్ణ గోస్వామి మహారాజు

సాధనత్వము :

౧ ఈ జగత్తులో కీటాణువు మొదలుకొని బ్రహ్మవరకు సమస్త భూతములు సుఖమునే కోరుచుండును. ఇందువలననే అందరి ప్రధానలక్ష్యము సుఖమే. ఈ అనుకూల వేదనాత్మక సాధ్య స్వరూపసుఖము రెండువస్తువుల సమ్మిళితము వలన ఉత్పన్నమగును. మరియు వస్తుసంయోగ విభిన్నతతో మూడు విధములగును.

౨. 1) జడ, జడ సంయోగజన్య సుఖము. 2) జడచేతన సంయోగ జన్యసుఖము. 3) చేతన, చేతన సంయోగజన్యసుఖము.

1. జడమగు యింద్రియములతో జడమైన విషయముల సంయోగమే జడ, జడసంయోగజన్య సుఖమనబడును. ఈ సుఖము అనిత్యము, అశాశ్వతము.
2. జడమగు మనస్సుతో చేతనమైన ఆత్మసంయోగమే జడ, చేతన సంయోగసుఖ మనబడును. ఇదికూడ అనిత్యమైనదే. ఎందుకనగ మనస్సు అనిత్యము, అశాశ్వతము.
3. చేతన ఘనుడైన పరమాత్మతో చేతన కణుడగు జీవాత్మని సంయోగమే చేతన, చేతన సంయోగజన్య సుఖమనబడును. ఈ రెండును నిత్యసత్యములు. ఇదే సత్యసుఖము. శాశ్వతము.

3. సాధకుడు సాధ్యుని పొందుటకు ప్రయత్నించుటను సాధనయందురు. ఈ సాధనను మార్గమని కూడ అందురు. ఈ మార్గము ప్రతిక్రియా భేదముచే రెండువిధము లుండును. అవి 1) ఆరోహి మార్గము. 2) అవరోహి మార్గము.

1. సాధకుడు, స్వయముగ స్వశక్తితో సాధ్యునివరకు పోవలసి యుండు దానిని ఆరోహి మార్గమందురు. ఇది అత్యంత కఠినము. భయావహము.

౨. సాధ్యుడే సహజముగా సాధకుని వద్దకు వచ్చునట్టి మార్గమును అవరోహి మార్గమందురు. ఇది అతిసరళము, నిర్భయము (యిది నావవంటి మార్గము).

## ౫౮. శ్రీ దీత్ మాధవ గోస్వామిజీ మహారాజ్

౧. భుక్తి, ముక్తులయం దిచ్ఛనుంచక కేవలము భగవంతుని భజించుటయే ఉత్తమము. నేను భగవంతుని వాడను. భగవంతుడు నా వాడను భావమే భక్తి.

౨. నీలో ఉన్న దోషమే నీ నిజస్వరూపమును కప్పియుంచెను. దానిని తొలగించిన నీ నిజరూపము నీకు గోచరమగును. అహంకారము త్యజించిన ప్రేమ జనించును.

3. నీ కొరకని నీవేదియు చేయకుము. ఏది చేసినను భగవంతుని కొరకే చేయుము. శ్రమ అనక అందరిని సేవింపుము. అందరి సుఖము దేనిలో కలదో, అదే నిజమైన సుఖము.

౪. శరీర మొక యంత్రము. ఆత్మ ఈ యంత్రమును నడిపించును. ఇక నేను, నాది అని భావించుట అవివేకము, ద్రోహము, దుఃఖమునకు కారణము.

౫. గుణములను బట్టియే వర్ణాశ్రమ ధర్మము లేర్పడును. శరణాగతియే ఆత్మ ధర్మము. సర్వకర్మములను భగవదర్పితము చేసి శరణాగతి నొందుటయే పరమధర్మము. నేను, నాది అను భావ ముండువరకు స్వస్వరూపదర్శనము కానేరదు. ప్రేమయే జీవుని ప్రథమ కర్తవ్యము. ఏకాగ్రచిత్తము కలిగి ప్రేమతో స్మరించు వాడే ముక్తుడు.

౬. ఇతరులను అపకీర్తి పాలుచేయుట అపరాధము. నిందించుచు జపించుట నామముకంటె నామస్వరూపుని వేరుగా తలంచి స్తోత్రముచేయుట దోషము, పాపము.

౭. దరిద్రులవైపు చూడుము. దుఃఖము దూరమగును. ధనికులవైపు చూచితివా, అసూయ జనించి దుఃఖ మధికమగును.

౮. నీ కోరకై ఇతరులకు హాని కలిగింపకుము. ఎవరిని ద్వేషింపకుము. నీ హృదయమును, భావమును పవిత్రముగా నుంచుకొనుము. ఏ వస్తువు నీకు ప్రియమో దానిని యితరుల కీయుము.

౯. నేను భగవదంశుడను. ఆయన అంశమును ఆయన నశింప జేసికొనడని భావించి ఆయనను విశ్వసించితివా, నీకు మేలు తప్పదు.

## ౫౫. శ్రీ డాక్టరు బాబా

౧. మనస్సు జడము. దీనికి రూపము లేదు. భావరూపము కలది. వికారములు, సంకల్పములచే ప్రతీతమగును.

౨. అంతఃకరణములో మనో బుద్ధి చిత్తాహంకారములు గలవు. మనస్సు సంకల్పించును. చిత్తము చింతనము చేయును. బుద్ధి నిశ్చయించును. వీనిని నావని తలంచునే అహంకారము.

3. రజో, సత్వ, తమోగుణముల మధ్య నుండి కార్య మూహించుచుండును. దీనిని మంచి కార్యములందు పెట్టినచో, సత్వగుణము పెరుగును. దీనినే చెడుకార్యములందు పెట్టిన, తమోగుణము పెరుగును. కావున సత్వమును వృద్ధి చేయుచు, రజస్తమోగుణములను క్షీణింపజేయవలెను. దీనికై న్యాయముతో సంపాదించిన అన్నమునే తినవలెను. కేవలము శరీర రక్షణకే తినవలెను. కడుపు రుచిని కోరదు. నాలుక కేవలము రుచిని చూపును. కాని కోరదు. రుచిని కోరునది తమోగుణమే. తమోగుణము తమోగుణ పదార్థములనే కోరును. రజోగుణము ఈ రెంటి మధ్య నుండి, ఏ గుణమేది కోరునో, దాని కది అందించుచుండును. కావున, సాత్వికాహారమునే స్వీకరింపవలెను. సాత్వికాహారము వలన శరీరము, మనోబుద్ధులు శుద్ధమగును. రజోగుణముగల పదార్థములను వండిన మూడు ఘడియల పిదప ఆ రజోగుణ పదార్థములందే తమోగుణము జనించును.

౪. పరులిచ్చు పదార్థములను తీసికొనరాదు. ఏలనన, వారే అభిప్రాయముతో నిత్తురో లేక, అవి పాపముచే సంపాదింపబడినవో? కావున, యెవరితోను యేమియు పుచ్చుకొనరాదు. ఏ అభిప్రాయముతో ఆ వస్తువు నిత్తురో, ఆ అభిప్రాయమే ఆ వస్తువులో ప్రవేశించును. దానిని మనము స్వీకరించినయెడల, ఆ అభిప్రాయము మనలో ప్రవేశించి, మనస్సును చలింపచేయును. దాని మంచి చెడ్డల ప్రభావము మనపైబడి, సత్వగుణము క్షీణించి, తమోగుణము వృద్ధియగును. దాన దుఃఖము సంభవించును. కావున, ప్రేమ లేనివారివద్ద యేమియు తీసికొనరాదు.

## ౭౦ హాతి బాబా

౧. జీవుడు ఆది, అంతములలో యేదియు కోరడు. కేవలము మధ్యస్థలోనే తానేదియో కాగోరును. ఈ కోరికయే బంధనము. కావున నీవేదియు కాగోరకుము. ఈశ్వర విధానములో యెట్టి జోక్యము కలిగించుకొనకుము. గొప్పవాడవగుటకు యిచ్ఛగింపకుము. ఏదో చేయుట, అగుట, పొందుట, కోరుట ఈ మొదలగు వాటియందిచ్ఛ యుండుటయే దుఃఖమునకు కారణము. సంసారము సంకల్పమాత్రము. కావున, యేమియు కోరకుము.

౨. నేను, నాది అను భావమును విడువుము. నాది, నీది అనునదే జననమరణములకు హేతువు.

3. సంసారములోని సర్వ వస్తువులు మంచివే. చెడ్డదనునది లేదు. వాటి వాటి స్వభావానుసారము, అవి వాటి గుణములను ప్రకటించును. మానవుడు సంసార సంగముచే తన నిజస్వభావమును మరచి దుఃఖము ననుభవించు చుండును.

## ౭౧ సాధనా భక్తుడు

౧. జీవితముండగానే ఈ శరీరమును నేను కాను, ఇది నాది కాదు అను వికల్ప రహితమగు విశ్వాసముచే నిశ్చయించుకొను

టావశ్యకము. దీనికొరకు సదా జాగరూకతతో మెలగవలయును. ఎంత చిన్న పనియందైనను నేనను అహంకారము జనింపకుండ చూచుచుండవలెను. సుఖమును, భయమును మనస్సులో ప్రవేశింప నివ్వరాదు. ఇట్లు ప్రవర్తించుటచే అహంకారము నశించును.

౨. సమర్పణమనగా, జీవన్మృతుడగుట, మరణమునకు, భయమునకు, జీవించుటకాశ యుండరాదు. సమర్పితుని మనోబుద్ధులు వానివి కావు. కావున, యెట్టి విచారము చేయుటకును వానికధి కారముండ నేరదు. నిర్విచారికి కర్తృత్వ ముండదు. కర్తృత్వము లేనివానికి పాపపుణ్యములంటవు.

3. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు. ఆయనను పొంద వలయుననిన ఆయన గుణములు మనలో రావలెను. ఎంతవరకీ గుణా ముల మనము పాలింపమో అంతవరకు ఆయనను పొందలేము. మనమే ఆయనను సాకార రూపునిగా జేసి ఆయనలో ఈ గుణ ములను ఆరోపింతుము. కావున ఆ గుణములు మనలో రావలెను. దీనికైనను నేనను అహంభావమును త్యజించు టావశ్యకము. గుణము లన్నియు మొదటినుండియు మనలో కలవు. కాని అజ్ఞానవశమున మరచిపోయితిమి.

౪. స్వప్నావస్థనుండి జాగ్రదవస్థకు రాగానే స్వప్నము అసత్య మని తోచును. అటులే జీవభావముచే శరీరము, సంసారము నిజమని తోచును. ఎపుడు జ్ఞానముచే జీవభావము నశించి, నీ నిజస్వరూప మును తెలిసికొందువో, అపుడు ఈ జగత్తు, శరీరము అసత్యమని తోచును.

౫. స్వప్నమెట్లు మనచే సృష్టింపబడునో జగత్తుకూడ. అట్లే మన శక్తిచే సృష్టింపబడును.

## ౭౨ దేవేందర్ జ్ఞానిజీ

౧. ఆత్మను దర్శించినవాడే నిజమైన గురువు. వాసనా రహితమగు మౌనమే నిజమైన మౌనము.

౨. నిరాడంబర, నిష్కళంక జీవితము గడుపువాడే అంతరాత్మను తెలిసికొనగలుగును. ఇతరులకు సుఖమును, శాంతియు కలుగజేయును. దీనికై అహంభావమును నశింపజేయుటవసరము.

౩. మనము, మన నిత్య జీవితములో అడుగడుగున అభేద భావముతో ప్రవర్తింపక కేవలము తెలిసికొనినంత మాత్రమున లాభమేమి? రైలు, బస్సు, బజారు, మందిరము, మొదలగు ప్రతిచోట, ఇతరుల కవకాశ మివ్వక, మనమెటులో వారల్లే యని తలంపక, కేవలము మాటలతో సరిపుచ్చుట వ్యర్థము, ద్రోహము. ఈశ్వరుడు సర్వత్ర గలడని అందుమే కాని ఆచరింపము. ఏ నాడిట్టి గొప్ప సత్యమును మనలో కార్యరూపమున జూతుమో ఆనాటి నుండియే మనము ద్వంద్వరహితుల మగుదుము.

౪. ఈశ్వరుని ప్రతి ప్రాణిలో జూచువాడు ఏ జీవిని ద్వేషింపడు, దేనికి భయపడడు. ఏ వస్తువునం దాసక్తుడు కానేరడు.

౫. మన ఆహార విహారములు సాధారణ, సాత్వికములే అగుచో, ఇక తీపి పులుపు, రుచిగల పదార్థములు, మృష్టాన్నములు, మేడలు, మిద్దెలు, వాహనములు, వేష భూషణములు, మొదలగు వైభవముల కొరకు శ్రమపడు టెందులకు? నీకు గల యావదాస్తియు, ప్రకృతి నుండియు సమాజము నుండియే కదా లభించెను. అట్టి సమాజ ద్రవ్యమును వ్యర్థముగా వ్యయపరచి ఇతరులకు దుఃఖము కలిగించు టెందులకు? దీనివలన మనకును, ఇతరులకును హాని చేకూరును.

## ౭౩ సాహెబ్‌జీ మహరాజ్

౧. మనో జయమునకు దివారాత్రములు ఎన్నియోసార్లు ధ్యానించుటవసరము. మనస్సును సంసార పదార్థములనుండి మరిమరి తొలగించుచు దృష్టిని అంతఃర్ముఖమునకు త్రిప్పవలయును. పరమాత్మయందు పొరపాటు చేయతగదు. సంసార సంబంధులతో అధికముగా వ్యవహరింపరాదు.

౨. సృష్టి నియమములకు విరుద్ధముగా ప్రవర్తించి నీకును, ఇతరులకును కష్టము, దుఃఖము కలిగించి, అట్టి నేరమును భగవంతు నిపై మోపకుము. స్వార్థపరుడవై నాది, నీది అను భేదము కలిగింప కుము. ప్రపంచ పదార్థములం దాసక్తి లేనివాడే నిజమైన భక్తుడు. అతడే ప్రతి ప్రాణిని ప్రేమింపగలుగును.

౩. అన్యాయార్జితమైన అన్నము తినకుము. పరుల సొమ్ము తిని వారి ఋణములో పడకుము. ఆకలి కానిదే రుచికై తినకుము.

౪. స్వయము నీవు కర్తవై యజమానుని మరువకుము. అట్లు మరచియే ప్రపంచ మీనాడు చీకాకులోబడి దుఃఖించు చున్నది.

౫. ప్రతి క్షణము నీ మనస్సును నీవు కనిపెట్టుచుండుము. వ్యర్థమైన ఆలోచనలు చేయకుము. ప్రపంచ లాభనష్టములకై ఖేద మోదము లొందక, అతనిపై భారము వైచి ఆనందింపుము. నష్ట మగుచో, అన్యాయార్జితమైనదే నశించినదని తలంచి సంతసింపుము.

౬. ధనమునం దాసక్తి, జీవించుటయందాశ, సుఖభోగముల యందిచ్ఛ ఉండుటచే పిరికితనము జనించును. కావున స్వార్థపరు డవై నీ సుఖము కొరకు పరులను కష్టపెట్టకుము. నీ తను, మన, ధన, బలములను పరుల సుఖముకొరకు వినియోగింపుము.

౭. భ్రూమధ్యమున దృష్టి నిలిపి ధ్యానింతువేని అంతరధ్వని ప్రకటమగును. ఈ సాధనచే కొలది కాలముననే తురీయావస్థ కలుగును. పదునైదు (15) దినములలో ఆత్మానందమగును.

౮. ఎంతవరకు దేహముండునో, అంతవరకు సంసార సుఖ దుఃఖములుండితీరును. ఎంతవరకేదియో పొందుటకిచ్ఛ యుండునో, అంతవరకు కష్టములుండును.

౯. స్వయముగా కర్తలలో, మంచి చెడ్డలు లేవు. కర్మచేయు వారి భావప్రకారమే వారికి మంచి చెడ్డలు కనిపించును. మహా పురుషులు మానవుని కర్తవ్యమునకై ఏ విధానము విధించిరో, అదే

శుభకర్మ అనబడును. దానిని శ్రద్ధాభక్తులతో ఆచరించిన, భగవ త్ప్రాప్తి కలుగును.

## ౬౮ శ్రీ హుజూర్ మహారాజ్

౧. మానవుడు ధనమును, స్త్రీ పుత్రాదులను, తుదకు దేహమునుకూడ విడచుట సహజమే. కాని కీర్తి, ప్రతిష్ఠ, పదవుల విడచుట చాలా దుస్తరము. వీనియందాసక్తుడై దైవమును మరచి స్వార్థపరుడగును.

౨. ఒకటి మంచిది, ఒకటి చెడ్డదనునది ఏ కార్యము లేదు. ఏ కార్యము చేయునో మనస్సు చంచలము, మలినము నగునో, అదే చెడ్డకార్యము. దేనిచే మనస్సు నిర్మలమగునో, అదే మంచి కార్యము.

3. పరులకు కీడొనర్చుట, వారి దోషములను పరిశీలించుట చాలా గొప్ప తప్పు.

౪. పరుల ఉన్నతిజూచి అసూయ పడుటవలన చైతన్యశక్తి క్షీణించును. నిజమైన పరమార్థి ప్రపంచ ఝంఝూటములో జిక్కుకొనడు.

౫. జీవుడు దేహాసక్తిచేతనే ఒకానొకపరి అన్నము లభించని కారణమున, వ్యాకులము జెందును. అన్నము లభింపగానే, అన్న విచారమును విడిచి కడుపునింపుట కారంభించును. నిజమైన సాధకునకు యిట్టి దేహాసక్తియుండరాదు. అన్నము లభించినచో ఓపికగలవాడై తినుటకుముందు ఈ అన్నము తినుటకు, నాకు అధికారము కలదా లేదా? ఈ అన్నము పవిత్రమైనదా? కాదా? తమోగుణపదార్థము కాదుగదా? అని విచారించి తదుపరి అంతర్ముఖుడై ధ్యానించి, భగవదర్పితముచేసి, ఆ తదుపరి మితముగా భుజింపవలయును. అధికముగా తినుట, అధికముగా నిద్రించుట, ప్రపంచ వ్యవహారలంపటుడై యిటునటు పర్యాలెత్తుట ఈ మూడు

పరమార్థమునకు హానికరములు. కావున, పరమార్థసాధకులు కడు జాగ్రత్తతో మెలగవలయును.

౬. జీవునకొకదినము చావుతప్పదు. కావున, మానవుడు మృత్యువునకు ముందే ప్రయాణమునకు సిద్ధమై యుండవలయును.

౭. ఓమానవా ! స్తుతిసన్మానములకు ఉప్పొంగితివా బంధింపబడుదువు. మంచివాడని అనిపించుకొనుట కంటె మంచివానివిగా గమ్ము. కీర్తి ప్రతిష్ఠలకాశింపకుము. ప్రపంచవాసనలు, గొప్పవాడగుట కిచ్ఛ ఏమాత్రమున్నను భగవత్ప్రేమ జనింపనేరదు.

౮. ప్రతి శరీరములో నాద శబ్దము ప్రతిధ్వనించుచుండును. నాదధ్వనితో సమమైన గురువు లేక బాటచూపువారు వేరొకరు లేరు. అంతరాత్మ సదాసర్వదా బోధించుచుండును.

౯. ఈ దేహమే బ్రహ్మాండరచనకు చిహ్నము. పిండాండములో బ్రహ్మాండముకలదు.

౧౦. ప్రపంచముతోను, ప్రపంచవస్తువులతోను నీమనస్సేంద్రియములను తొలగింతువేని వైరాగ్యము పెరిగి ఈశ్వర ప్రేమ జనించును. కావున ఆడంబరములను త్యజించి, సంసారుల యెడ మమతనుంచక వారితో అసంగుడవై చరింపుము.

౧౧. పర వస్తువులను, పరస్త్రీలను చెడు దృష్టితో చూడకుము. నీ మనస్సును చెడుసంకల్పముల చే వ్యర్థపుచ్చకుము.

౧౨. ఈ ప్రపంచములో కనుపించు పదార్థములన్నియు మానవులచే చేయబడినవి, భగవచ్ఛక్తియే దీనికిమూలము.

౧౩. పరమాత్మనివలె నిర్మల, నిర్గుణుడవైనపుడే నీవు ముక్తుడవగుదువు. అతని విశ్వసింపుము. ఎపుడు నీలో యే కోరికలుండవో అపుడు నీవు అతనివైపునకు పోవుచున్నావని తలంపుము.

౧౪. రుచి పచిలేనిది సంభవించినను, దానినే తిని సంతోషింపుము. విషయ వాసనల త్యజింపుము. స్వయముగ కష్టించి

జీవింపుము. ఏ గృహమున పవిత్రాచరణ లేక పాపముచే సంపాదింప బడునో, ఆ గృహమున భుజింపకుము.

౧౭. ఆత్మను, ఈ శరీరమను కారాగృహము నుండి విడిపించుటకు ప్రయత్నింపుము. లేనిచో జీవితము వ్యర్థమగును. చావక ముందే ఈ పనిని పూర్తి చేయుట నీ కర్తవ్యము.

౧౮. సంసార ఋణమును, పంచభూతములఋణములను, లోక ఋణమును, తల్లిదండ్రుల ఋణమును, సర్వ జీవుల ఋణములను చెల్లించుట కొరకే నీవు జన్మించితివి. కావున, కర్తవ్యమును నెర వేర్పుము. లేనిచో వారికి ఋణపడుదువు. అందరికి సేవకుడవై సేవ చేయుము. భగవదాజ్ఞను పరిపాలించుటచే భగవంతుని ఋణము తీరును. ఇటులే ఎవరిది వారికిచ్చి, ఋణవిముక్తుడవుగమ్ము.

## ౨౭ శ్రీ ప్రజ్ఞానాథ్‌జీ (కేదార సంగం)

౧. వ్యర్థముగా, కఠినముగా మాట్లాడకుము. నీకుగాని ఇతరు లకుగాని హితముగాని శబ్దము పలుకకుము. మనస్సుతో ఎప్పుడును ఏ జీవికిని అహితము కోరకుము. అందరిని ప్రేమింపుము. పర స్త్రీని కుదృష్టితో చూడకుము, పరవస్తువును ముట్టకుము. సత్య మును, బ్రహ్మచర్యమును పాలింపుము. సమయమును వ్యర్థపుచ్చ కుము. ప్రతిదినము, ఒక గంట లేక రెండు గంటలు ఏకాంతమున ఆత్మ చింతనచేయుము. అహంకారమును, మోహ మమతలను, కీర్తి ప్రతిష్ఠలను త్యజింపుము. స్త్రీమాయలో జిక్కకుము. సాధు పురుషుల దర్శించి సత్సంగము చేయుచుండుము. కామమును తొలగించుటకై ఉపవాసము చేయుము; రుచులను త్యజింపుము. క్రోధమును అణచుము. లోభమును త్యజించుటకు ప్రతి వస్తువును వివేకముచే విచారింపుము. కపటమును వీడుము. ఎవరికిని మోసము చేయకుము. ప్రతి దినము పంచ యజ్ఞములు చేసి, యితరులకు పెట్టి పిదప నీవు తినుము. ఆత్మదృష్టితో జగత్తును జూడుము. క్రింద

జూస్తు బాటనడువుము. ఏ ప్రాణికిని హింస కలిగింపకుము. పచ్చని చెట్లను నరుకకుము.

౨. ఏ కర్మ చేయుటవలన మనస్సు సంకోచించునో ఆ కర్మ చేయకుము. జలములో ఉమ్మి వేయుట, మలమూత్రాదులు విడచుట మహాపాపము.

3. పొరపాటుచే నీవలన ఏదైన పాపముజరిగినచో, దాన ధ్యానాదులచే ఆ దోషమును హరింప జేయుము. ప్రతి దినము, పది గంటల కాలమును పరమార్థముకొరకు వినియోగించుము.

## ౭౭ శ్రీ బృందావన్ జీ మహారాజ్

౧. శక్తి (బలము)ని భద్రపరచదలంతువేని సంకల్పరహితుడవుగమ్ము. శక్తి దురుపయోగము గాకుండ జూతువేని అధికము తినకుము. చెడుకార్యములను, చెడుమాటలను పలుకకుము. విషయ భోగముల విడనాడుము.

౨. సంసారమునుండి ముఖముత్రిప్పి భగవంతునివైపు తిరిగితివా ప్రేమజనించును. సంసారాశ్రయము వదలగానే భగవదాశ్రయము లభించును.

3. అతి స్వల్ప సాధారణమైన తప్పులనుకూడ మహా గొప్ప హానికరములని తలంచితివా ఎప్పుడో గొప్ప మహాత్ముడవగుదువు.

౪. అహంకారమును నశింపజేయదలంతువేని విషయ వాసనలను విడువుము.

౫. ప్రయత్నముచే భోగము లభించును. అప్రయత్నముచే యోగము సిద్ధించును.

౬. ముక్తిని, భక్తిని, కోరుదువేని త్యాగ, సత్యములను శ్రద్ధతో పరిపాలింపుము.

౭. మృత్యుభయమును తప్పించుకొనదలంతువేని, మృత్యువుకంటె మొదలే సమస్త కోరికలను త్యజింపుము. భోగములవలన

పుణ్యము నశించును. దుఃఖములవలన పాపము నశించును. దీనిని మరువకుము.

౮. మోహమును నశింపజేయదలంతువేని, ఎవరిని నీవారని తలంపకుము. అసంగుడవు గమ్ము.

౯. త్యాగమును పూర్తి జేయ దలంతువేని, సమస్త కామ వాసనలను త్యజింపుము.

౧౦. తపస్సు పూర్తిగావింప తలంతువేని దుఃఖములోకూడ సుఖము నాశింపకుము. సంకల్పరహితుడవు గమ్ము. అవమానముల సహించుటే తపస్సు. సన్మాన, భోగములచే తపస్సు నశించును.

౧౧. స్వామివి కాగోరుదువేని మనస్సు చెప్పినట్లు వినకుము. అంతరాత్మ ప్రేరణ ననుసరింపుము.

౧౨ భగవంతు నుపాసింప దలంతువేని ఇతరులకు దుఃఖము కలిగింపకుము.

౧౩ ముక్తుడవు కాగోరుదువేని బహువిధసాధనలలో పడక, జీవితమునే సాధనగా జేసికొనుము. వివేకము నాదరింపుము. జిహ్వోపస్థల రుచులను త్యజింపుము. కుటుంబపోషణ, కీర్తిప్రతిష్ఠల యందలి మోహ మమతల విడచి, అభిమానమును త్యజింపుము.

౧౪. భగవంతుని దర్శింపవలంతువేని సంకల్పరహితుడవై మౌనముద్ర వహింపుము.

౧౫. కలహ, తాపములకు దూరము గాదలంతువేని ఇతరుల కర్తవ్యమును, నీ అధికారమని తలంపకుము. ఎంత త్యాగ ముండునో అంత శాంతి కలుగును.

౧౬. మహత్తును కోరుదువేని అధికారమును, ఐశ్వర్యమును కోరకుము.

౧౭. నీ వెంత దరిద్రుడవైనను స్వార్థమును నీ దరికి జేర నీయకుము. ఏదియు నాది కాదనుకొనుము.

౧౮. మోసమును తప్పించుకొన దలంతువేని స్వార్థ సేవచే, శత్రు సన్మానముచే, స్త్రీల కన్నీటిచే, పదవిగలవారి తీయనిమాటలచే, నీకంటె అధిక ధనికుని ఆదరముచే సావధానుడవు గమ్ము. వీరిని విశ్వసింపకుము. నిన్ను నీవు గుణవంతునిగా దలంపకుము.

౧౯. జ్ఞానము పొందగోరుదువేని వివేకమను గురువు ననుసరింపుము. ఆ వివేకముచే సంసారమును, జగత్తును, నీ దేహమును, నీ జీవితమును పరీక్షించుచుండుము.

౨౦. మనస్సులో అపవిత్ర భావము ప్రవేశించి నాలుగయిదు నిమిషముల కాలము నిలచునేని దాని ప్రభావము సూక్ష్మ శరీరముపై బడి నలుబది యెనిమిది గంటల కాలముండునని మహాత్ములు చెప్పిరి.

౨౧. దేహాభిమానము తొలగుటకు నిరంతరము, దృఢముగా ఆత్మచింతన చేయవలసి యుండును. సంసారపు మాటలను విననిచో, అంతర్వాణిబోధ వినబడును.

౨౨. నీ పదవి, నీ ధనసంపత్తులు, కీర్తిప్రతిష్ఠలు నశించినను భయము జెందకుము. దీనివలన నీ అభిమానము తొలగి పరిశుద్ధుడవగుదువు.

౨౩. ప్రపంచము పవిత్రమగుటకు, ప్రజలు ధర్మాత్ములగుటకు ఎదురు చూడకుము. మొదట నిన్ను నీవు పాపరహితునిగా, పవిత్రునిగా జేసికొనుము. పరులను బాగుజేయుటకు తాను కర్తననుకొనక తనను తాను నిరీక్షించుకొనువాడే పరమ పవిత్రుడు.

౨౪. తపస్సు, నియమము, త్యాగము ఎపుడు తగ్గునో, అపుడే నీలో దోషములు, పాపములు ప్రవేశించును.

౨౫. బాధ పెట్టబడుచున్నను సహింపుము. మౌనము వహింపుము. అపుడు దైవశక్తి నిన్ను రక్షించును.

౨౬. నాది అనున దేదియు లేనివాడే నిర్మలుడు. నా దేదియు కాదని తలంచువాడే నిరభిమానుడు.

౨౭. త్యాగముచే శాంతి, తపస్సుచే శక్తి, ఆత్మీయతచే ప్రీతి, సేవచే పవిత్రత కలుగును.

౨౮. వాసనలు నశించినంతనే మనస్సు నశించును. జ్ఞానము చేతనే వాసనలు నశించును.

౨౯. త్యాగము చేయనిచో భోగవస్తువులు లాగుకొనబడును. తపస్సు చేయనిచో రోగములు భోగములను లాగుకొనును. దానము చేయనిచో ధనము అపహరింపబడును.

౩౦. స్వయము భగవంతుడే నిన్ను ప్రేమించునట్లు పవిత్రుడవు గమ్ము. సంసారమే నీకొరకు ఎదురు చూచునట్లు జీవయాత్ర గడుపుము.

## ౬౭ శ్రీ సదానందస్వామి

౧. సదా నీ జీవితమును కనిపెట్టుచు నిన్ను నీవు పరీక్షించుకొనుచుండుము. నేనెవడనని విచారింపుము.

౨. భోగ్యపదార్థముల అంతిమగతిని దృష్టియందుంచుకొని, వస్తువులకొరకు, వ్యక్తులకొరకు విలపింపకుము. ఇవి అన్నియు విష తుల్యములే యని గ్రహింపుము.

౩. సతతము నీ అంతర్వాణి రహస్యబోధనలను వినుచుండుము. సదా, 'ఓం' ను జపించుచుండుము.

౪. ఏది నీకన్నిటికంటె ప్రీతియో, దేనిచే నీకు ఆటంకము కలుగునో దానిని మొదలు త్యజింపుము.

౫. పుణ్యాత్ముడవు గాదలంతువేని ఋషుల జీవనము ననుసరింపుము.

౬. మృత్యువునకు భయపడకుము. శరీర సౌఖ్యముకై ఆత్మకు హాని కలిగింపకుము. శరీరము పరమాత్మసొత్తు కావున దాని నపవిత్రము చేయకుము.

౭. పరుల మేలుకొరకు నీ కోరికలన్నిటిని అణచిపెట్టుము.

౮. మానవుల దూషణ భూషణముల లెక్కింపకుము. చింతింపకుము. ధర్మాత్ముని లోకులు పరీక్షింతురు. వాటికి లోబడితివా, నీ జీవితము వ్యర్థమగును.

౯. మోసము, కపటము, అభిమానము, గర్వము, పరనింద, అసత్యము మొదలగు దుర్గుణములను త్యజింపుము.

౧౦. అధికముగా మాటలాడకుము. అవసరమగుచో, నీ హృదయములో నున్నదానిని నిర్భయుడవై నిజము చెప్పుము. దేవుని ఆజ్ఞలను పరిపాలింపుము. అంతశ్శత్రువులను జయింపుము. ఇతరుల ఔన్నత్యమును చెడగొట్టకుము. కీడు చేసిన వారికి మేలు చేయుము.

౧౧. జిహ్వారుచి చాలా చెడ్డది. ధర్మాత్ములకిది గొప్ప ఆటంకము. హానికరము. శ్రీమంతుల భోజనము దరిద్రుల రక్తముచే ఉత్పన్నమగును.

౧౨. ధన సంగ్రహబుద్ధి సమస్త పాపములకు మూలము. తనకు గల ధనములను భగవదర్పితము చేయుము. అనగా దరిద్రులకు పంచిపెట్టి త్యాగివి కమ్ము.

౧౩. మరచియైనను ఇతరుల పనులకు అడ్డుపడకుము, ముఖస్తుతి కొరకు మాట్లాడకుము.

౧౪. సంసారుల మాటలను మనస్సునందుంచుకొనక వారిని ప్రేమింపుము. లోకులు నీపై అసత్యపు నేరము మోపినచో, అది నీ కర్మఫలమేనని తలంచి సంతోషింపుము.

౧౫. లోకసేవ చేయ తలంచుకొనువాడు, మొదలు తాను నిర్దోషియగుట ముఖ్యము.

౧౬. నీ హృదయములో తాపము, భయము మొదలగు చికాకులు కనుపించినచో, ఈశ్వరాజ్ఞ నుల్లంఘించినట్లు తలంచుము.

౧౭. నీ ప్రతి క్రియ, ప్రతి కార్యములో నీ అంతఃకరణను సాక్షిగా తీసికొనుము. నీ జీవితము నిర్మలము, పవిత్రముగా నుండ వలయును. ఈశ్వరుడు నీ ప్రతి క్రియను చూచుచుండును.

౧౮. నీతోడివారిని ప్రసన్నుల జేయుటకై ధర్మభ్రష్టుడవు గాకుము. సంసారులు స్వార్థపరులు. వారు ద్వేషులై నీకు కీడొనర్చి నను ధర్మమును వీడకుము.

౧౯. ధర్మకార్యములకై ఇతర సహాయ్యమపేక్షింపకుము. ఈశ్వరుడు నీ వెనువెంటనే యుండును. విశ్వసింపుము. ఎచట సత్య ముండునో అచట పరమాత్మ యుండితీరును.

౨౦. ఇతరుల ఉన్నతిని, కీర్తిప్రతిష్ఠలను జూచి ఈర్ష్య నొందకుము. ఇది మహా గొప్పకీలక మంత్రము. దీనిని ప్రతి క్షణము, నీ దృష్టియందుంచుకొనుము.

౨౧. ధర్మాచరణ సులభమైన పనికాదు. ఈ పవిత్ర కార్య మునకై ప్రపంచమును, సంసారమును, స్త్రీ పుత్రాదులను, తుదకు నీ శరీరముతో సహా సమస్తమును త్యజింప వలసియుండును.

౨౨. ఏ దినము ఆత్మ సంతోషము నొందదో, ఏదోయొక చెడుకార్యము జరిగినదని తలంపవలెను. అప్పుడు మనస్సు దిగు లొంది, లోలోననే అణగియుండును.

౨౩. జప తప ధ్యాన పూజాదుల కాలమున, స్త్రీ పుత్ర బంధు బాంధవ సర్వసంబంధములను విడచి అసంగుడవై విధి నాచ రింపవలయును. లేనిచో నీ నియమమునకు భంగము వాటిల్లును.

౨౪. భోజన సమయమున నీ రెండు చేతులు పైకెత్తి దేవు నాజ్ఞనుపొంది పిదప భుజింపుము.

## ౬౮ శ్రీ బుద్ధ దేవుజీ

౧. భగవదత్తమగు ఈ ఉత్తమ శరీరమును సదుపయోగము చేయుము. లేనిచో ఏ ముఖముతో ఆయనను దర్శింతువో విచా రింపుము ?

౨. భక్తుడవు కమ్ము. ఇచ్చుచుండుము, తీసికొనకుము. ఇచ్చువాడే ఈశ్వరుడు. ఇతరుల దుఃఖముల తా ననుభవించుచు, వారికి సుఖము చేకూర్చువాడే పరమభక్తుడు.

౩. చట్టమువలన లోకము బాగుపడదు. మానవులకు విజ్ఞానము నేర్పుము. చట్టమును మార్చుటవలన ప్రయోజనములేదు. మనుష్యుల మస్తిష్కమును మార్చవలయును.

౪. ఈశ్వర పూజయు, దుఃఖితులజూచి కరుణ కలుగుటయు, పరిస్థితిని సదుపయోగ పరచుటయు, పరులకు మేలొనర్చుటయు ఈ మొదలగునవన్నియు, స్వధర్మములే!

౫. భక్తికి మించి ముక్తి నిచ్చున దేదియు లేదు. మంచి పనులు చేయుచు చెడ్డపనులను విడుచుచుండుము. మేము చెడు కర్మములు చేయుటచేతనే మా గతి ఇట్లైనది. ఇక నీవు జాగ్రత పడుమని నీకు బోధించుట కొరకే ప్రతిదినము దరిద్రులు, అంగహీనులు, రోగపీడితులు, పశుపక్షులు మొదలగునవన్నియు నిన్ను దర్శించుచుండును. కావున వాటిని ఆదరింపుము. నీకా గతి రాకుండునట్లు ప్రవర్తింపుము.

౬. భగవద్గుణానువాదము చేయగా చేయగా, మన దుర్గుణములు పోయి, ఆయన సద్గుణములు మనలో ప్రవేశించును. ఉపాసనవలన నిర్భయ మేర్పడును. సర్వవ్యాపకుడగు అంతర్యామి నా వెనువెంట నున్నాడను భావముచే నిర్భయము కలుగును. ఇదే నిజమైన ఉపాసన. ఈశ్వర విశ్వాసికి యెట్టి భయముండదు.

౭. ఓ మానవా! నీవు మొదలు మానవుడవుగమ్ము. తదుపరి భగవంతుని ధ్యానింప గలుగుదువు. భగవదాజ్ఞను పాలించువాడే నిజమైన మానవుడు.

## ౬౯. శ్రీ హిమ్మత్ దాస్‌జీ

౧. ఎవరి జీవితములో విషయవాంఛ లుండవో, వారి మనస్సు ప్రతి క్షణము ఆ అనంతుని మరువక స్మరించుచుండును. ఇది జీవిత విధానము.

## ౭౦ స్వామి నిత్యానందజీ, భారతి

౧. ఏ ప్రాణినైనను హీనముగా జూడకుము. కష్టపెట్టకుము.

౨. ప్రతి వస్తువును, ప్రతి వ్యక్తిని, తుదకు నీ శరీరమును కూడ నీదిగా భావింపకుము.

3. అభిమానివి, అహంకారివి గాకుము. నేను, నాది అను అహంభావమును నీలోనుండి పారద్రోలుము.

౪. సుఖదుఃఖములను సమముగా జూడుము.

౫. క్షమాశీలుడవు గమ్ము.

౬. సదా ప్రసన్నవదనము కలిగియుండుము.

౭. నిన్ను నీవు అదుపులో పెట్టుకొనుము. మనోఇంద్రియములను వశపరచుకొనుము.

౮. పరమేశ్వర ప్రీతికొరకు సంకల్పించిన సంకల్పమును దృఢనిశ్చయముతో సాధింపుము. నీవు భగవంతునివాడవని ప్రతిక్షణము మనస్సునకు బోధించుచుండుము.

౯. నీ మనోబుద్ధులను భగవదర్పితము జేయుము. మనస్సుతో విచారింపదలంతువేని భగవత్స్వరూపమును, ఆయన గుణగణములను విచారింపుము. సంకల్పములే జనించునేని, భగవత్ప్రాప్తికగు సంకల్పములనే జనించనిమ్ము.

౧౦. నీ జీవితమువలన ఇతరులకు కష్టములు కలుగకుండ జీవింపుము. సంసారము పట్ల విరక్తుడవై ఇచ్ఛారహితుడవుగమ్ము.

౧౧. నీ అవసరములను తగ్గించుకొనుము. పరులకును, నీ శరీరమునకును లోబడకుము. తినుటకు, త్రాగుటకు లోబడి దీనుడవు గాకుము. రోగపీడితుడవైనను ఇతరులపై ఆధారపడక, భగవంతుని మీద భారము వైచి నిశ్చింతుడవు గమ్ము.

౧౨. బాహ్యాంతఃకరణములను పరిశుభ్రముగా నుంచుము.

౧౩. కామక్రోధలోభాది దుర్గుణములకు దూరుడవగుము. నేను కామక్రోధ రహితుడ నను అభిమాన ముండరాదు. సావధానుడవై మెలంగుము.

౧౪. పక్షపాతివి గాకుము. ఎవరితోను సంబంధము పెట్టుకొనకుము. ఒకరితో సంబంధము కలిగెనా, వేరొకరితో ద్వేషము తప్పదు. కావున ఒకటి మంచి, వేరొకటి చెడ్డయని తలంపకుము.

౧౫. పరమేశ్వరుని విశ్వసింపుము. సంసారమును నమ్మకుము.

౧౬. ప్రతి కార్యము భగవత్ప్రీతి కొరకే చేయుచు, ఆ కర్మఫలమును భగవదర్పితము చేయుము.

౧౭. సంతోషింపకుము, చింతింపకుము, దేనిని కోరకుము. అన్నిటి యెడ ఉదాసీనుడవుగమ్ము. మానావమానములను, శీతోష్ణ సుఖదుఃఖములను, హాని లాభములను సహించుచు అన్నిటిని సమముగా జూడుము.

౧౮. శత్రుమిత్రుల యెడ సమభావము కలిగియుండుము.

౧౯. వస్తు వ్యక్తులతో సంబంధము పెట్టుకొనకుము. అన్నిటికి అసంగుడవు గమ్ము. పరమేశ్వరునకు ప్రియుడవు గాదలంతువేని ఏకాకివై ఏకాంతవాస మవలంబింపుము. ఏకత్వము సిద్ధించును.

౨౦ ఒకరిని స్తుతించి, మరొకరిని నిందింపకుము. నిందా స్తుతులచే ఒకడు శత్రువు, ఒకడు మిత్రుడగును. స్తుతింపబడినవాని శత్రువు నిన్ను తనకు శత్రునిగా భావించును. నిందింపబడినవాడు నిన్ను తనకు శత్రువుగా తలంచును. నిందాస్తుతులు రెండును ప్రమాదములే కావున ఈ రెంటికి దూరముండుము.

౨౧. నిష్క్రియుడవై మౌనము వహింపుము. నిశ్చల మనస్సుతో భగవంతుని ధ్యానింపుము.

౨౨. ఎట్టి పరిస్థితియందైనను సంతోషముతో భగవంతుని ధ్యానింపుము. భగవంతుడు చేయుచున్న దంతయు నీ మేలుకొరకనియే తలంపుము. దేనిని యాచింపకుము.

౨౩. నీ కొరకు ఎట్టి ఏర్పాట్లను చేసికొనకుము. ఇల్లు లేదని విచారింపకుము. పరమేశ్వరుడే నీ యిల్లుగా దలంపుము. సర్వస్వము ఆయనగానే భావింపుము.

౨౪. నీ మస్తిష్కమును పవిత్రముగా నుంచుకొనుము. సత్యాసత్యముల గమనించి నిజమైనదానినే అవలంబింపుము.

ఈ యిరువదినాలుగు సాధనలను ప్రతి సాధకుడు ఆచరించుట అవసరము.

## ౭౧ శ్రీ కాశీ సంత్

[వీరు ఒకరిని గౌరవించుటకు స్వయముగ తాను అపజయమొంది, వారే విజయము పొందినట్లు వారికి విజయపత్రము వ్రాసి యిచ్చిరి. వీరి శిష్యులు అది సహింపక ఆ విజయపత్రముపొందిన వారితో శాస్త్రార్థమొనర్చి ఓడించి తిరస్కరించిరి. అది విని మనో వ్యథజెంది వేదాంత శ్రవణ మేమి లాభమనియు, సాంసారిక వ్యర్థ వ్యవహారముల కొరకు శక్తిని వ్యయపరుచుట వలన వచ్చు ఫలమేమనియు, ఇతరులను తిరస్కరించుటకు బదులు జీవిత పర్యంతము మౌనిగా యుండుటే మేలనియు తలంచి మౌనముద్ర వహించిరి.]

౧. సాంసారిక క్షణభంగుర సుఖముల కాశించి, వాటిని పొందుటకు మనస్సు వానిలో లీనమగునేని మానవుని అంతఃకరణము మలినమగును.

౨. ఏ కార్యము చేసినను భగవంతుని కొరకనియే చేయుము. నీ కొరకని యేదిచేసినను దానివలన తుదకు దుఃఖమే సంభవించును.

౩. ఎంతవరకు మనస్సులో ధనముపై మమతయుండునో, అంతవరకు ఏదో ఒక కర్మ చేయుటకు మనస్సులో సంకల్పము జనించు చుండును. దానివలన సుఖదుఃఖములు తప్పవు. కావున నీవు కేవలము ధ్యానము చేయుచుండుము. వ్యవహార సంబంధ

మగున దేదియు నీ చిత్తములో రేకెత్తకూడదు. నీవు ఆ ధనము ద్వారా ఎవరికైనా మేలుచేయ కలుగుదు వేమో! కాని ఆ ధనముచే నీ చిత్తములో ఏదో చేయవలెనను కర్మసంస్కారము స్థిరమగును. అనగా ధనము నిశ్చింతతో ఉండనీయదు.

౪. స్త్రీ తన సుందర ప్రలోభములగు విలాస సామగిని రుచిగల పదార్థములను నీ యెదుటబెట్టి మధుర భాషణములతో, ముసిముసి నవ్వుముఖముతో నీ వైపు క్రీగంట జూచుచు, నిన్ను భోగానందములో మగ్నుని జేయుటకు ఎపుడు పురికొల్పునో, అపుడే నీకు అపాయ మాసన్నమైనదని తలంపుము.

## ౭౨ స్వామి సనాతన్ జీ మహరాజ్

౧. ప్రభుప్రాప్తి కొరకు నీకు నిజమైన జిజ్ఞాస యుండుచో, భగవంతుడే స్వయముగ గురురూపమున నీకుపదేశించును. కేవలము నీ వాయనను సంపూర్ణముగా విశ్వసించుటే ఆలస్యము.

౨. నీలోనున్న నీ అంతర్యామి స్వరూపుడగు పరమాత్మను నీవు మోసపుచ్చనిచో, లోకములో నిన్నెవడును మోసపుచ్చ లేడు. తెలిసియు చేయరానిపనులు చేయుటే నిన్ను నీవు మోసపుచ్చుకొనుట. వివేకము నాదరించకపోవుటే మోసము.

3. నీ అంతర్యామి స్వరూపుడగు గురుదేవుని ఆదేశానుసారము వర్తింపుము. నీ మనోవాక్కాయ కర్మలచే చేయరానిదేమియు చేయనిచో, ఇక చేయుటకు యోగ్యమగు సాధనలయందు కూడ అపేక్ష యుండదు. అపుడు నీవు కర్తవ్యాకర్తవ్యము లను రెండు బంధములనుండి ముక్తుడవై స్వయముగ నీలో నీవు స్థితుడవగుదువు. నీ ప్రియునితో ఏకమగుదువు. నీలో ఏదో ఒక కర్తవ్యము నిలచియుండుటచేతనే నీకు కర్తవ్యాభిలాష రేకెత్తుచుండును.

౮. లోకులు ఆయనవైపు చూడక, సంసారమువైపు చూచుచు సంసారిక వస్తువులందాసక్తులగుదురు. అందుకే వారు ఆయన ప్రాప్తించడను భ్రాంతిలో పడియుందురు.

౯. నీవు నీ కొరకు దేని నాసింపకుము. ఇచ్ఛారహితుడవు గమ్ము. ఇతరులపై నీకు అధికారము కలదని తలంపకుము. ఇచ్చుట, ఇచ్చుటే యుండవలయును కాని, పుచ్చుకొనుట యుండరాదు.

## ౭౩ శ్రీ ఓంకారానంద్‌జీ

౧. తన గృహమును సుందరముగ అలంకరింపదలంచి ఆ గృహమునే విక్రయించి అలంకారమునకు దగిన సుందరమైన వస్తువులను కొనునట్టి మానవునివలె ధనమువలన సుఖము కలుగునని ఆసించి ఆ ధనముకొరకు ప్రయాసపడు మానవుడు తన చిత్త శాంతిని కోల్పోవును.

౨. ఓ మానవా! నీ విచారశక్తిచేతనే నీ జీవితమును, సంసారమును, విశ్వమును సృష్టింతువు. లేక నశింపజేయుదువు. నీ ఇచ్ఛా విచారములే నీ జన్మకు కారణములు. లోకమున కనుపించు సుందరానందములు, కురూపస్వరూపములు, సుఖదుఃఖాది పరిస్థితులన్నియు నీలోనే నిండియున్నవి. బయట వెదకుట వెర్రితనము. ఈ సర్వమునకు నీవే కారకుడవు.

## ౭౪ సంతు సరయూదాస్‌జీ మహారాజు

[వీరు గుజరాతుదేశములో గొప్ప ధనవంతులు. మహా ఉదారస్వభావముగలవారు, పరోపకారులు. విరక్తిజెంది సర్వమును త్యజించి నిశ్చింతులైరి. కౌపీనముదప్ప వీరియొద్ద మరేమియు లేకుండెను.]

౧. చెట్లను, కొమ్మలను నరకుట, వాటి ఆకులను త్రెంచుట కూడ హింసయే. ఇది ఆత్మవిరుద్ధము. పరదోషముల జూచుటయే పరనింద యగును.

౨. నీ యొద్ద రెండు బట్టలకంటె అధికముంచుకొనరాదు. నీది అనునది ఏదియు నీ వద్దనుండరాదు. దేహాభిమానమే దుర్గతికి మూలము. రేపటికై చింతింపక ఆపూట పొట్టకు సరిపోవునంతే సంపాదింపుము. ఇతరులపై ఆధారపడకుము. సంగ్రహము మహా పాపము. ఏ వస్తువు, ఏ వ్యక్తి వలన మోహము జనించునో అదే మాయ. సర్వమును త్యజించి కేవలము భగవంతుని స్మరించుటే ఉత్తమము.

3. సాధువు, సాధకుడు ఎప్పుడును జిహ్వారుచికై విషయ భోగములందు జిక్కరాదు. రుచిగల పదార్థములను రుచికొరకు తినరాదు. నెయ్యిపూయని సాధారణమైన రొట్టెలను మితముగా తినవలయును. రుచిగల పదార్థములు లభించినచో, యితరులకు తినిపించవలయును.

౪. సాంసారిక సర్వఝంఝాటముల విడిచి భగవంతుని శరణు పొందుము.

## ౭౫ శ్రీ ఇవాంజెలీన్ బూథ్

ఈమె 1865 వ సంవత్సరములో లండన్ మహానగరమున జన్మించినది. ఈమె తండ్రి పేరు రెవరెండ్ విలియమ్ బూథ్. వీరు నిరాడంబరజీవి. బీదలకు, అనాథులకు, నిరాశ్రితులకు భోజనాలయాలు, అందరిని సన్మార్గులచేయుటకు ప్రబోధనాలయాలు నెలకొల్పి విధి విరామములేక సేవనొనర్చుచుండెడివారు.

ఇవాంజెలీన్ బూథ్ అట్టి వాతావరణంలో ఉంటూ పెరుగుతూ ఆమె జీవిత సాధనామహత్యాన్ని ఆకళింపు చేసికొంటూ ఉండేది. అంతరాత్మపిలుపు ననుసరించి జీవయాత్ర గడుపుచు తోటి బాలికలకు అవసరమగు పనులన్నిటిని స్వయముగా చేయుచు, జీవన్ముక్తికి సంబంధించిన బాలస్వప్నాలలో నిమగ్నమై ఇలా చేయడం ఆమె భావ్యున్నతికి నిదర్శనం.

మానవజీవితం భౌతికవాదం, ఆధ్యాత్మికవాదం అనే రెండు పక్షాలలో నడుస్తూ ఉంటుంది. అంటే మానవజీవితపు ఆంతరంగిక, బహిర్ముఖమైన సమస్త శక్తుల పరస్ఫురణ, లేదా వ్యక్తిత్వము ఆత్మల సర్వతోముఖ వికాసం పొందడానికే. అదే తన జీవితలక్ష్యంగా "ఇవా" నిర్ణయించుకొన్నది.

ఒకనాడు "ఇవా" తన ధనవైభవం, సుఖసౌకర్యాలు, విలువైన దుస్తులను పరిత్యజించి చినిగిన పాతగుడ్డలను కట్టుకొని పండ్లు అమ్ముకొనే ఇతర పిల్లలవలె "పికడిలీ" "సర్కస్"తో పువ్వులూ, అగ్గిపెట్టెలూ అమ్ముకొని జీవనోపాధి ఆర్జించడం ఆరంభించింది. క్రమక్రమంగా ఆమె దుఃఖాలతో సంఘర్షణ పడడం వాటిని నెట్టుకుంటూ ముందుకుసాగడం నేర్చుకుంటూ ఉండేది.

రోగులకు సేవచేయడం, ఆకలిగొన్నవారికి అన్నం పెట్టడం మొదలైన పనులలో ఆమె విసుగు విరామము లేక అత్యధిక సమయం సేవలోనే గడుపుతూ ఉండేది. హానిచేసినవారికి మేలు చేయుచుండెడిది.

ప్రపంచములో పాపుల దుఃఖం, వేదన, ఉత్పీడన మానవుని నైతిక పతనం, ఆదిగా గల మార్గాలలో మానవుడు చాలాదూరం పయనించాడు. వారి నుద్ధరించుటకై "ఇవా"కూడా వారితోపాటు చాలాదూరం పయనించింది. ఎన్నో అనుభవాలను పొందింది. ఆమెకు ఆత్మబలం అపారంగా చేకూరింది.

'ఇవా' తన సాహసం, ఉదారత ఓజస్సులతో, అంధకారంలో మునిగిఉన్న జాతి హృదయాలలో నూతన చైతన్యాన్ని మేల్కొల్పింది.

"ఇవా" ప్రతికూల పరిస్థితులలో ఎన్నడూ నిరాశ జెందడం కాని, అలసి ఆయాసపడడం కాని ఎరుగదు. ఆమె

అసాధారణమైన సాహసవంతురాలు. యౌవనమూ, ఆవేశమూ, అనే తన్మయతలో తన చిరకాల అభ్యస్త హాస్యజ్యోత్స్నా చంద్రికల్ని వికీర్ణం చేస్తూ, దౌర్భాగ్యమనేడి గాఢాంధకారాన్ని విచ్ఛిత్తి చేయడానికి ప్రయత్నించేది. ఆమె అడుగు పెట్టిన ప్రతిచోటా బల హీనులూ దుర్బలులైన పేద ప్రజానీకానికి అండదండలుగా నిలిచి పనిచేసింది. వారిలో ఆత్మశక్తి ప్రసారం చేసింది. సాధారణదృష్టి కోణంగల వ్యక్తులను అసాధారణ స్థాయికి చేర్చడానికి ప్రయత్నం చేసింది. ఆమె పతిత ప్రజానీకానికి వెన్నెముకయై పనిచేసింది. తిమిరాచ్ఛన్న వాతావరణంలో జారీతెన్నూ తెలియక తారాడే ప్రజాకోటికి "ఇలా" దీపస్తంభం లాంటిది.

## ౭౮. శ్రీ పురుషోత్తమ, నారాయణనాగర్‌జి మహారాజ్

౧. అపరిశుద్ధమైన మనస్సునుండి నివృత్తి నొందుట ముఖ్యము.

౨. హిందువుగాని, బౌద్ధుడుగాని, ఈసాయిగాని, ముసల్మానుగాని, వాడెవడేగాని, అది ఏ మతధర్మమేగాని అంతఃకరణ శుద్ధము కానిది అది ఎన్నటికిని సఫలత నొందనేరదు.

3. ఏకాగ్రత, నిస్పృహతలతో గూడిన ప్రార్థనచే భగవంతుని సింహాసనము కూడా కదలును. అనగా భగవంతుడు ప్రేమకు వశుడగును.

౪. ఈ లోకమంతయు ప్రకృతి పరివర్తనమే ననియు, నేను నిర్లిప్తుడను వీటన్నిటికిని సాక్షిమాత్రుడననియు ఏ క్షణము నీవు తెలిసికొందువో, ఆ క్షణమే నీవు జన్మమృత్యు బంధమునుండి ముక్తుడ వగుదువు.

## ౭౯ శ్రీ షహజాదారాం సభా

౧. స్వార్థపరుడవై నీ ఇంద్రియ సుఖముకొరకు ధర్మమును విడువకుము.

౨ ధనవంతులను, దరిద్రులను సమముగా జూడుము. బంధు మిత్రాదులందరి మమతను త్రెంచివేయుము. పరుల దోషములను పరిశీలింపకుము.

3. పాపమును ద్వేషింతువేని ఆత్మ జాగృతి జెందును. నీలో దాగియున్న పాపములను విచారించి, వివేకముతో తొలగింపుము.

౪. సంసారపు ప్రజలను పరీక్షించుటకు దుఃఖము గీటు రాయి వంటిది.

౫. సర్వము తెలిసియు. భగవంతునియెడ దృష్టినుంచని వాడు పాపాత్ముడు. స్వార్థమును విడువనివాడు ఈశ్వర ప్రార్థనకు కూడ అర్హుడు కాజాలాడు. ప్రార్థనకు మొదలు నిష్కపటివై నీ జీవితమును గురించి బాగా విచారించుకొనుము.

౬. మనస్సును యింద్రియముల బానిసత్వమునుండి తొల గించి ఈశ్వర విచారములో ప్రవేశపెట్టి ఆత్మసేవకై నియమింపుము.

౭. చావుకంటె మొదలు నీకర్తవ్యమును న్యాయముగా, ధర్మముగా పరిపూర్తిచేయుము.

౮. నీ మాటనే అందరు స్వీకరింపవలెనని ఆశింపకుము. ఎందుకన, అందరి స్వభావము లొకటిగావు. ఒకవేళ వారిమాట ధర్మబద్ధమగుచో, స్వీకరింపుము. ఆత్మవిరుద్ధమగుచో హఠము చేయక మౌనము వహింపుము.

౯. ధర్మముకొరకు ప్రపంచసుఖము లన్నింటిని విడిచి ప్రేమతో మెలంగుము, ప్రేమయే శత్రువును జయించును.

౧౦. నీ ధనమును విషయసుఖముల కొరకు వ్యయపెట్టక దరిద్రుల కొరకు, అనాథ శరణాలయములకు, విద్యాలయములకు, ఔషధాలయములకు వినియోగింపుము.

౧౧. ప్రపంచమున ప్రతిమానవుడు పనిచేయుటకే జన్మించి నాడు, కావున కష్టించే జీవింపవలయును కాని పరుల కష్టములపై ఆధారపడి జీవించుటకు హక్కు లేదు.

౧౨. ప్రపంచము బహురూపులతో నిండియున్నది. ఈ ప్రపంచపు అనిత్య భోగముల విడుతువేని శాశ్వతభోగములు వాటంతటచే లభించును.

౧౩. పరమాత్మ సదా సర్వత్ర సాక్షీరూపమున నున్నట్లు భావించి పాపకర్మములనుండి వైదొలగుము.

౭౮ శ్రీరాం నరేష్‌జీ

౧. సత్యాచరణయే నిజమైన సత్యనారాయణ వ్రతము. సత్యమును ఈశ్వర భావమున ఉపాసింపవలయును.

౨. ప్రపంచములోని ప్రతి జీవిని సత్యస్వరూపుడగు సత్యనారాయణుని సాకార దేవమూర్తులనుగా దలంచి నిర్మల హృదయముతో వానికి సేవచేయుము.

౩. దయామయుడవై పాపరహితుడవై, రాగ ద్వేషములు లేక జీవితము గడుపుచు సృష్టిలోని ప్రతి అణువును ప్రేమింపుము.

౪. జ్ఞానము బడసి, ఆత్మస్థితుడగు ప్రభువును తెలిసికొని లోకకల్యాణమునం దిచ్ఛగలవాడవై ప్రాప్తించిన జ్ఞానమును ప్రచారము చేయుచు ప్రతిజీవికి సంతోషమును, సుఖమును కలుగజేయుము.

౫. ప్రాప్తించిన పదార్థములను అందరికి పంచిపెట్టి మిగిలిన దానిని భగవత్ప్రసాద రూపమున గ్రహింపుము.

౬. మానవ జీవిత ముఖ్యోద్దేశము తినిపించి, త్రాగించి ఇతర జీవులను సుఖపెట్టుటే కాని, పశువులవలె తిని, త్రాగి, విలాస పడుట కాదు!

౭౯ శ్రీ శివానందజీ

౧. కొందరు ఉపవాసము చేయుచును, మనస్సులో వాసన లుంచుకొందురు. వాసనాయుక్త ఉపవాసము మనస్సును, శరీరమును దుర్బలముచేయును. వాసనచే మనస్సు ఉపవాసముచే శరీ

రము బలహీనమగుటే గాక ఉపవాస వ్రతముకూడా నిష్ప్రయోజన మగును.

౨. మృష్టాన్న గరిష్ఠభోజనముచే ఇంద్రియముల తృప్తిపరచి శరీరమును రోగముపాలుచేయుదురు. విషయసుఖముల కొరకు "నాది", "నీది" అను వివాదములో మనస్సును దుఃఖములో, బుద్ధిని అంధకారములో బడవేయుదురు.

3. అంతఃకరణము శుద్ధమగునేని ఆ నిర్మలాంతఃకరణము యొక్క ధ్వని జీవిత మార్గములో ప్రకాశపుంజమై తోడ్పడును.

౪. మనస్సు నిర్మలము కాగానే నిర్భయత్వము చేకూరును. మనస్సు వశమగుటకు మూడు ఉపాయములు కలవు. 1) వ్రతము, 2) దానము, 3) తపము.

1. వ్రతముచే మనస్సు సంయమ మగును. ఉపవాస కాలమున రుచిగల భోజనముపై ఇచ్ఛయుండరాదు.

2. దానము చేయు చుండవలెను. తన వ్యయమును తగ్గించుకొని పరోపకారము చేయవలెను. కాని భోగేచ్ఛ యుండరాదు. దీనివలన మనస్సు సూక్ష్మమగును.

3. తపము, శరణాగతి, ప్రార్థన, ప్రభువులలో లీనమగుటే స్థూలమునుండి సూక్ష్మమువైపు పోవుట లీనముచే విచారము శూన్యమగును. ఆ శూన్యములో ఆకాశముత్పన్నమై ఆ ఆకాశమున ప్రభుశక్తి ప్రకాశించును. వ్రతముకంటె అధికమైనది దానము. దానముకంటె అధికమైనది ప్రార్థన. వీనిద్వారా మానవ జీవితము సార్థకమగును.

౫. పంచభూత తత్త్వములపై భోజనవిధి ఆధారపడి యున్నది.

1. అన్నము పృథ్వీ తత్త్వాంశము.

2. పాలు, కూరగాయలు జల తత్త్వాంశము.

3. సూర్యకిరణముల (రశ్మి) చే పక్వమగు ఫలములు అగ్ని తత్త్వాంశము. కృత్రిమముగ పండించు ఫలములలో శక్తి యుండదు.

4. పాల, మెంతము, మూలి, సలాడ్, తులసి మొదలగు ఆకు కూరలు వాయు తత్త్వాంశము. చెట్లు ఆకులద్వారానే గాలి పీల్చును. కావున ఆకులలో వాయు తత్త్వము అధికముండును.

5. తుదకు ఆకాశ తత్త్వముండును.

౬. ఉపవాస వ్రతముచే కడుపు ఖాళీయై శూన్యముత్పన్నమగును. పృథ్వినుండి ఆకాశమువైపు పైకిపోవలెను, లేక స్థూలము నుండి సూక్ష్మమువైపు ముందుకు సాగవలెను. పృథ్వికంటె జలము, జలముకంటె అగ్ని, అగ్నికంటె వాయువు, వాయువుకంటె ఆకాశ తత్త్వము అధికబలము గలవి. కావున, పృథ్వి తత్త్వములగు అన్నము, రొట్టె, పప్పు పదార్థములను మెల్లమెల్లన తగ్గించుచు కూరగాయలను, ఫలములను ఆహారముగా తీసికొనవలయును. గరిష్ట, గట్టిపదార్థములను మిక్కిలిగ తినరాదు. మరి మరి తిన కూడదు. అన్నముచే దేహమునకు బలము చేకూరును. కాని శక్తి అధికముగా లభింపదు. శక్తికంటె బలము తుచ్ఛమైనది.

౭. కష్టపడి సంపాదింపకనే భుజించుట అనధికారము, ఆకలి లేనిది తినుట దేహమునెడ అత్యాచారమగును.

౮. దేనిని చూచుటవలన లోభము వృద్ధియగునో, దానిని చూచుటకంటె మించిన గొప్ప పాప మింకొకటిలేదు. దీనిని బాగా జ్ఞాపకముంచు కొనవలయును.

౯. సర్వభూతములను తనవలె తలంచి ఎవరికిని కష్టము కలిగింపరాదు. ఇట్టి భావనకు త్యాగమవసరము. త్యాగమునకు భోగముల విడచుట ముఖ్యావసరము. ఏ పదార్థముపై లోభము కలు

గునో, అదే ధనమగును. కావున ఏ పదార్థమందును ఆసక్తి నుంచ రాదు. దానిని నీదిగా భావింపక పరుల కుపయోగపడునట్లు ప్రవర్తిం చుటే నిర్లేపము. ఇదే త్యాగము. ఇదియే ఆత్మభావమును చేకూర్చుటకు సాధనము. దేనినైన నాదని తలంచి అభిమాన పడుటే అహంకారము. అహంకారమువలన, సన్మానేచ్ఛ కలుగును. దానిచే మానవుడు ఇతరులను అనాదరించి సన్మానము పొందుటకు సిద్ధపడును. ఈ కోరికచే తేజో తపములు రెండును క్షీణించును. కావున అందరు సమానులని భావించుటే పరమౌషధము. అపుడు మానవుడు తన అవమానము తన వలననే కలుగునని తలంచి శాంతుడగును. పరుడే లేనపుడు ఇక సన్మానావమానము లెవరికి ?

౧౦. ఎవని దృష్టి పరుల అవగుణముల వెదకుటయందు దగిలియుండునో, వాడు ఎట్టి ఉన్నతిని పొంద నేరడు. అట్టివారి దుర్గు ణములు వానిలో ప్రవేశించి స్థిరముగా నిలచియుండును.

౧౧. మానవుడు తాను అందరికంటె గొప్ప బుద్ధిమంతుడ నని తలంచుట వాని బలహీనత. ఇది మహా గొప్ప దోషము, మోసము.

## ౮౦ తపోమూర్తి స్వామి, రామదాస్‌జీ మహంతు

౧. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు అను ఈ అష్టాంగ యోగసాధనలు ముఖ్యము.

౨. 1. సత్య, అహింస, బ్రహ్మచర్య, అపరిగ్రహాదులను పాలించుట యమ మనబడును.

2. తప, శౌచ, సంతోషాదులను పాలించుట నియమమన బడును. తమ కర్తవ్య కర్మములను జేయుచు ప్రారబ్ధ కర్మానుసారము ఏది లభించునో దానితోనే సంతోషిం చుట, తమ తమ వర్ణాశ్రమ ధర్మములను పాలించుచు

శారీరక మానసిక కష్టములను సంతోషముగా సహించుట తప మనబడును. దానిచే అంతఃకరణము పరిశుద్ధమగును.

3. దేహమును చలింపనీక చక్కగా, స్థిరముగా కూర్చొని పరమాత్మయందు తను మనములను జేర్చినచో ఆసనసిద్ధి కలుగును. దానివలన శీతోష్ణాది బాధలు కలుగనేరవు. ప్రాణాయామాభ్యాసము యెట్లెట్లు పెరుగుచుండునో, అట్లట్లు వివేక జ్ఞానమును గప్పియుంచునట్టి తెర తెగి సూర్యప్రకాశమువలె ఆ జ్ఞానము ప్రకాశించును.

४. ప్రత్యాహారముచే ఇంద్రియములు అధీనములగును. ఇంద్రియము అధీనములగుటవలన ఏ సాధనము అవసరముండదు.

౬. బాహ్యాంతరములందు ఏదో ఒక స్థలమునందు చిత్తమును నిలుపుటే ధారణ మనబడును.

౭. ధారణయందు దృష్టియుంచుటే ధ్యానమనబడును.

౮. ధ్యానమందు మనస్సు లీనమగుటే సమాధి.

౯. 1. సత్యవ్రత పాలనమున వాక్సిద్ధికలుగును.

2. అహింసావ్రత పాలనమున తన చుట్టుప్రక్కలగల జీవులు ద్వేషభావమును విడచును.

3. బ్రహ్మచర్య వ్రత పాలనమున దేహేంద్రియ మనో బుద్ధులలో శక్తిసామర్థ్యములు పెరుగును.

4. అపరిగ్రహమువలన విషయ విరక్తికలిగి వైరాగ్యము జనించును. దానిచే మనస్సు సంయమమై జ్ఞానోత్పత్తి కలుగును.

5. నియమపాలనచే పవిత్రత, ప్రసన్నత, ఏకాగ్రత, ఇంద్రియ నిగ్రహము చేకూరును. దానిచే ఆత్మసాక్షాత్కారమగును.

6. తపస్సువలన పాపములు నశించి దివ్యదృష్టియు, పరకాయ ప్రవేశశక్తియు ప్రాప్తించును. అజ్ఞానము, అహంకారము, రాగము, ద్వేషము, జీవితేచ్ఛ ఈ అయిదు క్లేశములను తొలగించుటే యోగముయొక్క ముఖ్యోద్దేశ్యమని మహర్షి పతంజలి యోగదర్శనమున వ్రాసెను.

## ౭౧ శ్రీ భాగమల్‌జీ శేని

౧. ఓ మానవుడా! నీ జీవితము ప్రారబ్ధానుసారము నడచును. బంధమోక్షములయొక్క విచారములన్నియు పడుగుపేకలవంటివి.

౨. ఈ దేహమే నేనని భావించుట దుఃఖము. దేహభావమున్నంతవరకు దుఃఖము తప్పదు.

3. ఆత్మజ్ఞానమును పొందుట, మనోమాలిన్యమును తొలగించుట అత్యవసరము.

ర. నీ బంధుబాంధవులకు నీవు లోబడితివా, వారి విషయసుఖములకొరకు ప్రపంచపు బరువునంతటిని నీపై పడవైచి వారి ఇచ్ఛానుసారము నీతో చాకిరి చేయించుకొనెదరు. అది నీ ముక్తికి ప్రతిబంధకము. ఆ విచారములే నీ అవసానకాలమున నీకు జ్ఞప్తికి వచ్చును. అది మరుజన్మకు కారణమగును. కావున దేహవిచారమును విడిచి సదా ఆత్మవిచారము చేయుచుండుము.

## ౭౨ స్వామి రామతీర్థ నాగరికుల ప్రశ్నోత్తరములు

౧. నాగరికుడు : స్వామీ! ఆసియాఖండపు సోమరితనాన్ని మీ రెందుకు అమెరికాలో దిగుమతి చేస్తున్నారు? వెళ్ళి ఏదైనా మంచిపని చేయండి. అనిన

రాముడు: ఓ నా ప్రియాత్మా! మంచిపని చేయమంటే, గుంపులుగట్టి జనులు లోకంలో ఒకండ్ల నొకరు విరగతొక్క

కుంటూ ఆశా దాహంతో అనవరతం చేస్తున్న సంరంభమనేకదా నీ అభిప్రాయం? నన్నూ నా రామునీ ఏకాంతంగా ఉండనీ.

సోమరితన మంటున్నావా! ప్రాచ్యదేశపు సోమరితనమా! సోమరితనమంటే ఏమిటి? సంప్రదాయ మనే బురదగుంటలో దిగబడి కదలలేకపోవడం, లోకాచార వ్యవహారములనే ప్రవాహంలోపడి కొట్టుకొనిపోవడం, ఆడంబరాలనే అగాధకూపంలో పడి అల్లాడడం, స్వామ్యబుద్ధి అనే తటాకంలోపడి తన్నుకులాడడం, దైవంకొరకు ఉపయోగించవలసిన కాలాన్ని ద్రవ్యంకొరకు దుర్వినియోగం చేస్తూ మంచిపని చేస్తున్నామని భ్రాంతిపడడం- ఇదంతా సోమరితనం కాదా! నీ జీవితాన్ని పరాభిప్రాయాలకు బానిసగా చేసి, వాక్స్వాతంత్ర్యం మాట అలా ఉంచి గుడ్డలు కట్టుకోవడంలో, తినడంలో, నడవడంలో, నిద్రపోవడంలో, నవ్వడంలో, చివరకు ఏడవడంలోగూడా స్వేచ్ఛలేకుండా బ్రతకడం సోమరితనం కాదా!

నీ బ్రహ్మత్వమును పోగొట్టుకోవడం సోమరితనం కాదా! ఈ హడావుడీ ఆందోళనా దేనికి? ఈ తొట్రుపాటూ, తొందరా దేనికి? ఈ దిగుళ్ళూ దీనత్వాలూ దేనికి? ఈ ఒకరి నొకరు త్రోసుకొని విరగద్రొక్కుకోవడం దేనికి? ఒకనికంటె ఒకడు హెచ్చుధనం ప్రోగు చేసికోవడానికే కదా! ఒకనికంటె ఒకడు హెచ్చుభోగా లనుభవించాలనే కదా! ఈ విషయోప భోగాల వెంటబడి పరుగెత్తడంలో సుఖం లేదుసుమా!

౨. ఓ ప్రియ పరాభిప్రాయ దాసులారా! మీ నైజానందాన్ని ఎందుకు మీరు త్రోసివేసి కొంటున్నారు? ఈ ప్రకృతి సహజానందాన్ని మీ రెందుకు అనుభవించరు? నిజంగా మీ దేహంలోని రక్తం వీటివల్లనే కదా నిర్మితమైంది! నాగరక మానవులు వర్ణవ్యవస్థలో, నిబద్ధులై యున్నారు. సోదర మానవుల నుండి వేరుపడి, విశాల ప్రకృతినుండి, సహజ జీవితమునుండి దూరమై, నరకబిలాల వంటి అంధకార గృహాలలో, తమ్ము

తాము బంధించుకొన్నారు. ఈ విశాల ప్రపంచము నుండి తమకు తామే బహిష్కృతులై సమస్త సృష్టినుండి తమకు తామే వేరుపడి వృక్షజంతు దశలకంటె న్యూనమైన దుర్దశలో తమ్ము తాము పడవేసికొన్నారు. తమకు తాము ఆపాదించుకొన్న స్వార్థిక్యాదులవల్ల దురభిమానాలవల్ల పాషాణహృదయులై గడ్డగట్టిపోయారు. దయవహించండి!

3. మిత్రులారా! మీ మీద మీరు దయ వహించండి! దురాశతో దుస్తంత్రాలతో, పేదల నోళ్లుగొట్టి ఆర్జించిన మీ ధనం రోగనిలయములైన హోటలు విందులకూ, పానశాలలకూ ఉపయోగిస్తుంది. మీకు పాలిపోయిన ముఖాలను, లౌకికాచార దాస్య దృక్కులనూ ప్రసాదిస్తుంది. కృత్రిమాలంకరణలతో కూడిన గృహాలనెడి శవపేటికల్లో మిమ్ము బంధిస్తుంది. సమస్త విధములైన శారీర మానస దుర్వ్యసనాదులవల్ల రేగిన అశాంతికి అనవరతం మిమ్ము గురిజేస్తుంది. ఈ రభసంతా దేనికి- ఆత్మవంచనకే కదా! స్వయం పతనానికే కదా! ఈ మిథ్యా భోగాలకొరకు నీ నిజమైన ఆనందాన్ని వదలుకోబోకు!

౪. జీవిత భద్రతకోసమని వెండిబంగారాలు కూడబెట్టడంలో నీ జీవితాన్ని వృథాచేసికోబోకు. కాలాన్ని వ్యయంచేసి ధనాన్ని సంపాదించి లక్షాధికారి అవడంవల్ల నీ జీవితానికి భద్రత చేకూరుతుందా? ఓ భ్రమపడిన అమృతుడా! క్షణికసుఖాలకోసం రాత్రింబవళ్లు రభసపడుతూ జీవితాన్ని వ్యయంచేసికోవడం దేనికి?

౫. ఓ ప్రియమైన ఆడంబర మానవులారా! ఆర్యాదర్శమైన సన్యాసం (సర్వసంగపరిత్యాగం) మీకు సోమరి నిద్రగా, పగటి కలగా కనబడుతున్నది. జాగ్రతవహించండి! మిమ్మలను పునాదులతో కదలించి, మీ దురవస్థను కన్నులకు కట్టినట్లు చూపించగల కాలపరిపక్వదశ ఆసన్నమైంది. ప్రేమ ప్రేరితమైన పరి

త్యాగత్వంతో భాసించని నాగరక మానవుడు ఎక్కువ అనుభవ శాలియైన తెలివిగల ఆటవికుడు మాత్రమే.

నాగరక ప్రపంచములోని తళుకుబెళుకులకు, కృత్రిమ శోభలకూ, ఆచార వ్యవహారాలకూ, ధనోన్మాదానికీ - వ్యామోహితులు కాకండి. ఇవి నిరర్థకములైనవి. అగ్నిపరీక్షకు ఏమాత్రం నిలువలేక భస్మీభూతమైనవి. మానవకోటిలో సగభాగం, వస్తువులతో మాడి మసియైపోతున్నది. మిగతా సగం, వృథావ్యయాలతో, అనవసర గృహోపకరణాలతో, సెంటు సీసాలు, నటనలు, టాకు టీకులు, రకరకాల దుర్వ్యసనాలు, అన్యాయార్జితమైన సంపదలు ఈ మొదలైనవాటితో అస్వాస్థ్య జీవితాన్ని గడుపుతూ క్రుళ్ళిపోతున్నది.

ఒకదాని వ్యయంతో ఒకటి నిర్వహింపబడితే తప్ప, మానస పరిశ్రమగానీ, శరీర పరిశ్రమగానీ, దీర్ఘాయురారోగ్యాలను కలిగించదు. కాని నేటికాలపు ప్రపంచంలో, కొందరు దేహపరిశ్రమవల్ల చావులాంటి బ్రతుకు బ్రతుకుతున్నారు. మరికొందరు మానసికమైన అధిక శ్రమవల్ల నశించిపోతున్నారు.

౬. ఈ జగతిలో "ఇది నాది" అని ఏ వస్తువునందైనా మమత్వదృష్టి గలవాండ్లే స్వయంకృతాపరాధులైన చండాలురు. ఏ వస్తువునందైనా స్వామ్యదృష్టి గలవాండ్లే నిజమైన శూద్రులు. ఏ వస్తువునైనాసరే - ఇది నా సొంతం అనుకున్నవాండ్లే తమ్ము తాము అంధకార కారాగారాల్లో బంధించుకొన్న మూర్ఖులు. వస్తువులను కూడబెట్టుకొనేవాండ్లే శోచనీయమైన క్షుద్రక్రిములు. ఈ ఆత్మహంతకులలో కొందరు సంపద లనే కల్మషధూళిలో పడి ఉక్కిరిబిక్కిరవుతూ మేము రాజులమనీ, అధ్యక్షులమనీ చెప్పుకొంటున్నారు. మరికొందరు అజ్ఞానమనే అంధకారకూపంలో పడి, మేము పండితులమనీ, తత్త్వవేత్తలమనీ చెప్పుకొంటున్నారు. మరికొందరు దౌర్బల్యమనే బురదగుంటలో దిగబడి, మేము బలవం

తులమని ఎంచుకొంటున్నారు. ఇట్లు అజ్ఞానపు అట్టడుగులో పడి, తమ పరిహాసాస్పద దుర్దశకు పరితపించడానికి బదులు, స్వాతిశయముతో విర్రవీగుతూ - స్వయంసమ్మోహితులై మెట్టనేలపై చేపలు పట్టడానికి ప్రయత్నిస్తూ - తమ ఆస్తిపాస్తులనే, ధనధాన్యసంపదలనే పగటికలల్లో పలవరిస్తూ, పరితపిస్తూ నానాయాతనలు పడే ఈ ఆత్మహింసాపరాయణులైన విచిత్ర భిక్షుకులకు విజ్ఞానమూ, విముక్తీ అవసరం. స్వాతిశయాలు, ధన జన విద్యాధికారభిమదాహంకారములు నశించుగాక ! సమానత్వమే సౌఖ్యానికి పునాది. అనాగరకమైన దురాశ, పాశవికమైన పరిగ్రహపరాయణత, మృగస్వభావరూపకమైన నాది నాదని కూడబెట్టుకొనే మమత్వదృష్టి - మానవులను నిరంతరం ఆవేశంలో, ఆందోళనలో, ఆకులత్వంలో, (తొట్రుపాటులో) ఉండేలాగు చేస్తుంది. స్వాతిశయ, దురాశా సన్నిపాత జ్వరం శమిస్తుంది గాక! నీ వెంతగా ఒక వస్తువును 'ఇది నాది' అని పట్టుకొంటావో, ఆ వస్తువు అంతగా నిన్ను "వీడు నా బానిస" అని పట్టుకొని బంధిస్తుంది" అనే కఠోరసత్యం, ప్రతి మానవుని కర్ణకుహరాల్లో ప్రతిధ్వనిస్తుందిగాక !

౭. ఓ సత్యాన్వేషీ! నాగరికతయొక్క ఒత్తిడికి లోబడిపోకు. నీ చుట్టూ ఉన్న లోకపునడతకు కట్టుబడకు ! అభ్యుదయజాతులనబడే వాటి పైపై మెరుగులకు, ఆడంబరాలకు మోసపోకు. అభివృద్ధిని సూచిస్తూ వాండ్లు చెప్పే సమాచారాలూ సంఖ్యలూ (లెక్కలూ) కట్టుకథలని గుర్తించు. వాండ్లనిక్కమైన రొక్కమంతా నిలువక ఉఫ్ అంటే గాలికి కొట్టుకొనిపోయే వగుడాకుల కట్ట అని గుర్తించు. ఇరవయ్యో శతాబ్దంలో, అభ్యుదయ జాతులు తమ ప్రభుత్వ రూపాలనూ - జీవిత పద్ధతులనూ - తప్పక మార్చుకొని, వైదాంతిక స్వాతంత్ర్య సూత్రాలపై పునర్నిర్మించుకొనే రోజులు సమీపిస్తున్నవి. మమకార రూపకమైన స్వామ్యదృష్టిని పరిత్యజించడంలోనే వైదాంతికమైన సన్న్యాస తత్త్వమును పరిగ్రహించడం

లోనే జాతులయొక్క వ్యక్తులయొక్క విముక్తిమార్గం గోచరిస్తున్నది. ఇంతకంటే వేరొకమార్గం లేదు.

పాశ్చాత్య నాగరక దేశా లన్నిటిలో ధనాశా దాహం తీవ్రంగా ఉన్నది. స్వామ్యభావ స్వప్నపీడితమై ఉక్కిరిబిక్కిరి అవుతున్న శిశుకోటిని త్వరలో - అతి త్వరలో జాగరితం చేయగల దేశీయశక్తులు తీవ్రంగా పనిచేయసాగినవి. సన్న్యాసరాజ్యము స్వాతంత్ర్యరాజ్యము ప్రపంచానికి శుభాన్ని చేకూర్చనున్నది.

## ౭౩ శ్రీరాం రాంజీ మహారాజ్

[శ్రీ రాం రాం మహారాజుగారు, అహమదాబాద్ జిల్లాలోని, ప్రాంతిజ మను గ్రామమున, ౧౩ అక్టోబరు ౧౮౯౦ వ తేదీన బ్రాహ్మణ కుటుంబమునందు జన్మించిరి. బాల్యమునుండియే భక్తి, దయా దాక్షిణ్య స్వభావముగల వారుగా నుండిరి.]

౧. ఓ మిత్రులారా! అధికముగా చదివి యేమి చేయుదురు? ఇదివరకు మీరు చదివిన దానిని, వినిన దానిని మీ ఆచరణలో పెట్టుడు. మనోవాక్కాయ కర్మలచే అహింసావ్రతమును పాలించనంతవరకు, చిత్తమును విషయవాసనల నుండి తొలగించనంతవరకు దయా, దాన, ఉదారాది, మిత్రులను ప్రేమింపనంతవరకును, కామ క్రోధ లోభ దోష దంభాది శత్రువులను మీ అంతఃకరణములనుండి తొలగించనంతవరకును మీకు ప్రేమ లభించుట దుర్లభము.

౨. సోదరులారా! ప్రేమ భగవత్స్వరూపము. కావున, ఏకాంతములో నిశ్చలముగా నివసించి అంతఃకరణమును శుద్ధిపరచి, లోకవాసనలను త్యజించి, బాలస్వభావము గలవారలై భగవంతుని స్మరింపుడు.

3. ఓ స్నేహితులారా! ఏమి? మీ బుద్ధిని తాకట్టు పెట్టితిరా? దరిద్రులు, దీనులు, దుఃఖితులు, కష్టపడుచుండుట, చూచుచు కూడ వారివైపు దృష్టి నుంచక తమ స్వజనులకై అత్యంత కష్టము

లను పొందుచు, ధనమును సంపాదింతురు. కాని స్వజనులు మృత్యు సమయమందును, పరలోకమందును, సహాయపడనేరరు. సాధు, సత్పురుషుల, అనాథుల సేవయు, భగవద్భజనయు మీకు సహాయ పడును. ఇదే మీ సంపత్తి. ఇదియే మీ పరమవస్తువు. తక్కిన ఆస్తి నంతయు మీ స్వజనులే అపహరింతురు. దీని ఫలితము కేవలము మృత్యువు, మరణాంతమున నరకము.

౪. భగవంతుని సంపూర్ణముగా విశ్వసించి, ఆయన యందు భారమువైచి నిర్భయుడవు కమ్ము. రొట్టెతునుకలకై ఎవరిని యాచింపకుము. లేదని చింతింపకుము.

౫. నీ అమూల్య సమయమును, భోగవిలాసములకై వ్యర్థ పుచ్చక, భగవత్స్మరణకై ఉపయోగింపుము.

౬. సోదరా! భోగవిలాసములు నరకములోను లభించును. ఇచ్ఛలేకున్నను దుఃఖములు సంభవించునటులే సుఖములుకూడ సమయానుసారముగను సంభవించును. కావున ఈ రెంటిని విడిచి సచ్చరిత్రుడవు కమ్ము. నిర్మలాంతఃకరణ కలవానికే భగవత్ప్రాప్తి కలుగును.

౭. మొదట వాణిని నిర్బంధించి మౌనము వహించుము. నీ నేత్రములు పవిత్రమునే చూడనిమ్ము. నీ చెవులు పవిత్రముననే విన నిమ్ము. నీ అంతఃకరణములో క్రోధమును ప్రవేశింప నీయకుము. మనస్సును ఇంద్రియములను నియమములో నుంచుటకై, ఈ నియ మముల నాచరించు టావశ్యకము.

౮. మిత్రమా! నీవు బిచ్చగాడవు గాకుము. ఎవడు విషయ భోగియో వాడే బిచ్చగాడు. అనాసక్తుడే చక్రవర్తి. ఆసక్తిగల వాడు చక్రవర్తియైనను, వాడు బిచ్చగాడే!

## ౮౪ స్వామి కేశవానందజీ అవధూత్

౧. ఓ మానవుడా! నీ తండ్రి, తాతలను నీవు చూడ కున్నను, నీ స్వజనుల వలన, ఇతరుల వలన విని ఎట్లు నమ్మ

చున్నావో, అటులే నీవు ఈశ్వరుని చూడకున్నను, ధర్మశాస్త్రము లను, మహాపురుషుల వచనములను విశ్వసించి ఈశ్వరుని నమ్ముము. సమస్త జీవుల హృదయములలో అంతర్యామి రూపమున ప్రకాశించుచున్న పరమాత్మయే అందరికీ తండ్రి. అతడే జీవస్వరూపుడు. సర్వసమర్థుడగు అట్టి పరమాత్మను విడిచి, విషయసుఖముల కోరుట వ్యర్థము.

౨. సగుణ, నిర్గుణములు రెండును ఈశ్వర స్వరూపములే! ఈశ్వరుడు లేనిది నేను, నీవు అనున దేదియు ఉండదు. నామ రూపము లన్నియు అబద్ధములే! అస్తి, భాతి, ప్రియము ఈశ్వర స్వరూపములే. కేవలము సచ్చిదానందుడగు ఈశ్వరుడే సత్యము.

3. ఈశ్వరప్రాప్తి గలవాడే గుణాతీతుడు. అతనికి సగుణ నిర్గుణ భేదము లుండవు. బ్రహ్మవేత్త తన పరమానంద సుఖమహిమను వాక్కుతో వర్ణింపలేడు.

## రా॥ సంత్ గంగాతీర్ నివాసి

౧. ఈ సృష్టిలో ఈశ్వరునకు భిన్నమైన దేదియు లేదు. ఈ జగత్తునకు ఉపాదానకర్త ఈశ్వరుడే. అన్నిరూపములుగా, తానే మారి జగత్తును రచించును.

౨. ఈ బ్రహ్మాండమంతయు ఈశ్వరుని స్థూలశరీరము. ఈ సంపూర్ణమైన సమిష్టి సూక్ష్మశరీరము ఈశ్వరుని యొక్క సూక్ష్మ శరీరము. మాయ, ఆయన యొక్క కారణ శరీరము. ఈ మూడు శరీరములలోనే సమస్త వ్యష్టిశరీరములును, ఈ సర్వ ప్రపంచమును గలవు. ఈ వ్యష్టిశరీరము లన్నిటిలో ఈశ్వరుడు అనుగతుడై యున్నాడు.

3. భగవంతుడు సాధకునికి సహాయము చేయుచుండును. ఎవరి సహాయము లేనపుడు భగవంతుడు సాక్షాత్కారరూపమున సేవచేయును. అహంభావము, ఇతరసహాయము ఉండునపుడు భగ

వంతుడు కేవలము సాక్షిమాత్రుడుగా నుండును. ఈశ్వరునియెడ సంపూర్ణ విశ్వాసముగల భక్తునకే యిది సాధ్యపడును.

౪. దేహమే తానను అహంభావమును త్యజించి, సర్వ భూతములకు కర్తయగు పరమాత్మను తెలిసికొనువాడే ముక్తుడు.

౫. భోగపదార్థము లన్నియు నశించునవిగా భావించి, వాటి యందలి దోషములను తెలిసికొని, అనాసక్తుడై ధ్యానపరాయణు డగు వానికి, ఈ జన్మలోనే ఈశ్వర సాక్షాత్కారమగును.

## ౮౭. స్వామి నగమానంద్‌జీ సరస్వతి

౧. ఈశ్వరుని శక్తి యిట్టిదని ఇతరులకు విశ్వాసము కలిగించుటయు, లేక తర్కప్రమాణముల ద్వారా ఈశ్వరశక్తిని నిరూపించుటయు సంభవమని తోచదు.

౨. సదాచారము, ఆత్మానుసంధానము లేనిది, లేక ఈశ్వరుని విశేషకృప లేనిది శ్రద్ధ, విశ్వాసము, సత్సంగము అనునవి ఉత్పన్నము కానేరవు.

## ౮౮. స్వామి భూలానాథ్‌జీ మహరాజ్

౧. జీవుని స్వాభావికమైన పరమానందవాంఛయే ఈశ్వరుని అస్తిత్వమునకు ముఖ్యప్రమాణము. ఎందుకన, లోకములోని యే వస్తువైనను ఆనందము నివ్వజాలదు. ఈశ్వర సత్తయుక్తుల ఆధారమున లేదు. ఈ సమస్త పదార్థములు ఈశ్వరాధీనములై యున్నవి. ఆ ఈశ్వరుడు సృష్టిలోని ప్రతిపరమాణువు నందును స్థితుడై "నేనున్నాను, నేనున్నాను" అని చాటుచున్నాడు. కాని మనము నామరూపములను చూచి అతనిని మరచిపోవుచున్నాము. ఎట్లు సినిమాలోని చలనచిత్రములను చూచు నిమిత్తము వెలుపలి వెలుతురు రాకుండుటకు కిటికీలన్నియు మూసియుంచెదరో అటులే హృదయములోని ఇంద్రియముల బాహ్యప్రకాశమును మూసివేసితి మేని భగవత్స్వరూపము గోచరమగును.

౨. ఓ సోదరా! ప్రప్రథమున హృదయమును పవిత్రము చేసికొనుము. నమ్రత, ప్రేమ, విశ్వాసము, ప్రార్థన, సహనశీలత, ఆత్మసమర్పణ, మొదలగు వానిని మొదట అంధవిశ్వాసముతో ఆచరించితివేని అపుడు హృదయము పవిత్రమగును. హృదయము పవిత్రమైన పిమ్మట ఈశ్వర సత్తాను తిరస్కరించువాడు, స్వయమే అట్టి సత్తాను స్వీకరించువాడు ఆస్తికుడుగా మారును.

౩. నీలో ఇచ్ఛలు లేనంతవరకు నీవు రాజువే! ఇచ్ఛకు దాసుడవైతివా జగత్తునకు దాసుడవు కాక తప్పదు. కావున ఇచ్ఛలను గొప్ప సరళభావముతో విడువుము. లేదా ఈశ్వరార్పణ చేయుము.

౪. ప్రతిరోజు ఏకాంతములో, మౌనముగా, నిస్సంకల్పుడవై కూర్చుండెదవేని ఈశ్వర తత్వము నీకు బోధపడును.

౫. మహాత్ముల వచనములను నమ్మి ఈశ్వరుడు కలడని విశ్వసింపుము. ఇట్టి ధారణచేతనే నీ జీవయాత్ర గడుపుట నేర్చుకొనుము. ఎల్లప్పుడు ఆయనను స్మరించుచుండుము. అవసర సమయమున ఆయనను పిలువుము. ఆనందసమయమున అతనికి ధన్యవాదము లర్పింపుము. చివరకు, నిన్ను నీవు అతనికి అర్పించుకొని సుఖదుఃఖముల విచారమును విడువుము.

## లాలా మహాత్మా బాలక్‌రాం వినాయక్‌జీ

౧. ఈశ్వరుడు ఇంట, బయట అంతటను, అణు పరమాణువులలోను, చరాచరములందును విరాజమానుడై యున్నాడు. కావున మిక్కిలి వినయ విధేయతలతో ప్రవర్తింప వలెను.

౨. ప్రేమయే ఈశ్వరుడు. ఈశ్వరుడే ప్రేమయని లోకులు ఆలాపింతురేకాని, ఆచరింపరు. విశ్వాసప్రేమలులేనిచో సాంసారిక వ్యవహారములుకూడ నిర్వర్తించుట అసంభవము. కావున ఈశ్వరునియందు సత్యమైన ప్రేమ కలిగియుండవలెను.

## ౮౯. శ్రీ రాందాస్‌జీ గౌడ్

౧. ఈశ్వరవాదులు, సగుణ నిర్గుణములను రెండు విధములైన ఈశ్వరోపాసనలు చేయుచుందురు. సగుణోపాసన సిద్ధాంతమును తెలిసికొనుట అత్యంత కఠినము. కాని నిజమునకు చాలా సులభమైన విషయము, నిర్గుణోపాసన సిద్ధాంతము తెలిసికొనుట కఠినముకాదు. కాని దాని నిర్వహణ మాత్రము అత్యంత కఠినము. నిర్గుణోపాసకుడుకూడ పరమాత్మని సత్తానుభవమును చివరదశలో పొందును. కాని ఏ అనుభూతి సగుణోపాసన యొక్క సుగమ మార్గములోకూడ దుర్లభమో, అది నిర్గుణోపాసన యొక్క కఠిన మార్గములో మరింత దుర్లభముగా నుండును. మరియు సమాధి అవస్థయొక్క అనుభూతికూడ అవర్ణనీయ, అనిర్వచనీయముగా నుండును. అయినను ఒకసారి ఇటువంటి అనుభవము కలిగెనేని మరల తన కొరకై చేయవలసిన దేదియు మిగిలి యుండదు.

౨. సగుణోపాసన అనేక విధములుగా నుండును. సాకారోపాసన చేయువాడు ఏదో ఒక భగవదాకారమును కల్పించుకొని, దానిని ధ్యానించుచు దర్శనముకూడ పొందును. ఇట్లు ప్రత్యక్ష దర్శనము పొందినవారు అనేక భక్తులు కలరు.

## ౯౦. శ్రీ జయకాంత్‌జీ మహారాజ్

౧. తన కార్యములను తాను చేసికొనుటే ఆత్మనిరీక్షణము. ఎవడెంత అయాచకుడో, లేక ఆత్మనిర్భరుడో వాడంత మహానుభావుడు. అతనికి ఎవరితోను ఎట్టి భయము ఉండదు. పరుల ప్రాధేయపడనవసర ముండదు. ఎవరి నేది యాచించినను వారి దృష్టిలో మనము హీనుల మగుటయే కాక, వెంటనే మన ఆత్మ విశ్వాసమునుకూడ కోలుపోవుదుము. ఇతరులపై ఆధారపడువాని శక్తి నశించి పరాధీనుడగును. కావున యాచింపకుము.

౨. ప్రతి ప్రాణిలో పరమాత్ముడు కలడని నమ్మి, సమస్త ప్రాణులకు సేవచేయుము. ఏదియు కోరకుము, యిచ్చుచుండుము.

దీనివలన నీకు ఈశ్వరశక్తి లభించును. నీ వెవరి వద్దకు వెళ్ళినను వారికి ఏదో యిచ్చుటకో లేక సేవచేయుటకో వెళ్ళుము. కాని, పుచ్చుకొనకుము. పరులశక్తి కాసించి ఏ కార్యమును చేయకుము. నీ ఆత్మశక్తి చేతనే చేయుము.

## ౫౧ అమెరికా దేశపు డాక్టరు

౧. ఉపవాసముచేతను, అల్పాహారముచేతను దీర్ఘాయువు ప్రాప్తించును. అధికముగా భుజించుటవలన మానవుడు త్వరగా ముదుసలివాడగును. మరణించును. అధిక భోజనమువలన అకాల మరణము సంభవించును.

౨. భారము కలిగించునట్టి మిఠాయిలు, తైలపక్వములు మొదలగు రుచిగల, కృత్రిమ భోజనములవలన రక్తవాహికలలోను, స్నాయువులలోను కఠినత్వము కలుగుటవలన, వృద్ధాప్యము తొందరగా వచ్చును. అటులే అకాలమృత్యువు కలుగును.

3. కృత్రిమములును, ఉత్తేజకరములును లేక మాదకములును (మత్తుకలిగించునవి), అస్వభావికములును, అనావశ్యకములును నగు పదార్థములను తినుట, త్రాగుట వలననే శరీరమునకు హానికలుగును.

## ౫౨ ఒక మహాత్ముని ఉపదేశము

౧. ఓ మానవుడా! ధనసంపత్తులను నీవిగా భావింపకుము.

౨. ఎప్పుడెప్పుడు సాంసారిక చింతలు నీ మనస్సులో రేకెత్తునో, అపుడపుడే వాటిని ఝాడించి విసరి పారవేయుము. ఈ అభ్యాసమును మరువకుము. నీ ముఖముపై దుమ్మో ధూళియో పడుచో వెంటనే దానిని తుడిచి శుభ్రము చేయునట్లు, నీ మనస్సులో ప్రవేశించిన చింతలను తుడిచి శుభ్రము చేయుము.

3. భగవంతునిపై భారమువైచి, విశ్వాసము కలవాడవై ఉండుటే నీ పురుషార్థము. కృపచూపుట భగవంతుని ధర్మము.

సాధనచేయుట జీవుని ధర్మము. కావున భగవత్కృపపైన విశ్వాసము కలిగి ఆత్మసమర్పణము చేసిన వానివాడ వైతివేని నీ పాపతాపము లన్నియు శాంతించును.

౪. ఎంత దుఃఖము నీ మనస్సు ఇంద్రియములవలన కలుగునో అంత దుఃఖము సంసారమువలన కలుగదు. మనస్సును, ఇంద్రియ ములను నిగ్రహించితివేని, సంసారము స్వర్గమగును.

౫. ఇతరుల మాటలను విశ్వసింతువు. గురూపదేశములను వినగోరెదవు. కాని, నీ అంతరాత్మ ఎల్లప్పుడు బోధించుచుండు దానిని విశ్వసింపవు. ఇదియే చాలా గొప్ప తప్పు. అంతరాత్మయే నిజమైన గురువు. లోకులు అంతర్వాణిని నిర్లక్ష్యము చేయుచు వ్యర్థములగు ఇతరులు చెప్పు కట్టుకథలను వినుచుందురు. మహా త్ముల ఉపదేశముల చేతను, శాస్త్రముల చేతను ప్రభావితులగుదురే కాని అంతర్వాణి ప్రబోధమును ఎవడును విననొల్లడు.

౬. మొదట విచారముచే ఆసక్తిని నశింపజేయుము. చిత్త మును శుద్ధిపరచుము. ఉపాసనద్వారా చిత్తైకాగ్రతను పొందుము. విషయాసక్తి నశించిననే ఏకాగ్రత కలుగును.

౭. సేవచేసి మరచిపొమ్ము. కాని, చేయించుకొని మరువ కుము. దుఃఖమును పొంది మరచిపొమ్ము. కాని దుఃఖము నిచ్చి మరువకుము. మేలుచేసి మరచిపొమ్ము. కాని మేలుపొంది మరువ కుము. చెడుచేసి మరచిపోకుము. కాని చెడుపొంది మరచిపొమ్ము. ఇతరుల కుపదేశింపబోకుము. నీకు నీవే ఉపదేశించుకొనుము.

## ౯౩ పూజ్యబాబా మన్‌మోహన్‌లాల్‌జీ

౧. సాధకుడు ప్రేమభావము, సేవాభావము, వ్యవహారకుశ లత, యీ మూడింటిని ఎల్లపుడు పాలించు చుండవలయును. ఇవి ఉపాసనకు నియమములు.

౨. నీ వాక్కుపైన, నీ క్రియపైన ఎల్లప్పుడు దృష్టినుంచు టావశ్యకము. నీ వేది మాట్లాడ దలచినను, నీ వే పని చేయదలచి

నను నిర్మలబుద్ధితో విచారించి మరి చేయుము. పిదప చేయుము. ఇటు లాచరింతువేని యితరులను దుఃఖములనుండి తప్పింప కలుగుదువు. కావున నీ మనోవాక్కాయ కర్మములచేత యితరులకు దుఃఖము కలుగకుండా వర్తింపుము.

3. సాధకుడు బాహ్యమునుండి తన వృత్తులను మరలించి, అంతర్ముఖము చేయునపుడే వాడు ఉపాసనకు నిజమైన అధికారి కాగలుగును. బహిర్ముఖము కలవానికి మనోచాంచల్యము కలుగును. దీనికై దృఢమగు విశ్వాస మవసరము.

౪. మనలో శారీరక, మానసిక, ఆత్మక, బౌద్ధిక బలహీనతలున్నవో, అవి యీ మార్గమునకు హానికరములు. ఆత్మవిశ్వాసము లేకుండుట అన్నిటికంటెను గొప్ప బలహీనత. ఒకవేళ సాధకునకు దృఢమగు ఆత్మవిశ్వాస మున్నయెడల అతడు తన ప్రయత్నములో తప్పక విజయము పొందకలుగును.

౫. జ్ఞానేంద్రియ కర్మములు సమత్వము పొందియుండని యెడల ఉపాసకుని ఉపాసనా మార్గములో బాధ కలిగించును. ఇట్టి అసమత్వము మూలమున ఉపాసకుని అంతర్ముఖములగు వృత్తులు ఏకైక లక్ష్యముమీాద నిలిచియుండ నేరవు. అట్టిచో ఉపాసన యెట్లు సిద్ధించును? ఏ పని చేయుటలో తనకు భయము, సంశయము, లజ్జ కనిపించునో అదే జ్ఞానేంద్రియముల యొక్క పాపములని తెలిసికొని అట్టికర్మములను చేయకూడదు. జ్ఞానేంద్రియముల బలహీనతను తొలగించుటకు ఇది మంచి ఉపాయము. ఇదే వీనిని పరీక్షించుటకు గీటురాయి.

౬. సాధకుడు భగవత్ప్రాప్తి కొరకు తొందర పడరాదు. ప్రతీక్ష చేయుచుండవలెను. ఎల్లపుడు తన మనోమందిరమును సుందరముగను, పరిశుద్ధముగను అలంకరించుకొని, అతనికొరకు ప్రతిక్షణము నిరీక్షించు చుండవలెను. సదా సంతోషముగా నుండ

వలెను. తహతహ పడరాదు. ఇట్లు వర్తించు వానికి ఒకానొక రోజు తప్పక భగవత్ప్రాప్తి కలుగును.

## ౨౪ స్వామి నిత్యానంద్ శాస్త్రి

౧. ఏ ప్రాణి నైనను, హీనదృష్టితో చూడకుము. కష్ట పెట్టకుము.

౨. దేహ, గేహ, స్త్రీ పుత్రాదులను కూడ నావి, నా వారని తలంపకుము. అభిమానివి అహంకారివి గాకుము. నేను, నాది అను అహంకారమును త్యజింపుము. సుఖదుఃఖములందు సమముగా నుండుము. క్షమాశీలుడవు గమ్ము. సదా ప్రసన్నుడవుగా నుండుము. నిన్ను నీ స్వాధీనములో ఉంచుకొనుము. మనస్సును, ఇంద్రియములను నిరోధింపుము.

3. పరమేశ్వరునకు ప్రియుడవగుటకు ఏ శుభసంకల్పమును నిశ్చయించితివో దానియందు స్థిరముగా నుండుము. నేను భగవంతుని వాడనని ఎల్లపుడు జ్ఞాపకముంచుకొనుము. నీ మనోబుద్ధులను భగవదర్పితము జేయుము. మనస్సుతో ఆలోచింప దలంతువేని భగవత్స్వరూపమును ఆయన గుణ గణములను, ఆలోచింపుము. సంకల్పములు కలిగినను, భగవత్ప్రాప్తి సంబంధములగు సంకల్పములనే కలుగ నిమ్ము.

౪. నీ జీవితములో యెట్టిజీవికైనను కష్టము కలుగకుండ వర్తింపుము. నీ అవసరములను తగ్గించుకొనుము. దేనికిని లోబడకుము. ఇతరుల సహాయముమీద ఆధారపడి, జీవింపనెంచకుము. రోగగ్రస్తుడవైనప్పటికి భగవత్సహాయము తప్ప ఇతర సహాయమపేక్షింపక నీ పురుషార్థముతో స్వస్థత బొందుము. లేనిచో నోరు మూసికొనుము. (మౌనము వహించుము) భగవదేచ్ఛయే నీ ఇచ్ఛగా తలంచి సంతోషించుము. బాహ్యాంతరములను పరిశుద్ధముగా నుంచుము. సావధానుడవై మెలంగుము. కామక్రోధాదు

లకు దూరుడవై సంచరించుము. వీనిని జయించితినని అహంకార పడకుము.

౫. ఒకరితో సంబంధము కలిగినా, వేరొకరితో ద్వేషము తప్పదు. ఒకరు మంచి, ఒకరు చెడ్డ అని భావించుటే భేదము. కావున ఎవరితోను సంబంధము పెట్టుకొనకుము.

౬. పరమేశ్వరుని విశ్వసింపుము. కాని సంసారమును విశ్వసింపకుము. అన్నిటినుండి అసంగుడవై మెలంగుము. శత్రుమిత్రులను సమముగా చూడుము. మానావమానములను సమముగా తలంచుము. చలి, వేడిమి మొదలగు వాటిని సహింపుము. ప్రతి పనిని భగవంతుని ప్రసన్నత కొరకే చేయుచు, దానిని భగవదర్పితము చేయుము. ప్రతి పరిస్థితిలో, సంతోషముతో భగవంతుని స్మరించుచుండుము. జరుగుచున్నదంతయు నీ మేలుకొరకే జరుగుచున్నదని తలంచుము. కాని భగవంతుని నిందింపకుము.

## ౧౫ స్వామి గోబిందానంద్‌జీ మహారాజ్

౧. బట్టలు ఎర్రగా నుండినను, లేక తెల్లగా నుండినను, సదా నిన్ను నీవు సన్యాసివిగా తలంచుకొనుము.

౨. ఓంకారమును ఎల్లప్పుడు, బాహ్యాంతరములలో జపించుచు, చింతన చేయుచుండుము. బాహ్య జపముకంటె మానసిక జపము మంచిది.

3. జరుగుచున్న దంతయు నీ మేలుకొరకే జరుగుచున్నదని తలంచి ఎట్టి పరిస్థితిలోనైనను భయభ్రాంతులను నీ దరికి చేరనీయకుము.

## ౧౬ ఒక పంజాబీ మహాత్ముడు

౧. మౌనము వలన చాలా గొప్ప శక్తి చేకూరును. నిరంతరము అఖండ జపము జరుగుచుండవలయును.

౨. జీవజగత్తును విడిచి విశ్వంభరుని రాజ్యములో నివసింపుము. సంసారము చర్వితచర్వణమే కదా!

3. సూర్యుడు ప్రతిరోజు ఉదయించుచుండినను దానికై యెవరును అయిష్టపడరు. ఏలనన, సూర్యుడులేనిది ఎవరును జీవింపలేరు. అటులే ఆత్మకు సత్సంగము ఆహారము వంటిది. కావున ప్రతిరోజు సత్సంగము చేయుచుండవలెను.

౪. కామ క్రోధములను నీవు వశపరచుకొంటివా, స్వయముగా నీ శక్తి మేల్కాంచును. నిన్ను నీవు తెలిసికొనెదవు.

౫. లోకేషణ, విత్తేషణ, పుత్రేషణ ఈ మూడిటిపై గల ఆసక్తిని త్యజింపుము.

౬. ఎవడు తనను తాను తుచ్ఛునిగా తలంచుకొనునో, వాడందరికంటె గొప్ప వాడగును.

౭. నీది అనునది నీ యొద్ద నేదియు నుంచుకొనకుము. ఉన్నదంతయు పంచిపెట్టుము.

## ౯౭ కాశి నివాసియగు మహామండలేశ్వరుడు

౧. విషయవాంఛలను యెంతవరకు త్యజింపరో, అంతవరకు భగవత్ప్రాప్తి కలుగనేరదు.

## ౯౮ శ్రీ పాగల్ జైజైరాం

౧. భగవంతుని ఆశ్రయించనిదే శాంతి లభింపదు. బాహ్య ప్రయత్నములను త్యజింపుము.

౨. ఎవడు మితభాషియో, అల్పాహారియో అతడు పవనకాయుడై యుండును. నిద్రాహారములను మితముగా నుంచుము. ఎక్కువ తినుటచే ఇంద్రియములు బలపడి నిన్ను నశింపజేయును.

## ౯౯ స్వామి సదానంద్‌జీ మహారాజ్ (కాశి)

౧. త్యాగమువలననే శాంతియు, శక్తియు లభించును. ఎంతవరకు విషయ భోగముల వెనువెంట తిరుగుచుందువో అంతవరకు ధర్మమును పాలింపలేవు. ఎంతవరకు వాసన, మమత, అహం

కార అభిమానాదులను త్యజింపవో, అంతవరకు ఈ సంసార బంధ మునుండి విముక్తుడవు కానేరవు.

౨. ఆకలిదప్పుల దుఃఖములను సహించుట, మనస్సు ఇంద్రియముల బానిసత్వమునుండి విడబడుట ముఖ్యావసరము.

౩. వినినట్లు అనినట్లు వర్తించుటే సత్యము. లేనిచో వ్యర్థము. ప్రార్థన చేయుదువు కాని ప్రార్థించినట్లు జీవితమును గడుపవు. అదే గొప్ప ప్రమాదము.

౪. ఓ రామకృష్ణులను పూజించు వారలారా! వారి జీవితములనుబోలు మీ జీవితములను గడపితిరా, వారికి, అదే నిజమైన భక్తి, నిజమైన పూజయగును.

౫. కామ, క్రోధ, లోభ, మోహాదులన్నిటిని భగవంతుని చరణకమలములందు సమర్పించి, నీ హృదయమును పవిత్రము చేసికొంటివేని, భగవంతుడు నీ హృదయములోనే ప్రకటమగును. ఇందులో ఎట్టి సందేహముగాని లేదు.

౬. లోకములోని లోకులందరు స్వార్థపరులు. ప్రపంచవస్తువులే సర్వస్వమని తలంచుటే గొప్పమోసము, భ్రమ. సంసారమనగా మాయాంధకారము. ఎట్లు సినిమా చిత్రములు అంధకారములో ప్రదర్శింపబడునో అట్లే ఈ సంసారముకూడ మాయయొక్క చీకటి తెరపై ప్రదర్శింప బడుచున్నది. జాగ్రదవస్థలో కనబడు సంసారము స్వప్నములో కనబడదు. స్వప్నావస్థలో కనబడు సంసారము జాగ్రదవస్థలో కనుపించదు.

౭. ఛాయాచిత్రము (ఫోటో)ను తీయునపుడు సావధానముగానుండవలసి వచ్చును. అటులే భగవంతుని కార్యములో సావధానముగా మెలగితివేని భగవంతుని స్వరూపము నీ హృదయములో అంకితమగును.

౮. వివేక, విచార, విజ్ఞానములులేనిదే మోక్షము సిద్ధింపదు.

## ౧౦౦ బ్రహ్మలీన్ విద్యానంద్ జీ మహారాజ్

౧. బీజము నశించిన పిమ్మటనే దానినుండి వృక్ష ముత్పన్న మగును. ఆ వృక్షము నశించినపుడు అది దాని బీజములో ఇమిడిపోవును. వేల కల్పములు గడచి నప్పటికిని, ఆ వృక్షము జాతి నశింపదు. అట్లే జన్మజన్మాంతరములు గడచి నప్పటికిని, ప్రాణులయొక్క త్రిగుణములలో ఎట్టి భేదము కలుగదు.

౨. అహంకారమే దుఃఖమునకు కారణము. స్వస్వరూప జ్ఞానమే సుఖమునకు కారణము.

## ౧౦౧ సంత్ వసవేశ్వర్ జీ

[శ్రీ వసవేశ్వరుడు కర్నాటక ప్రాంతములోని, యింగ్లేష్వర మను గ్రామమున, బ్రాహ్మణ కుటుంబమునందు 1189 సంవత్సర ములో జన్మించిరి. వీరి తల్లిపేరు మాదలాంబిక. తండ్రిపేరు మాదిరాజు వీరు శివభక్తులు.]

౧. ఈశ్వరు డొకడే. శివుడే పూజ్యుడు. అహింసయే పరమ ధర్మము. ధర్మముచే ప్రాప్తించిన వస్తువును స్వీకరించుటే వ్రతము. ఇచ్ఛలను వశములో ఉంచుకొనుటయే సమ మనబడును. శాంతమే తపస్సు. కపటవర్తనము లేకుండుటే భక్తి.

౨. దేవలోకము, మర్త్యలోకము వేరు వేరుగా లేవు. సత్యమే దేవలోకము. అసత్యమే మర్త్యలోకము. సదాచారమే స్వర్గము. అనాచారమే నరకము.

౩. భగవంతుడే ఆశ్రయుడని తలంచువానికి దినములన్నియు సమానములే.

౪. నాకంటె తుచ్ఛుడు వేరొకడు లేడు. శివభక్తునికంటె అధికుడు మరొకడు లేడు. ఓ శివుడా! నీ చరణములే దీనికి సాక్షి. నా మనస్సే యీ తత్త్వము నెరుంగును. సర్వం శివం జగత్.

౫. బ్రహ్మపదవి నాకు వలదు. శివకేశవుల పదవులందు నాకు ఇచ్ఛలేదు. నేను కేవలము శివభక్తుల మహత్తును తెలిసికొన కోరెదను.

## ౧౦౨ సంత్ కవి నజీర్

౧. ఓ మానవుడా! ఒకానొక దినము ఈ లోకమునుండి పోక తప్పదు. అనిశ్చితమైనదానికొరకు అనే కాడంబరా లేల? ఎవరికొరకు సంగ్రహింపవలెను? చేయరాని పను లెల్ల ఎవరికొరకు చేయవలెను? అనువానిని సదా విచారించుకొనుచు నీ మనస్సును భద్రపరచుకొనుము.

౨. భగవదేచ్ఛకు సంతోషించువాడు ఎట్టి పరిస్థితి సంభవించినను, దానిని చెడ్డదిగా భావింపక ఎల్లపుడు ఆనందమయుడై యుండును.

3. ఎవడు పరమేశ్వరునకు ప్రేమమయుడగునో వాడు లోకములోని ఏ పదార్థము వైపును కన్నెత్తి చూడడు. అట్టివాని పాదముల వద్ద ప్రపంచ పదార్థము లన్నియు దొర్లుచున్నను, వాడు వాటి యందు దృష్టి నుంచడు.

౪. ఎవడు అంతిమ ప్రయాణమునకు (మరణించుటకు) మొదటి నుండియే తగిన ఏర్పాటులు చేసికొనునో వాడు సుఖముగా పయనము సాగించును (మరణించును). ఎవడు సంసారాసక్తుడై ప్రాపంచిక వస్తువులను తనవని పట్టుకొని, తన మనస్సులో నిలుపుకొనునో వాడు ప్రపంచమును విడుచునపుడు, వ్యాకులము జెందును (విలపించును) కావున యిట్టి దుఃఖమునుండి విముక్తుడగుటకు ప్రతి వ్యక్తి తన అంతిమ ప్రయాణముపైన దృష్టి ఉంచి తగు ప్రయత్నములో ఉండవలెను. నీలో సమత్వము, శక్తి యున్నకాలములోనే యిట్టి మహామంత్రము సిద్ధించుటకు సిద్ధపడుము.

౫. మానవుడు ఎన్ని ఆత్మలను సుఖపెట్టగలుగునో అతడు అంతే ఆనందమును పొందకలుగును. కారణమేమనగా? ప్రతి జీవి

హృదయములోని "శాంతి" అతని హృదయములో ప్రవేశించు చుండును.

(వీరు మొదట గొప్ప ధనవంతులు, పిదప విరక్తుడై సర్వస్వ మును త్యజించి పరమభక్తు డాయెను.)

## ౧౦౩ సంతు జలారాంజీ

[శ్రీ జలారాంజీ సంతు గొప్ప ఉదారులు, త్యాగులు. వీరు సర్వస్వమును విడిచి కట్టుబట్టలతో పత్నితోసహా యిల్లువెడలి గుజరాత్ దేశములోని "కాఠ్యావాడ్" ప్రాంతమున "వీర్‌పూర్" అను గ్రామములో నివసించి, భార్యాభర్త లిరువురు కూలినాలి చేయుచు, వచ్చినదానిలో యితరులకు పెట్టి పిదప మిగిలిన దానిని ప్రసాదరూపమున గ్రహించుచుండిరి. తాము తినక, కడుపుకట్టుకొని మిగిలించి, అన్నక్షేత్రము తెరచి ప్రతి సమయమందు అన్నార్తులకు అన్నము పెటుచు, మానవసేవ చేసిరి. "వీర్‌పూర్" ఆశ్రమమున యిప్పటికిని ప్రతి నిత్యము వచ్చిన అతిథి అభ్యాగతులకు తగు సత్కారము జరుగుచున్నది.

వీరు దరిద్రనారాయణుల సేవకొరకు తన సర్వశక్తులను విని యోగించువారు. కొందరికి రొట్టెకొరకు పిండి విసరువారు. కొంద రికి కాళ్లు పిసుకువారు. ఇట్లు వారు వారివారికి తగిన తీరున సేవ చేయుచుండిరి.

ఒకరోజు ఒక మహాత్ముడు వచ్చి వీరి భార్యను తన సేవ కొరకై అడిగిరి. వెంటనే సంతోషముతో తన భార్యను ఆ మహా త్మునికి అప్పగించిరి. నాకు భూతసేవయే అధిక ఆనందము కలిగిం చును. కావున మీ రీమెను మీ సేవకై ఉపయోగించుకొనుడు అని పలికిరి.]

౧. ఓ మానవులారా! కుడిహస్తముతో చేయబడు దానము యెడమ హస్తమునకు తెలియనట్లు నిరభిమానులైన ప్రభావముతో

లోకసేవకులై ప్రవర్తింపుడు. హృదయమున సంకోచము లుండ రాదు. మనోవిచారములు పరిశుద్ధముగా స్థిరములై నుండవలెను.

౨. శీలము, వినయము మానవునికి కిరీటములు. మానవుడు మానవత్వము వహించి మానవసేవ చేయుచుండవలయును. బీదలకు, అన్నార్తులకు యెంత యివ్వగలిగితే అంత యిచ్చి ముక్తుడు కావలయును. సత్పురుషులను వెదకి, భవతాపమునుండి నివృత్తి నొందుట కొరకు వారి నాశ్రయింపవలయును.

3. ఇతరుల కుపకారము చేయుచుందునను భావము లేక ఎవరు భగవంతునిపై భారమువైచి ఇతరుల సేవ చేయుదురో, వారి సేవ సఫలమగును. వారిని స్వయముగా భగవంతుడే తరింపజేయును.

౪. 1. సమర్థుడు అన్నము పెట్టి సంతోషించును.

2. అన్నార్థుడు అన్నముతిని దీవించును. కావున, ఓ సహోదరులారా ! నిత్యము అన్నదానము చేయుడు.

## ౧౦౪ శ్రీ దేవదత్తుజీ

౧. ధనము సర్వానర్థములకు మూలమనియు, ధనార్జనమనగా అగ్నిలో దూకుటయే యనియు భావము కలిగియున్నచో ధనము నందు విరక్తి కలుగును. లోభము నశించును. సాత్విక విచారముచే భయము తొలగును. మాటలాడుటవలన సమాధికి విఘ్నము కలుగును. మౌనవ్రతముచే యోగసాధనలో సంభవించు విఘ్నము లన్నియు దూరమగును.

౨. ఓ మిత్రులారా ! దేహసుఖము కొరకే మనము యితరులను కష్టపెట్టుచుందుము. కావున దేహమునందలి మమతను త్యజించి నపుడే అహింసావ్రతము సిద్ధించును.

3. కృపవల్లనే భౌతిక దుఃఖము నివృత్తియగును. సమస్త జీవులయెడ మనమెట్లు దయ కలిగి వ్యవహరింతుమో, ఆ జీవులును అటులే మనయెడ దయకలిగి ప్రవర్తించును.

౪. ఈశ్వర నామమగు ప్రణవము (ఓంకారము) ను అర్థ సహితముగా జపించు చుండుడు. సర్వవ్యాపకుడగు సర్వేశ్వరునకు, సదా సర్వదా నమస్కరించు చుండుడు.

## ౧౦౫ శ్రీ గోవిందుదాస్‌జీ

౧. గాంధిగారికి ఎపుడు సమస్త సృష్టి రామమయముగా కనుపించెనో, అపుడే వారి రాగద్వేషములును, కామ క్రోధ లోభాదులును తమంతట తామే సమాప్తమై భ్రాతృ ప్రేమ భావము ఆయనలో ప్రవేశించెను. అట్టి ప్రేమచేతనే ఆయన విశ్వమునకు బంధువై బాపూజీగా మారెను.

౨. సాధకులును, సన్యాసులును, భక్తులును అగు వీరు తమ పురుషార్థముచే లోకమునకు యేమైనను యిచ్చినపుడే వారు ముక్తులగుదురని తలంపవలెను. భగవత్సాక్షాత్కారమునకు యింతకంటె సులభము, చక్కని సద్గతిదాయకమగు మార్గము వేరొకటి లేదని మా అభిప్రాయము.

### ఒక కథ

నా శిష్యులు మానవులుగా మారుదురేని, నేను నా ప్రతి శిష్యునితో కొరడా దెబ్బలు తినుటకు సంతోషింతునని "చంద్రఘరు"డను గురువు "శ్వేతకేతు"డను శిష్యునితో చెప్పెను. శిష్యుని అపరాధమునకు, గురుడే కారకుడు. తన శిష్యుని తనతో సమానముగా చేయువాడే నిజమైన గురువు. శిష్యుని మానవునిగా తయారుచేయుటకై గురువు స్వయము తనను తాను నశింపచేసికొనవలసి యుండును.

## ౧౦౬ మహాత్మ జన్నుని శిష్యుడగు శొహోల్ తష్టరి

౧. ఓ మానవుడా! రుచిగల పదార్థములను రుచి కొరకు తినకుము. ఔషధమువలె భుజింపుము. అన్యాయార్జితాన్నమును తినకుము. తినిన పదార్థము నాలుగయిదు ఘడియలలో మలముగా మారును. కాని ఇచ్ఛాదోషము మాత్ర ముండితీరును.

౨. ఓ సోదరా! పోరాడ తలంతువేని నీ మనస్సుతోను, ఇంద్రియములతోను పోరాడుము. వాటిని నీ అదుపులో పెట్టుకొనుము. మీరు బాగుపడుడని మరల మరల యితరులకు బోధింప బోకుము. మొదలు నిన్ను నీవు నియమించుకొనుము. ఇతరుల వైపు చూడకుము.

3. నీవు భగవత్ప్రాప్తి కోరుదువేని పాపముల నుండి వైదొలగుము. ప్రవృత్తి మార్గమును విడచి నివృత్తి మార్గమును అవలంబింపుము.

౪. సమ భావముతో అనాసక్తిచే విశ్రాంతి లేక జలము సర్వభూతములకు ఉపకరించునట్లు నీవునుసోమరివిగాక నిష్కాముడవై అందరికి సేవ చేయుము. ఆత్మోన్నతిని కోరుదువేని దృఢ వైరాగ్యము నవలంబింపుము. భగవంతునిపై భారము వైచి నిష్క్రియుడవుకమ్ము. త్రాగుడు, తిండి, చింతలను విడచి అతని వాడవై మెలగుము. మొదలు జీవన్ముక్తుడవై పిదప భగవన్నామ మును భజింతువేని అతి శీఘ్రముగా సఫలమగును.

౫. పతివ్రతా స్త్రీ, వేశ్యవెంట తిరుగునేని లోకులు ఆమెను కూడ వేశ్యగానే తలంతురు. అటులే భక్తులగువారు విషభోగుల సాంగత్యము చేయుట లజ్జాకరమైనపని. వారు రాజులుగాని, ధన వంతులుగాని, వారందరు భోగులే సుమా! విషయ భోగుల సాంగత్యము సేయువారు పతనమగుదురు. చేయరాని పనులను చేయుటచేతను పోరాని చోటునకు పోవుటచేతను పాపమే సంభవించును.

౬. విడిపోవు వారితో సంబంధము పెట్టుకొని వారితో నీకు మేలు కలుగునని విశ్వసింపకుము. సంసార మొక దినము స్వయమే నిన్ను విడచును. కావున దానికంటె మొదలే నీవు దానిని విడువుము. చనిపోవువారి సంబంధమువలన లాభమునకు బదులు దుఃఖమే ప్రాప్తించును. కావున ఈ జీవితములోనే భగవత్ప్రాప్తిని

పొందుము. దానికై అశాశ్వతమైన సంసారమును అతిత్వరగ త్యజింపుము.

౭. ఒక వంక ఈశ్వరాజ్ఞ నుల్లంఘించుచు, వేరొక వంక ముక్తికొరకు భగవంతుని ప్రార్థించుట, ఇది యెంత మూర్ఖత్వమో, వెర్రితనమో నీవే విచారించుకొనుము.

౮. ఓ నాయనా! వాక్కును నియమించుము. నీచే కాని దానిని నీ నోటి నుండి పలుకకుము. దేనిని చేయజాలవో దానిని చేయుదునని ప్రతిజ్ఞ చేయకుము.

౯. ఎంతవరకు జీవచైతన్యము, జడదేహము వేరు వేరుగా కనిపించదో అంతవరకు జ్ఞానాభ్యాసము జరుగుచునే యుండవలయును. ఎవని మనస్సునుండి విషయ భోగాసక్తి తొలగదో, వాడెంత జ్ఞానియైనను వాని జన్మ పరంపరలు తొలగనేరవు.

౧౦౭ మహాతపస్వి జవనీద్

౧. ఓ మానవా! నీవు జన్మించి నపుడు యెట్లుంటివో (అబోధ బాలకునివలె) అటులే జీవిత కాలమంతయు ఉండినచో చేయవలసిన ధర్మమేదియు నుండదు.

౨. ధన, సంపత్తాదులకై చింతింపకుము. సమస్త వస్తువులును, సర్వభూతములును, భగవంతునివే కదా! ఇక ఏ వస్తువు నెవరు తీసికొనినను దానికై నీవు చింతించుటేల? నీ జీవ యాత్ర గడుచుటకు ప్రయత్నింపకుము. నీ గతి ఏమగునోయని విచారింపకుము. నీ కొరకు భగవంతుడు ఏ విధానము విధించెనో దానిని మార్చుటకు యత్నింపకుము. అంతఃకరణ శుద్ధియే కార్యసిద్ధి. అంతశ్శుద్ధి లేనిది భగవంతునిపై ప్రేమ కలుగదు.

3. ఓ సోదరా! నీ భారమును ఇతరులపై వేయకుము. సంకోచ రహితుడవై దానము చేయుచుండుము. దీనినే పురుషార్థమందురు.

౪. దేహ భావముతో జీవించువాడు మృతుడగును. ఆత్మ భావముతో జీవించువాడు అమరుడగును. అందరిని భగవత్స్వరూపులనుగా భావించి నిష్కామముతో సేవించు వానికి ప్రేమ జనించును. అహంకారము నశింపగానే ఈశ్వర ప్రాప్తి కలుగును.

౫. వైరాగ్యమును సాధింప తలంచితివా, ప్రేమింపుము. ప్రేమను రక్షింప తలంతువేని పరిపూర్ణ విరక్తుడవుకమ్ము.

## ౧౦౮. శ్రీ బొంత ముంతస్వామి

[వీరు విశాఖపట్టణం జిల్లాలోని విజయనగర ప్రాంతమున ఒకానొక గ్రామములో బ్రాహ్మణ కుటుంబమున 17-2-1871 వ తేదీన జన్మించిరి. వీరు బాల్యమునందే విరక్తిజెంది సర్వము త్యజించి గుజరాతు దేశముపోయి సన్యసించి ప్రకాశానందస్వామి యను పేరు బడసి సంచరించుచుండిరి. వీరికి ఒకముంత, ఒకబొంత తప్ప మరేమియు లేకుండెను. అందువలననే వీరిని బొంత ముంత స్వామియని పిలుచుచుండిరి. వీరు ద్వారకానగరమున 23-2-1962వ తేదీన బ్రహ్మీభూతులైరి.]

౧. నా మనస్సు నా మాట విని ఆ ప్రకారము నడచుకున్న తర్వాతనే నేను పరుల కుపదేశింప సర్హుడను. అందాక ఇతరుల కుపదేశించుటకు తగినవాడను కాను.

౨. ఎవని మనస్సు ఇతరుల చిత్తము నాకర్షించుటకు తాపత్రయ పడునో, ఎవడు భోజన వస్త్రాదులయందు ఆసక్తుడై యుండునో, ఎవడు శబ్దశాస్త్రాదులందు నిమగ్నుడగునో, ఎవనికి రమ్యములైన భవనములయందు ప్రీతియుండునో అట్టివానికి మోక్షము లభించదు.

3. రామభజనలో నిమగ్నత జెందుటయే చాతుర్యము, పరుల మనస్సును, పరుల ధనమును ఆకర్షించుటలో చాతుర్యము వేశ్యకు మరీయెక్కువ.

౪. జిజ్ఞాసువు ఒకచోట స్థిరముగా నుండరాదు. నివసించుటకు స్థానమేర్పరచుకొని దానిని అలంకరించువాడు విరాగికాడు. ఉత్తముడైన విరక్తుడు ఎట్టి సామగ్రిని సేకరించడు.

౫. ఆదర సన్మానముల కాశించరాదు. ఇతరులతో సంబంధము పెట్టుకొన్నకొలది అహంభావము, మమత్వము పెరుగును.

౬. వేషమునకు తగినట్లు ప్రవర్తనలేకున్న ఆ వేషమునకు కళంకము వచ్చును. దానిచే దోషము సంభవించును.

౭. యతులకు కాంచనమును, బ్రహ్మచారులకు తాంబూలమును, దొంగలకు అభయమును ఒసగినవాడు నరకమును పొందును.

౮. మనుష్యులలో క్షౌరము చేయువాడు ధూర్తుడు. పక్షులలో "కాకి" ధూర్తము. చతుష్పాదులయిన జంతువులలో నక్క ధూర్తమయినది. తపస్సులలో స్వేచ్ఛగా సంచరించువాడు ధూర్తుడు.

౯. సాధువుల సాంగత్యమువలన సంసారులు పాడయినను మంచిదే కాని సంసారుల సాంగత్యమువలవ సాధువులు పాడగుట చాలాతప్పు.

౧౦. కేవలము సన్యాసులే కాదు, ముముక్షువులు కూడా ధనము స్వీకరింపరాదని శాస్త్రములు చెప్పుచున్నవి.

౧౧. తాను చెప్పినట్లు తానే సంచరించని మానవుడు శునకముతో సమానము. అతడు బంధనములచే బద్ధుడై యమ లోకమునకు పోవును.

౧౨. బ్రహ్మము లేదని చెప్పువాడును, బ్రహ్మజ్ఞానిని ద్వేషించువాడును, అనుభవము లేనిదే బ్రహ్మజ్ఞుడను అని చాటుకొను వాడును, వీరు ముగ్గురును బ్రహ్మహత్యా పాతకులే.

౧౩. తాను బ్రహ్మమే అని నిరంతరము ధ్యానము చేయునంతవరకు దేహాభిమానము నశింపదు. అద్వైత సాక్షాత్కారము కలుగదు.

౧౪. మృష్టాన్నమును, మిఠాయిలును తినుట అధ్యాత్మిక మునకు భంగకరము.

౧౫. ముముక్షువునకు స్త్రీ సంపర్కము, విలాసవస్తువులు, శయ్య, ఉత్తమాసనము, పదవులు, ధన ఐశ్వర్యాదులు, తాంబూల భక్షణము, ఈ మొదలగు విషయము లన్నియు విఘ్నకరములే.

౧౬. అపథ్యము చేయువాడును, దొంగయు, భార్యాసక్తుడగు రాజును, ఈ ముగ్గురును అనర్థమును ఎరిగియుండియే ప్రారబ్ధ కర్మ వశమున కర్మ చేయుదురు.

౧౭. బ్రహ్మహత్య, సురాపానము, చౌర్యము, గురుపత్నీ సంగమము, ఈ పాపములు చేసినవారితో సంసర్గము మహాపాపము.

౧౮. భంగు, గంజాయి, నల్లమందు, మొదలగు వానికంటె మద్యపానము మహాపాపము.

౧౯. గోవధ, కన్యావిక్రయము, పరస్త్రీ సంగమము, మాతాపితృ పరిత్యాగము, శాస్త్రనియమము నతిక్రమించి వడ్డీ తీసుకొనుట ఈ మొదలగునవన్నియు పాపములు. ఇవి రాక్షస స్వభావమునకు చెందినవి.

౨౦. దంభముచే పరలోకము నశించును. దంభమునకు మూలకారణములు నాలుగు. 1. ప్రపంచము స్తుతింపవలెనను కోరిక. 2. ప్రజలు నిందించెదరను భయము. 3. ప్రజలు పూజింపవలెనను ఇచ్ఛ. 4. ద్రవ్యోపార్జనము చేయవలెనను భావన.

౨౧. నిష్కామ కర్మము చేయనిదే అంతఃకరణము శుద్ధి కాదని శాస్త్రసిద్ధాంతము. అంతఃకరణము శుద్ధికానిది జ్ఞానము కలుగదు (అంతఃకరణ పరిశుద్ధ్యమునకు నిష్కామ కర్మ సాధకము).

౨౨. మలిన చిత్తమునందు ఉపదేశబీజము నాటుకొనదు. నిష్కామియై సగుణోపాసన చేసినచో చిత్తశుద్ధియగును.

౨౩. పామరులవలె వ్యవహరించుటకంటె వైదిక కర్మానుష్ఠానము శ్రేష్ఠము. వైదిక కర్మానుష్ఠానముకంటె సగుణ బ్రహ్మోపాసన శ్రేష్ఠతరము. సగుణ బ్రహ్మోపాసన కంటె నిర్గుణోపాసన శ్రేష్ఠతమము,

౨౪. ధనము దైవభక్తికి విరోధి. ధనము మానవుని దుష్ప్రవర్తనకు దారి తీయించును.

౨౫. మోక్షమునకు నలుగురు ద్వారపాలకులు.

1. శమము. 2. తత్త్వవిచారము. 3. సంతోషము.
4. సాధుసంగమము.

౨౬. పరమ సంతోషమును పొంది సుఖమును అనుభవింప గోరు మానవుడు సంయమమును పాటింపవలెను. సుఖమునకు మూలము సంతోషము. అసంతోషము దుఃఖమునకే కారణము.

౨౭. ఆరంభమునందు అనురాగము, తొందర, అసత్కార్యములను చేయుట, నిరంతరము విషయ సుఖములను అనుభవించుట ఈ నాలుగును రజోగుణ లక్షణములు.

౨౮. లోభము, స్వప్నము, నిలుకడలేక పోవుట, క్రౌర్యము, నాస్తికత్వము, భ్రష్టాచారము, యాచనా స్వభావము, పొరపాట్లు చేయుట ఇవి అన్నియు తమోగుణ లక్షణములు.

౨౯. దొంగతనము, జారత్వము, మద్యపానము, హింస మొదలగు శాస్త్ర విరుద్ధములును, నింద్యములునునగు దురాచారపు పనులు చేయువాడు లోకమున నిందాపాత్రుడగును ఎప్పుడును దుఃఖములను పొందును. రోగములతో బాధపడును. అల్పాయువగును.

30. వివేకము గలవానికి యాచించుట చావుకంటె ఎక్కువ దుఃఖము కలిగించును. మృత్యువుచే కలుగు దుఃఖము క్షణికము. కాని, అడుగుటచే కలుగు దుఃఖము అనంతము. అంతియేకాదు, యాచించు మనుష్యుని చూచి ప్రపంచముకూడ భయపడును. గడ్డి

కంటె దూది తేలిక. దూదికంటె యాచకుడు తేలిక. వాయువు దూదిని ఎగరవేసికొని పోవునట్లు యాచకుని ఎగరవేసికొని పోవును. కాని తననుకూడా అడుగునేమో యను భయముచేతనే వాయువు ఆ ముష్టివానిని సమీపించుటలేదు.

౩౧. పరులకొరకు సముద్రోదకమును గ్రహించు మేఘము నల్లబడుచుండగ ధనికుని దగ్గరనుంచి తన స్వార్థమునకు ధనమును గ్రహించినవాని ముఖము నల్లబడుటలో ఆశ్చర్యమేమి ? యాచించు వానిని జనులు తిరస్కార దృష్టితో చూచెదరు.

౩౨. చేయవలసిన పనిని చేయవలసిన సమయమున చేయక పోవుట ప్రమాదము. జ్ఞానికి పొరపాటుకంటె ఎక్కువ కీడు మరి యొకటి లేదు. పొరపాటుచే జ్ఞానికి మోహము కలుగును. మోహముచే అహంభావము కలుగును. అహంభావముచే బంధనమునందు చిక్కుపడును. అంతట దుఃఖము కలుగును.

౩౩. స్వేచ్ఛాచారముచే తత్త్వజ్ఞాన మహిమ నశించును. అనగా మనోవాంఛలకు లొంగుటయే స్వేచ్ఛాచారము.

౩౪. మఠములందు భోజనము చేయరాదు. భుజించినచో చాంద్రాయణము చేయవలెను. మఠాధిపతిని స్పృశించినచో సచేల స్నానము చేయవలెను.

౩౫. భూములు, ఆవులు, సువర్ణము మొదలగు వానిని సంపాదించు సన్యాసిని చూచినచో సచేల స్నానము చేయవలెను. సన్యాసులు దేహరక్షణమునకు మించిన పరిగ్రహమును చేయరాదని శాస్త్రసమ్మతమగు సిద్ధాంతము.

౩౬. అరణ్యము దావాగ్నిచే దగ్ధమైనను మరల పెరుగును కాని, ప్రతిగ్రహముచే దగ్ధమైన నరుడు తిరిగి ఔన్నత్యమును పొందడు.

౩౭. పురుషుడు పరస్త్రీనిగాని, స్త్రీ పరపురుషునిగాని, ఆసక్తికల దృష్టితో చూచినచో అది మానసిక వ్యభిచారమగును.

౩౮. కామినీ కాంచనములను త్యజించిన సన్యాసులైన త్యాగులకు విరక్తులకే ప్రణవ మంత్రమును జపించు అధికారము కలదు. ధనాదిపదార్థములను త్యజించి ఐకాంతికమగు వానప్రస్థ జీవితమును నిర్వహించువారికి ప్రణవ మంత్రమును జపించు అధికారము కలదు. ఏ కారణము చేతనైన సంపూర్ణ త్యాగము చేయలేనివారు "సోహమ్" అను అజపా మంత్రమును జపించవచ్చు. సాధకులకు ఈ "సోహమ్" ఎంతయో సులభము. చిత్తవృత్తిని ఆపుటకు ఈ "సోహమ్" జపమును ఉపయోగించెదరు. ధ్యానము చేయు సామర్థ్యము లేనివారికి ఇది ఎంతయో ఉపయోగము. అంతియే కాదు, "సోహమ్" ను జపించుటచే వేదోక్తమగు ప్రణవ జపము దానంతట అదియే జరుగును. "సోహమ్" జపము శ్రేష్ఠమని తెలిసికొని, దాని అర్థమును భావించుకొనుచు జపించినచో మలదోష నివృత్తియగును. దైవానుగ్రహము కలుగును. అనగా నిర్వికల్ప సమాధివరకు చేరుటకు ఇది సాధనము.

౩౯. కామమును బలహీనపరచు ఉపాయము :

ఒకే పూట మితముగా భుజింపుము. నేత్రములను సుందర రూపమును చూడనీయకుము. ఏకాంతమునందు ఉండుము. అటులనే మనస్సును సంకల్పములనుండియు ఆలోచనలనుండియు దూరము చేయుము. ప్రతి శరీరము రక్త మాంసము, మలమూత్రము మొదలగు దుర్గంధ పదార్థములచే నిండియున్నదని తెలిసికొనుము. ఇట్టి ఉపాయములచే కామము దుర్బలమగును. కామోత్తేజము కలిగించు పదార్థమును త్యజించవలెను. నేత్రములను సంకల్పములను నిరోధించవలెను. ఇదియే కామమును వశపరచుకొను ఉత్తమ మార్గము.

౪౦. విషయములను, సంగమును త్యజించుటచే భక్తి లభించును. విషయ త్యాగ మనగా అంతరంగిక విషయ వాసనా

త్యాగము. సంగత్యాగ మనగా బాహ్యములగు విషయ భోగము లను త్యజించుట.

౪౧. జ్ఞానమునకు భక్తి, వైరాగ్యము లను రెండు సాధనములు.

## ౧౧౯ శ్రీ నిత్యానంద స్వామి

[వీరు ఉత్తర ప్రదేశములోని "మీరటుకు" సమీపమున "పరీక్షితగడ"మను గ్రామమున బ్రాహ్మణ కుటుంబములో 1866వ సంవత్సరములో జన్మించిరి. పూర్వాశ్రమ నామము 'రాం ప్రసాద్'. వీరు బాల్యమునందే విరక్తులై సర్వమును త్యజించి గుజరాత్ దేశములోని "పీఠదియా" గ్రామమున 1934వ సంవత్సరములో బ్రహ్మభూతులైరి.

౧. ఇతరుల కుపదేశింప దలచినప్పుడు ముందుగా సమస్త భోగములను త్యజింపవలెను. ఆ త్యాగము ఆచరణద్వారా ఇతరుల కుపదేశము కావలెను. కాని ఉపన్యాసముల ద్వారా కాదు. వారి ఆచరణయే పరుల కుపదేశమగును.

౨. ఎక్కువ మాట్లాడినను, వినినను, వృత్తి బహిర్గతమగును.

౩. వాఙ్నిరోధము, అపరిగ్రహము, ఆశారాహిత్యము, అనాసక్తి, ఏకాంతము నందుండు స్వభావము ఇవి అన్నియు యోగమునకు ప్రథమ ద్వారములు.

౪. మాయ ఎంతో బలమైనది. ఒకచోట ఆసనము నేర్పరచుకొనినచో ఆ స్థానమునందు మమత్వము ఏర్పడును. అందుచే నిజమైన త్యాగి ఏ ఒక్క చోటను ఆసనమును ఏర్పరచుకొనడు.

౫. ఇది నాది అను భావము ఉన్నంతవరకు మమత్వము ఉండితీరును.

౬. పరిచితుల సంఖ్య పెరిగినకొలదియు యోగాభ్యాసమునకు విఘ్నములు కలుగును.

౭. సంసారుల సాంగత్యమువలన సాధువులు పాడై నరకములో పడుదురు. సాధువుల సాంగత్యమున సంసారులు పాడై స్వర్గములో పడుదురు.

౮. పంక్తి భేదము మహాపాపము.

౯. మానవుడు అసత్యమాడి దొంగయై సంసార బంధములో పడును. దొంగయే కానిచో ఈ జన్మచక్రములో ఎందుకు తిరుగవలసి వచ్చును?

౧౦. ధనమువలన సర్వవిధముల భయమే సంభవించును. ధర్మమునకైనను ధనమును సేకరింపరాదు.

౧౧. ఆశ కలవాడే దరిద్రుడు. తృప్తియు, సంతోషము కలవాడే ధనవంతుడు.

౧౨. సతికిని, సన్న్యాసికిని మంచివేషము అక్కరలేదు. ఆడంబరునకును, వేశ్యకును అలంకారములు అవసరము.

౧౩. అభ్యాసకాలమున సాధువులకు జనుల సంసర్గము విఘ్నకరము. కావున గుప్తముగా నుండవలెనని శాస్త్రములు చెప్పుచున్నవి.

౧౪. ధ్యానయోగముచే పరమాత్మను తెలిసికొనవలెను. ఎవరిని ధ్యానింప వలెను? గురు దృక్పథముతో రామ కృష్ణాది మూర్తులను ధ్యానించుట చాలా మంచిది.

౧౫. భావము ప్రధానము. కాన సద్భావము కలిగియుండుడు.

౧౬. సంతోషము లేనిదే మానవునకు సుఖము కలుగదు. సంతోషము లేనిచో బుద్ధి నశించును.

౧౭. పాపము చేయువారియందు ఉపేక్షాభావము కలిగియుండుటచే ఔదాసీన్యము పెరిగి తన పాపాచరణమునందు కూడ ఔదాసీన్యము ఏర్పడును. ఇట్లు మైత్రీభావముచే అంతఃకరణము నుండి రాగద్వేషములు నివృత్తిపొంది చిత్తము నిర్మల మగును.

౧౮. అఖండ భజనచే సాధనములు లభించును. తినుచు, త్రాగుచు, తిరుగుచు, పనిచేయుచు, ఎల్లవేళల హరిభజన చేయవలెను. మనస్సున ప్రభునామమును స్మరింపవలెను. ఇట్లు చేయుటచే వైరాగ్యాది సాధనములు మెల్ల మెల్లగా సమకూరును.

౧౯. ప్రభుపరాయణు డగువాడు రేపు ఏమగునను చింతను కలిగియుండడు.

౨౦. భేదభావమును పాటించువారు బ్రహ్మహత్యా పాతకమును పొందుదురు.

## ౧౧౦ శ్రీ రామదాస స్వామి

౧. ఉత్తమ గ్రంథములను నిత్యము శ్రవణము చేసినను, అవగుణములను విడనాడక, తన హితమును తాను తెలిసికొనలేని వాడు చదువుకొనిన మూర్ఖుడు.

౨. భక్తికి వలయు సాధనలేకుండ, వైరాగ్యము, భజన చేయవలెనను భావము లేకుండ ఆచరణ రహితుడై, బ్రహ్మజ్ఞానమునకు సంబంధించిన మాటలను మాత్రము చెప్పువాడు చదువుకొనిన మూర్ఖుడే.

3. బహుశ్రుతుడును, బుద్ధిమంతుడును అయి బ్రహ్మజ్ఞానమునకు సంబంధించిన కబుర్లు చెప్పుచు దురాశ, గర్వము మనస్సునందు కలిగియుండువాడుకూడ చదువుకొనిన మూర్ఖుడే.

౪. జ్ఞానమునకు సంబంధించిన కబుర్లుచెప్పి తన స్వార్థమును పూరించుకొను వాడును పిసినిగొట్టుతనముతో ధనమును కూడబెట్టువాడును, ధనసంపాదనకు పరమార్థమును సాధనముగా ఉపయోగించుకొను వాడును చదువుకొనిన మూర్ఖుడే.

౫. జ్ఞానగర్వముతో మొండిపట్టుదల కలిగియుండు వాడును తనకు కలిగిన క్రోధమును ఆపుకొన లేనివాడును, మాటలకును, చేతలకును భేదము కనపరచువాడును చదువుకొనిన మూర్ఖుడే.

౬. అధికారము లేనిదే ఉపన్యసించుటకు వ్యర్థప్రయత్నము చేయువాడును, పరుషవాక్యములు పలుకువాడును చదువుకొనిన మూర్ఖుడే.

౭. ఇతరుల దోషములను వర్ణింపదలచువాడును, దేహాభిమానము కలవాడును చదువుకొనిన మూర్ఖుడే.

౮. ఇతరులయందు తాను చూపు దోషములు తన యందు ఉన్నను వానిని కాననివాడు చదువుకొనిన మూర్ఖుడే.

౯. పరమాత్మని విడిచి మనుష్యుని స్తుతించువాడు చదువుకొనిన మూర్ఖుడే.

౧౦. తాను వైభవమున నిమగ్నుడై జీవాత్మ తుచ్ఛమని పాఖండమతము ప్రతిపాదించువాడు చదువుకొనిన మూర్ఖుడే.

౧౧. పైపైన ఎంతయో గొప్పగా వేషము ధరించి ఆచరణమునందు ఏమియు కనబరచనివాడును, సన్మార్గమును విడిచి ఆడంబరమును మాత్రము అభిమానించువాడును చదువుకొనిన మూర్ఖుడే.

౧౨. అధ్యాత్మ నిరూపణ సమయమున ఉత్తమ శ్రోతలు వచ్చినను, వారిని విడనాడి క్షుద్రశ్రోతల మనస్సును రంజింపజేయువాడు చదువుకొనిన మూర్ఖుడే.

౧౩. తన శిష్యుడు అనధికారియై తనను అగౌరవించినను, ఆతనియందే ఇంకను ఆశ కలిగి యుండువాడు చదువుకొనిన మూర్ఖుడే.

౧౪. తాను వైభవములకు లోనై సద్గురుని ఉపేక్షించువాడును, తన గురుపరంపరను దాచువాడును చదువుకొనిన మూర్ఖుడే.

అవగుణములను తెలిసికొనియు వానిని త్యజింపనివాడు మూర్ఖుడు.

శాస్త్రములను చదివి అందు చెప్పబడిన ప్రకారము ఆచరించువాడు పండితుడు.

ఎన్ని శాస్త్రములు చదివినను, వినినను ఆ విధముగ ఆచరింపనిచో ఆ చదువంతయు వ్యర్థమే.

అభిమానోత్పత్తికి గల కారణములు :

౧. చదువురానివాడు పశువుతో సమానుడనియు, తాను పండితు డనియు భావించుట విద్యాభిమానము.

౨. గృహస్థులు మాయలోపడి యున్నారనియు, తాను ముక్తుడ ననియు తపశ్శాలి ననియు తలంచుట, తపో వైరాగ్యముల అభిమానము.

3. తాను ఉత్తమ కులీనుడనని భావించుట కులాభిమానము.

౪. తాను రూపవంతుడనని తలంచుట రూపాభిమానము.

౫. తాను ధనవంతుడనని గర్వపడుట ధనాభిమానము.

౬. శరీరబలముచే విర్రవీగుట దేహాభిమానము.

౭. శిష్యులు, సేవకులు, బంధువులు అనేకులు కలరని గర్వించుట బహుజనాభిమానము.

ఇతరులకంటె తాను అధికుడనని అనుకొనువాడును, తన ఆధిక్యమును ప్రకటించుకొనువాడును అభిమాని అని తెలిసికొనవలెను.

## ౧౧౧ శ్రీ అరిస్టాటిల్

౧. విద్య అను మహావృక్షము వేళ్ళు చేదుగాను, అది అందించే ఫలితము మధురముగాను ఉండును.

౨. ఆత్మ సంతోషించును, సంతోషించదు. ఆత్మ ఆత్మసంబంధ స్థితిలో సంతోష మనుభవించును. నిరంకుశ స్థితిలో మౌనము ధరించి సాక్షిగా నుండును. కాబట్టి అప్పుడు సంతోషించదు.

3. ఆత్మ శరీరము లేనిదనియు, నశ్వరమగు శరీరమందు గట్టిగా నిలచియున్నదనియు, గొప్పదనియు అంతటను వ్యాపించియున్నదనియు తెలిసిన జ్ఞాని ఎన్నడును విచారపడడు.

౪. ఎవరు కోరికలనుండి విముక్తులగుదురో, ఎవరు దానిని తెలిసికొనవలెనని వెదకుదురో, వారు ఆత్మను పొందెదరు. అది అట్టివారికి నిజరూపము కనపరచును. కాని, ఎవరు చెడుస్వభావము విడువక, జితేంద్రియత్వము పొందక, ధ్యాననిమగ్నులుకాక, పవిత్ర మనస్సు కలిగియుండక నుందురో అట్టివారు కేవలము జ్ఞానమువల్ల ఆత్మను పొందజాలరు.

౫. పరమాత్మ, జీవాత్మ అని రెండు గలవు. అందు పరమాత్మ "వెలుతురు" (ప్రకాశము), జీవాత్మ "నీడ".

## ౧౧౨ శ్రీ సేనేకా

౧. ద్వేషభావముతో మాట్లాడేవారు తమ శాంతిని, తమ చేతులార భంగ మొనర్చుకొందురు.

౨. ప్రేమద్వారా మనము శత్రువులను సహితము సమీపమునకు ఆకర్షించుకొని జయించగలము.

3. సమస్త విషయవాంఛా విముక్తమైన ప్రేమయే ఆధ్యాత్మిక జ్ఞానము.

## ౧౧౩ శ్రీ నిత్యానంద శ్రీప్రకాశానందస్వామి

వార్తాలాపములు :

౧. యతులకు కాంచనమును, బ్రహ్మచారులకు తాంబూలమును, చోరులకు అభయమును ఒసగినవాడు నరకమును పొందును.

౨. సెంట్లు, అత్తరులు, పువ్వులు మొదలగు సుగంధద్రవ్యములు, స్త్రీలు, వస్త్రములు, సంగీతము, పానము, భోజనము, పాన్పు, అలంకారములు - అని భోగములు ఎనిమిది రకములు.

"ముముక్షువునకు స్త్రీసంపర్కము, శయ్య, ఉత్తమాసనము, వస్త్రములు, ధనాదులు, విఘ్నకరములు. తాంబూలము, పల్లకి

మొదలగు వాహనములు, రాజ్యము, వివిధ భోగములు, బంగారు మొదలగు పదార్థములు, నృత్యగీతాది వినోదములు, భార్యాబిడలు ఈ విషయములన్నియు విఘ్నములు.

3. జ్ఞానప్రాప్తికి పూర్వము కామక్రోధాదులచే నీవు బాధపడితివి. ఇప్పుడు ఇష్టము వచ్చినట్లు సంచరించి ప్రపంచమందరి చేతను తిట్లు తినుచున్నావా? ఏమి తెలివి?

౪. నీవు తత్త్వజ్ఞుడవు. అయినను కామాదులను త్యజించలేక అధమాధములగు సూకరాదుల సమత్వమును పొందకుము. కామాది సంకల్పాత్మకమగు మనస్సునందలి దోషములను త్యజించి దేవునివలె లోకపూజ్యుడ వగుము.

౫. సత్యము జనులకు నచ్చదు. అసత్యము నచ్చును. కల్లు అమ్ముటకు ప్రత్యేక స్థలము ఉండును. పాలు, పెరుగు ఇంటింట తిరిగి అమ్మబడును.

౬. గీత నశించినది. పురాణములు పోయినవి. స్మృతులు అడుగంటినవి. వేదములు అంతరించినవి. ఇప్పుడు ఈ కలియుగమున ధనదాసుల వాక్యములే మోక్షదాయకములు.

౭ పతికిని, సన్యాసికిని మంచి వేషము అక్కరలేదు. వీరికి అడంబరము పనికిరాదు.

౮. దంభమునకు మూలకారణములు నాలుగు : 1. ప్రపంచము స్తుతించవలెనను కోరిక 2. ప్రజలు నిందించెదరు అను భయము 3. ప్రజలు పూజించవలెనను కోరిక 4. ద్రవ్యోపార్జనము చేయవలెనను భావన.

౯. తాను పూజ్యుడనని తెలుపుకొనుటకు దంభమును కలిగియుండువారు 5 రకములు.

1. దేహదంభము. శరీరమును విచిత్రముగా ప్రదర్శించుట, గాంభీర్యము వెలువడునట్లు నెమ్మదిగా సాధువుగా మాట్లాడుట మొదలగునవి.

2. కాషాయ వస్త్రములుగాని, పాతగుడ్డలుగాని, మృగచర్మము గాని ధరించుట.

3. భజనమునందు ఏకాగ్రతను చూపుటకు మౌనమును ధరించుట.

4. ప్రజలు చూచునట్లు తలవంచి నడచుట, ఎటువైపు చూడకుండుట, మార్గమున గాంభీర్యమును ప్రకటించుచు నెమ్మదిగా నడచుట, ప్రజలు చూచునట్లు దానముచేయుట మొదలగునవి.

5. తన శిష్యులను వృద్ధిచేసికొనుట మొదలగునవి.

౧౦. ధ్యానయోగముచే పరమాత్మను తెలిసికొనవచ్చును.

ఎవరిని ధ్యానించవలెను? పరమాత్మను ధ్యానించవలెను. గురువుని ధ్యానించవచ్చునా ? గురుదృక్పథముతో రామ, కృష్ణాది మూర్తులను ధ్యానించుట యుక్తము.

౧౧. ఏకాంతమున మానవుల దృష్టికి దూరముగా నుండవలెను. ఎవరిని ముట్టుకొనరాదు. ఎవరితోను సంభాషించరాదు. అట్టివానికి పరమ కళ్యాణము కలుగును.

౧౨. ముముక్షువు మలదోష నివృత్తికొరకు నిష్కామకర్మము నాచరించవలెను. నిష్కామకర్మద్వారా అంతఃకరణము శుద్ధి పొందిన తదుపరి చిత్తచాంచల్యమును పోగొట్టుటకొరకు ఉపాసన ఆచరణయోగ్యము అని శాస్త్రములు ఘోషించుచున్నవి.

౧౩. ఈ లోకములో ఏపనియును చేయని గృహస్థుడును, ప్రతిగ్రహమును చేయు యతియును, తలనొప్పి వంటివారు.

౧౪. ఎవరిమనస్సు, వాక్కు, శరీరము పాపములను చేయవో ఆమహాత్ములే తపస్వులురు శరీరమునుశోషింపజేయుటతపముకాదు.

౧౫. తగనిసమయమున నిద్రించుచున్నను, పగలు ఎక్కువసేపు నిద్రించుచున్నను తమోగుణ పరిణామము గానే గ్రహించ

వలెను. "నేను సుఖముగా నిద్రించితిని" అని తలచుకొనుట సాత్త్విక నిద్ర అనబడును. మనస్సు స్థిరముగా లేదు, చికాకుగా నున్నది. అను భావము కలిగించు నిద్ర రజోగుణ జన్యమగు రాజస నిద్ర అనబడును. లేచునప్పటికి గ్లాని, జాడ్యము కలిగినచో ఆ నిద్ర తామస నిద్ర అనబడును. కథా కాలక్షేపములు వినుచున్నపుడు కునికిపాట్లు పడినచో అది తమోగుణ లక్షణమే.

౧౬. పరులకొరకు సముద్రోదకమును గ్రహించు మేఘుడు కూడ నల్లబడుచునే యున్నాడే? ఇక ధనికుని దగ్గరనుంచి తన స్వార్థమునకు ధనమును గ్రహించిన వానికి ముఖము మలిన మగుటలో ఆశ్చర్య మేమి?

౧౭. ఎక్కడ నిన్ను ఎక్కువగా అవమానించెదరో అక్కడ నివసించుము. ఇదియే నీకు ఉత్తమమగు ఔషధము. ముముక్షువు సన్మానస్థలమున నివసించుట మంచిది కాదు. లోకులు గౌరవించుట యోగసిద్ధికి మిక్కిలి హానికరము. జనులచే అవమానింపబడిన యోగి యోగసిద్ధిని పొందును.

౧౮. ఆత్మజ్ఞానమునకు ముఖ్య ప్రతిబంధము దేహాధ్యాస. దానినుంచి నివృత్తిని పొందుటకు సన్యాసము తీసికొనవలెను. సన్యాసము తీసికొనిన పిదప దేహాధ్యాసను వృద్ధిపొందించు విషయపంచకమును, పూజా ప్రతిష్ఠాదులను త్యజించి, నిర్జన ప్రదేశమునందుండి ఆత్మచింతనమును, ధ్యానమును చేయువలెను. ఆత్మచింతన వృద్ధి పొందిన కొలదియు దేహాధ్యాస నివృత్తిని పొందును. అట్లు ధ్యానము చేయుచుండగా దేహాధ్యాస పూర్తిగా పోయినప్పుడే ఆత్మసాక్షాత్కారము కలుగును. అని మనువు అభిప్రాయము.

౧౯. అరణ్యము దావాగ్నిచే దగ్ధమయినను మరల పెరుగును. కాని ప్రతి గ్రహముచే దగ్ధమయిన నరుడు తిరిగి ఔన్నత్యమును పొందడు.

౨౦. 1. ఉత్తమ గ్రంథములను నిత్యము శ్రవణము చేసినను, అవగుణములను విడనాడక, తన హితమును తాను తెలిసికొనలేనివాడు చదువుకొనిన మూర్ఖుడు.

2. భక్తికివలయు సాధనము లేకుండ వైరాగ్యము, భజన చేయవలెనను భావము లేకుండ ఆచరణరహితుడై, బ్రహ్మజ్ఞానమునకు సంబంధించిన మాటలను మాత్రము చెప్పువాడును,

3. బహుశ్రుతుడును, బుద్ధిమంతుడును అయి బ్రహ్మజ్ఞానమునకు సంబంధించిన కబుర్లు చెప్పుచు దురాశ, గర్వము మనస్సునందు కలిగియుండువాడును,

4. జ్ఞానమునకు సంబంధించిన కబుర్లు చెప్పి తన స్వార్థమును పూరించుకొనువాడును, లోభత్వముతో ధనమును కూడబెట్టువాడును, ధనసంపాదనమునకు పరమార్థమును సాధనముగా ఉపయోగించుకొనువాడును,

5. జ్ఞానగర్వముతో మొండిపట్టుదల కలిగియుండువాడును, క్రోధమును ఆపుకొనలేనివాడును, మాటలకును, చేతలకును భేదము కనబరచువాడును,

6. అధికారము లేనిదే ఉపన్యసించుటకు ప్రయత్నము చేయువాడును,

7. ఇతరుల దోషములను వర్ణించదలచువాడును, దేహాభిమానము కలవాడును,

8. ఇతరులయందు తాను చూచు దోషములు తనయందున్నను వానిని కాననివాడును,

9. పరమాత్మని విడిచి మనుష్యుని స్తుతించువాడును,

10. తాను వైభవమున నిమగ్నుడై జీవాత్మ తుచ్ఛమని పాఖండమతమును ప్రతిపాదించువాడును,

11. పైపైన ఎంతయో గొప్పవాడుగా వేషము ధరించి ఆచరణమునందు ఏమియు కనబరచనివాడును, సన్మార్గమును

విడనాడి ఆడంబరమును మాత్రము అభిమానించు వాడును,

12. తాను వైభవములకు లోనై సద్గురుని ఉపేక్షించువాడును- వీరందరు చదువుకొనిన మూర్ఖులే.

౨౧. జనులందరు నన్ను స్తుతించుపనులనే నేను చేయవలెను, వారి నిందను నేను పొందరాదు. అను పట్టుదలను కలిగియుండుట లోకవాసన. ఈ లోకవాసనను నూరుజన్మము లెత్తినను పూర్తిచేసికొనలేము. కావున ఇతరుల నిందాస్తుతులను లెక్కపెట్టకుండ అధికారియగు నరుడు సమభావమును పొందియుండి తన హితమును కోరవలెను.

౨౨. కామినీకాంచనములను త్యజించిన ఏకాంతికముగు, వానప్రస్థ జీవితము గడుపు వారెవరైనను ఓంకారము నుపాసించవచ్చును. ఏ కారణముచేతనైన సంపూర్ణత్యాగము చేయలేనివారు అజపామంత్రమును శ్వాసద్వారా "సోహం" జపించవచ్చును. శ్వాసను లోపలికి పీల్చునపుడు 'సో' అని బయటకు విడుచునప్పుడు 'హం' అని వదలవలయును. ఇట్లు లయప్రకారము జపించినచో సోహం (ఓం) అను ధ్వని వినిపించును. దీనిచే చిత్తము స్థిరమగును. మలదోషనివృత్తి యగును. దైవానుగ్రహము కలుగును. అనగా నిర్వికల్ప సమాధివరకు చేరుటకు ఇది సాధనము.

౨౩. కామమును బలహీనపరచవలెననిన పగటిపూట ఉపవాస ముండుము. రాత్రి స్వల్పభోజనము చేయుము. నేత్రములను సుందరరూపమును చూడనీకుము. ఏకాంతమున నుండుము. మనస్సును సంకల్పముల నుండియు, ఆలోచనల నుండియు దూరము చేయుము.

౨౪. జనులతో వాదవివాదములను చేయవలె ననుకొను వారు మూర్ఖులు. అట్టివారి హృదయములును అశాంతిని పొందును. ఆయువు వ్యర్థమగును.

౨౫. నిర్గుణోపాసన చంచలచిత్తునకు కష్టసాధ్యము. సామాన్యులకు సగుణోపాసన ఆచరణీయము. సగుణోపాసనకూడ చేయలేని నరుడు నిష్కామకర్మ ఆచరించవలెను. నిష్కామకర్మకుకూడ అసమర్థుడైన సకామకర్మమునే చేయవలెను, సకామకర్మమును కూడా ఆచరించలేనివాడు నికృష్టుడు. ఆతనికి అధోగతి కలుగును.

౨౬. ఒక కసాయి ఒక ఆవును వెదకుచు వెదకుచు అక్కడ కూర్చొనియున్న ఒక సాధువునుచూచి "ఓ సాధూ! ఆవును చూచితివా?" అని ప్రశ్నింపగా ఆ సాధువు ఇట్లు చెప్పెను. "చూచినవాడు మాట్లాడుట లేదు. మాట్లాడువాడు చూడలేదు. రెంటిని కలుపువాడు గురుచరణములయందు నిమగ్నుడై యున్నాడు." సాధువు నిజమే చెప్పెను. చూచినవాడు మాట్లాడుటలేదు. అనగా కన్ను చూచునది. కాని అది మాట్లాడలేదు. మాట్లాడువాడు చూడలేదు. అనగా నాలుక మాట్లాడుచున్నది. కాని, అది చూడలేదు. ఇరువురను కలుపువాడు గురుచరణములయందు నిమగ్నుడై యున్నాడు. అనగా బుద్ధి నేత్రములద్వారా చూచును. జిహ్వద్వారా మాట్లాడును. అది గురుచరణములయందు నిమగ్నమై ఉన్నది. అని తెలిపెను.

౨౭. ఒకప్పుడు ఒకభక్తుడు మస్తరామ్‌గారి వద్దకు జని, మేము దేవునకు మందిరము కట్టించుచున్నాము. తమరు తఖ్తసింగ్ మహారాజుగారితో మాకు సహాయము చేయించగలరాయని అడిగెను. అదివిని, మస్తరామ్‌గారు ఇట్లనిరి. నీ దేవుడు గొప్పవాడా? తఖ్తసింగ్ గొప్పవాడా? గొప్పవాడు దేవుడే కదా! గొప్పవాడు తక్కువవాని వద్దకువెళ్ళి యాచించుట తగునా? నీ దేవుని మందిరమున కూర్చుండ బెట్టవలెనని కోరిక నీకున్నచో నీవు ఆయన వద్దకే వెళ్ళి అడుగుము. అని బదులు చెప్పెను.

## ౧౧౪ మహాత్ముడు అభయము

౧. మృత్యుభయము, సంపత్తి నశించునను భయము, కుటుంబభయము, రోగభయము, శస్త్రభయము, అపవాదభయము,

అవమానభయము యిట్లు అనేక భయములు కలవు. అట్టిభయము లేమియు లేకుండుటే అభయము. సత్యవ్రతుడు ఈ భయములన్నిటిని పరిత్యజింపవలయును. కామ క్రోధ లోభాది అంతఃశత్రువుల జయించినచో బాహ్యభయముల ఉపద్రవములు వాటంతటవే తొలగును.

౨. దేహాభిమానమే భయమునకు కారణము. కావున దేహసంబంధములగు, రాగాసక్తులు తొలగునేని సహజముగా అభయము ప్రాప్తించును. ఇది నాది యను కల్పనా సృష్టియే భయమునకు కారణము. ఇది నాదికాదు, ఈశ్వరునిది. నేను కూడా ఈశ్వరునివాడనను సంకల్పమే అభయము. యజమానత్వమును విడిచి సేవకుడవై శూన్యునివలె ప్రవర్తింతువేని అభయుడ వగుదువు. శాంతి చేకూరును. ప్రభుదర్శనమగును.

3. అభయుడు కానిదే సత్యాన్వేషి కానేరడు. సత్యశోధకుడు కానిది అహింసాపాలన మెట్లగును? శూరులే హరి మార్గమనుసరింతురు. అది పిరికిపందల పనికాదు. సత్యమే హరి యనబడును. పిరికిపంద నిర్భయుడు కానేరడు. ఖడ్గము, శౌర్యసూచకము కాదు. అది భయచిహ్నము.

## ౧౧౫ శ్రీ స్వామి అఖండానంద్ జీ మహామండలేశ్వరుడు

౧. జీవునికి భగవంతుని శ్రీచరణములయందు విశ్వాసము కలిగనేని మృత్యువును జయింపగలడు.

౨. మహాపురుషుల ఆచరణయే బోధరూపమగును. పరిశుద్ధ హృదయముతో ధర్మమును పాలించువానికి స్వాభావికముగానే దివ్యదృష్టి కలుగును. సత్కర్మములలో గొప్ప శక్తికలదు. దానిచే జీవునికి ఆత్మోన్నతి ప్రాప్తించును. జీవుడు సంసార మోహములో చిక్కుకొని యుండునంతవరకు భగవంతుడు జీవునివైపు చూడనే చూడడు. సర్వకామములను త్యజింప నంతవరకు సుఖ శాంతులు లభింపవు.

3. మనస్సును ప్రసన్నము గావింప తలచినచో, మనస్సులోని వాసనలను దోషములను తొలగింపవలెను. అసత్యమగు వ్యవహారమును త్యజింపవలయును.

౪. భగవత్ప్రాప్తి కావలయు నన్నను, స్వస్వరూపానుభవమును పొందవలయు నన్నను శరణాగతుడు కావలసియుండును. నేను పరమాత్ముని వాడను, ఆయన ఆజ్ఞలను ప్రతికూలింపను, ఆయనకు ప్రతికూలమైన ఏ కార్యమును చేయనని ప్రతిజ్ఞ చేయవలెను.

౫. శుద్ధాంతఃకరణము కలవాడును, రాగరహితుడును, వైరాగ్యము కలవాడును, జ్ఞానమార్గమునకు అధికారియగును. మలినాంతఃకరణము కలవాడు, కర్మకాండమునకు ఉపాసనా కాండమునకు అధికారి యగును. దీనిచే మనస్సు పరిశుద్ధమై జ్ఞానమార్గమున ప్రవేశించును. విశుద్ధమగు నిర్మలాంతఃకరణము కలవాడే బ్రహ్మోపాసనకు అధికారియగును.

౬. ఎవనిమనస్సు నిర్మలముగను, కపట రహితముగను నుండునో వాడే నిజమైన భక్తుడు. అట్టివానికే శరణాగతి కధికారముండును.

1. పరోక్ష శరణాగతి యనియు, 2. అపరోక్ష శరణాగతి యనియు, 3. అనన్య శరణాగతి యనియు, శరణాగతిమూడు విధములుగా నుండును.

1. నేను పరమాత్ముని వాడను, ఇది పరోక్ష శరణాగతి.

2. నేను నీ వాడను, ఇది అపరోక్ష శరణాగతి.

3. నేను నీ స్వరూపమునే. దీనినే అభేద శరణాగతి యందురు.

౭. ఇంద్రియ నిగ్రహమును, చిత్తశుద్ధియు, పరబ్రహ్మ ప్రాప్తియు కానంతవరకు ప్రణవమంత్రమును జపించుచుండవలయును. అంతఃకరణము శుద్ధికాగానే ఆ జపము తనంతట తానే సమాప్తమగును. కర్మకాండ సమాప్తమగును.

౮. సాంసారిక పదార్థములయెడ రాగము లేకుండుటే చిత్త శుద్ధి యనబడును.

౯. ధనము, స్త్రీ పుత్రాదులు కర్మముచే లభించును. భక్తిభావము, సత్సంగము, భగవత్కృపచే లభించును. వాయువు గంధమును యితరుల నద్దకు చేర్చునట్లు భగవంతుడు భగవద్భక్తిని సంతులద్వారా భక్తులవద్దకు చేర్చును. దీనివలన విచారము, వివేకము జనించును.

౧౦. మానవుడు క్షురకర్మ సమయమున మంగలిని విశ్వసించి తన శిరస్సును అతనికి అప్పగించును. కాని భగవంతుని విశ్వసింపడు. ఇది యేమి విచిత్రమో!

౧౧. ఓ అన్నలారా! మేలుకొనుడు. మనో ఇంద్రియము లను భగవదర్పితము చేసి భక్తితో భజింపుడు. మనమందరము భగవంతుని పుత్రులమే. కావున యెవరిని ద్వేషింపకుడు. భేదభావ ముంచకుడు. భోగవిలాసములను త్యజింపుడు. వీరుడగు సమర్థుడే భక్తి చేయకలుగును. ఎవని అంతఃకరణమునుండి 'నేను', 'నాది' అనునది వెడలిపోవునో, వాడే భక్తిపరుడగును. భక్తి లేక జ్ఞానము కలుగదు. జ్ఞానము లేనిది భక్తి నిలువదు.

౧౨. వేదవాక్యానుసారము బ్రహ్మము పరిశుద్ధుడు. లోక వ్యవహారానుసారము బ్రహ్మము శక్తిస్వరూపుడు. జీవుడే బ్రహ్మము, ఆత్మయు బ్రహ్మమే. జీవునిలోపల బ్రహ్మకలడు. బ్రహ్మలోపల పరబ్రహ్మ కలడు. సృష్టి స్థితి లయ కర్తయే ఆ పరబ్రహ్మము.

౧౩. ఈశ్వరునకు జగత్తును సృష్టించుటలో ఎట్టికారణము లేక లాభమును లేదు. జీవుని కర్మము లెపుడు ఫలోన్ముఖము లగునో అపుడు ఈశ్వరుడు జీవుల కర్మానుసారము జగత్తును సృష్టించును. ఈశ్వరుడే జగత్తునకు ఉపాదానకారణుడు, నిమిత్త కార

ణుడును. కారణము ఒకటే అగుటచే కారణ బ్రహ్మముకూడా ఒకడే కలడు. అందుకే ఈశ్వరుడు ఒకడే. జీవుని ఉపాధి కారణములు అనేకములు కనుకనే జీవులు అనేకులు.

౧౪. రామ కృష్ణాది అవతారములు మాయ పరిణామములు, ఈశ్వరుని విశేష విభూతులు. వీనిని కార్యబ్రహ్మము, కారణ బ్రహ్మము అందురు. కార్యబ్రహ్మము ఉపాసకుడు, పూజకుడుకూడ. కారణబ్రహ్మము ఉపాస్యము. శుద్ధనిర్విశేష బ్రహ్మము ప్రాప్యము, సాక్షి.

౧౫. శివుడు, విష్ణువు వేరువేరుగా లేరు. ఇద్దరు ఒకటే. కేవలము శబ్దభేదమే. పరమాత్మ డొకడే. శివపురాణము శివుడే పరమాత్ముడని తెలుపును. విష్ణుపురాణము విష్ణువే పరమాత్ముడని తెలుపును. పురాణములన్నిటిని వేదవ్యాస మహర్షియే రచించెను. వానిని మనము అర్థము చేసికొనుటలోనే భేదము కలదు. శ్రీ వేద వ్యాసమహర్షి సిద్ధాంతము ఏకేశ్వరోపాసనయే. కారణబ్రహ్మయే ఉపాసకుడు. కావున భగవంతు డొకడే. ఇటులే మానవులందరు ఒకటే, మనలో భేద ముండరాదు. శాస్త్రములన్నియు ఒకటే. ఏలనన ప్రాప్యవస్తువు, భగవంతుడును ఒకడే. కావున, మనమందరము ఒకటే.

౧౬. నిన్ను నీవు అర్పించుకొనుటే నిజమైన పూజ. మనో బుద్ధులను అర్పించుటయే, తులసిపత్రి అర్పించినట్లగును.

౧౭. కార్యకారణములన్నియు నశించినపుడే శుద్ధబ్రహ్మము ప్రాప్తమగును. ఇవన్నియు ఉపాధిభేదములే. అంతర్ముఖులై అంత ర్జ్యోతియొక్క ధ్యానాభ్యాసమగు సహజయోగముచే, ఈశ్వరునిలో లయమగుటయే సర్వోత్తమమగు సాధన.

౧౮. అందరిని భగవంతునిగా తలంచమని వేదముఘోషించు చున్నది. జగత్తును భగవంతునిదిగా భావింపుము. మిథ్యయని

తలంపకుము. సర్వలోకములను నడుపువాడు ఈశ్వరు డొకడే, ఆయ నని ఉపాసింపుము.

౧౯. భస్మమును ధరించుటకు కారణము, రహస్యము ఏమన, లోకేషణ, ధనేషణ, పుత్రేషణలను, సత్వ రజ స్తమోగుణము లను త్యజించి (భస్మముచేసి) ఉపాసించుట ఉపాసకుని లక్షణము. పూజ, ఉపాసనచేయు భక్తుని పరీక్షించుటకు యిదిరా గీటురాయి.

౨౦. ఆత్మకంటె భిన్నముగా కనుపించునదంతయు మిథ్యయే. ఆత్మసాక్షి, అధిష్ఠానుడగు నేత పరమాత్ముడు. అనాత్మ పదార్థ మంతయు అనిత్యమే. లౌకిక వ్యవహారము నుండి మనస్సును తొల గించుట సమమనబడును. నేత్రాది యింద్రియములను అంతర్ముఖము చేయుట దమమనబడును. బాహ్యకర్మముల నుండి తొలగుట సన్యాస మనబడును. చిత్తశుద్ధికొరకే కర్మములు చేయబడును. చిత్తములో మలినదోషము లుండువరకు కర్మములు చేయుచుండవలెను. ప్రమా దమును విడచి చిత్తమును శ్రవణమననములో పెట్టుటయే సమాధా నము. అన్నిటియందును బ్రహ్మమును చూచుట ఆస్తిక మనబడును.

౨౧. సంసారమునుండి విరక్తుడై భగవత్ప్రాప్తిని కోరు వాడు ఓంకారమును జపించవచ్చును.

౨౨. విషయరహితుడై భక్తిచే భగవన్నామ సంకీర్తనము చేయవలెను. శబ్దము (నామస్మరణము)చే అపరోక్షజ్ఞానము కలు గును. అది మరణించిన వానిని బ్రతికించును. శాంతము కలవానిని ఉద్రేకునిగామార్చును. ఉద్రేకుని శాంతింపజేయును. మరియు భగ వంతుని దర్శింపచేయును. శబ్దములో గొప్పశక్తి కలదు. దీని ద్వారానే ప్రపంచ వ్యవహారము జరుగుచుండును. కాని నామ మును విధిపూర్వకముగా ఆచరింపవలయును. దీనివలన స్వస్వరూప జ్ఞానముకూడ కలుగును.

౨౩. సర్వాత్మభావమే బ్రహ్మభావము. ఇదే జ్ఞానఫలము. ఇదియే ముక్తి.

౨౮. సంసారులు స్వార్థపరులు. చాకలివాడు గాడిద వెంబడి పడి తిరుగుచందమున ఎంతవరకు నీవు వారి పనులు చేయు చుందువో అంతవరకు వారు నిన్ను అనుసరించి నీ వెనువెంట తిరుగుచుందురు. ఎపుడు నీవు వారి పనులకు పనికిరావో అపుడు వారు నీ వైపు తిరిగి చూడరు.

౨౯. నిజమైన శివలింగమును పరీక్షింప దలంచినచో ఆ లింగమును ఒక తరాజులో పెట్టి మూడుమార్లు జోకి చూడుము. అపుడు ఆ లింగము హెచ్చు తగ్గులగుచో నిజమైన లింగమని తెలిసి కొనుము. మూడుసార్లు జోకినప్పటికిని అది సమానతూకములోనే నుండుచో, అది నిజలింగము కాదనుకొనుము.

## ౧౧౬. సాధు గరీబ్ దాస్‌జీ

[వీరు గుజరాత్ దేశములో కచ్ ప్రదేశమున "కూకుమా" అను గ్రామమందు నివసించుచుండిరి. సర్వసంగ పరిత్యాగులు, సదా భగవద్భజనలో తల్లీనులై యుండువారు. నిత్యము ప్రజలకు సద్బోధ చేయు చుండువారు.]

౧. ఓ బాటసారీ! మోహ నిద్రనుండి మేలుకొనుము. ఇంకేల ఆలసించెదవు. మృత్యువెపుడు సంభవించునో యెవరి కెరుక? జనసమూహ సాంగత్యమును త్యజింపుము. భోగరాగముల నుండి విరక్తుడవు కమ్ము. ధన సంపత్తులకు అగ్నితగిలించుము. ఆడంబరములను విడిచిపెట్టుము.

౨. నీ తాతతండ్రులందరును వెళ్ళిపోయినది నీవు చూచితివి కదా! ఇక నీవుకూడ ప్రయాణమునకు సిద్ధపడుము.

౩. పొట్టకూటికై భోగాసక్తిలోపడి పరిశ్రమలేని అన్యాయార్జితమగు తిండిని తినుట మహాపాపము. రెండు దినములదైన యీ ప్రపంచములో విషయసంగతికి విరామములేదు. కావున విషయవాంఛలను త్యజింపుము.

౪. ఓ ప్రియుడా! కుక్కలు, పందులరీతి జీవించెద వెందులకు? నీ ఆయువు బహుస్వల్పము. కావున ఎల్లప్పుడును హరిని స్మరించుచుండుము. నేను తెలిసి చెప్పుచున్నాను వినుము.

౫. సోదరా! ధన మదాంధుడవై పాపవ్యవహారములను చేయుచుందువు. కాని అది నీ మెడకు ఉరిత్రాడై నరకమునకు గొనిపోవును సుమా!

౬. సంపాదించిన దంతయు అందరుకలసి తిందురు. కాని నరకమునకు నీవొక్కడవే పోవలసివచ్చును. నీ వెంట యెవరును రారు. మోసపోకుము.

౭. ఓ నాయనా! ఎవరిని ద్వేషింపకుము. ఇతరుల సొత్తును దొంగిలింపకుము. భగవంతునికి భయపడుము. అంతమునకు నీకు అతడేగతి. ఇక్కడ ఉండునది నాలుగు నాళ్ళే కదా! ఎవరిని కష్టపెట్టకుము. మౌనము వహింపుము, నా మాటను తెలిసికొనుము.

౮. ఓ మానవుడా? నీవు మోహమత్తుడవై తిరుగుచుందువు. ఎప్పుడు ఎక్కడికి పోవలయునో నీకు తెలియదు. చివరకు నీవు మృత్యువునకు బలికావలసినదే. నాయనా! అట్టిసమయ మాసన్నమై యున్నదిసుమా! ఓ ప్రియుడా! ఇక సమయము దాటిపోవుచున్నది. విషయవాసనలను త్యజింపుము. అజ్ఞాన నిద్రనుండి మేలుకొనుము. హరిని భజింపుము.

౯. నీవు మోక్షమును కోరుదువేని అవినీతిని విడువుము. మాటయిచ్చి తొలగకుము. సుఖభోగములను కాల్చివేయుము. ఈ సమయము దాటిపోవును. విపరీతకాలము ఆసన్నమగును. అది నిన్ను యెనుబది నాలుగులక్షల యోనులందు త్రిప్పును. అట్టి చిక్కులో పడుదువేల? భగవచ్చరణములందు చిత్తము చేర్చకపోతివి, జగత్తుయొక్క జంజాటమును విడువక పోతివి కదా!

గేయము :

౧౦. అద్భుతమోయీ నీ రచనా! అద్భుతమో యీ
నీ రచనా!

ఒక బిందువుచే నింతలుగా! ఒక బిందువుచే వింతలుగా
లోపలనీవు ప్రతిష్ఠుండవై తనువును ప్రాణిగ చేసితివే!
ఎముకలగూటిని తయారుచేసి కప్పితివోయి
చర్మముతో ॥అద్భుతమోయి॥

౧౧. నీవు గర్భగోళములో తలక్రిందుగా ఉన్నప్పుడు సదా నీ నామమునే స్మరింతునని భగవంతునితో ప్రతిజ్ఞచేసి ఈ లోకములో పడగానే, మమతా మోహాదులలో చిక్కి ఆ నామస్మరణమును ఏల మరచితివి? పాపపుణ్య పరీక్షాదినమున యమభటులు దండించుచుండ అపుడేమి బదులు చెప్పుదువో, కొంచెము నీవే విచారించుకొనుము.

౧౨. తల్లి తండ్రులును, కుటుంబ పరివారమంతయు తమ స్వార్థమునకే నిన్ను ప్రేమింతురు. లోకులును, తమ స్వార్థమునే చూతురు. నీ అంతఃకరణమును వెదకిచూడుము, విచారింపుము. ఇవన్నియు నరకద్వారములే. మోహజాలములో చిక్కి ఈ జగత్తులో వ్యర్థముగా తిరిగెద వెందులకు?

౧౩. అజపమంత్రమును సదా జపించుచుండుము. సోహం శబ్దమను మాల, ఒక నిమిషముకూడ ఆగకుండ దివారాత్రములు సోహం, సోహం, అను ధ్వనితో నీలో తిరుగుచున్నది. దానియందు దృష్టినుంచి ఉచ్ఛ్వాసనిశ్వాసముల ద్వారా ఆ సోహంను, సదా స్మరించుచుండుము. అభేద భావముగల ముక్తిదాతయగు ఈ మహామంత్రము సర్వదుఃఖములను, కష్టములను నిర్మూలించును.

౧౪. ఓ మూఢుడా! నాది నాది అనుకొనుచు యేల చత్తువు? ధన సంపత్తులును, దేహ గేహాదులును, తుదకు ఒక దమ్మిడికూడ

నీ వెంట రాదుసుమా! కావున, కార్యకలాపము లన్నిటిని విడచి, హరిని భజింపుము.

౧౫. ధనము, భూమి, స్త్రీ ఈ మూడునుఎల్లప్పుడును ఉండు నని నమ్మితివి. కాని యివి వాస్తవములో మోసకారులే. కావున వీటి నన్నిటిని మరచిపొమ్ము.

౧౬. గీత, భాగవతములను కంఠస్థము చేసితివి. గొప్ప వాక్య చతురతను చూపితివి. కాని నిజాత్మను కనుగొనక పోయితివి. ఈశ్వరునియందు మనస్సు చేర్చవైతివి. మోహమమతలను విడువక పోయితివి. ఇక ఆత్మ సుఖమెట్లు కలుగును?

౧౭. ఎవని హృదయములో రాము డుండునో, యిక యితరులతో పనియేమి? సంసారసంబంధమును త్రెంపుము. విషయముల నుండి మనస్సును త్రిప్పుము. చిత్తమును హరిచరణములందు జోడింపుము. ఇటు నటు చూడకుము. హృదయ మందిరమును విప్పుము. సదా హరిని స్మరింపుము.

గేయము :

౧౮. అజాగ్రత్తలో లాభము లేదు. అజాగ్రత్తలో
లాభము లేదు.

దొంగలదోయి ప్రపంచ గ్రామము!
తల్లీ తండ్రీ తోడూనీడా దోపిడిగాండ్ర ముఠా!
లోకముగెలుచు కిరాతకితిరుగును "నారీ" దానినామం
కుంజరయాన మృగేంద్రకటీ ఫణివేణీ తరుణీ శ్యామ.
చీకటిరాత్రుల అడవి, మహాబలి కాముని పూర్ణ
కలాపం.

మోహమంత్రమున పురుషునిజంపి, దోచును గల
ధన ధామం,
దుర్గంధిలమగు దేహముపైన, మెరయును తుచ్ఛపు
చర్మం. ॥అజాగ్రత్తలో లాభము లేదు॥

గేయము :

౧౯. మేలుకోరా మేలుకో, ఛీ సిగ్గుమాలిన, వ్యర్థజీవా !
మేలుకో !

కాలుడెప్పుడు శిరముపై నిలుచుండి యుండగ
చూడవే !

నిద్రలో పడియుందు వెప్పుడు! నీవు నిర్లజ్జాగ్రణి
విరా ! మేలుకో ! ॥మేలుకోరా॥

పెక్కు దేహముల ఉదరసీమల లెక్కలేని యుగాల
మారుల పుట్టితివి, చచ్చితివి,

నీవు సిగ్గుగాంచ వొకింత యింకను మేలుకోరా,
మేలుకో ! ॥మేలుకోరా॥

౨౦. ఉప్పు, కారము, నూనె, పులుపు తినకూడదు. ఉప్పుచే లోకవాసన, కారమునుండి మోహ మమతలు, నూనె, పులుపుల వలన నీది నాది అనుభేదము జనించును. ఉప్పు వాసనాతుల్యము. కారము మోహతుల్యము.

౨౧. తనస్సు, వైరాగ్యము, త్యాగము, ఈ మూడును మన వస్తువులు. శరీరము, ధనము, స్త్రీ, ఈ మూడును పరవస్తువులు. పరవస్తువునుండి దుఃఖము, మనవస్తువులనుండి సుఖము కలుగును.

## ౧౧౩ పరమసంత్ బాబా జయమల్ సింహజీ మహారాజ్

[బాబాగారు సర్వమును త్యజించి యిల్లు విడచిపోవుచున్నపుడు వీరి తల్లి యిట్లనియె : "ఓ కొడుకా ! నీవు ఈ సంపత్తిని విడచిపోయినచో, అది యితరుల పాలగును కదా !"

బాబా : "ఓ తల్లీ ! తీసుకపోనీ. ఎవరికేది అవసరమో వారు అది తీసికొనెదరు. ఈ ప్రపంచము మనది కాదు. ఈ సర్వసంపత్తులను ఒకరోజు మనము విడువక తప్పదు. కేవలము మన జీవయాత్ర నడువవలెను కదా ! సర్వసంపత్తి పోయినను మనకు భయమెందు

లకు ? పరమాత్ముడు మనకు సుదృఢములైన రెండు హస్తముల నిచ్చినాడు. ఆయన కృపవలన గౌరవమర్యాదలతో జీవింప వచ్చును.” అని తల్లికి బదులు చెప్పిరి.

బాబాగారు నిరాడంబరులు. తనకొరకు బహుస్వల్పము ఖర్చు చేయుచు బీదసాదలకు ఎక్కువ ఖర్చు పెట్టుచుండిరి. సన్మానము లకును, కీర్తిప్రతిష్ఠలకును యిష్టపడక దూరముగ పరుగెత్తుచుండు వారు. నిరాడంబరమును, నమ్రతయు సాధువులకు శోభయని అనుచు, తాను నిరాడంబరులై ప్రవర్తించుచుండెడివారు.]

౧. ఓ సోదరా ! నీ మనస్సులో “నేను, నాది” అను భావము రానీయకుము. త్రిలోకాధిపత్యము లభించినను, దానిలో నీకు భాగము కలదని యెప్పుడును తలంపకుము. దానికి నీవు సేవకుడవుగా తలంపుము.

౨. పరమార్థ మార్గములో న్యాయార్జితమగు సాత్వికాహా రము ముఖ్యము. పరులసొత్తు గ్రహింతువేని వారికి ఋణపడుదువు. అపరిగ్రహము లేక ముక్తి లభింపదు.

౩. భజన, స్మరణ, ధ్యానాది సమయమున సంసారములోని సర్వచింతలను తొలగింపుము. ఎట్టి ఆపత్తి సంభవించినను, భజన ధ్యానాది సమయమును మీరవలదు. యథా సమయముననే ఆచ రింపవలయును. లేనిచో నిష్ఫలమగును.

౪. మద్యమాంసాదులను సేవించువారు తయారుచేసిన పదార్థములను తినకుము. వాని ప్రభావము నీపై పడును.

౫. మోక్షమును కోరుదువేని బాహ్యమునువిడచి అంతర్ముఖు డవుగమ్ము. పరమార్థసాధనలో, మనోయింద్రియములను నిరోధింప కుండుట అన్నిటికంటె గొప్ప అనర్థము.

## ౧౧౮ స్వామీజీ మహారాజ్

**శిష్యుడు జయమల్‌సింహునకు ఆదేశము :**

౧. వత్సా ! లోకకల్యాణమునకై సేవచేయుము. జీవులు సత్యమార్గావలంబు లగుటకు ప్రయత్నింపుము. వారి ఆత్మలను

బీదలకు పంచిపెట్టుము. సంగ్రహముచేయుట పాపము. చత్తునని భయపడకుము.

౨. నీ మనస్సును సంసారసంబంధమునుండి తొలగించి, భగవంతుని యందు చేర్చి అంతర్ముఖుడవై చూడుము. మనస్సు సాధనచేతనే స్వాధీనమగును. ప్రపంచ ప్రబోధమును విడువుము. భేదభావమును త్యజింపుము. అందరిని సమముగా చూడుము.

## ౧౨౨ మేన్‌పురి ఆశ్రమ విరక్తుడు

౧. ఓ మానవుడా! నిన్ను నీవు మంచివానిగాను, లేక చెడ్డవానిగాను తలంపకుము. అందరిలో భగవంతుని చూడుము. అహంకారమును నశింపచేయుము. ఏదియు కోరకుము. ఏ కోరికలు లేనివాడు పరాధీనుడు కానేరడు. నిశ్చింతుడ వగుము. ఎవరిని యేదియు యాచింపకుము. నీ జ్ఞానము నీ లోపలనే ఉన్నది. అంతర్ముఖుడవై చూడుము. నిన్ను నీవు మరువకుము. అవసరమగుచో గురువు స్వయముగా నీ యొద్దకు వచ్చును. చింతింపకుము. సర్వ సంబంధములను త్యజించి కేవలము భగవంతుని విశ్వసింపుము.

౨. ప్రతియొక్కరిని నీ కంటె పెద్దవారనియు, గొప్పవారనియు తలంచి వారిని సేవింపుము. నేను అను అహంభావమును విడువుము. పసిబాలునిరీతి ప్రవర్తింపుము. నిన్ను నీవు భగవంతునకు సమర్పించుకొనుము.

3. అవసరము కంటె అధిక ముంచుకొనకుము. భగవంతుని భజించుటకు ప్రచారముచేయుము. ఒక బట్ట నీ వద్దనున్నచో, రెండవ బట్టను నీ వద్ద ఉంచుకొనక లేనివారి కిమ్ము. దొరకిన దానితో సంతోషింపుము, లేనిచో నిశ్చింతుడవై యుండుము. నీవు తినుచున్నపుడు ఏ ప్రాణి వచ్చినను మొదలు దానికిపెట్టి మిగిలిన దానిని తినుము. మిగులనిచో చింతింపకుము.

౮. ఆచరణలేక ఉపదేశించుటకు ప్రయత్నింపకుము. నీవు ఆచరించి యితరులకు చూపుము.

౯. నిస్స్వార్థివి, నిరోగివి కమ్ము. నీవు స్వయము మోస పొమ్ము. కాని పరులను మోసగింపకుము. నీవు చెడినను యితరులను చెరుపకుము. ఇవ్వుము. కాని తీసికొనకుము. పనిచేయుము కాని పని తీసికొనకుము.

౬. నీ యొద్ద చెడ్డవస్తు వున్నను, చెల్లనిపైస ఉన్నను, వానిని వెంటనే నశింపజేయుము. అవి యుండుచో వాటివలన యితరులకు నష్టము కలుగును. దానికి కారకుడవు నీవే అగుదువు.

౭. నీ యింద్రియములలో ఏ ఒక ఇంద్రియము దూషిత మైనను నీవు నరకబాధను అనుభవింపవలసి వచ్చును. కావున ఇంద్రియములను నీ వశమందుంచుకొనుము.

౮. ఎల్లప్పుడు బీదలవైపు దృష్టినుంచుము. వారితో సంబంధము పెట్టుకొని వారికి సహాయము చేయుచుండుము.

## ౧౨౩ స్వామిజీ మహారాజ్

౧. ప్రపంచములోని వన్నియు మంచివే. ఒక వస్తువు ఒకనికి మంచిగను, అదే వస్తువు వేరొకనికి చెడ్డగను కనుపించును. ఇదంతయు మనోవికారమే.

౨. నియమబద్ధుడవై మంచిపనులు చేయుచుండుము. మృత్యువునకు భయపడకుము. ఒకానొక దినము చావక తప్పదు. ఇక భయమెందులకు? నిశ్చింతుడవగుము. శుభాశుభకర్మముల వల్లనే సృష్టిక్రమము జరుగుచుండును. సృష్టిలోని సమస్త పదార్థములు మనకొరకే నిర్మింపబడినవి. ఎవడెట్లు కర్మచేయునో వానికట్లే ఫలము కలుగును. ఇందులో సంసారదోష మేమికలదు? ఏది ఎట్లు జరుగుచున్నదో అట్లే జరుగనిమ్ము. దానిని తారుమారు చేయ తలంపకుము. భక్తిలేని జీవితము వ్యర్థము. కావున భగవంతుని

విశ్వసింపుము. ఇంద్రియములను నిగ్రహించి, సంకల్ప రహితుడవై మనస్సును భగవత్స్మరణయందు నియమింపుము.

3. నిన్ను నీవు భగవంతునకు సమర్పించుకొనుము. నాది ఏదియు లేదు. ఉన్నదంతయు నీదియే అను భావము కలిగియుండుము. అప్పుడు ముక్తుడవగుదువు. భగవంతుడు నీవాడైనపుడు సృష్టి అంతయు నీదే యగును. పరాధీనుడవు గాకుము, పరుల యాచింపకుము.

## ౧౨౪ శ్రీ హరిఓం స్వామి

౧. సోదరా! ఈర్ష్య చాలా చెడ్డది. దానిచే మహాగొప్ప పాపము సంభవించును.

౨. పరులమేలు జూడుము. ధనసంపదల యందలి మమతను వీడుము.

3. ఓ మానవుడా! బాగుగా ఆలోచించి నిన్ను నీవు బాగుపరచుకొనుము.

౪. భగవంతుని యెడ విశ్వాసము కలిగియుండుము. నీవు ఈ లోకమునుండి పోవుటకు సమయము సమీపించినది. కావున సిద్ధపడుము. ఆలసింపకుము.

## ౧౨౫ శ్రీ ఉపదేశక్ మహారాజు

౧. ఓ మానవుడా! దేవుడు కనుపించనిచో విచారింపకుము. వివేకముతో ఆలోచించి చూడుము. ప్రపంచములోని ప్రతి స్వరూపము ప్రతి పరిస్థితి దేవుని స్వరూపమే కదా! సర్వము ఆయనయే ఇక అయినపుడు ఎచట యెట్లు కనుపించును? కావున అన్నిటిలోను జూడుము. విగ్రహములను పువ్వులతో పూజింతురు. ఏమి? ఆ పువ్వులలో భగవంతుడు లేడా? సమస్త వస్తువులలో దేవుడుండగా మరి దేనిచే దేవుని పూజించెదరు?

౨. ఒక రాయినే రెండు భాగములుగా చేసి, అందులో ఒక దానిని విగ్రహమునుచేసి పూజింతురు. రెండవ దానిని ఇంటికి

మెట్టుగా ఉపయోగింతురు. ఈ రెంటికి మూలపదార్థము ఒకటే అయినను, ఆకారము మార్పుజెందుట వలన మనభావముకూడ మార్పుజెందును. కేవలము మన విశ్వాసమే దీనికి ప్రధానము.

3. సత్కర్మవలన జ్ఞానము ప్రాప్తించును. దానిచే భక్తి లభించును. చెడుపనిచేసి పెద్దల యెదుటికి బోవ భయపడుదురు. అటులే మనస్సులో చెడు తలంపులుంచుకొని భజించువారి మనస్సు స్వయము సిగ్గుపడును. పరులకు చెడుతలంపరాదు. చెడుచేయరాదు. తాను చచ్చియైనను పరులను బ్రతికించవలయును.

౪. కోరికలన్నియు నశించగానే భగవద్దర్శన మగును. నేను భగవంతుని వాడనని దృఢవిశ్వాసము కలిగియుండుము. కేవలము విశ్వసించుట నీ కర్తవ్యము. దర్శనమిచ్చుట భగవంతుని కర్తవ్యము.

౫. మనస్సులో సూదిమొన మోపినంత సంశయమున్నను భగవంతుడు సంతోషించడు. నీ పనియు సంపూర్తిగ నెరవేరదు. కనుక భగవంతునియెడ సంపూర్ణ విశ్వాసముకలిగి యుండవలెను.

౬. దేశభక్తికంటె ఈశ్వరభక్తియే చాలాగొప్పది. ఒక మహాపురుషుడు కూర్చుండినస్థలమునుండి కదలక, నోటినుండి ఒక శబ్దమైనను పలుకక, ఉత్తమోత్తముండైన ప్రజానాయకుని కంటె అధికముగా లోకసేవ చేయకలుగును. ఎట్లన, ఆ మహాభక్తుని నిర్మల నిష్కళంకమగు పరిశుద్ధ హృదయభావమే, అవ్యక్త రూపమున ప్రజల మనస్సులో జొచ్చి ప్రశాంత వాతావరణ మేర్పరచును.

## ౧౨౬ జ్ఞానేశ్వర భక్తుడు

౧. ఎవని హృదయములో ఆనందముండునో వానికి అంతటను కేవలానందమే కనిపించును. ఎట్లన, మనమేమి తిందుమో దానివాసనయే త్రేనుపురూపమున బయటబడునట్లు హృదయమెట్లుండునో బయటను అట్లే కనిపించును.

౨. నాయనా! ఇది చేయవలె, అదిచేయరాదు. ఇదికావలె, అది వద్దని ఆలోచింపకుము. ఇది మంచిది అది చెడ్డదని తలంపకుము. ఏదిజరుగునో, అది కర్మానుసారమే జరుగును. అందులో హెచ్చు తగ్గు లుండనేరవు.

౩. అద్వైత భావమునే అనుసరింపుము. భేదభావమును త్యజింపుము. పిండాండమునుండి బ్రహ్మాండమువరకు సర్వాత్మ భావము కలిగి యుండుము.

౪. ద్వేషభావమును వదలి, భగవదాజ్ఞను పాలింపుము. లోకమువైపు చూడకుము. భగవద్భక్తుడవైతివా లోకము నీవెంట తిరుగును. లోకేశుని విడిచి లోకులవెంట తిరిగితివా, అది నిన్ను విడిచి దూరముగా పరువెత్తును.

లోకములో తప్పుపనులు చేసిన వాడే ప్రభుత్వ సిబ్బందికిని, కారాగృహమునకును భయపడును. కాని ప్రభుత్వ నియమమును పాటించువానికి భయముండదు. అటులే భగన్నియమము పాటించు వాడు లోకమునకు వెరవ పనిలేదు. కావున సంసారమును చూచి భయము జెందకుము. భగవంతుని విశ్వసింపుము. ఆయన ఆజ్ఞను పాలింపుము. మనోబుద్ధులను భగవదర్పితము చేయుము. సంసారములోని కల కల ధ్వనులచే మనస్సు చంచలమగును. కావున దానియందు చిత్తముంచకుము. కీర్తి ప్రతిష్ఠలను త్యజించుటవలన మనస్సు శాంతించును.

౫. అధికము మాట్లాడకుము. తిండికై చింతింపకుము. సమయమున కేదిలభించునో అదియే తిని సంతసింపుము. దేహమును ప్రేమింపకుము. దేహభావము వదలుము. ఉదాసీనుడవై సంసారచింతను విడిచి ఏకాంతమున ఎల్లప్పుడు భగవంతుని ధ్యానింపుచుండుము. ఇక నాకు సెలవొసంగుము.

## ౧౨౭ ఒకయోగి (క్రొత్తఢిల్లీ)

౧. జీవుడు అయిదు తత్త్వములచే జన్మించును. కావున మానవుడు ఆ అయిదు తత్త్వముల ననుసరించి జీవింపవలయును.

1. ఆకాశతత్త్వము నిరాకారము, నిర్మలము. అనగా ఉపవసింపవలెను. శాంతము వహింపవలెను.
2. వాయుతత్త్వము ఆకులలములు. కావున ఆకుకూరలు పచ్చివి తినవలెను.
3. జలతత్త్వము కాయలు. కావున పచ్చికాయలను భుజింపవలెను.
4. అగ్నితత్త్వము పండ్లు. కావున సూర్యతప్తములైన పండ్లను తినవలెను.
5. పృథ్వీతత్త్వము బీజములు. కావున అన్నము తినవలెను. పాలు, ఈ పాలగుణము పండ్లు, కాయలకు మధ్యరకమై యుండును.

౨. ఆహారమును, బాగుగా నమలి మితముగా తినవలెను. ఆకలికంటె తచ్చు తినవలెను. ఆకలి కానిది కదాపి భుజింపతగదు. మితముగా నిద్రింపవలెను. ఇట్లు జీవయాత్రగడుపువాడు సుఖపడును.

3. కేవలము ఓంకారమును జపించుట కంటె ఓంకారార్థస్వరూపములో స్థితుడగుట మంచిది. "సోహం"ను లక్ష్యమందుంచుకొని శ్వాసద్వారా స్మరించుట ఉత్తమము.

ర. నిజమునకు ఆత్మ శాంత, మౌన స్వభావములు గలది. దేహభావము కలిగినపుడే నోటితో చెప్పగలుగును.

## ౧౨౮ శ్రీరామానందుడు

ఒక స్త్రీకి బోధించుట :

౧. నీ త్రికూట స్థానమున దృష్టినుంచి "రామ్" ను లేక "ఓమ్"ను ధ్యానించుచు, దానినే నోటితో ఉచ్ఛరించు చుందువేని

పరమేశ్వరుడు నిన్ను సంసారసాగరమునుండి దాటించును. నిరాకారుడును, నిర్గుణుడును, అంతర్యామియునగు నారాయణుడే రాముడని తలంచుము.

## ౧౨. శ్రీ అభేదానంద్‌జీ మహారాజ్

౧. నిన్ను నీవు యజమానివిగా తలంపకుము. లోకమునకు యజమానుడు భగవంతుడే. నీవు సంసారమునకు సేవకునివిగా తలంచుకొనుము.

౨. మున్నొకపుడు ఒకదాత దానమిచ్చు నపుడు తన తలను వంచి యిచ్చుచుండెను. నీవు క్రిందచూచుచు యిచ్చుటెందులకని ఒకరు ప్రశ్నింప అందులకు వారిట్లనిరి. "ఇది నా సొత్తుకాదు. నేను కేవలము దీనిని పంచిపెట్టుటకు నియమింప బడితిని. దీనికి యజమాని భగవంతుడు. తీసికొనువారు భగవంతుని భక్తులు. కేవలము వారికి అందిచ్చుటకు నేను సేవకుడను." అని బదులు చెప్పెను.

౩. మొదట నీవు మంచివాడవై పిదప ఇతరులు మంచివారగుట కుపదేశింపుము. ప్రథమమున నీ ఇంటిని బాగుపరచుకొని తదుపరి నీ గ్రామమును బాగుపరచుము.

౪. ఇతరులను నిందింపకుము. దరిద్రులయెడ కరుణాభావము కలిగియుండుము. సుఖులను జూచి మిత్రభావము వహింపుము. దుఃఖితులను జూచి దయగలవాడవు గమ్ము. పుణ్యాత్ములను జూచి సంతోషింపుము. సాధు సత్పురుషులను జూచి ప్రసన్నుడవు గమ్ము. వారిమాటల నాలకించి అనుసరింపుము.

౫. నీవు ఎవరినైనను నీ చూపుడు వ్రేలితో చూపుచో, తక్కిన నీ మూడు వ్రేళ్లు వానిలో ఒక తప్పుఉంటే నీలో మూడు తప్పులు కలవని సాక్షిరూపమున నీ వైపు చూపుచుండును. కావున నీవు మొదలు మంచివాడ వగుము. ఇతరుల తప్పులను జూడకుము.

౬. పరీక్షాసమయమున పిల్లవాడు తప్పులు వ్రాయుచున్నను అపుడు ఉపాధ్యాయుడు ఆ తప్పులను తెలియచెప్పడు, సరిదిద్దడు. ఎందుకన, అది పరీక్షాసమయము. మొదలే అంతయు నేర్పియుండెను. దాని పరిణామమే ఈ పరీక్ష. అటులే మానవుడు పాపకార్యములు చేయుచున్నను, దానిని భగవంతుడు చూచుచుండును. కాని ఆపడు. ఏలనన, మంచిచెడ్డలను తెలుపుటకు జ్ఞానమును, చేయుటకు శక్తిని యిచ్చియున్నాడు. వాటి విధి విధానము శాస్త్రములద్వారా తెలిపియున్నాడు. కావున ఎవడేమి చేయునో వాడదే అనుభవించును. కేవలము భగవంతుడు సాక్షియై చూచుచుండును. న్యాయము చేయును. కర్మఫలమును మానవు డనుభవింపవలసి వచ్చును.

## ౧౩౦ ఒక మహాత్ముడు (ఆర్యసమాజము)

౧. పశువునకు కనిపించును కాని, చూడదు (తెలియదు). వెనుక ముందు చూడదు (విచారింపదు). ఎంత కనుపించునో అంతే. కాని, భవిష్యత్తు నాలోచింపదు.

౨. ఋషి చూచును. విచారించును. భవిష్యత్తు నాలోచించును. ఆచరించును.

3. పశువు, ఋషి ఈ రెంటి యొక్క మధ్యావస్థయే మానవునిది. మానవుడు చూచును (తెలుసుకొనును). కాని ఆచరింపడు.

౪. పక్షులలో ఆడ పక్షిగాని, లేక మగ పక్షిగాని, ఈ రెంటిలో నేది చచ్చినను, రెండవది జీవిత పర్యంతము బ్రహ్మచర్యవ్రత మాచరించును. పక్షులే యింత నియమము పాలింపుచుండ, మానవు లేమి చేయుచున్నారో మీరే ఆలోచింపుడు. ఇది చాలా సిగ్గుచేటు.

## ౧౩౧ షంలా సనాతన సాధు

౧. అపస్మృతియే నిద్ర. (మతిమరుపు) దీనినే మృత్యు వందురు. అనగా మతిమరుపే ఒక మృత్యువు. నిద్రయే మృత్యువు.

౨. లోభగుణమే సమస్త పాపములకు మూలము. ఇతరులకు దుఃఖము కలిగించి నీవు సుఖపడనెంతువేని నీ సుఖమే ఇతరుల దుఃఖమునకు కారణమగును. కావున సుఖమున కాశింపకుము.

౩. ఎక్కడ మనస్సుండునో, అక్కడ నీ వుందువు. కావున మనస్సును ఇటు నటు పోనివ్వకుము. విచారింపుము.

౪. పరుల వస్తువులను వారి ఆజ్ఞలేనిది తీసికొనకుము. చూడకుము. చావునకైన సిద్ధపడుము. కాని, నీ స్వార్థమునకై ఎవరిని యాచింపకుము. ఈశ్వరుని ఎల్లప్పుడు స్మరింపుచుండుము.

## ౧౩౨ స్వామి శివానంద్‌జీ మండలేశ్వర్

౧. ఈశ్వరప్రాప్తి కోరుదువేని పవిత్రత అవసరము. కావున బాహ్యాంతరములను పరిశుద్ధముగా నుంచుము. సాత్వికాహారము మితముగా భుజింపుము. వ్యాయామము చేయుము.

౨. శరీరములో అస్వస్థత కనుపించగానే తిరిగి స్వస్థత చేకూరువరకు ఉపవాసవ్రత మాచరింపుము. ఉపవాస కాలమున నిమ్మరసము కలిపిన నీరు తప్ప మరేమియు త్రాగకుము.

౩. ప్రకృతి ననుసరించి జీవయాత్ర గడుపుము. పచ్చి కూరలను, కాయలను సేవింపుము.

౪. సూర్యుడు, గాలి, నీరు, మట్టి, ఉపవాసము, చెట్ల క్రియలు వీటియందు రోగనివారణ శక్తి కలదు. కావున వీటిచే లాభము పొందుము.

౫. సూర్యోదయ, అస్తమయ సమయములందును, పగటియందును నిద్రించుటచేతను, రాత్రులందు చాలాసేపు కృత్రిమ వెలుతురులో కాలము గడుపుటచేతను శరీరారోగ్యము చెడును.

## ౧౩౩ మహాత్మ రన్‌జీత్ రాంజీ

౧. ఏ పని చేయుటలో స్వార్థము కాంక్షయు లేకుండునో అదే నిష్కామ కర్మ. మేలొనర్చుట కేవలము నీ కర్తవ్యమని తలంచుము. సర్వభూతములను నీ శక్త్యానుసారము సేవింపుము.

౨. మాటాడుట తగ్గించితివా తపస్సు సిద్ధించును.

3. నిన్ను నిందించినవారిని కోపింపక సంతోషింపుము. దానిచే నీవు బాగుపడుదువు. ప్రతికూలమునకు ఆనందింపుము.

## ౧౩౪ సంత్ విల్సన్

ప్రార్థన :

౧. ఓ నా ప్రభువా ! నా కేమియు అక్కరలేదు. నే నేమియు కోరను. కేవలము యింతియే. అది నేను నిన్ను మరువకుందునుగాక !

౨. ఏ మానవుడు ప్రభువు నామము జపించక శ్వాస పీల్చునో వాని జీవితము వ్యర్థము.

## ౧౩౫ బ్రహ్మలీన్ గోబిందానంద్ మహారాజ్

౧. బంధన నివృత్తియు, ముక్తి ప్రాప్తియు ఈ రెండు కోరికలును బంధన రూపములే. ఆత్మ సత్స్వరూపము. కావున దీనిని గురించి చేయబడు పురుషార్థమంతయు వ్యర్థము. కేవలము నేను స్వయము శుద్ధముక్తుడను. నిర్మలాత్మను. కాని దేహమును కాను. అనునట్టి భావము సదా యుండిన ఇక బంధన ముక్తు లెవరికి ? నామరూపములను విడిచి కేవలము అద్వైతానుభవము పొందుము. సంకల్పము లన్నియు బూటకములు. అన్నిటిని త్రోసిపుచ్చి ఆత్మానుభవమును మాత్రము పొందుము. ఇదియే పరమావస్థ.

౨. దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసన ఈ మూడింటిని విడువనంతవరకు మనో సంకల్పములు నశింపవు.

3. ఎంతవరకు హృదయములో సంసారమందు రాగము, తిండిని గురించిన చింతయు నుండునో అంతవరకు చిత్తము పరమాత్మునియెడ లగ్నముకాదు.

౪. దేహాభిమానమును, వస్తువులందు వ్యక్తులందు మమతయు నుండునంతవరకు చింతయు రాగద్వేషములును నిన్ను విడువవు. నిన్ను నీవు మరువకుము. దీని నెల్లప్పుడు మననము చేయుచుండుము.

౫. చిత్తము జడస్వరూపము. చిత్తము విక్షేపమయినను నీ నిశ్చయమును మార్చుకొనకుము. దిగులు నొందకుము. ఏకాగ్రతా విక్షేపములు నీ భావ తరంగములే యను ఉత్కృష్ట దృష్టి కలిగి యుండిన అతి శీఘ్రముగ శాంతి లభించును.

## ౧౩౬ స్వామి కృష్ణానంద్ జీ

౧. మనోవాక్కాయ కర్మములచే సచ్చరిత్రుడవగుదువేని సంసార మందెచటను నీకు భయముండదు.

౨. నీవు స్వయము ముక్తుడవై ఇతరులను ముక్తుల జేయుము. ఇదే నిజమైన సేవ.

౩. స్వార్థ భావముచేతనే పరులకు చెడుచేయ తలంపు పుట్టును.

౪. వర్తమాన పరిస్థితిని సదుపయోగ పరతువేని మహోన్నతిని పొందుదువు.

## ౧౩౭ శ్రీ సరస్వతి స్వామి

౧. మాయామయమగు సృష్టి మనస్సంకల్పము వల్లనే యేర్పడును. మనస్సును నియమించిన చిత్తశుద్ధి కలుగును. దీనికై అస్తేయ, అపరిగ్రహములను పాలించు టవసరము.

౨. దేహము, దేహసంబంధములగు ధనసంపత్తి, కుటుంబాదుల యందలి మమతను త్యజించి బ్రహ్మభావమున స్వస్వరూపమునందు స్థిరపడుము. అపుడు మాయామయ ప్రపంచము తనకుతానే విడిపోవును.

౩. ఈశ్వరప్రాప్తి కావలెనన్న అంతఃకరణను పవిత్రము చేయుము. రాగద్వేషాదులు రహితమయినపుడే అంతఃకరణము పవిత్రమగును.

౪. దేహభావము నశించి, సంపూర్ణముగా సర్వాత్మభావము కలిగినపుడే సమాధి సిద్ధించును.

౫. బ్రాహ్మణాదులకు దేవత అగ్ని. యోగులకు దేవత అంతరాత్మ. సాధన రహితుడైన మానవునకు దేవత విగ్రహము. తత్వజ్ఞానికి దేవత వ్యాప్తబ్రహ్మము. ఇది దేవపూజా విధానము.

౬. అందరిని భగవత్స్వరూపులనుగా భావింపుము. ప్రతి ప్రాణిలో పరమాత్ముడే జీవరూపమున నున్నాడు. కావున అందరిని నీ అన్నదమ్ములనుగా తలంచి ప్రవర్తింపుము. లేక ఆత్మస్వరూపులనుగా భావింపుము.

## ౧౩౭ శ్రీ పూర్ణానంద్ మహారాజ్

౧. సమస్తము బ్రహ్మమయమను సంకల్పము దృఢమగుచో మనస్సు ముక్తినొందును. అభ్యాస వైరాగ్యముల నాశ్రయించి, సర్వభోగాసక్తులను త్యజించి నిర్వికల్పుడవై సుఖింపుము. "హరిః ఓమ్ తత్సత్."

## ౧౩౮ శ్రీ బ్రహ్మానంద సరస్వతి

౧. పరబ్రహ్మమే సత్యమైనది. ప్రపంచమంతయు అసత్యము. దీని తత్త్వమరసి మౌనము వహించి కూర్చుండుము.

౨. ఏపనులు చేయుచున్నను సరే లోభి మనస్సు ధనముపై లక్షితమైయుండునట్లు నీవు ప్రాపంచిక" కర్మలలో ఉన్నప్పటికిని నీ మనస్సు నిరంతరము భగవద్ధ్యాన నిమగ్నమై యుండవలయును.

౩. స్త్రీల నందరను నీకు స్వయముగ మాతృదేవతలుగ భావింపుము. స్త్రీల ముఖముల నెన్నడును జూడకుము. వారి పాద

ములను దిలకింపుము. దీనిచే నీ చెడు తలంపులు తొలగి, కామము తగ్గును.

౪. మనస్సు, అరణ్యము, ఏకాంతప్రదేశము అను నీ మూడును ధ్యానయోగ్యములయిన ప్రదేశములు. విశ్రాంతియు, ఏకాంతస్థితియును ముఖ్యావసరములు.

౫. శాంతముకంటె మానవులకు యత్నముచే అభ్యసింపవలసిన సుగుణము మరియొకటి లేదు. ప్రతి మనుజుడును స్థిరబుద్ధి కలిగి యితరు లేమియన్నను, యేమిచేసినను సహించి యుండ వలయును.

౬. సంసారమును పరిత్యజించిన ప్రతి సన్యాసియు, ప్రతి భగవద్భక్తుడును స్త్రీ జాతినెల్లను దైవీప్రకృతియగు జగన్మాత స్వరూపులుగ నెంచవలయును.

౭. ఐశ్వర్యము, బిరుదులు మున్నగు ప్రపంచ సుఖేచ్ఛలను మనస్సులో పెట్టుకొని ధ్యానసాధన లొనర్చు వానికి, సాధన సిద్ధింపదు.

౮. ముముక్షు వే విషయమునను మోహమునకుగాని, సువర్ణమునకుగాని చోటీయరాదు. ఏవిధమైన విషయాపేక్షగాని ఈషన్మాత్ర ముండినను వాడెన్నటికి సిద్ధుడగుట కలలోని వార్త.

౯. నిరుపయోగములగు వేదాంత చర్చలను, వాగ్వాదములనుజేసి నీ శక్తిని బోగొట్టుకొనకుము.

౧౦. చెప్పేమాటయు, చేసే ఆలోచనయు నొక్కటై యుక్తముగ నుండవలయును. ధ్యానసాధనముల కిది సరియైన లక్షణము. లేకున్న ఓ దైవమా ! నాకు సర్వము నీవేయని పైకి మాటలాడుచు లోన సంసారము నాశించితివా! నీ ధ్యానసాధనము లన్నియు నీట గలియక మానవు.

౧౧. కామాదులను జయింపనిదే ఆత్మ సామ్రాజ్యము లభింపదు. ప్రపంచమునం దందరిని మెప్పించి నీ వే కార్యమును

చేయజాలవు. కావున సత్యమునుండి చలింపక నీ అనుష్ఠానమును నిర్విఘ్నముగా సల్పుము.

౧౨. ప్రజలను మోసపుచ్చు వేషములు వేసి భక్తునివలె నటింపబోకుము. సత్యమునుండి జారి ప్రజలను మెప్పించి నీవు సంతసింప దలంపకుము.

౧౩. దేహాభిమానము గలవాడెన్నిసారులు "అహం బ్రహ్మ"మను మహావాక్యమును నోటితో పలుకునో అన్నిపర్యాయములు వాడు గుంటనక్కయై పుట్టును.

౧౪. బ్రహ్మోపదేశము జేసికొనదలచిన వారెల్లరును మత్తు పదార్థములను, మాంసాహారములను వాడకూడదు.

౧౫. 1. "కల్లు" అలవాటు గలవారు "తెల్ల ఉమ్మెత్తాకుల రసము" కల్లులో కలిపి త్రాగినచో, ఆ అలవాటు పోవును.

2. గంజాయి త్రాగువారు "తుమ్మి" ఆకునుగంజాయివలె నలిపి చిలుములో పెట్టి పీల్చినచో ఆ అలవాటు పోవును.

3. నశ్యము అలవాటు గలవారు సొంటిపొడి పీల్చినచో ఆ అలవాటు పోవును.

4. మత్స్యమాంసములను తినువారు పచ్చిమాంసమును నమలినచో ఆ అలవాటు నశించును.

౧౬. 1. కారము కేశములకు, నేత్రములకు, గుండెకు, పుంసత్వమునకు అపకారము చేయును. గ్రుడ్డితనము, నపుంసత్వము, వెంట్రుకలూడుట, నెరయుట, హృదయమునందు పరివర్తన అనెడి బాధలను కలిగించును.

2. ఉప్పును ఎక్కువ ఉపయోగించిన యెడల, శరీరమునకు బడలిక, శైథిల్యము, దౌర్బల్యము, సోమరితనము కలుగును, మాంసరక్తములు శిథిలములగును. ఏ మాత్రము కాయకష్టమును ఓర్వజాలదు. అందు వలన "లవణం నాత్యుపయుంజీత" అనగా ఉప్పు నెక్కువగా ఉపయోగించరాదు.

## ౧౪౦ శ్రీ నిర్విషయానంద బ్రహ్మచారి

౧. జీవితమందు ముఖ్యముగా సాధింపదగినది బ్రహ్మజ్ఞానమే.

౨. నిరంతరము నీ స్వస్వరూపాత్మలో జీవింపుము. అపుడు నీ ఆనందమును నేదియు భంగపరచలేదు. సర్వప్రకృతి ముక్త పురుషున కాతిథ్యమిచ్చును. బ్రహ్మవేత్తకు సమస్త ప్రపంచము మోకరిల్లును.

3. మీరు సత్యస్వరూపు లగుటకే, సోహం స్మరణ, ఓంకారము నుచ్చరించుట అనునవి యేర్పడి యున్నవి. కార్యకారణత్వమునకు లోనగుచో, అది మహాపతనమునకు దారితీయును. ఈ జగద్దృశ్య కారణములకు చలింపబడిన మరుక్షణముననే పతనము సంప్రాప్త మగుచున్నది. నీ వెపుడును కార్యకారణ ప్రపంచ రంగము లోనికి దిగక బ్రహ్మజ్ఞానాకాశము లోనికే పురోగమింప వలసి యున్నది. ఈ ప్రపంచ దృశ్యములకు నేను సాక్షిమాత్రుడనై యున్నాను. దీనితో నాకేలాటి సంబంధము లేదు. దీనికి అతీతుడనై యున్నానని సంకల్పించుము.

౪. అకలంకులమై లోక హితమొనర్చుటయే సమస్తారాధనమునకును సారాంశము. పేదలలో, దీనులలో, దుర్బలులలో, రోగులలో నెవ్వడు శివుని గాంచునో వాడే శివారాధకుడు.

౫. లోకహిత మొనర్ప దలచువారు తమ సుఖదుఃఖములను, పేరు ప్రతిష్ఠలను, స్వార్థపరమగు సమస్తమును కట్టకట్టి గంగలో కలిపి, భగవంతు నాశ్రయింప వలయును. జగద్గురువు లందరును చెప్పినదియు, చేసినదియు నిదియే !

## ౧౪౧ శ్రీ హరీ బాయిజీ

౧. ఓ సహోదరా ! ఎవరిని అవమానింపక అందరిని సన్మానింపుము. సర్వదానములలో సన్మానమే గొప్పదానము. సర్వ

ములో సర్వేశ్వరుడున్నాడు. కావున సర్వభూతములను గౌర వింపుము.

౨. సత్యము, మధురవాక్కు, బ్రహ్మచర్యము, మౌనము, జిహ్వాచాపల్యమును త్యజించుటయు, ఈ నాల్గింటిని ఆచరించువాడు సిద్ధుడగును.

3. ఎవని మనస్సు వికలముగాక ఎల్లప్పుడు ప్రసన్నముగా నుండునో వాడు సదాముక్తుడు.

౪. సంతోషము, ఆనందము ఈ రెంటిలో భేదముకలదు. అనుకూల భోగములచే ఇంద్రియములు సంతోషించును. ఆత్మాను భవముచే మనస్సు ఆనందించును.

౫. సదాచారము లేని వాడెంత గొప్ప మహాత్ముడు గాని, వాడు సత్కారమునకు పాత్రుడు కాజాలడు.

౬. ఎల్లప్పుడు నేదో యొక ఉపకార కార్యము చేయుచుం డుము. లేదా జపతప ధ్యానములు జరుపుచుండుము.

౭. నీ పని జీవించుటకును, కుటుంబపోషణకును కాదుసుమీ! ఈ పనులు పశుపక్షులును చేయుచుండును. నీ పని కేవలము ముక్తి నొందుటయే. తుదకు నీ వెంట ధర్మాధర్మములు తప్ప మరే మియురావు. కాలము సమీపించుచున్నది. కావున జాగ్రత్త పడుము.

౮. ఎవడు తనస్త్రీని గాని, పరస్త్రీని గాని మోహదృష్టితో చూచుట కభిలషించునో, వాడు పాపియే సుమా! అట్టివాడు ఈశ్వర విముఖుడగును.

౯. నీ కెంతవరకు ఇతరుల కుపదేశింప వలెనని ఇచ్ఛ యుండునో, అంతవరకు నీలో విషయాసక్తి దాగియున్నదని తలం పుము. ధన, మాన, కీర్తి, ప్రతిష్ఠాములన్నియు దోషయుక్తములే. అట్టి దోషములను పోషించుటకే యివన్నియు చేయుచుందువు. నీ వింతవరకు లోకులను సంతోష పెట్టుట కెంతయో కృషి చేసితివి.

కాని దానివలన లభించిన లాభమేమి? వాసనాయుక్తమైన కృషి ఫలింపదు. నిష్కామసేవయే నిన్నుద్ధరించును. భగవంతుని ప్రసన్నుని గావించితివా భగవద్దర్శన మగును.

౧౦. విషయ వాసనయందలి వాంఛను త్యజింపనిదే యే ఉపాయము చేతనైనను చిత్తము నిర్మలము కానేరదు. చిత్తము నిర్మలము కానిదే యేమిచేసినను జ్ఞానము లభింపదు.

౧౧. ప్రకృతి, పరమాత్మ ఈ రెంటి మధ్య జీవుడు కలడు. జీవుడు ప్రకృతి కాశించి అందులో సుఖము కలదని తలంచి దాని వైపు తిరుగును. అందు దుఃఖము కనుపింపగానే పరమాత్మవైపు తిరుగును. ఇట్లు భ్రమలోపడి తిరుగుచుండును. ఓ నాయనా! ప్రకృతి మాయ. కావున దానిని త్యజింపుము. పరమాత్మ నాశ్రయింపుము. ఎవడు జన్మించునో వాడు చావక తప్పదు. ఏది మాయయో అది అదృశ్యము కాకతప్పదు. తెరపైన సినిమా బొమ్మలవలె సర్వజగత్తు మాయా నిర్మితమే! కావున ఈ మాయామయమగు జగత్తును విడచి, మాయాతీతుడైన జగద్రక్షకుని అనుసరింపుము.

౧౨. నిన్ను లోకులు సన్మానించినను, నీకీర్తి ప్రతిష్ఠలను గొప్పగా పొగడినను అది నీ పరీక్షకొరకే జరుగుచున్నదని గ్రహింపుము. దానికి లోబడితివా పతన మగుదువు.

౧౩. భగవంతుని యందు చిత్తమును జేర్చుటే యోగము. అతనియందు చిత్తమును నిలుపుటయే భక్తి. ఆయనయందు చిత్తము లీనమగుటే ముక్తి. చిత్తములో సుఖేచ్ఛయుండుటే మలినము. మనస్సులో రాగద్వేషాదులు కనుపింపగానే, జప ధ్యానము లొనర్పవలెను.

౧౪. సర్వభూతములలో భగవానుడు కలడనియు, సర్వభూతములు భగవానునిలో కలవనియు, సర్వభూతములను ప్రేమతో పూజింపుము. ఇదే నిజమైన అంతిమ సాధన.

## ౧౪౨ హజరత్ శేఖ్ నూరొద్దీన్ సాహెబు

[పేరు, ఆకులలోను జీవముండుననను భావమున, పచ్చి ఆకులను త్రెంచక క్రిందపడి యెండిన వేపఆకులను యేరి, నూరి తినుచుండెడివారు. అతి సూక్ష్మజీవులకు హాని కలుగునని భయముచే, నడచునపుడు క్రిందచూచుచు, మెల్ల మెల్లన భూమిపై పాదముల మోపుచు నడచుచుండు వారు.]

౧. సంసారములో, ప్రతి పనియు భగవదిచ్ఛానుసారమే జరుగుచుండును. కావున ఆయన యిష్టానుసారమే మనము ప్రవర్తించుట మంచిది.

## ౧౪౩ శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వామి

౧. హృదయ కమలములో నివసించియున్న భగవంతుని నిరంతరము ధ్యానింపుడు.

౨. వేదాంత భావమును మీ నిత్య జీవితములో ప్రవేశింప జేయుడు.

3. చెడుగుణముల విడిచి సత్యాహింసాది సద్గుణ ధర్మములను పాలింపుడు.

౪. 'నీది-నీకే, నాది కూడ-నీకే' అని భావించువాడు ఉత్తమోత్తముడు. 'నీది-నీకే, నాది నాకే' అను వాడు మధ్యముడు. 'నాది నాకే, నీది కూడ నాకే' అనువాడు అధముడు.

౫. ప్రతిరోజు మీ దినచర్యను డెయిరీలో వ్రాసికొనుడు.

౬. ప్రతినిమిషము నిన్ను నీవు పరీక్షించుకొనుచుండుము.

౭. ప్రతిదినము లేనివారికి లేని దాని నిచ్చుచుండుము.

౮. అందఱిని బ్రహ్మ స్వరూపులనుగా దలంచి సేవించుటే అనుభవ వేదాంతము.

౯. సాధకుడు పవిత్రతను, పట్టుదలను, సహనమును- ఈ మూడింటిని విడువరాదు.

౧౦. వేదశాస్త్రాది కర్మల ద్వారా రాగద్వేషములు తొలగి వైరాగ్యము కలిగి, చిత్తము శుద్ధమై, సాకారోపాసనద్వారా బ్రహ్మోపాసనలో ప్రవేశింపవచ్చును.

౧౧. ఆత్మదర్శనమే పరమ ధర్మము. నదులన్నిటికి వేరు వేరు నామములున్నను, సముద్రములో కలిసి ఏకమైనప్పుడు నామ రూపములు సమసిపోవును. అట్లే నామరూపాత్మకమైన సంసారములో ఎన్ని భేదములున్నను అఖండ బ్రహ్మముతో నైక్యము పొందిన వెంటనే భేదములన్నియు తొలంగును.

౧౨. మనోఇంద్రియములకు మనకు భేదము కలిగినప్పుడే దుఃఖము సంభవించును. నీది నాదను అభిమానమే దుఃఖమునకు కారణము.

౧౩. నీది కాని దానిని నీదని భావించునట్టి అజ్ఞానమే బంధము. నా దేదియు లేదు. సర్వము ఈశ్వరునిదే యను భావ జ్ఞానమే మోక్షము.

౧౪. అనాత్మ పదార్థముల కాశించు దేహామే, నేనను మోహామమతలకు లోనై మానవుడు ఆత్మపదార్థమును కోలుపోవుచున్నాడు. జీవబ్రహ్మైక్య సారమే పరమాత్మ తత్త్వము.

౧౫. సాధనలేనిచో భౌతికశక్తులే లభింపనపుడు, ఇక ఆధ్యాత్మిక శక్తులనుగురించి వేరుగ చెప్పవలయునా! కావున సాధన అత్యవసరము. జీవితము అంతమగు లోపల సాధనయు సమాప్తి కావలయును.

౧౬. నియమబద్ధమైన జీవితములేనివాడు పశుతుల్యుడేయగును.

౧౭. వాచావివేకము అవివేకముతో సమానమని వశిష్టుడు శ్రీరామచంద్రుని కుపదేశించెను.

౧౮. హృదయము దైవమునకు సంబంధించినది. దయ, కరుణ మొదలగునవి మస్తిష్కము (బుద్ధి) నకు సంబంధించినవి. కీర్తిప్రతిష్ఠలు విద్యకు సంబంధించినవి.

౧౯. మనస్సు రాగద్వేషయుక్తమై మలినముగా నున్నచో దైవమునందుగాని, దైవవాక్యనందుగాని అభిరుచి గలుగదు. కావున విషయభోగములందు విరక్తి కలిగియుండవలెను.

౨౦. మానవజన్మము సార్థకము జెందవలెననిన ప్రజ్ఞాన బ్రహ్మమును అనుభూతము చేసికొనవలెను.

౨౧. మానవుని మాధవునిగా మార్చునది సచ్ఛీలము. దానవునిగా రూపొందించునది దుశ్శీలము. దుశ్శీలమును వీడి సచ్ఛీలము నాశ్రయించుటే మానవధర్మము.

౨౨. సద్గుణము లన్నిటిలోను నిర్భయత్వమే శిరోమణి. దేహాభిమానమే భయమునకు మూలము. దృశ్యవస్తువులపై మమతయే భయమునకు ప్రధాన కారణము. కావున దేహాది ప్రాపంచిక వస్తువుల యెడ మమత్వమును వదలి, భగవానుని ఆశ్రయించవలెను.

౨౩. దైవమునందును, తీర్థమునందును, బ్రహ్మనిష్ఠునియందును, మంత్రమందును, జ్యోతిష్కుని యందును, ఔషధమునందును, గురువునందును జీవు డెట్టిభావమును గలిగియుండునో అట్టి ఫలితమునే పొందగల్గును.

౨౪. అమూల్యమగు ఈ జన్మను ఇంద్రియ సౌఖ్యముల కొరకు ధారబోసి తుదకు శోకసంతప్తులగుట విజ్ఞులకు పాడిగాదు. కావున ఓ సాధకుడా! రేపు రేపు అనక ఇప్పటినుండియే పరమాత్మచింత కుపక్రమించి బ్రహ్మానంద సామ్రాజ్యాభిషిక్తుడవు కమ్ము.

**కోపమును జయించుట కుపాయములు :**

౧. కోపముయొక్క ఆవిర్భావ మెప్పుడు సంభవించునో కడు జాగ్రతగ గమనించుచుండి, అది ప్రవేశించకముందే హెచ్చరికతో దానిని లోనికి రానీయక విచారణచే దానిని తరుమగొట్టవలెను. ఇది ఉత్తమోత్తమ పద్ధతి. కోపము ప్రవేశించిన పిదప వెంటనే

తొలగించుట మధ్యమ పద్ధతి; ప్రవేశించి చాలసేపు బాధించిన వెనుక దానిని పోగొట్ట యత్నించు టధమపద్ధతి.

౨. క్రోధతరంగములు పుట్టిన వెంటనే కనిపెట్టి క్షమ, ప్రేమ, దయ, సహనము - ఇత్యాది సుగుణసంపత్తిచే దానిని నివారించవలెను.

3. అందఱును భగవత్స్వరూపులే యను భావనగాని, ఆత్మస్వరూపులే యను నమ్మకముగాని యుండుచో క్రోధావిర్భావమునకు అవకాశమే లేదు.

౪. కోపమను వృత్తితో తాదాత్మ్యము నొందక సాక్షిగా ఉండి దానిని వీక్షింపవలెను. అపుడు క్రమముగా దానంతట నదియే తొలగిపోవును.

౫. ఎవరైన దూషించినచో, అది మన మంచికొరకే యని తలంపవలెను. దూషింపదగిన పొరపాటున్నచో దానిని పోగొట్టుకొనుటయు, అకారణముగ దూషించినచో నిది నా సహనశక్తిని పరీక్షించుట కొక అవకాశమని తలంచియు, చిత్తమునందు ఏ వికారము రానీయక శాంతముగా నుండవలెను.

౬. కోపము వచ్చినప్పుడు ఆ చోటును విడిచి మఱొకచోటికి వెళ్ళుట మంచిది.

౭. కోపము వచ్చినప్పుడు చన్నీళ్ళ స్నానము చేయుటయో లేక 1, 2, 3 అని అంకెలను లెక్కపెట్టుటయో జరిపిన, అది కొంత శమింపవచ్చును.

౮. కోపము వచ్చినవారు అద్దము చూచుకొనినచో, వారి వికారస్వరూపము వారికే సిగ్గు కలుగజేయును.

౯. క్రోధమునకు పుట్టినిల్లు కామము. కామమువల్ల క్రోధము జనించును. కావున కోరికలు తగ్గించుకొనినచో లేక కోరికలను పూర్తిగ తొలగించుకొనినచో క్రోధముండ నేరదు.

## ౧౪౪ స్వామి శ్రీనిరంజనాదేవ తీర్థులు

౧. అనేక జన్మ జన్మాంతర పుణ్యమువలన లభించిన మానవ జన్మమును, కేవలము సంసారములోని ఐహిక క్షణిక సుఖములకై వినియోగించి, భజన పూజాది భగవత్కార్యములకు పామరులు సమయము లేదందురు. కాని సినిమా మొదలగు అసత్కార్యములలో చాల సమయమును వ్యర్థమొనర్తురు. ఇది కడు శోచనీయము.

౨. నీకు ప్రతిదిన మెంత భోజన మవసరమో, ఎంత జీర్ణమగునో, అంతే నీ జన్మకు ముందే భగవంతుడు నిర్ణయించిపెట్టెను. దానికంటె అధికము గ్రహించుచో విధి విరుద్ధమే గాక రోగము కూడ సంభవించును. భాగ్యమెంతో, భోగ్యమంతే; గొప్పవారి వద్ద కుక్కలకుకూడ మంచిభోజనమే దొరకును. కాన భోజనపదార్థముల కాశించి నశింపకుము.

3. మానవజన్మ తినుటకు నిద్రించుటకే దొరకలేదు. తినుటకే దొరకుచో పసుగుజన్మ దొరకవలసి యుండెను. నిద్రించుటకే దొరకుచో అజగరజన్మ దొరకవలసి యుండెను. తిండి, నిద్ర సుఖము కుక్కలకు దొరకినంత మానవులకు కూడా దొరకుట కష్టము. కుక్కలు మట్టిగుంటలో పరుండి సుఖముగా నిద్రించును. కాని మానవుడు హంసతూలికా తల్పమునందుకూడ చింతచే సుఖముగా నిద్రించలేడు.

౪. మనోనిధి ధ్యానలద్వారా చిత్తదోషములను తొలగించి అంతఃకరణమును పవిత్రము చేసికొని భగవంతుని శరణము పొందవలెను.

౫. ప్రజలను, ధర్మమార్గమున ఎట్లు ప్రవేశ పెట్టవలెనో విచారించవలెను.

౬. భారతదేశము అవతారపురుషులు జన్మించిన మహాపుణ్య ప్రదేశము. ఇట్టి పవిత్ర పుణ్యదేశమున మానవుడవై పుట్టి

కూడ, భక్తిజ్ఞానముల నవలంబించకుండుట కడుంగడు శోచనీయము.

౭. 'బ్రహ్మోస్మి'యని చెప్పుటేకాని అనుభవము మాత్రము సున్న. అట్లే ఆచరణతో చెప్పువారు లేమిచే మనదేశస్థితి యిపుడాందోళనకరముగా నున్నది. ధర్మము, భగవద్విశ్వాసము లేమిచే అవినీతి చెలరేగినది. భౌతికమైన ఆశలోపడి నీతిని విడిచితిమి.

౮. సంసారప్రజల ఆపత్తులను తప్పించనివారు ప్రజలలో నుండుట న్యాయముకాదు. వారి ఋణము తీర్చుట ప్రతిమానవుని విధి. అట్లే మహాత్ములు గృహస్థుల అన్నమును భుజించునపుడు వారి ఆపత్తులను తీర్చి, భక్తి జ్ఞానముల నలవరచి, వృద్ధిచేసి వారి ఋణమునుండి విముక్తులు కావలెను. లేనిచో అరణ్యమున కేగి ఆత్మోన్నతి చేసికొన వలయును.

౯. మానవులందరు సమానులు కారు. బుద్ధిలో, శరీరావయవములలో, ముఖస్వరూపములో, రుచిలో అనేక భేదములుండును. జీవమున్నంతవరకు సమానముగా నుండలేరు. కాని చచ్చిన పిదప పీనుగులన్నియును సమానములగును.

౧౦. భారతదేశము సమస్త విశ్వమునకు మధ్యభాగమున హృదయమువలె నున్నది. హృదయములో దోషములు సంభవించుచో విశ్వమంతయు దూషితమగును.

౧౧. ధర్మాచరణము ద్వారా దోషములు తొలగి విశ్వము శాంతి పొందును.

## ౧౪౩ శ్రీ హరిహరానంద అనంతశ్రీ

౧. తనకును లోకమునకును కల్యాణమును, భగవత్ప్రాప్తియు కలిగించునదే ధర్మము. ధర్మముచేతనే ప్రజలలో సద్భావము భగవద్భక్తి కల్గును. దానిచే విశ్వకల్యాణ మగును.

౨. సర్వప్రాణి పదార్థములందును, చూచుట వినుట మొదలగు సర్వక్రియలందును, సర్వత్ర భగవద్భావము కలిగియుండుటయే సద్భావమనబడును. దీనిచే మానవుడు తీర్ణుడగును.

3. మనకు కలుగుచున్న ఆనందము నశ్వరములైన స్త్రీ పుత్రాదుల ఆనందమే కాని, నిర్విశేషానందము కలుగుటలేదు. నిర్విశేషానందమే భగవదానందము. అది మనస్సు నిశ్చలమైనప్పుడే విశేషణము తొలగి నిర్విశేషణముగ సంభవించును.

౪. కర్మలన్నియు భగవంతునికి సమర్పించినపుడే మీకు శుభము చేకూరును. జీవించినను ధర్మానుసారముగ జీవింపుము. మరణించినను ధర్మానుసారముగనే మరణించుము.

౫. న్యాయార్జితమైనను కుక్కతిన్నట్లు తినక, ఇతరులకు పెట్టి శాస్త్రానుసారముగ తినుము. నిద్రించునపుడు భగవంతుని స్మరించుచు నిద్రించుము. ఏడ్చినను యితరుల దుఃఖములకు కష్టములకై యేడువుము. భగవంతుని స్తుతించుచు ఆనందబాష్పములు విడువుము. నీ ప్రతిక్రియ విధివిధానమునకు విరుద్ధమై యుండరాదు.

౬. నేను స్వతంత్రుడను అను "అహమ్" దేహాభిమానమును బలిదాన మొనర్చినప్పుడే నీకు నిజమైన స్వతంత్రత చేకూరును. మనము నిజమైన స్వతంత్రులమైనప్పుడే పూర్ణస్వతంత్రుడగు నా పరమాత్మను పొందుదుము. తండ్రిని ఆశ్రయించి ఆయన ఆజ్ఞకు బద్ధుడైనప్పుడే, పుత్రుని తండ్రి ప్రేమించునట్లు, భగవంతుని ఆశ్రయించి ఆయన విధానమునకు బద్ధుడైన జీవుని భగవంతుడు ప్రేమించి దర్శనమిచ్చును.

౭. చెడుకార్యములు చేసినవారికి ప్రేతములుకూడ దర్శనమివ్వనప్పుడు దేవత లెట్లు దర్శనమివ్వగలరు?

౮. నీకిష్టమైన దేవదేవుని యొక్క నామమును సదా జపించుము. కాని నామాపరాధ ముండరాదు. అనగా ధర్మవిరుద్ధముగా నడువ

రాదు. తృణముకన్నను హీనుడవై, అమానుషుడవై యితరులను సన్మానించుచు భగవంతుని స్మరింపుము.

౯. గుణదోషములను జూచుటే దోషము; త్యాగముకొరకై నిందించరాదు, స్వీకృతికై స్తుతించరాదు.

౧౦. 'విద్యావినయసంపన్నే' యను శ్లోకమునకు భౌతికముగ గోబ్రాహ్మణ శునకచండాలాదులు సమానమని యర్థము కాదు. కాని వానిలో పరమాత్మను సమానముగా జూడుమని యర్థము. ఎట్లనగా మట్టికుండలు, బంగారపు కుండలు విలువలోను, రూపములోను సమానము కానప్పటికి వానిలో సూర్యచంద్ర బింబములు, ఆకాశము సమానముగా కనుపించును.

౧౧ ప్రేమాను రాగము చేతనే భక్తి కలుగును. ప్రియమైన భక్తుని కొరకే భగవంతుడవతరించును. రాగరహితునకే నిజమైన ప్రేమ కల్గును. అనాసక్తుడగు నిరపేక్షునకే భక్తి చేకూరును.

౧౨. ద్రవీభూతమైన చిత్తములోనే రసస్వరూపుడగు భగవంతుడు ప్రకటితుడగును.

౧౩. హృదయములో ప్రేమజనించగానే భౌతికవాసనలు తగ్గును. ప్రతివస్తువును, ప్రతిమానవుని భగవంతుని రూపములని భావించి సేవింపుము.

౧౪. ఎట్లెట్లు సంసారపదార్థాసక్తి తొలంగుచుండునో, అట్లట్లే భగవత్ప్రేమ జనించును.

౧౫. పుణ్యపాపములనుండి కూడ సుఖములు కలుగును. పాపసంభవ మగునట్టి సుఖము పాపసుఖము. పరస్త్రీగమన సుఖము పాపమునకు మూలము. శాస్త్రానుసారమగు స్వస్త్రీగమనము పుణ్యసుఖము.

౧౬. కేవలము లాలస విరహమే భగవత్ప్రాప్తికి మూల్యము.

౧౭. పుణ్య పాపములు రెండును పూర్తిగా నశించుటే ముక్తి.

## ౧౪౭. స్వామి ఆనందాజీ

౧. మానవుని కర్తవ్యమేమిటో, అనాచార భ్రష్టాచారములు, మోసము మొదలగు దుష్టకార్యము లెవరు తెచ్చిపెట్టిరో, ముందు మీరు విచారించుడు. 'ఎవరును తేలేదు. వానిని మనమే చేయుచున్నాము' అని తేలును. మన వేదాంతము అద్వైతము. రామరాజ్య భావము లెటుపోయెనో కొంచె మాలోచించుకొనుడు. ఓ మానవులారా! భేదభావమును, స్వార్థకుంచిత భావములను విడచి, తోడిమానవులను ప్రేమింపుడు, దీనిచే మనస్సు నిర్మలమై భక్తిభావ ముదయించి పరమ కల్యాణము చేకూరును.

౨. లంచము తీసికొని వస్తువులు కల్తీచేసి మోసముచే తోడి సోదరులను నాశనము చేయుచు మిమ్ము మీరు పాడుజేసికొనకుడు. పరమాత్మస్వరూప మన్నిటిలో నున్నదని తలంచి అందఱిని తమ సోదరులవలె భావించి సేవించుడు. లోకము దిన దినమవినీతివైపు పోవుచున్నది. దీనికి కారకులము మనమే. కాన దీనిని నైతికమునకు మరల్చుటకూడ మన కర్తవ్యమే.

3. రాగద్వేషములు లేనిచో హృదయము మనస్సు నిర్మలమై ఈ లోకమే స్వర్గతుల్యమగును.

౪. పరమత సహనమే వైదిక సిద్ధాంతము.

## ౧౪౭ స్వామి విశుద్ధానంద సరస్వతి

౧. 'మత్కర్మ' అనగా ప్రతిపనిని మనపనిగానే భావించి చేయుట. దీనికి విపరీతముగా జపతప పూజాదులైన కొన్ని పనులు భగవంతుని పనియు, ధనార్జన గృహ దారాపుత్రాదులైన కొన్ని పనులు మనపనియు చేయుచున్నాము. ఇదే అజ్ఞానము, మోసము, దొంగతనము. అదెట్లన ప్రతిక్రియ భగవచ్ఛక్తిద్వారానే చేయుచు

నా దనుటే దొంగతనము. కొంతకాలము భగవద్భక్తుడవై కొంత సేపు భార్యాభక్తుడవు గాకుము. సర్వప్రాణులను భగవత్స్వరూపులు గానే తలంచి సర్వకార్యములను భక్తిభావముతోనే చేయు చుండుము.

౨. దేహాభిమానమును విసర్జించిన వెంటనే 'నాది' అను అభిమానము తొలగి భేదభావము నశించి, వైరముపోయి, సకల ప్రాణులలో పరమాత్మను జూచెడు దృష్టి కలుగును.

3. మన మీశ్వరాంశీయులము. కావున ఆయనను పొందు టకు పై కార్యము లన్నియు చేయుచు, ఆయన యనుగ్రహము బడయవలయును.

౪. నదులు నిరంతరము నిలువకుండ పారుచు, మానవ పూజాదులకుకూడ ఆశపడి ఆగక, తమ మూలాధారమగు సము ద్రుని జేరి సుఖమును పొందును. అట్లే మానవుడు కూడ లోక మర్యాదల కాశించి ఆగక, పరమాత్మనుజేరి శాశ్వత సుఖము పొందు నంతవరకు ప్రయత్నమును వీడరాదు.

౫. కనిపించున దంతయు ద్వైతము. కనిపించనిదే అద్వై తము. భక్తిజ్ఞానముల ద్వారానే పరమాత్మ తెలియబడును. ద్వైత మనగా భక్తి. అద్వైతమనగా జ్ఞానము.

## ౧౪౮ శ్రీ శ్రద్ధానంద సద్గురు స్వామి

౧. నీ క్రియలన్నియు యజ్ఞరూపమై యుండవలయును. అనగా ప్రతికార్యము దైవభావముతో చేయవలెను.

౨. ప్రతిక్రియకు ఫలము లభించక తప్పదు. కాన శాశ్వత మగు సత్ఫలదృష్టితో కర్మ చేయవలెను.

3. ప్రతిప్రాణిని భగవత్స్వరూపముగా లేక ఆత్మ స్వరూప ముగా దలంచి సేవించుటచే భక్తి వృద్ధియగును. శక్తివంచన లేకుండ ప్రయత్నించువానికే ఫలముచేకూరును.

# ౧౪౬ సాధూమాత జనాబాయి

౧. కర్మ చేయకుండ ఒక క్షణముకూడ యుండలేము. కాని కర్మలుప్రలము గాక, భగవంతునికొరకే యజ్ఞరూపమున కర్మ చేయవలయును.

౨. ఇచ్చుటలో గొప్పకలదు. కాని పుచ్చుకొనుటలో గొప్ప లేదు.

౩. మీ కొరకు కర్మ చేయకున్నను లోకముకొరకు సత్కర్మలను జేయుడు.

౪. భగవంతు డిచ్చిన దేహముతో భగవంతుని పదార్థములను కర్మరూపమున సదుపయోగము చేయుడు.

౫. సదాచార సత్ప్రవర్తన, నీతి, ఓరిమి, సహనములతో మెలగుచు మనము బాగుపడి ప్రజలను బాగుచేయుటయే మన కర్తవ్యము.

౬. ఎన్ని విన్నను, ఎన్ని చదివినను, అందులో మనకేది మంచిదో, దేనిచేత మన కల్యాణమగునో దానినే వివేకముతో నాచరింపుడు.

౭. బాహ్యవిషయజ్ఞానము నిజమైన జ్ఞానముకాదు. లోన దాగియున్న ఆత్మస్వరూపమును తెలిసికొను జ్ఞానమే నిజమైన జ్ఞానము. ఈ సంసారము, దేహము మొదలగున వన్నియు నశ్వరములేనని తెలిసికొని వాటి మమతలను త్యజించుటే నిజమైన జ్ఞానము.

౮. మన దుఃఖమునకు అర్జునుని దుఃఖమునకు భేదము కలదు. మనము "కావాలి, కావాలి" అని యేడ్చుచున్నాము. అర్జునుడు "వద్దు, వద్దు" అని యేడ్చినాడు. అందుచేతనే మన యేడ్పు రోగమునకు, అర్జునుని యేడ్పు యోగమునకు దారి తీసినది. మనకు పుట్టినదాది చచ్చువర కేడ్పుతప్పదు. ఈ యేడ్పెందులో నున్నదో ఆలోచింపుడు. అర్జునుడు నా వారు

చత్తురని యేడ్చినాడు. కాని మీరు 'నాది, నేను' అను అహం భావమువలన యేడ్చి నాశన మగుచున్నారు. దుఃఖమునకు కారణము మమత్వము. ఇదే అజ్ఞానము. ఈ ప్రపంచములో నీ దను వస్తు వెద్దియును లేదు.

౯. భగవద్గీతవలన అర్జునుని అజ్ఞాన విషాదములు తొలగి ముక్తిని బడసినట్లు మీరుకూడ గీతను చదివి అనుభవించి మాలిన్యముల తొలగించుకొని ముక్తులు కండు.

## ౧౫౦ స్వామి పరమానంద సరస్వతి

౧. తెలియనివాడు చెడుకర్మ చేయునేని భగవంతు డంతగా పరీక్షించడు. కాని తెలిసినవాడు కొద్ది తప్పు జేసినను ఆ తప్పు క్షమింపబడదు.

౨. దేహము వినాకర్మలు చేయలేరు. మానవదేహము లభించినందుకు దీనిచే సత్కర్మలుజేసి ముక్తిని బడయుడు.

3. ఆత్మ పశువు శరీరములో ప్రవేశించినప్పుడు కేవలము తమోగుణ ప్రధానముగను, మానవదేహములో ప్రవేశించినప్పుడు సత్వగుణ ప్రధానముగను ఉండును. నల్లని సీసాలో పెట్టిన దీపము ఎట్లు కాంతిహీనముగా కనిపించి, అదే దీపము తెల్లని సీసాలో పెట్టగానే తేజోవంతముగ ప్రకాశించునో, అట్లే మానవునకును, పశువునకును శరీరములోను, బుద్ధిలోను భేదము కలదు. కాన నీవు మానవుడవై కూడ చెడుకార్యములు జేయుదువేని పతనమగుదువు. ఇతరులు నిన్ను నిందించినను, నీవు దానిని సహించుశక్తిని సంపాదించుము. బుద్ధిని నిర్మల మొనర్చినచో దానిద్వారా భగవంతుని తెలిసికొనవచ్చును. మనస్సు సంస్కరింపబడనిచో భగవత్ప్రాప్తి కానేరదు. మట్టికి విలువయుండక, బంగారమునకు విలువయుండునట్లు మానవునికి విలువయుండును. కావున మనస్సును బుద్ధిని రక్షింపవలయును.

౪. భగవంతుని భజించుటకు, ప్రేమించుటకు పనికివచ్చునట్టి మానవశరీరము అమూల్యమైనది. కావున కుక్కలు, నక్కలవలె జీవించి నీ అమూల్యమైన మానవశరీరమును పాడుచేయకుము.

౫. సదాచారము, సత్ప్రవర్తనము, మితాహార మితవ్యవహారముల ద్వారా నీ జీవయాత్రను గడుపుచు భగవద్భక్తుడవు కమ్ము.

౬. లోకములో ప్రయోజనములేని వస్తువేదియు లేదు. పరస్పరము కలియుటచేతనే కల్యాణమగును.

౭. మన జీవితమును శ్రద్ధతో యజ్ఞమయము జేయవలయును.

౮. మనస్సును అర్పించినపుడే నిజమైన సేవ జరుగును.

౯. మనస్సు ప్రసన్నముగాను, స్వస్థముగాను నున్నప్పుడే, శరీరము స్వస్థముగా నుండును.

౧౦. శరీరమును పెంచి శృంగారించుటలో ప్రయోజనము లేదు. కాని మానవ ముఖ్యలక్షణ మేదో తెలిసికొని దానినవలంబించుటలోనే ప్రయోజనము కలదు.

౧౧. సంసారాసక్తులను సంపూర్ణముగా విడిచి నిశ్చింతుడవైనపుడే నీకు మేలు సేకూరు టారంభమగును.

౧౨. స్త్రీని చూచుటచే చిత్తములో కామవాసన ఉత్తేజమగునేని గొప్ప పాపము సంభవించినదని తలంచుము. ఈ పాపము జన్మజన్మాంతములవరకనుభవించవలసివచ్చును.

౧౩. వ్యభిచారికి యెప్పుడును సద్గతి లభించనేరదు.

౧౪. తల్లి పిల్లవాని మలమును, మైలను శుభ్రపరచి, తన ఒడిలో తీసికొనునట్లు భగవంతుడు పాపపంకిలమును దుఃఖముల ద్వారా తుడిచి, శుభ్రపరచి మిమ్ములను తన వద్దకు జేర్చుకొనును.

## ౧౫౧ శ్రీ నిత్యానందస్వామి (కాళహస్తి)

౧. మానవులందఱు సమానులనుట పొరపాటు. మనుష్యులందఱొకే తీరుండనేరరు. సనాతనధర్మప్రకారము వర్ణాశ్రమధర్మ

ములును, ప్రారబ్ధ కర్మానుసారమున సత్యమును ఉండును. అందుచే మానవులందఱు సమానులనుట శాస్త్రవిరుద్ధము.

౨. అజ్ఞానము, భేదభావముచేతనే బంధమేర్పడును. ఇతరుల మనస్సు నొప్పింపక వర్తించుటే బంధవిముక్తి.

## ౧౫౨ శ్రీ కృష్ణానందభారతి స్వామి

౧. మానవజన్మ మహోత్తమమైనది. దీనిచే జన్మ సార్థకమగును.

౨. సాధన లెన్ని యున్నప్పటికిని మూలభూత మొకటే. 'చూచువాడు, చూడబడు వస్తువు, చూపించువాడు' అంతయు ఆయనయే.

3. మానవజన్మ సార్థకమగుటకు త్యాగము ముఖ్యము. దీనితోపాటు సదాచారము, సత్ప్రవర్తన గలవారై శ్రద్ధాభక్తులతో సేవ జేయవలయును.

౪. విషయ వాసనలు తొలగి, రాగద్వేషములు నశించినప్పుడే ముక్తిలభించును.

## ౧౫3 శ్రీ రామకృష్ణానంద స్వామి

౧. మనోశక్తి ఇంతింతని చెప్పుటకు వీలులేదు. దానిని వినియోగించి యేదైన పొందవచ్చును. సత్యసంకల్ప ప్రభావము మహాగొప్పది. కావున మనస్సులోని చెడుగుణములను తొలగించి పవిత్రము జేయుడు. ప్రాతవన్నిటిని వదలి క్రొత్తవి చేపట్టుడు.

౨. ప్రతి మానవుడు నిన్ను ప్రేమించునట్లు వర్తించుము. ప్రతిజీవి నాదరించి ప్రేమించి సేవింపుము.

3. భేదభావమును, స్వార్థమును విడిచి లోకసేవ జేయుము. సత్సంగము, సాధుదర్శన మొనర్పుము.

౪. మానవజన్మ కడు దుర్లభము. కావున ఈ జన్మలోనే ముక్తిని సంపాదించుకొనుము. విషయభోగములకై మానవ జీవితమును వృథాగా పాడుచేసి కొనకుము.

౫. దేహము, సంసారము అనిత్యములు. కాన క్షణికమైన సంసారమును త్యజించి, శాశ్వత బ్రహ్మము నాశ్రయింపుము.

౬. అన్నమునందు ప్రీతిని విడిచి ఆత్మయందు ప్రీతి నుంచుము.

౭. ప్రాణమునైనను వీడి పాటుపడు వాడే ఆత్మానుభవ మును పొందును.

౮. నిన్ను నిందించు వానిని ప్రేమించుము. ఎందుకన వాడు మొదలుచేడి, నిన్ను పవిత్రుని జేయును. కాన వాడు నీ కుప కారి, మిత్రుడు.

౯. ఫలవృక్షమువలె వంగి నమ్రుడవై మెలంగుచు శ్రద్ధతో పనిచేయుము.

౧౦. నీ వెన్ని చదివినను, యెన్ని విన్నను, అనుభవము లేనిదంతయు వ్యర్థమే.

౧౧. పరమాత్మయందు దృష్టినుంచి భగవద్భావముతో లేక ఆత్మభావముతో పని చేయుచుండుము.

౧౨. నీ యొక్కని ముక్తినే జూచుకొనక, అందఱిని ముక్తులను జేయుటకు ప్రయత్నింపుము. సదా లోకసేవ చేయుచుండుము.

౧౩. నీళ్ళవలె మనస్సుకు స్వరూపము లేదు. ఎందుపెట్టిన నందులోనే నిలుచును.

౧౪. కను విషయముకంటె విను విషయమే శాశ్వతముగా నిల్చును. కాన మీరు వినున దంతయు ననుభవములో పెట్టుకొనుడు.

౧౫. జడమను భావమును వదలినప్పుడే చైతన్యము చేకూరును.

౧౬. నీవు పశువుగావు, పశుపతివి. కాన విచారించుకొనుము.

౧౭. లోకము విద్యుచ్ఛక్తివంటిది. కాన లోకమును ముట్టు కొనకుము. పట్టుకొన్నట్టి జగద్దృశ్యములను వదలి పరమాత్మను పట్టుకొనుము.

౧౮. త్యాగము చేతనే నీ వుద్ధరింపబడుదువు. కాన త్యాగివి కమ్ము.

౧౯. ఇంద్రుడు గొప్ప కాడు. ఇంద్రియములను జయించిన వాడే గొప్పవాడు.

౨౦. సాధకు డింద్రియార్థ జీవి కాకుండ ప్రాణార్థజీవి కావలయును. ఏకాంత మితాహారముతో పాటు మనోవాక్కాయములను నియమములో పెట్టుకొనవలసి యుండును. మనస్సులో మాయ మర్మములు లేక బాలకునివలె ప్రవర్తింపవలయును. ఈ విధమైన త్రికరణశుద్ధి లేనివానికి ధర్మశుద్ధి లేదు. ధర్మశుద్ధి లేనివానికి భగవదనుగ్రహము కలుగదు.

౨౧. ఏకాంతసేవన, లఘుఆహారము, త్రికరణశుద్ధి గల్గిన వానికి సహజముగా వైరాగ్యముండును.

౨౨. పాలలో వెన్న వ్యాపకమై యున్నను మథించనిదే బయటికి వెడలనట్లు, భూతములలో ఆత్మ వ్యాపకమై యుండికూడ, ధ్యానయోగముద్వారా బుద్ధిని మథించనిదే ఆత్మ సాక్షాత్కారము కానేరదు. పరమాత్మ సర్వవ్యాప్తమై యుండికూడ స్తంభమును బద్దలు చేయనిదే హిరణ్యకశిపునికి దర్శన మీయలేదు. కావున పురుషప్రయత్నముచే ప్రబల ధ్యానసాధనలతో ఆవరణ భంగము కలుగనిదే ఆత్మ లేక పరమాత్మ సాక్షాత్కారము కాదు.

## ౧౫౪ స్వామి ఆనందాశ్రమ్‌జీ

౧. విశ్వమంతయు నీశ్వరస్వరూపమే. భూతములన్నియు భగవత్స్వరూపములే. అందటిలో నేను, నేను అను ధ్వని వెడలు చుండును. కాన భూతములన్నియు నాత్మస్వరూపములే. కాని సంకుచిత భావముచేత భేదమేర్పడినది.

౨. మనోశక్తి మహామహిమాన్వితమైనది. మనోభావము ఈ బ్రహ్మాండములో వ్యాపకమై యున్నది.

3. ఈ శరీరము తిని త్రాగుటకే లభించలేదు. ముక్తికై లభించినది. కాన విషయభోగములను త్యజించి, ఆత్మానందముకై ప్రయత్నింపుడు.

౪. నీ అంతఃకరణము పవిత్రమైనపుడే సమస్త సంసారము నీకు పవిత్రమై గోచరించును.

౫. ఈ సంసారమంతయు నీ స్వరూపమైనప్పుడు, వారందఱి క్షేమమును గోరుటకూడ నీ కర్తవ్యమే. కావున నందఱిని యాదరించి సేవింపుము.

౬. ఆత్మ శాశ్వతమైన దైనప్పు డిక మృత్యువుతో భయమేల ?

౭. భగవంతుని సేవకురాలు లక్ష్మీదేవి. కావున భగవంతుని నామమును స్మరించువారికి లక్ష్మి కొరత యెప్పుడు నుండదు. ఇయ్యది నిశ్చయము.

౮. పరిశ్రమ – అనగా పురుషార్థము లేకున్న ముక్తి లభించదు. కాన పురుషార్థముచే తత్త్వమును దెలిసికొనవలయును. తన స్వస్వరూపమును దెలిసికొనుటే ముక్తి.

## ౧౫౫ స్వామి అశేషానంద సరస్వతి

౧. మనలోనుండి మలవిక్షేపావరణము లను మూడు దోషములు తొలగనిదే, మన హృదయస్థితుడగు భగవంతుడు కనిపించడు. అద్దము నిర్మలమై ఆచ్ఛాద చలనరహితముగా నున్నప్పుడే మన బింబ మా యద్దమున నెట్లు కనిపించునో అట్లే మన యంతఃకరణము నిశ్చలమై, నిర్మలమై, ఆవరణ దోషరహితము కాగానే ఆత్మదర్శన మగును. ఆవరణమనగా తన స్వరూపమును మరచుటయే. అదే అజ్ఞానము.

౨. ఈ దోషములు కర్మలతో, మాటలతో, ఉపాసనలతో తొలగవు. జ్ఞానజ్యోతితోనే తొలగి అద్వైతస్థితి కలుగును. సాధన

లన్నియు నంతఃకరణ శుద్ధికొరకే అక్కరకు వచ్చును. ఈ మూడు దోషములు తొలగినచో మానవుడే మాధవుడగును.

## ౧౫౬ సాధుమాత జోగమాంబ

౧. ఓ మహాజనులారా! ప్రకృతి పురుషు లిద్దరిద్వారా యీ సృష్టి యేర్పడినను, యీరెంటికి సాక్షీభూతు డొక్కడే.

౨. సర్వభూతములలో నివసించు పరమాత్మను నిర్మల హృదయముతో నుపాసింపుడు.

3. మానవజన్మ ముక్తికి దొరకినది. కాని విషయభోగము లకై దొరకలేదు. కావున సర్వవాసనలను విడిచి, ప్రతి ప్రాణిని నీ సోదరుని వలె భావించి సేవించుచు, భగవంతుని ధ్యానించు చుందుము.

ర. భార్య తన భర్తను దైవము వలె భావించి సేవింపవల యును. తన భర్తకు సంబంధించిన వారందరిని ప్రేమతో నాదరింప వలెను. ఇదియే పతివ్రత ధర్మము.

## ౧౫౭ జ్ఞానానందస్వామి

౧. జన్మము లన్నిటిలో మానవజన్మ ఉత్తమమైనది. మాన వునికర్మ యోగకర్మ కాని భోగకర్మ కాదు. అతడు స్వతంత్రుడు కాని పరతంత్రుడు కాడు. నీ వెవడవో తెలిసియున్నచో వెంటనే నీకు మోక్షము.

౨. సుఖ మపేక్షించు మనస్సును బంధించినచో సుఖము కోరున దింకొకటి యుండదు. అనగా సుఖము నివృత్తియగును. కాని దానిని బంధించక బాహ్యసుఖములకై నీ వెంతసేపు ప్రయత్నించి నను వ్యర్థమే. కోరికలన్నియు విడిచితివా మనస్సు పట్టుబడును. సంసారము నుండి మనస్సును మరల్చి భగవంతుని వైపు త్రిప్పుము.

3. ఈ కనిపించుచున్న సాకారమంతయు ఈశ్వరరూపమే. కావున ప్రతి ప్రాణిని ఈశ్వరభావముతో సేవింపుము.

౪. ఆత్మభావముననే ప్రతి క్రియ నాచరింపుము.

౫. ఆత్మభావము లేనికారణముననే, యీ కాలమం దెవ్వరికిని శాంతిలేదు. ఈ దేహము, సంసారము అంతయు నశించునవియే. నిజస్వరూపుడనగు ఆత్మను 'నేనే'నని తెలిసికొన్నవానికే శాంతి చేకూరును.

౬. నేను, నాది అనున దేదియు లేదు. అంతయు పరమాత్మ స్వరూపమే. నా భార్యాబిడ్డ లందఱు పరమాత్మ స్వరూపులే యని భావించితివా ముక్తి సిద్ధించును. ఓంకారమే సర్వత్ర వ్యాపించి యున్నది.

## ౧౫౮ శ్రీ దండిస్వామి

౧. మనో ఇంద్రియములను వశపర్చుకో లేనివానికి భక్తి, జ్ఞానము చేకూరవు. అంతఃకరణ శుద్ధిచేతనే భక్తి, జ్ఞానము చేకూరును. జ్ఞానముద్వారా మోక్షము సిద్ధించును. చిత్తశుద్ధి కానంత వరకు కర్మచేయక తప్పదు. చిత్తశుద్ధి అయినప్పుడే మనస్సు శాంతిని పొందును.

౨. అంతఃకరణ పవిత్రమే సన్న్యాస మనబడును. రాజస, తామస త్యాగముచే అంతఃకరణ శుద్ధికాదు. సాత్వికత్యాగమైన పుడే అంతఃకరిణ శుద్ధియగును.

౩. స్థూలదృష్టి యున్నంతసేపు కర్మత్యాగము కానేరదు.

౪. విషయములనుండి చిత్తము విడబడినప్పుడే భగవంతుని వైపు తిరుగును.

౫. సావధానుడవై మెలగుము. లేనిచో పతనమగుదువు.

౬. జీవుడు అఖండ సుఖమును గోరుచుండును. కాన ధన ధాన్య సంపత్తులు కుటుంబము లెన్నియున్నను వాటిచే అఖండ సుఖమును పొందనేరడు.

౭. సంసారమున రోజూ ఎందఱో మృతి నొందుచుందురు. కాని వారికై దుఃఖించరు. తమవారు మరణించినచో దుఃఖింతురు.

'నాది, నేను' అను మోహ, మమతలే దుఃఖమునకు కారణములు. కాన దుఃఖము తొలగవలెనన్న నాది, నేనను మోహమమతలను త్యజించుడు.

౮. సృష్టిస్థితి లయ కారకుడైన పరమాత్ముడే దేహములో నుండి, తినుచు, త్రాగుచు, మాట్లాడుచు, చూచుచు, ప్రతికార్యమును జేయుచుండును. అట్టి కార్యములు నేనే జేయుచున్నానని దేహాభిమానములో జిక్కి నశింపకుడు.

౯. నీవు నీ సంసారమును భగవదర్పణము చేసి, సేవకునివలె పని చేయుము.

౧౦. ఈ లోకములోని అత్యాచారములన్నియు, అధర్మ, అసత్య కర్మలవల్లనే జరుగుచున్నవి.

## ౧౫౯. శ్రీ స్వయం ప్రకాశానందస్వామి

౧. సాధు సత్సంగమే సకలార్థ సాగరము.

౨. చేప, తాబేలు, పక్షి-పిల్లల జేయు విధమున సాధువుల కటాక్షముచే, సంకల్పముచే స్పర్శచే మానవుడు ముక్తినిపొందును. చేప తన గ్రుడ్లను దూరమునుండి చూచుచుండి పిల్లల జేయును. తాబేలు తన గ్రుడ్లను కేవలము సంకల్పముద్వారా పిల్లలజేయును. పక్షి తన గ్రుడ్లను ఱెక్కల చాటున పెట్టుకొని పిల్లల జేయును.

## ౧౬౦ శ్రీ శంకరానంద స్వామి

౧. నామస్మరణలోనే భుక్తి ముక్తి కలదు. ప్రతినిత్యము నామస్మరణజేసి మోక్షము బడయుడు. ఓంకారమే భగవంతుని నామము. కావున జాతిమత విచక్షణ లేకుండ స్త్రీపురుషులందఱు చిత్తైకాగ్రతతో ఆ "ఓం"కారమును అర్థసహితముగా సదా స్మరించు చుండవలెను.

౨. ప్రతి ప్రాణిలో పరమాత్ముడు వసించియుండ నిక బ్రాహ్మణ శూద్రాదు లను సంకుచిత భేద మెందులకు?

3. మీ యథార్థ స్వరూపమును మీరు జ్ఞాపక ముంచుకొనుడు.

౪. సుఖదుఃఖములకు లోబడక అనంతానంద మనుభవించుడు. సుఖముతోపాటు దుఃఖముండి తీరును.

౫. ఓ మానవులారా! మీ హృదయములను పవిత్రము జేసికొనుడు. మానవునిలో అమృతము, మృతము అను రెండు వాసనలు గలవు. అమృతముచే నానందము చేకూరును. మృతముచే దుఃఖము కలుగును.

౬. సంకుచిత భావముచేత మనలను మనమే నశింపజేసికొను చున్నాము.

౭. మీ క్షుద్ర భావములను (అల్పుల మను భావములను) తొలగించుకొని 'శివోహం' అను భావమును నెలకొల్పుకొనుడు.

## ౧౬౧ శ్రీ చిరంతనానంద స్వామి

౧. సర్వము బ్రహ్మమయ మగుటచే, బ్రాహ్మణ క్షత్రియ శూద్రాదు లందఱికిని బ్రహ్మవిద్య కధికారము కలదు.

౨. జ్ఞాన భక్తి సాధనలవలన మోక్షము సిద్ధించును.

3. నీతోడి సహోదరులు తినుటకు తిండిలేక, కట్టుటకు బట్టలేక అల్లాడుచుండ, నీవు మాత్రము సుఖపడుట న్యాయమా? స్వార్థపరులకు జ్ఞానము, భక్తి ఎట్లు కలుగునో నీవే విచారించుకొనుము.

౪. పేదలను ప్రేమతో నాదరించి లోకకల్యాణము నర్థించువారే మహాత్ములు.

౫. విషయవాసనల త్యజించువాడే ముక్తుడు. ధర్మము నాచరించుచు ప్రచారము జేయువాడే ధర్మాత్ముడు.

౬. సర్వపరిత్యాగమే సన్న్యాసము. అహంకార మమకార త్యాగమే నిజమైన త్యాగము. నేను, నాది అను భావమే బంధము.

౭. అవినీతి దురాశలచే అరిష్టములు వచ్చినవి. పశుపక్ష్యాదులకు లేని తిండికొరత, వివేకముగల మానవులకు సంభవించుటకు కారణము వారి అవివేకమే.

౮. సర్వభూతములను పరమాత్మ స్వరూపులుగా భావించువాడే ముక్తుడు.

౯. అన్నదానముపోయి అన్నవిక్రయ మగుటచే శరీరము వికృతమైనది.

౧౦. కన్యాదానము పోయి కన్యావిక్రయమైనది. విద్యాదానముపోయి వికృతవిద్య యైనది.

౧౧. మనదేశము బాగుపడవలెనన్న మన విద్యావిధానములో మార్పు వచ్చితీరవలెను. సత్యము, అహింస, వినయవిధేయతలు, సదాచారాది సద్గుణములు మన పిల్లలకు నేర్పనిదే స్వరాజ్యమెట్లు సిద్ధించును?

## ౧౬౨ స్వామి వాసుదేవానందగిరి

౧. త్యాగమే అన్నిటికంటె ఉత్తమమైనది. త్యాగముచేతనే వైరాగ్యము, వైరాగ్యముచేతనే చిత్తశుద్ధి, చిత్తశుద్ధిచేతనే ఆత్మానుభవము కల్గును. దేహాభిమాన త్యాగమే నిజమైనత్యాగము. అహంకారత్యాగమే సత్యమైన త్యాగము. నిరభిమానము గలవాడే సన్యాసమున కర్హుడు.

౨. మహాత్ముల సేవ, సత్సంగములతోపాటు తోడి జీవులను భగవత్స్వరూపులుగా భావించుచు లోకమునకు దాసుడై జీవయాత్రను గడుపువాడే ముక్తుడు.

3. అహంకార మమకారములను తొలగింపక తక్కినవెన్ని చేసినను శాంతి చేకూరదు.

౪. నిష్కామకర్మయే ముక్తికి ద్వారము. కేవలము శుష్కవేదాంతముతో ముక్తి దొరకదు.

## ౧౬౩ శ్రీ సర్వేశ్వరానందస్వామి

౧. తపశ్శక్తిచేతనే ముక్తి సిద్ధించును.

౨. భక్తి జ్ఞాన వైరాగ్యములు గలిగి పవిత్రహృదయము గల వారందఱు సాధువులే. విద్య నేర్చినంతనే సాధువు కానేరడు. జ్ఞానశక్తిగలవాడే (విద్యుచ్ఛక్తి) సాధువగును.

3. అనేక చిత్ర విచిత్రములుగల, ఈ మాయాలోక మొక ప్రదర్శనశాల వంటిది. కాన దీనిని ప్రదర్శనశాలవలెనే జూడుము. దానిని గూర్చి విచారపడక ఆనంద మనుభవింపుము. దానిలోపడి నిన్ను నీవు మరువకుము. విషయభోగముల కాశించి వానికి బద్ధుడవై నశింపకుము.

౪. ఆత్మవిశ్వాసము లేనివాడు నాస్తికుడే. ఆత్మవిశ్వాస మెట్టిదో దృఢనిశ్చయమును అట్టిదే. అందుచే దేహము నేను కానని నిశ్చయించుకొనుము.

౫. విన్నదానిని మనస్సులో నుంచుకొని యనుష్ఠించి నపుడే మీకు మేలు గలుగును.

౬. శమదమాది, సత్యాహింసాది గుణములు గలవానికే దయ కలుగును.

౭. బింబ ప్రతి బింబములే జీవేశ్వరులు. నేనను కర్తృత్వ భావ మున్నంతవరకు జీవదేహ భావము లుండును. అద్దము తొలగగానే, బింబ ప్రతిబింబ మేకమగునట్లు దేహాభిమానము నశించిన వెంటనే జీవత్వము తొలగి బ్రహ్మత్వమే మిగులును.

## ౧౬౪ స్వామి మహాదేవానంద సరస్వతి

౧. సర్వభూత స్థితుడగు పరమాత్మని దెలిసికొనుట మానవుని కర్తవ్యము. పరమాత్మ సర్వదేహములలో వసించుచున్నాడు. కాబట్టే వాసుదేవు డందురు.

౨. శ్రవణ, మనన, నిదిధ్యాసములచే చిత్తము నిర్మలమై నిశ్చలముకాగానే ఆత్మసాక్షాత్కారమగును.

## ౧౬. స్వామి న్యాయాచార్య గణేశానందజీ

౧. ఓ బంధువులారా! కారణము లేక కార్యముండదు గదా! ఐతే మీరు పుట్టి పెరుగుచున్న ప్రయోజనమేమో, మీరే విచారించుకొనుడు.

౨. మనము పశువులమైనచో బండికి కట్టెదరు. గాడిదలమైనచో బరువును మోయింతురు. కాని మనము విజ్ఞానముగల మానవులము. కావుననే మానవజన్మ శ్రేష్ఠమనబడినది.

౩. ఓ సహోదరులారా! బయటికి వెళ్ళిన శ్వాస తిరిగి లోనికివచ్చు నమ్మకము లేనట్టి అశాశ్వతమైన యీ నశ్వరదేహ మెపుడు పడిపోవునో యెవరి కెరుక? కాన తొందరగా జాగ్రత పడుడు.

౪. సంసారభోగములను విషప్రాయముగ విడచి ఆత్మామృతమును పొందుడు.

౫. 'సంశయాత్మ వినశ్యతి'. ఒకటి మంచి ఒకటి చెడ్డదను భావ ముంచక, నీకేది మంచిదో, దేనిచే కల్యాణము చేకూరునో అట్టిదానినే అవలంబింపుము.

౬. ఇతరులవైపు జూడక నిన్ను నీవు జూచుకొనుము.

౭. నిద్రించుటకు పూర్వమును నిద్రనుండి లేవగాను ప్రభువును ధ్యానించిన మనస్సు పరివర్తన మగుచుండును. ఇట్లొక మాసము చేసిన నీకే అనుభవమగును.

౮. ఓ జనులారా! మానవజన్మమెత్తి భగవన్నామమును భజించనివారు మరుసటి జన్మమున కప్పలై పుట్టుదురు. ఆత్మానందము పొందని జన్మము నిరర్థకము. చిత్తవృత్తిని నిరోధించినపుడే యోగము సిద్ధించును. మనోనిగ్రహముచేతనే ఆత్మానందము కలుగును.

౯. మహాపురుషులు నివసించుస్థలము మహాపవిత్రమగును. జీవితమునుపవిత్రము జేసికొన్నచో ప్రజ లుద్ధరింపబడుదురు.

౧౦. సమయమును, సంపత్తిని, శక్తిని దురుపయోగము చేయక సదుపయోగము జేయుదురేని ముక్తి కరతలామలకమగును. ఆర్జితవిత్త మపహరింపబడినను దానిని తిరిగి సంపాదింపవచ్చును. కాని పోయినసమయము తిరిగిరానేరదు. కాన కాలమును వ్యర్థము చేయకుడు.

## ౧౬౬ శ్రీ ప్రణవానందస్వామి

౧. బ్రహ్మతత్త్వమును తెలిసికొనుట మానవుని కర్తవ్యము. ఇది విచారముద్వారా తెలిసికొనబడును.

౨. అంతఃకరణ మెట్లుండునో మానవు డట్లే యగును.

౩. కీర్తిప్రతిష్ఠల కాశింపకుము. చేయరాని దేదియును జేయకుము.

౪. జాతి కుల మర్యాదలను శాస్త్రానుసారమున వర్తించువాడు సులభముగ ముక్తుడగును.

౫. సుఖమే కోరుదురేని స్వేచ్ఛను త్యజింపుడు. ధర్మాచరణముననే సుఖము లభించును. శరీరసుఖములను త్యజించినప్పుడే ధర్మాచరణ జరుగును.

౬. బ్రాహ్మీ ముహూర్తమున నిద్రించుటకూడ పాపమే.

౭. పరస్త్రీని పవిత్రదృష్టితో మాతృభావముతో జూడుము.

౮. ప్రేమతో జేయు కార్యమున క్లేశముండదు. ప్రేమగల కార్యమున శ్రద్ధాభక్తు లుండును.

౯. మన జీవితము సమాజము నుండియే ఉద్ధరింపబడును. కాన సమాజోపకారము మన ధర్మము. సమాజము నుపేక్షించినచో ముందుకు పోలేము.

౧౦. ప్రాణులన్నియు మానవుని కుపకారము జేయుచుండును. కాన సర్వప్రాణుల రక్షించుట మానవుని కర్తవ్యము.

## ౧౬౩ బ్రహ్మానందగిరి స్వామి

౧. యజ్ఞ, యోగ, ఉపాసనాది కర్మలవలనగాక, కేవలము జ్ఞానమువలననే మోక్షము సిద్ధించును.

౨. ఓంకారము (సోహం) అను జపమంత్రమును క్రమముగా ననుష్ఠించుచో ముక్తి గలుగును. 'సోహం' ను శ్వాసతో జపించవలెను. 'సో' అనుచు నిశ్వాసము జేసి పిదప 'హ'మ్మని ఉచ్ఛ్వాస మొనర్చుచు, సదా సోహమును ఉచ్ఛ్వాస నిశ్వాసల ద్వారా జపించిన ముక్తి సిద్ధించును.

3. దేహమును సర్వకాలములందు కనిపెట్టుకొనియుండు, హంస యను పేరుగల ప్రాణవాయువే, అన్నిటికంటె శ్రేష్ఠమైనది.

## ౧౬౪ శ్రీ నారాయణానందగిరి స్వామి

౧. జీవేశ్వరైక్యము కొరకే దేహ మవసరము. దేహమున కాహార మవసరము. ఆహారమునకై కర్మ జేయవలసియుండును. కాని ఆ కర్మ ధర్మబద్ధమై, యితర జీవులకు హానికలిగించనిదై యుండవలయును.

౨. ప్రాణరక్షణార్థమై హితమగుదానిని మితముగా భుజింపవలయును. తినుటకే జీవించువాడు బద్ధుడు; జీవించుటకు తినువాడు ముక్తుడు.

3. తత్త్వమును దెలిసికొనుటకే, ప్రాణమును రక్షించుకొనవలయును. 'నే నెవడనని తెలిసికొనుటే తత్త్వము. జన్మమృత్యునివారణ కొరకే తత్త్వమును తెలిసికొనవలెను.

౪. జీవన కృత్యములను పవిత్రముగా జేసి కర్తవ్యమును పాలింపుము.

౫. మానవజన్మ ముక్తికొరకే లభించినది. కాబట్టి యీ కర్తవ్యమును నిర్వహించువాడే నిజమైన మానవుడు.

౬. ఓంకారము పరబ్రహ్మమును బోధించును. కాబట్టి అందఱును ఓంకారమునే జపించి బ్రహ్మమును బొందవచ్చును.

## ౧౬౯ సాధు మాత త్యాగీశానందజీ

౧. లోకమున సుఖము లేదు; లోకవాసనల వీడరా! ఇంద్రియములకు లోనుగాక ఇంద్రియాతీత సుఖమును గాంచరా! ఆత్మానందమే, అనుభవానందమే, అమృతమురా !

౨. నే నెందుకు పుట్టితినని వివేకముతో విచారించి, ఆత్మసుఖమును పొందుడు. ఆశ నశించినప్పుడే ఆత్మసుఖము చేకూరును.

3. బొట్టు, జుట్టు మొదలగునవన్నియు బాహ్యములే. సర్వభూతములలో నివసించు బ్రహ్మ మొకడే. కావున బాహ్యవిషయములను వీడి ఆంతరములోనున్న పరమాత్మను చేపట్టుడు.

౪. సాధు సమ్మేళనమే సరిపోదు. హృదయ సమ్మేళనము కూడ జరుగవలెను. బోధించుటే కాదు. ఆచరణానుభవము కూడ కావలయును. హృదయతాపమును హరించునట్టిది ఆత్మవిద్య. ఇదే సాధుసమ్మేళనము. హృదయములోని మాలిన్యము పోకున్న తగాదాలు వచ్చును.

౫. ఇతరుల నవమానించక ఆదరించి ప్రేమించుడు.

౬. క్రోధమును ప్రేమచే, లోభమును దానముచే, అసత్యమును సత్యముచే జయించుడు.

౭. దేహభావము, విషయవాసనలు తొలగనిదే ఏకాంతవాసముండుచో అది యేకాంత వాసముకాదు. కాని కాంతావాసమే యగును.

౮. సంఘములో వసించి తగాదా వచ్చినప్పుడు కూడ ముఖవికారము జెందనివాడే శాంతుడనబడును.

౯. భగవంతుడు కావలెనని కోరుదురేని సత్సాధనలచే హృదయమును పవిత్రముచేసి, సర్వప్రాణులను ప్రేమింపవలసి యుండును.

౧౦. రాగద్వేషములు విడిచి పశుత్వమును తొలగించినప్పుడే మానవత్వము సిద్ధించును. దానిచే దేవత్వము చేకూరి

పిదప బ్రహ్మత్వము ప్రాప్తించును. భూతదయ కలిగినప్పుడే ముముక్షుత్వము కలుగును.

౧౧. సముద్రములో పడినట్టి ఉప్పు బొమ్మవలె విన్నదానిని అనుభవించి అందు లీనమగువాడే బ్రహ్మమును పొందును. కాన ఆలసింపక మోక్షమునకై తీవ్రముగా యత్నింపుము.

## ౧౭౦ శ్రీ అనుభవానంద స్వామి

౧. కారణభూతుడైన పరమాత్మ, ఆత్మ స్వరూపమున, సర్వప్రాణులలో స్థితుడై యున్నాడు. మానవునిలో జరుగుచుండు క్రియలన్నియు, ఆ చైతన్య శక్తిచేతనే, జరుగుచుండును. జాగ్రత్ స్వప్న, సుషుప్తావస్థలను, సాక్షీభూతుడై జూచువాడు కూడ, పరాత్పరుడే యని, వివేకముతో బాగుగా విచారించి, సంసార సుఖ క్రియలన్నియు నశ్వరములని యెఱింగి దృఢనిశ్చయుడై, ఆత్మ విశ్వాసాయత్తుడైనప్పుడే ఆత్మసాక్షాత్కారము కలిగి నిత్యానంద సుఖము ప్రాప్తించును.

౨. ఇంటిలో సూదిని పోగొట్టుకొని వీధిలో వెదకునట్లు, ఆత్మానందమును బాహ్య ప్రపంచమున వెదకుటే వెఱ్ఱితనము. ఆత్మానందము కొఱకే ప్రతిజీవి, ప్రతివస్తువును ప్రతిజీవిని ప్రేమించును.

౩. వినినదానిని, చదివిన దానిని హృదయములో జేర్చుకొని, మనన నిదిధ్యాసములద్వారా నాచరించి అనుభవించి ఉత్తీర్ణులుకండు.

౪. ఆర్తభక్తి శ్రద్ధావైరాగ్యములుగల్గి శాంతముదాంతము ద్వారా రాగద్వేష క్రోధరహితుడై, నిశ్చల నిర్మల చిత్తుడైనవాడే బ్రహ్మోపదేశార్హుడని, కైవల్యోపనిషత్తులో, ఆశ్వలాయన ఋషికి బ్రహ్మదేవు డుపదేశించినట్లు చెప్పబడినది.

౫. ధర్మమునకు బద్ధుడై ధర్మమును కాపాడుటే మానవ కర్తవ్యము. ధర్మాచరణముననే ముక్తి లభించును.

౬. జీవబ్రహ్మైక్యము పొందవలెనన్న మహావాక్యమును (ప్రణవమును) సదా అర్థసహితముగా జపించవలెను.

## ౧౭౧ స్వామి రామానంద భారతి

౧. ఓ మానవులారా! సంసార వస్తువులన్నియు క్షణిక ములు, నశ్వరములు. కాన ఆలసించక వాటిని త్యజించి తీవ్ర ముముక్షువులు కండు.

౨. మొదట మానవులుకండు. పిదప యేమైనను చేయుడు. మానవులు గాక యేమిజేసినను మీకు జన్మ మృత్యు దుఃఖాదులగు బాధలు తప్పవు. జీవులకు మేలును శాంతిని గల్గించుటే మానవుల కర్తవ్యమని విస్మరింపకుడు.

౩. ప్రస్తుతము మన భారతదేశము మహాగొప్ప ఆపత్తిలో పడియున్నది. దీనిని పరిరక్షించునది ఆధ్యాత్మిక శక్తిదప్ప వేఱొకటి లేదు. ఆ దివ్యశక్తిని సంపాదించి విపత్తును తొలగించుట ప్రతి భారతీయుని కర్తవ్యము.

౪. మన దేశములో అసంస్కృతి ప్రబలి విస్తరించినది. సినిమాలలోను క్యాలండర్లపైనను మనదేవతల నగ్నచిత్రములు ప్రకటింప బడుచున్నను చూచి, ముకుళించుకొని కూర్చుండుట జూడ చాల శోచనీయము.

౫. మనుజత్వమే దుర్లభము. అందు ముముక్షుత్వేచ్ఛ గల్గుట మహాదుర్లభము. ఆధ్యాత్మిక శక్తిద్వారా లోకమునకు శాంతిని చేకూర్పవలెను. దేశమున కాపత్తి వచ్చినప్పుడు మనము తిని త్రాగి సుఖముగా నిద్రించి, సనాతన ధర్మ సంస్కృతులను విడిచి పెట్టుట చాలా విచారకరము. కాన వెంటనే మేల్కాంచి జాగ్రత పడుడు.

## ౧౭౨ శ్రీ మాతా కృష్ణాదేవి

౧. కర్మచేయుచు ఆ కర్మఫలమును త్యజించుటే సన్యాసము. ఇదే నిజమైన త్యాగము. ఇదియే గృహస్థుని కర్తవ్యము.

## ౧౭౩ శ్రీ లక్ష్మణ చైతన్య బ్రహ్మచారి

౧. మానవజన్మ కడు దుర్లభము. కాన దృఢనిశ్చయముతో శాస్త్రవిధి ననుసరించి దైవపూజ ప్రారంభించినచో మానవోన్నతి కలుగును. దైవారాధన విధిప్రకారము జరుగనిచో విపత్తి కలుగును.

౨. మనము సుఖమున కాశించి, కష్టములను సహించుటకు వెనుదీయుచుండు కారణముననే మన కాపత్తులు గలుగుచుండును.

౩. భగవదారాధనమే మానవునికి శ్రేష్ఠము.

## ౧౭౪ శ్రీ విశ్వేశ్వరానంద స్వామి

౧. భక్తియనగా ప్రేమ. ప్రతిజీవిలో పరమాత్ముడు ప్రేమ స్వరూపుడై యున్నాడని భావించి అందఱిని భగవత్స్వరూపులుగా దలంచి ప్రేమించి నప్పుడే నిజమైన భక్తి చేకూరును.

౨. పరిశుద్ధాంతఃకరణముననే భక్తియను ప్రేమ జనించును. అభిమానరహితమైనప్పుడే అంతఃకరణ పవిత్రమగును.

౩. రాధ శ్రీకృష్ణుని అనన్య ప్రేమచే స్మరించినందుననే, ఆమె ప్రతి రోమము నుండియు కృష్ణా, కృష్ణా యను ధ్వని వెడలుచుండెను. అదే నిజమైన భక్తి. ఈ భక్తి నిజమైన ప్రేమచే జనించును.

౪. శరీరమున వణకుపుట్టి, నేత్రములనుండి ఆనందాశ్రుధారలు అజస్రముగా ప్రవించు సంస్థితియే, నిజమైన భక్తి యనబడును. ఇది ప్రేమచేతనే సిద్ధించును.

౫. ప్రేమోపేతమైన నిష్కామభక్తియే శ్రేష్ఠమైన భక్తి.

౬. భక్తి ప్రేమరహితమైన జ్ఞానము వ్యర్థము. కేవలము జ్ఞానముచే అభిమానము చేకూరును.

## ౧౭౫ శ్రీ కేశవదాసుశాస్త్రి మహామండలేశ్వర్

౧. మానవత్వ మెఱుంగనివాడు మానవుడు కాడు. ఆత్మతత్త్వమును దెలిసికొన్నవాడే మానవుడు.

౨. ధర్మార్థ కామమోక్షము లను ఈ నాల్గింటిని సాధించుటే మానవకర్తవ్యము. మొదట ధర్మమును, దానికై అర్థమును, పిదప కామమును దానిచే మోక్షమును సాధించుకొనుచు, తుదకు ముక్తిని బడయవలయును.

౩. కేవలము బుద్ధివిచారము యథార్థము కానేరదు. ఆత్మ ప్రకాశానంతరమే బుద్ధి నిశ్చలమైన యథార్థమగును.

౪. మనోబుద్ధులు శరీరమువైపు తిరుగుచో బంధనమేర్ప డును. కాని ఆత్మవైపు తిరిగినప్పుడు మోక్షము సిద్ధించును.

## ౧౭౮ శ్రీ మాతా యోగమాంబ

౧. సత్యమే పరమాత్మ స్వరూపము. ఏకాత్మోపాసనయే అన్నిటికంటె శ్రేష్ఠమైనది. సర్వప్రాణుల హృదయములలో నున్న ఆత్మ ఒకటే యను భావముతో నందఱిని ప్రేమించి ఆదరించ వలెను. అభేదజ్ఞానమే శ్రేష్ఠమైన జ్ఞానము.

౨. ఈ ప్రపంచ మొక పిచ్చిఆస్పత్రి వంటిది. కాన డాక్టర్లను వివేకముగల బుద్ధిమంతులు ప్రపంచ మను ఆస్పత్రిలో నున్న అవి వేకులగు బుద్ధిహీనులను సన్మార్గములో ప్రవేశపెట్టుటకు యత్నింప వలెను.

## ౧౭౭ స్వామి సుందర్ ప్రకాశ్ జీ మహారాజ్

౧. ప్రతిమానవుని అంతఃకరణములో మలవిక్షేపావరణము లను మూడు దోషములు గలవు. మలమను రాగద్వేషాది దోషము లును, విక్షేపమను చంచలత్వమును, ఆవరణమను భ్రమ, అజ్ఞాన మను మోహ మమతాది దోషములు తొలగనిదే ఆత్మ ప్రకాశము కానేరదు. నీటిలోని నాచను చంచలత్వమును తొలగించనిదే, సూర్యబింబము కన్పించనట్లే, పరమాత్మ అందఱిలో నున్నను అంతఃకరణమందలి దోషములు దొలగనిచో పరమాత్మ కనిపించడు.

౨. సంసారము నుండి మనస్సును దొలగించువాడే పర మాత్మను దెలిసికొనగలుగును.

3 విషయభోగములలో పడి మీ జీవితమును వృథాగా పాడు జేసికొనకుడు. ఈ దేహము పడిపోవ తుదకు దుఃఖమే సిద్ధించును. కాన మీకు లభించిన దేహ గేహ ధనసంపత్తు లన్నింటిని సదుపయోగ మొనర్పుడు.

## ౧౭౮ స్వామి మహానంది మహారాజ్

౧. జీవుడు సంసారమను కారాగారమున మోహరూపమను గొలుసుతో బంధింపబడి నానా కష్టము లనుభవించుచుండును.

౨. ముక్తి (వాస్తవిక సుఖము) కావలెనన్నచో, విషయ భోగములను, మోహ మమతలను పరిత్యజించి పరమాత్మ శరణ మును పొందవలయును.

3 సుఖదుఃఖములకు మూలమైన సంసారము నుండి తరించు టకు పరమాత్మ పాదములే శరణ్యము. కావున భగవద్భక్తితో సర్వస్వమును పరమాత్మ పాదములం దర్పించి భజించుటే శ్రేష్ఠము.

## ౧౭౯ బాబా మస్తూరాంజీ మహారాజ్

౧. శరీరము క్షణభంగురము. కాని మానవశరీరము మహా దుర్లభము. ఎనుబదినాల్గు లక్షల (84) యోనులలో పుట్టి చచ్చుచు పిదప మానవదేహము లభించును, ఈ యెనుబదినాల్గు లక్షల యోను లందు పుట్టుటకు ఒకలక్ష డెబ్బదియైదు కోట్ల సంవత్సరములు పట్టును. ప్రతి మనిషి తన అంగుళముతో ఎనుబదినాలు గంగుళముల పొడవే యుండును. అనగా తన మూరతో మూడున్నర మూరల పొడ వుండును. ఎనుబది యంగుళముల పొడవుగల శరీరపు క్రింది భాగము భోగభాగము. కేవలము మిగిలిన నాల్గంగుళములు జ్ఞానభాగమగు కపాలము (శిరస్సు). శరీరమును పరమాత్మ (గురువు) పాదపద్మముల కర్పింతురేని ముక్తులగుదురు.

౨. సత్యమునే పలుకుట, పరులకు హానితలపకుండుట, సదా భగవంతుని స్మరించుట అను నీ మూడింటిచే మానవ కల్యాణ మగును.

3. సూర్య చంద్రాదుల ద్వారా తానే మిమ్ము ప్రకాశింప జేయుచు వర్షము ద్వారా అన్నోత్పత్తిని గల్గించుచున్నాడు. కాని మీకు పరమాత్ముడు బిల్లును పంపించుట లేదు కదా! ఆయన యెంత దయాళుడో చూడుడు. అట్టి పరమ దయాళుని విడిచి మిమ్ము మోసముచేసి నశింపజేయు సంసారమును విశ్వసించి స్మరించు టెంత యన్యాయము! ఇంతకంటె ఎక్కువ మోసగాడింకెవ్వడు గలడు?

౪. ఎవ్వరికిని మేలు చేయకున్నను కీడు మాత్రము చేయకుడు.

## ౧౭౦ స్వామి భూమానంద భారతి

౧. మానవజన్మమే కడు దుర్లభము. అందు ముముక్షుత్వపు వాంఛ మహోత్కృష్టము. ఇదంతయు భగవత్కృప చేతనే లభించును.

౨. శాస్త్రాభ్యాసము ద్వారా అంతఃకరణమును పవిత్రముచేసి కొన్న తదుపరి సర్వ వ్యాపకమైన పరమాత్మ సాక్షాత్కార మగును.

3. మంత్ర, జప, యోగ ధ్యానములచే మనస్సును నిర్మలముగను నిశ్చలముగను జేసికొని ముక్తులు కండు.

౪. అవిద్య (అజ్ఞానము) తొలగిననాడే ఆత్మజ్ఞానము చేకూరును.

## ౧౭౧ శ్రీ దయానంద స్వామి

౧. శాంతిని పొందగోరుదువేని, శరణాగతుడవై నీ మనస్సును భగవదర్పితము గావింపుము. శరణాగతుడవై నిన్ను నీ వర్పించు కొనవచ్చును. కాని హృదయములో భగవంతుని నిల్పుట చాలా కష్టము.

౨. దాసుడగుట చాలా సులభము. కాని దాసుని జేసి కొనుట చాలా కష్టము. కాన నిన్ను నీ వాయన కర్పించుకొని ఆయన వాడవగుము. ఇదే మొదటి శరణాగత భక్తి.

౩. 'నీవు నా వాడవు' అనునది రెండవ శరణాగత భక్తి.

౪. 'నీవే నేను, నేనే నీవు' అనునది మూడవ శరణాగత భక్తి.

౫. నేను దేహదృష్టిచే నీకు దాసుడను, జీవదృష్టిచే నీ అంశుడను. ఆత్మదృష్టిచే నీవు నేను ఒకటే-అని హనుమంతుడు శ్రీరామునితో ననెను.

౬. సర్వ విషయములను వీడి, అనన్య భక్తిశ్రద్ధలతో నాయన శరణు పొందినప్పుడే నీ హృదయములో నాయన ప్రవేశించును.

## ౧౮౨ మాతా శాంతీబాయి

౧. కాలము చాలా అమూల్యమైనది. దేహ మనిత్యమైనది. బాల్య యౌవన కౌమారము లను మూడవస్థలుగల యీ దేహము మూడురోజుల పాటిదే. కాన దైహిక సుఖములకై కాలమును వ్యర్థము జేయకుము.

౨. దేవుడు ప్రతిజీవిలో గలడు. కాన ప్రతివానిలో మంచియే యుండును. మలినము మనస్సుదే కాని మానవునిది కాదు. చూచువాని దృష్టి మంచిదియై యుండవలెను.

౩. దేహమునందు లక్ష్యముంచక, కేవల మాత్మయందే లక్ష్యముంచవలయును. అనగా నాత్మభావముతో వర్తించవలయును.

౪. త్యాగులు త్యాగులు కలియుదురేని, అగ్నికి వాయువు తోడ్పడు నట్లుగను, భక్తులు భక్తులు కలియుదురేని అగ్నిలో నెయ్యి పోసినట్లుగను, జ్ఞానులు జ్ఞానులు కలియుదురేని నీటిలో ఉప్పు కలిసినట్లుగను ఏకమగుదురు.

౫. 'పరోపకారాయ పుణ్యాయ' అనునట్లు సదా పరోప కారము జేయుచుండుడు.

౬. తినుట మనకర్తవ్యము; తిన్న దానిని జీర్ణించుట ప్రకృతి కర్తవ్యము. అట్లే మనస్సును పరమాత్మయందు జేర్చుట మన కర్తవ్యము. మిగతదంతయు స్వయమే జరుగును. ఉన్నదున్నట్లు విధి ప్రకారము జరుగుచుండును. కాన చింతను వదలుడు.

## ౧౮౩ స్వామి ఆత్మానంద భారతి

౧. ఈశ్వరుడు కనుపించుచునే యుండును. కాని అతనిని కనుగొను సాధన మనవద్దలేదు. అంధునకు పదార్థము లగపడనట్లు, అజ్ఞానుల కాయన కనిపించడు. హృదయములో పరమాత్మ కలడు. కాని అంతఃకరణము పవిత్రమైనప్పుడే పరమాత్మ గోచరించును.

౨. నవద్వారములు గల దేహములో పదవవాడైన జీవుడను దేవుడు గలడు. తొమ్మండుగురిని లెక్కపెట్టుచు, తన్నుతాను మరచినట్టి పరమానందయ్య శిష్యులవలె, అజ్ఞానముచే, నవద్వార ములు గల దేహమును, భౌతికదృశ్యములను జూచి వాటి మమత లలో దగుల్కొని, జనులు తమ్ము తాము మరచుచున్నారు.

## ౧౮౪ స్వామి కిశోర్ దాస్‌జీ

౧. సంసారాంధకారము జ్ఞానభాస్కరునిద్వారా తొలగును. కాని మానవుని యందలి అజానాంధకారము మహాపురుషులద్వారా తొలగును.

౨. ఆత్మస్వరూపమును తెలిసికొనుటే జ్ఞానము.

3. ఒక కుటుంబీకుని, తన కుటుంబము వారందఱు గొప్పగా దలంచునట్లు, విశ్వకుటుంబమునకు యజమానుడగు ఈశ్వరుని అందఱు గొప్పవాడని తలంచి భజింతురు.

౪. ఈ సంసారము మహా చిత్ర విచిత్రములు గలది.

౫. తమ కర్తవ్యములను విస్మరించి, అవివేకాజ్ఞానములలో దగుల్కొన్న పామరులను బాగుపరచుశక్తి మహాత్ములకు గలదు.

౬. సంసారాసక్తులై అవినీతిలో మగ్నులైయున్న భారతీయుల నుద్ధరించుట మహాత్ముల కర్తవ్యము.

౭. నేడు మన భారతదేశము గొప్ప ఆపత్తులో పడియున్నది. కాన మహాత్ములు తమ యావచ్ఛక్తిని వినియోగించి అవినీతి ఆపత్తులను తొలగించవలెను.

## ౧౮౫ స్వామి ఆత్మ చైతన్య

౧. కామ్య కర్మలు స్వర్గాది సుఖముల నిచ్చిపోవును. కాని చిత్త చాంచల్యము నిష్కామోపాసనచే నశించును. కర్మచే చిత్తశుద్ధి కల్గును. జ్ఞానముచే ముక్తి కల్గును.

౨. విచారముద్వారా జ్ఞానము గలుగును. విచార వివేకములు సత్సంగము ద్వారా సంప్రాప్తమగును. దీనిచే ఆత్మానుభవము సిద్ధించును.

3. భగవత్కృపచేతనే మహాపురుషుల దర్శనము, సత్సంగము సమకూరును. అట్టి కృపాప్రాప్తికి సేవాప్రేమ లవసరములు. యజ్ఞయాగాది, నిత్యనైమిత్తికాది సత్కర్మలద్వారా నిష్కామసేవ జేయుచో ప్రేమజనించును. ప్రేమభక్తిచే భగవంతుని స్మరించినచో, భగవత్కృప కలిగి ముక్తి చేకూరును.

## ౧౮౬ విద్వాన్ సాధు బసవయ్య

౧. అజ్ఞుడు విజ్ఞుడగుటకు, మర్త్యుడు అమృత స్వరూపుడగుటకు, జీవుడు శివస్వరూపుడగుటకు, లోకపావన తత్పరులు, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులు, తపోధనులు నగు ఋషిపుంగవులు జప తపధ్యానాదులు ప్రతిపాదించిరి. కావున సాధకులు, ముముక్షువులు, భక్తులు, ఇది ప్రథమముగా జేయదగిన సాధన. హృదయమునందలి కామక్రోధా ద్యరిషడ్వర్గమును, రాగద్వేషాది దుర్గుణములను,

ఈర్ష్యాసూయాది మలినవృత్తులను, నిశ్శేషముగా రూపుమాపవలయును. మానవజీవుడు అగ్రజుడైనను, అంత్యజుడైనను, కోమల హృదయుడు, పరిశుద్ధాత్ముడు, పవిత్రాంతరాత్ముడు గానిదే, తాను జేయు పూజ, జపతపధ్యానాది సాధనానుష్ఠానము లన్నియు ఊసర క్షేత్రమున జల్లిన విత్తనములవలె వ్యర్థములగును. రాగద్వేషాది మలిన హృదయముతో జేయబడిన దైవప్రార్థన, వ్రతజపతపాదు లన్నియు నిరర్థకములే యగునుగాని సార్థకములు గానేరవు.

౨. నాయనలారా! ఆత్మశుద్ధికి సమానమగుశుద్ధి ముల్లోకములయందును లేదు. కావున సర్వసాధనల నవలంబించి, పరిపూర్ణమగు నాత్మ పారిశుద్ధ్యమును సంపాదించుకొనుడు. స్వాత్మస్వరూపము నావరించి ప్రతిబంధించుచున్న పాపవాసనలను సమూలముగా నశింపజేసికొనుటకై సాధకులు తమ యావచ్ఛక్తిని ప్రయోగించి ప్రయత్నింపవలయును. పరిశ్రమించి సాధనలు జేయవలయును. సర్వసాధనలలో ప్రశస్తమగు సాధన, ధ్యానయోగమని విజ్ఞుల యభిప్రాయము.

3. ఎవరికి విద్య, తపస్సు, దానము, జ్ఞానము, శీలము, గుణము, ధర్మము అను సద్గుణములలో ఏకొన్నిగాని, తుదకే యొక్కటిగాని లేదో, అట్టివారు భూమికి బరువుగా, మర్త్యలోకమున మనుష్యరూపులగు మృగములవలె సంచరించువారే యగుదురని భర్తృహరి సుభాషితములో జెప్పబడినది.

## ౧౪౭ శ్రీ దేవర్యా బాబా

[వీరు దిగంబరులు. వయస్సు 150 సంవత్సరములు. గొప్ప మహిమగలవారు. భజనప్రియులు.]

౧. మీరు సంసారమునుండి అసంగులై ప్రభువుతో సంబంధ మేర్పరచు కొనుడు.

౨. హృదయ స్థితుడగు వాసుదేవుని సదా భజింపుడు. గోవింద ! గోపాల! యని గానము జేయుడు.

## ౧౭౭ శ్రీ నీలానంద పాగల్ బాబా

[వీరు అస్సాంప్రాంతపు సాపట్ గ్రామనివాసులు. గొప్ప మహాత్ములు, భక్తులు. భగవంతుడు ప్రతిజీవిలో కలడను భావముతో, ప్రతిజీవికి నమ్రతతో సాష్టాంగ ప్రణామము లాచరించు చుందురు.]

౧. ఓ భగవత్స్వరూపులారా ! మీరు మానవజన్మ మెత్తి దుఃఖ పడుటెందులకు? అందరిలో భగవంతుడు కలడని భావించి నమ్రులై యందరిని ఆదరించి సేవించుడు. మేము-నేను గొప్ప యను అభిమానము త్యజించుడు. గోవింద ! గోవింద ! గోపాల ! యని గానముజేయుచు భక్తిభావమున ముక్తులు గండు.

## ౧౭౮ శ్రీ నారదానంద స్వామి (నైమిశారణ్యము)

౧. ఎప్పుడు మానవుడు తన్నుతాను మరచునో, అప్పు డితరులలో, నితరవస్తువులలో సుఖము నన్వేషించును. నిజమునకు సుఖము తనలోతప్ప వేరెందులోను దొరకదు.

౨. దేహము తనదని భావించుటే అజ్ఞానము.

౩. ధన సంపత్తి గృహాదులను విడిచినంతనే గొప్ప త్యాగము కాదు. మాన ప్రతిష్ఠలు విడుచుటే గొప్ప త్యాగము. కీర్తి ప్రతిష్ఠలకు ప్రసన్నుడైనప్పుడే ద్వంద్వము జనించును.

౪. ఆత్మభావము కల్గునంతవరకు దుఃఖము లనుభవించక తప్పదు.

౫. ఆత్మదర్శనాభిలాషి, ఆత్మదర్శన మొందిన సత్పురుషుని వెంటనైన లేక సాధు సాంగత్యములోనైన నుండవలయును.

౬. అందరిలో భగవంతుని, తనలో నందరిని జూచు వాడుత్తమ భక్తుడు. భగవంతునియెడ ప్రేమ, అన్ని జీవులయెడ దయ,

దానము గలిగి సేవాభావముతో సేవించువాడు మధ్యమ భక్తుడు. పూజాది ద్రవ్యములచే భగవత్కార్యములు జేయువాడు కనిష్ఠ భక్తుడు.

౭. స్వార్థభావమును త్యజించినప్పుడే మానవుడు సాధకుడు కాగల్గును.

౮. ఆత్మభావము లేనివాడు సంసారములో సేవ చేయుపల యును. నిష్కామ సేవవలన దేహభావము తొలగి ఆత్మభావము కల్గును.

౯. ఏ సమాజమునకైనను, ఆశ్రమమునకైనను అధికార పదవిని స్వీకరింపక, అసంగుడై సలహానిచ్చుచుండ వలయును.

౧౦. మానావమానములను సహించుచు, హానిలాభములను సుఖ దుఃఖములను సమానముగా జూచుచు లోకసేవ జేయునప్పుడే సాధకుని నిజానిజంబులు బయటపడును.

౧౧. అందఱిని భగవత్స్వరూపులుగా భావించి సేవించి నప్పుడే నిజమైన రహస్య మెఱుకపడును.

## ౧౯౦ శ్రీ సరస్వతి స్వామి

౧. దాతవు కమ్ము. కాని గ్రాహకుడవు గాకుము.

౨. నిన్ను నీవు స్ఫుటముగా నుంచుకొందువేని, జ్యోతులలో కెల్ల ప్రకాశమైనజ్యోతి నీలో ప్రకాశించును.

౩. పరమాత్మయను అనిర్వచనీయమగు ఆనంద సాగరములో దూకి, సర్వమును దానిలో విసరివేసి, రవ్వంతయు మిగుల్చు కొనకుము.

౪. పసిపిల్లవాడు నడువ నేర్చుకొను విధమున సహజముగా సరళముగా మరణించ నేర్చుకొన వలెను.

## ౧౯౧ శ్రీ పోప్ పాల్

౧. క్రైస్తవులు,క్రైస్తవేతర సర్వజనులు మానవాళి ఉజ్జ్వల భవిష్యత్తుకు రూపురేఖలు దిద్దుటకు సమైక్యము కావలెను.

౨. అన్నిదేశాల మధ్య సన్నిహిత సహకారము పెంపొంద డానికి మనము కృషి చేయవలయును. మనము, ఆధునిక రవాణా సౌకర్యముల ద్వారా, పత్రికలు రేడియోలద్వారా మాత్రమేగాక, మనస్సుతో, పరస్పరావగాహనతో, గౌరవప్రేమలతో సన్నిహితు లము కావలయును.

౩. మనము ప్రయాణీకులవలె కలసికొనక, మానవహృద యాలలో గల భగవంతుని కనుగొను భక్తులవలె కలసికొనవలెను. మనిషి మఱొక మనిషిని, జాతి మఱొక జాతిని, అన్నదమ్ములు అక్క చెల్లెండ్రవలెను, భగవంతుని బిడ్డలవలెను కలిసికొనవలెను.

౪. "అసతో మా సద్గమయ- తమసో మా జ్యోతిర్గమయ- మృత్యోర్మా అమృతంగమయ" అను ఈ శ్లోకము ప్రతిమానవుని హృదయమునుండి వెలికి రావలెను. మానవజాతి అనేక మార్పు లకు లోనగుచున్నది. ఉజ్జ్వల భవిష్యత్తు కొఱకనేక మార్గముల నన్వేషించుచున్నది. కాన మానవాభ్యున్నతికి నిర్విరామమగు కృషి అత్యవసరమై యున్నది.

౫. మన మధ్య నిజమైన ప్రేమ ఉత్పన్నము కావలెను. ఈ ప్రేమయే మనకృషిని ఉత్తేజపరచుటకు కారణము కావల యును.

౬. ప్రపంచములో శాంతి, సుస్థిరత అవసరము. లక్షల కొలది ప్రజలకు అన్నవస్త్రములు, గృహములవసరము. మానవుని స్థితిగతులను మెరుగుపరుచుటకు చిత్తశుద్ధితో ఏకాగ్రతతో నిర్వి రామకృషి జరుగుటవసరము, కాని ఈ కృషి పరస్పర ప్రేమతో కొనసాగ వలెను.

౭. తోటి సోదరుల ఇక్కట్ల నివృత్తికి కృషి అవసరము. పేదలకు పుష్కలమైన ఆహారము, వస్త్రములు, వైద్యసౌకర్య ములు కలిగించుటకై పెద్దమొత్తమున ప్రపంచనిధి యేర్పాటుచేయ

వలయును. ఆయా రాజ్యములు, ఆయుధోత్పత్తిని ఉపసంహరించి పొదుపుచేసిన కొంత మొత్తమునుండి, ఈనిధిని యేర్పాటు చేయ వలయును. ప్రపంచములోని భీతావహచ్ఛాయలను తొలగించనిచో ప్రపంచములో ప్రశాంత పరిస్థితి కొనసాగదు. కావున కొంత ప్రళయమును నివారించవలెను. ఏ ప్రళయము ప్రపంచమును ముప్పులోనికి లాగునో దానితో మానవజాతి నాశనము తప్పదు.

## ౧౯౨ స్వామి పరమానంద భారతి

౧. ఆత్మైకత్వము ననుభవములోనికి దెచ్చుకొనుటయే బ్రహ్మవిద్య యనబడుచున్నది. బ్రహ్మవిద్యావిదుడు సాక్షాత్తుగ బ్రహ్మయే కాగలడు. బ్రహ్మాత్మైక్యతను సాధింప దలచినవాడు ప్రప్రథమమున అంతఃకరణమును దోషరహితముగా జేసికొనవల యును. అనగా మొదట చిత్తశుద్ధిని సంపాదించవలెను. చిత్తశుద్ధిని సంపాదించుటకే వేదము కర్మలను విధించినది.

౨. దేహాభిమాన మున్నంతవరకు కామ క్రోధాదులుగాని, అహం మమత్వాభిమానములు గాని దూరముగావు.

3. అక్షరోపాసనయందు లగ్నమైన వానికి బ్రహ్మాత్మైక్యము ప్రాప్తించగలదు. ఈ విధముగా వేదము కర్మోపాసనలను బ్రహ్మా త్మైక్యత్వ ప్రాప్తికి సాధనములుగా విధించినది.

౪. జపకర్మయందు మంత్రోచ్చారణ ప్రధానము. ఉపా సన యందు మనస్సును ధ్యేయమూర్తి యందు లగ్నమొనర్చుటయే ప్రధానము; కాని మంత్రోచ్చారణ ప్రధానము కాదు.

## ౧౯౩ తపోమూర్తి శ్రీ స్వామిజీ మహరాజ్

౧. సదాచార పాలనచే ఆయువు, యశస్సు వృద్ధినొంది, ఇహపర లోకములలో కీర్తి చేకూరును.

౨. విశేషగుణమేదియు లేకున్నను, కేవలము సదాచార పాలనచే, మానవుడు నూరు సంవత్సరముల వరకు జీవించి యుండ

గలుగును. కావుననే శరీరక్రియ లన్నియు, ప్రకృతి నియమాను సారముగానే జరుపవలయునని ఆజ్ఞ కలదు. ఎందుకనగా, నియమానుసారముగ జరిపినచో ఆరోగ్యము, పటుత్వము సురక్షితముగా నుండును.

3. నీవు అమరుడవు గాదలంతువేని జీవితాసక్తిని విడువుము.

౪. అనాహత శబ్దమును వినగోరుదువేని మొదట నీ అశుద్ధ సంకల్పములను, అశుభ విచారములను తొలగించి ఇచ్ఛారహితుడవు కమ్ము.

౫. దేహముపై ధ్యాస యుండువరకు ఆత్మజ్ఞానము ప్రాప్తించదు. వాసనలను విడిచి అహం మమతలయొక్క మదమడంచుము.

౬. మాయను జయింపదలతువేని పూర్ణత్యాగివై అంతఃకరణమును శుద్ధిచేసి నమ్రత్వముతో వినయశీలుడవై భేద దృష్టిని తొలగించుకొనుము.

౭. కర్మ-భక్తి-జ్ఞానములను యీ మూడింటిని పాలించుచుండవలెను. శరీరముచే కర్మ, మనస్సుచే భక్తి, బుద్ధిచే ఆత్మ జ్ఞానమును స్థిరపరచి నీ జన్మమును సార్థకము జేసికొనుము.

౮. ఏమైన అగుదును లేక కాగల్గుదు నను ఆశ యనెడి విషమునువీడి, నాకేమియువలదు అనునట్టి నిరాశయనుఅమృతమును సేవింపుము. బ్రహ్మమును తెలిసినవాడు బ్రహ్మమేయగును.

౯. ఆత్మను పరమాత్మతో జోడించుట యోగము.

## ౧౯౪ స్వామి శ్రీ స్వరూపానంద సరస్వతీ మహరాజ్

౧. యథార్థమైన జ్ఞానోత్పత్తి భక్తిచే గలుగును. భక్తి హీనునికి జ్ఞానము కలుగదు. అనగా భక్తుడును జ్ఞానియు నిద్దరును భగవంతుని పొందుదురు. కాని జ్ఞానికి శ్రమకల్గును. భక్తుడగు సేవకునికి శ్రమయుండదు.

౨. ఓ నాథా! నేను నీవాడను. కాని నీవు నావాడవు కావు. ఎట్లన తరంగములు సముద్రానివైనను సముద్రము తరంగములది కాదు.

3. హృదయ ప్రధానముగల అధికారికి భక్తియు, మస్తిష్కము ప్రధానముగాగల అధికారికి జ్ఞానమును ముఖ్యముగా ననుకూలించును.

౪. ఇంద్రియములను అంతర్ముఖము చేసి, ధ్యానపూర్వకముగా జూచుచో, జీవు డొక్కడే నిత్యమనియు, మిగిలినవన్నియు మిథ్యయనియు తేలును. అదే బ్రహ్మము.

౫. స్వార్థ వాసన యేమాత్రమున్నను అది ఉత్తమ భక్తి కానేరదు.

## ౧౬౫ స్వామి పురుషోత్తమానంద్‌జీ (అవధూత)

౧. మనోబుద్ధి అహంకారములను లయము చేసిన పిదపనే భక్తియొక్క రుచి కనిపించును.

౨. భక్తి సాధనలో భగవంతు డే ప్రకారము సత్యమో, ఆ ప్రకారమే ఆయన నామరూపలీలలు కూడ సత్యములే. ఆయన నిర్గుణ లీలాక్షేత్రమగు ఈ విశ్వముకూడ సత్యమే.

3. అద్వైత జ్ఞానము పరిపక్వమైనప్పుడే భక్తి నిర్గుణమగును. ఇట్టినిర్గుణ భక్తిని పొందుటకు మొదట జ్ఞానమును, కర్మను భగవంతుని కర్పింపవలయును. అర్పించిన పిదప అనుష్ఠించిన భక్తియే నిర్గుణభక్తి.

## ౧౬౬ స్వామి శ్రీకాశికానంద్‌జీ మహరాజ్

౧. భక్తి లేని జ్ఞానము వ్యర్థము. భగవత్ప్రాప్తికి భక్తి పరమ సాధనము. జ్ఞానముద్వారానే పరాభక్తి కల్గును. శ్రవణ కీర్తన స్మరణాది సాధనలతో పరాభక్తి, ఉత్పన్నమైన వానికి జ్ఞానముకూడ స్వయమే ప్రాప్తించును. అనగా భక్తిచే చిత్తము

ద్రవీభూతమై హృదయములో భగవత్స్వరూపము అంకితము కాగానే భక్తుడు సర్వజగత్తును భగవన్మయముగా జూచును. పచ్చని అద్దములు ధరించిన వానికి సర్వవస్తువులు పచ్చవిగానే కనిపించునట్లు, భగవత్స్వరూపము హృదయాంకితము కాగానే సర్వమునందును భగవత్స్వరూపమే కనిపించును.

౨. వాస్తవములో పరమాత్మయొక్క చిదంశమే జ్ఞానము. ఆనందాంశమే ప్రేమ.

## ౧౯౭. స్వామి శంకరానందజీ

౧. కర్మవాదుల సిద్ధాంతానుసారము, వేదవిహిత కర్మానుష్ఠానముచేతను, నిషిద్ధకర్మలను త్యజించుటచేతను పరమగతి ప్రాప్తించును. కాని జ్ఞానవాదుల సిద్ధాంతానుసారము కర్మఫలమనుభవింపక తప్పదు. కావున కర్మద్వారా పరమగతి ప్రాప్తించనేరదు. వీరి మతానుసారము కర్మమెట్టిదైనను బంధమునకే కారణమగును.

౨. భక్తియనగా సేవ, భజన, అర్చన, పూజ లేక ప్రీతి. ఈశ్వరునిపై ఉత్కృష్టమైన అనురక్తియే భక్తి. ఇదే పరాభక్తి.

3. భగవంతునినుండి యేదైన పొందవలెనను కోరికచే జేయబడు భక్తి సకామభక్తి. ఈ సకామభక్తి అత్యంత నికృష్టమైనది. కాన అనాసక్తభక్తియే శ్రేష్ఠమైనది.

౪. కర్మజ్ఞానములు రెండూ లేనిది భక్తి కానేరదు. భగవంతుని ప్రసన్నుని జేయుటకు కర్మ అవసరము. నశ్వరమైన శరీరము, అనశ్వరమైన ఆత్మయొక్క భేదమును తెలిసికొనుటకు జ్ఞానమవసరము.

౫. భక్తి పరా, అపరా అని రెండు విధములు. కర్మజన్యమగునది అపరాభక్తి. అనగా భగవంతుని గుణగణములను, శ్రవణసంకీర్తనాది కర్మలద్వారా గానము జేయుచో అంతఃకరణము

శుద్ధమై నిర్మలమగును. పరాభక్తి బుద్ధిజన్యము. ఇది కేవలము జ్ఞానికే ఆనందము చేకూర్చును. జ్ఞానియే దీనికధికారి. ఈ విధముగా భక్తిమార్గములో జ్ఞానకర్మలు రెండును ముఖ్యావసరములు.

## ౧౯౭౦ సాధు ప్రజ్ఞానాథ్ జీ

౧. భగవంతునితో కలియుటే జీవితముయొక్క సర్వోత్తమ లక్షణము. ఈ లక్షణప్రాప్తి కనేక సాధనలు గలవు. అందులో భక్తియే వర్తమాన యుగములో ముఖ్యసాధన. భక్తియనగా ఏ ఉపాయముచేతనైనను భగవంతుని శరణాగతి పొంది సేవించి ఉపాసించుట. అందుచే సేవ - ఉపాసన - శరణాగతి మొదలగునవన్నియు భక్తియొక్క అంతర్గతములే. భగవత్ప్రాప్తి కొరకు శాస్త్రములలో కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము, ప్రపత్తియోగములు చెప్పబడినవి. వేదములలో పూర్వభాగము కర్మకాండమనియు, ఉత్తరభాగము జ్ఞానకాండమనియు చెప్పబడినది. భక్తి కర్మజ్ఞానకాండముల రెండింటిని సమన్వయము చేయును. జ్ఞానహీనమగు కర్మ కేవలము కృత్రిమము. అట్లే కర్మహీనమగు జ్ఞానముకూడ నిరర్థకము. జ్ఞానము క్రియాత్మకమగుటచేతనే శివం-సుందరం-ఆనందము ప్రాప్తించును. భక్తి జ్ఞానకర్మల రెండింటికి సహాయకారియై రెంటిలో శోభాయమానమగును. జ్ఞానము-కర్మ-భక్తి ఈ మూడింటియొక్క లక్ష్యము కేవలము ముక్తియే.

౨. భక్తుడు కర్మకాండు డనబడక, కర్మయోగి యనబడును. కర్మకాండుని కర్మలన్నియు సకామములై యుండును. కాని కర్మయోగి కర్మలన్నియు నిష్కామములై యుండును. ఏ కర్మలో కామము, ఆసక్తి కర్తృత్వాభిమానము లుండునో ఆ కర్మ బంధనకు కారణమగును. కర్మలకు స్వాతంత్ర్యము లేదు. కాబట్టి కర్మలు స్వతః మంచివనియు, చెడ్డవనియు ఉండవు. అది మానవుని యొక్క బుద్ధి కార్యమేకాని వేఱొండు కాదు.

3. భోగవాసనా పూర్తికై కర్మచేయక భగవత్ప్రీతికొరకు నిష్కామకర్మచేయుడు.

౪. మనోనాశనము, వాసనాక్షయము, తత్త్వజ్ఞానము- ఈ మూడింటిని ఒకేసారి యెవ రభ్యసింతురో వారికపుడు జ్ఞానయోగము ప్రాప్తించును.

౫. హృదయము వాసనద్వారా సంతప్త మొందుచుండు నంతవరకు మానవుడు నిష్కామి కానేరడు. కాని భక్తియోగ సహాయమున హృదయము స్వయంశాంతి నొందును.

౬. పరమాత్ముని సాక్షాత్కారమువలన మాయాబంధనము విచ్ఛిన్నమై, మనస్సు శాంతమై కర్మబంధన తెగును.

౭. మానవుడు దాగియుండి ఎట్టి దుష్టకర్మలను జేయుటకు కూడ అంతర్యామియగు భగవంతుడు లేని గుప్తస్థాన మొక్కటియును లేదు. గుప్తస్థానములో మనస్సును మోసపుచ్చి యేకర్మను చేయకుండుటయే, భగవంతునియొక్క మొదటి సేవయనబడును.

౮. ప్రాణులశరీరము లన్నియు భగవన్మందిరములే. కాన రాగద్వేషములు లేక, దీనుల దుఃఖములను తొలగించుటకు ప్రయత్నించుట అంతర్యామియగు భగవంతునియొక్క రెండవ సేవయనబడును.

౯. మన శరీరముకూడ భగవన్మందిరమే. కావున భగవన్మందిరమును స్వచ్ఛముగా పవిత్రముగా నుంచుట అంతర్యామియగు భగవంతుని తృతీయ సేవయనబడును.

౧౦. కామక్రోధాదులను త్యజించి, సంధ్య, పూజ, హారతి, భోగ, దీప, దానాదులచే సేవించుట అర్చావతారుని సేవ యనబడును.

౧౧. విరక్తుడు కాని వానికి జ్ఞానయోగ మందధికారము లేదు.

౧౨. శరీరము, మనోబుద్ధి, ప్రాణము, సర్వస్వమును భగవదర్పితము చేయువాడే ప్రసన్న భక్తుడు. ఇదే నిజమగు శరణాగతి.

౧౩. భగవదర్పితమైన శరీర మనోబుద్ధులద్వారా తన స్వార్థమునకై యెట్టి క్రియను చేయకూడదు.

౧౪. తనను తృణముకంటె నీచముగా దలంచి, వృక్షమువలె సహనశీలుడై, గౌరవమున కాశింపక, అందఱిని గౌరవించువానికే భగవన్నామ సంకీర్తనము చేయుట కధికారము కలదు.

౧౫. క్షమ లేకపోయినను, అథవా క్రోధము జనించినను, అతిప్రయాసచే సంపాదించిన తపోధనము నష్టమగును.

౧౬. క్షణమాత్రమునకైనను వైరాగ్యము జనించనివానికి, భక్తిజ్ఞానములలో నేదియు ప్రాప్తించదు. భక్తికి వైరాగ్యము అత్యావశ్యకము.

## ౧౯౯ శ్రీ కృష్ణా బోధాశ్రమజీ మహరాజ్

౧. పరబ్రహ్మ లేక పరమాత్మునియందు నిశ్చలముగా చిత్తము లగ్నముకానిచో సర్వకర్మలను భగవదర్పితము జేసి, ఆయన దివ్యగుణగణములను గానము చేయుచు, భగవత్ప్రీత్యర్థము నిష్కామ కర్మను జేయుము.

౨. మనస్సును సాంసారిక మానవుల సాంగత్యమునుండి తప్పించి, ఆత్మనిష్ఠగల సాధు పుంగవుల సాంగత్యములో లగ్నము చేయుము.

౩. మానవుడు మాయా ప్రపంచమునుండి దాటి తన స్వరూపమందు స్థితుడగుటే పరమ పురుషార్థము.

౪. స్వస్వరూపానుసంధానమే భక్తి.

౫. సర్వత్ర ఆత్మదర్శనముగల దృఢ నిష్ఠాపరుడైన తత్త్వవేత్తకు "నేను, నాది, నీవు, నీది" అనునది కనిపించదు.

౬. వైరాగ్యము, ఆత్మజ్ఞానము, భక్తి - యీ మూడును ముక్తికి సాధనములు.

౮. ధ్యేయవస్తువేది? యనియు, సంసారముయొక్క అనిత్యత్వమును గూర్చియు, ఆత్మస్వరూప శివతత్త్వకర్మ దేనినందురో యనియు సదా విచారించుచుండవలయును.

## ౨౦౦ స్వామి సనాతన్ దేవ్‌జీ

౧. భగవంతునితో ఏదైన కోరుదురేని, అది కర్మయగును. కోరికయే కర్మగా మారును. ఏ కోరిక లేక స్వయంప్రభువునే కోరుదురేని అది ఉపాసనయగును. ఏ కొద్ది కోరిక యున్నను ప్రభువును తెలిసికొనలేము. అనాసక్తిచేతనే భగవత్సంబంధము కల్గును. ఆయనవాడవై ఆయనతో ఏకీభవించుటే సర్వమును పొందినట్లు.

౨. ఎంతవరకు, సంబంధము లేక ఆత్మీయత చేకూరదో, అంతవరకు అనురాగము కలుగదు.

3. సర్వవస్తువులయు, సర్వవ్యక్తులయు సంబంధమును విడిచి ప్రభువుతో సంబంధము గలుగజేసికొనంతవరకు భక్తి లభించదు. ఇది భక్తి యొక్క ప్రథమ నిబంధనము

౪. భక్తుడు కేవలము సంబంధమునే విడుచునుకాని, సంబంధీకులను కాదు. ఎందులకన సంబంధీకులను విడుచుచో సేవ యెవరికి జేయగలడు? ప్రజలందరు భక్తుని సంబంధీకులే. ఒకవేళ సంబంధీకులు భగవత్సంబంధములో బాధకల్పింతురేని, అట్టివారిని తప్పక త్యజించి సంపూర్ణముగా భగవత్పరుడు కావలెను.

౫. భగవంతునితో సంబంధ మేర్పడనంతవరకు, భజన చింతన ధ్యానములు చేయక తప్పదు.

౬. భక్తుడు, ఈ సృష్టిని ప్రభువు లీలావిలాసమనియు, జ్ఞాని దీనిని మాయా మాత్రమనియు తలంచును. ఈ ఒకే తత్త్వము భక్తుని దృష్టికి సగుణమనియు, జ్ఞానిదృష్టికి నిర్గుణమనియు తోచును. కాని ఆయన స్వయముగా సగుణుడును కాడు, నిర్గుణుడును కాడు.

సగుణ నిర్గుణములు రెండును వీరి ఆరోపణలే. ఆయన ఎవరో, ఏమిటో అది ఆయనకే తెలియును.

## ౨౦౧ పరమ సంత్ డాక్టర్ చతుర్భుజ సహాయజీ

౧. ఇరువదియైదు తత్త్వములచే సంసారజీవు లుత్పన్నమైనవి. వీనిలో ప్రాణశక్తి, మానసికశక్తి, ఆత్మశక్తి యను నీ మూడు శక్తులు పనిచేయు చుండును.

౨. ఎవడు నిర్మలహృదయముతో యేదేని యొక సుఖాసనముపై యెంతసేపు నిరోధావస్థలో కూర్చుండ గలుగునో, అంతసేపు జ్ఞానపరమాణువులు వానిలో ప్రవేశించును. ఏ మాత్రమైనను మనస్సులో విచారము లేక సంకల్పము జనించునేని సంబంధ విచ్ఛేదమగుగు. కావున సర్వవిచారములను తొలగించి, సత్యోపాసన చేయువలయును. ఈశ్వరశక్తి సర్వత్రకలదు కాన మనము నిశ్చలహృదయుల మగుదుమేని ఆ ఈశ్వరశక్తి మనలో ప్రవేశించును.

3. నీ వద్ద నున్నదాని నంతయు ఇతరులకిచ్చి నిస్వార్థుడవై మెలగుము.

౪. కండ్లు మూసియుంచుటచే కండ్లకు శక్తివచ్చును. అద్దములు కూడ అవసరముండవు.

౫. విశ్వమంతయు ఈశ్వరమయమే నను దృఢభావము కలుగనంతవరకు, రాగద్వేష సుఖదుఃఖాది ద్వంద్వములు తొలగనేరవు; జీవుడు ముక్తుడు కానేరడు. అనేకములు నశించి ఏకము కనిపించునపుడే శాంతి నెలకొనును.

౬. ఉపాసనాస్థానము, కర్మధ్యానముల రెండింటి మధ్యలో గలదు. ఈ ఉపాసనచే అహంకారము నశించును.

౭. మనస్సు శబ్దములో కట్టుబడునట్లు, నామమును లేక మంత్రమును ఎలుగెత్తిఉచ్చరింపుము. ఇట్లుచ్చరించుట వలన అలసి

పోయి తుదకు మనోజపము జరుగుచుండి, తుట్టతుదకు ఆమనోజపము కూడ ఆగి శాంతినొంది సంకల్పవికల్పము లేకుండ పోవును. దీనినే ఉపాసన యందురు. జపముచేయుచు చేయుచు తన్నుతాను మరచుటే యోగము.

౮. శ్వాసను సాధారణముకంటె అధికముగా లోపలికి పీల్చి, కుంభించి, నీ శక్త్యానుసారము జపముచేసి, పిదప మెల్లగా బయటికి వదలుచుండుము. ఇది పూర్ణవిధి. ఇదే మంచివిధి. ఇట్లాచరించిన కొలది దినములలోనే హృదయములోని సర్వావరణములు తొలగును.

౯. శబ్దోచ్చారణతోపాటు శబ్దార్థభావమును ధ్యానమునందుంచుకొనుట ముఖ్యము. లేనిచో జపము వ్యర్థమగును. జపోద్దేశమును కూడ మరువరాదు. ఓంకారజపమే మంచిది. నేను శరీరమును కాను, ఆత్మనను భావ ముండవలయును.

౧౦. పాలు మంచివే కాని రజోగుణము కలవి. అధిక వేడి గల పాలలోను, బాగా మరిగించిన పాలలోను, పంచదార కలిపిన పాలలోను రజోగుణ మధికముండును. వేడిపాలలో రజోగుణమును, చాలా సేపుంచబడిన పచ్చిపాలలో తమోగుణమును జనించును. అభ్యాసకులకు పిండగానే వెంటనే ఏమియు కలుపని పాలు సేవించుట శ్రేష్ఠము.

౧౧. అహంకారమును విడచి భగవంతునిపై భారమువైచి శరణాగతుడగు సాధకునికి, ఎట్టిక్రియ జేయు నవసరముండదు.

౧౨. ఓంకారమును విధిప్రకారము నిరంతరము హృదయ భావముతో జపించువానికి, బ్రహ్మాండము కదలి భగవత్సాక్షాత్కారమగును.

౧౩. భగవద్దర్శనమును గోరుదువేని సర్వవాసనలను విడచి, అంతర్ముఖుడవై, అంతఃకరణమును నిర్మలముజేయుము. భోజన

పానీయములపై కూడ ఏ మాత్రము చింతయుండరాదు. ఆత్మసాక్షాత్కారము కానంతవరకు ఉపాసన జేయుచుండ వలయును.

౧౪. అంతరాత్మ ఆజ్ఞను పాలించుచు జీవయాత్రను గడుపు వానినే ధార్మికు డందురు.

౧౫. అసురప్రేరణ మనస్సునుండి జనించును. దైవప్రేరణ అహంకారమునుండి జనించును. ఆత్మప్రేరణ చైతన్యపురుషుని సహాయమున జనించును. ఈ మూడు ప్రేరణలను సాంసారిక మానవులు తెలిసికొనుట చాలకష్టము.

1. నిశ్చలము నిర్మలమునైన శాంతముగల మనస్సు గలవాడే అంతర్వాణిని తెలుసుకో గలుగును. సర్వవాసనల నుండి ముక్తుడై భగవంతునిపై నిర్భరుడైనవాడే అంతర్వాణిని వినగలుగును.
2. భక్తుడు బ్రాహ్మీ ముహూర్తమున అంతర్వాణిని వినగల్గును.
3. 'నీది నాది' అను భేదభావము లేనివానికి సదా సర్వదా అంతర్వాణి వినిపించును.
4. భగవత్కృప గలవానిని, అంతర్వాణి స్వయమే సదా, సచేతుని జేయుచుండును.

౧౬. దేహభావమును మరచి ప్రార్థించువానికి సర్వరోగములు దొలగును. రోగనివారణ కిది సరళ విధానము.

౧౭. సంకల్పములను ఆపుకున్నవానికి సర్వము సమకూరును. మనస్సువైపు చూడకుము. దానిపని నది చేసికొనుచుండును.

౧౮. వృత్తిని నిరోధించి, చిత్తమును శాంతింపజేయుదువేని ఆత్మ పరమాత్మతో నేకమగును. ఇదే యోగము.

౧౯. ప్రజాసమూహములోను, కోలాహలములోను, తన మనస్సును స్థిరముగ నుంచుకొనువాడే గట్టి అభ్యాసకుడు.

౨౦. సాధనలన్నింటిని పరిత్యజించి, కేవల మీశ్వరుని శరణుపొందుట మేలు. కాని ద్రిమ్మరులై ఇటు నటు దిరుగుట మంచిదికాదు.

౨౧. సిద్ధులు, చమత్కారము లన్నియు కేవలము మనో ఏకాగ్రతయొక్క ఆటలే. కాన మనోనిగ్రహమును పొందినచో నీ సిద్ధులన్నియు నీ యెదుట వచ్చి నిలుచును.

౨౨. ఏకాగ్రతకై రెండు క్రియ లవసరములు. ఒకటి మస్తిష్కమున బాహ్యవిచారములు జేరబడరాదు. రెండవది చిత్తములోని అంతఃక్రియలన్నియు కూడ నిర్మూలింపవలెను.

౨౩. మనస్సు, అహమ్ యొక్క ఆటలను మన మాపగల్గుదుమేని మనకు మన శక్తియొక్కయు, ఈ మిథ్యాజగత్తు యొక్కయు యథార్థజ్ఞానము ప్రాప్తించును.

౨౪. మనస్సులో సంకల్పశక్తియును, చిత్తములో విచార శక్తియును, బుద్ధిలో వివేకశక్తియును కలదు. అభ్యాసముచే విచార వివేకశక్తులను వృద్ధిచేసికొనుము.

౨౫. నిరంతర విచారముచే మస్తిష్కము బలవత్తరమై సంశయములు నశించి, అంతఃకరణము నిర్మలమై ఆత్మసాక్షాత్కార మగును.

౨౬. దేహము, ఆత్మ ఈ రెంటిమధ్య మనస్సొక కొక్కెము వంటిది. కేవల మీ ఒక్క మనస్సును వశపరుచుకొన్నచో ఆత్మ సాక్షాత్కారమగును.

౨౭. భగవదిచ్ఛానుసారము వర్తించువానికి, వాసనలు జనించక సంసారమునుండి నిర్లిప్తుడగును.

౨౮. ఇచ్ఛ యున్నంతవరకు మానవుడు మాయాబంధము నుండి ముక్తుడు కానేరడు.

౨౯. దొరకినట్టి శక్తిని దురుపయోగపరచుటచే నిజమైన వస్తువు ప్రాప్తించుటలేదు.

౩౦. ప్రతి వ్యక్తిలో మూడు గుణములు సమానముగా నుంచబడినప్పటికి, జనులు పొరపాటుచే వాటిలో వికారము తెచ్చి పెట్టుకొనుచున్నారు. తమ పొరపాటును సరిదిద్దుకొని తిరిగి ఆ గుణమును సమముగా జేసికొనుటే వారి కర్తవ్యము.

౩౧. ఏ కోరిక లేనివానికి సర్వము వాటంతటవే ప్రాప్తించుట విధానము.

౩౨. నియమపూర్వకముగా తన మనధనముల నర్పించు వానికి, ఏ మంత్రజప మనుష్ఠించుటగాని, దేవతల యాచించుట గాని అవసరములేదు.

౩౩. సమస్త మమతలను, సర్వసంబంధములను వీడనంత వరకు భక్తి చేకూరదు. సాధనలన్నిటికంటె భక్తిసాధనయే శ్రేష్ఠమైనది.

౩౪. భగవంతునికి అందరి దోషము తెలిసియున్నను కూడ మారుపలుకక సాక్షీమాత్రుడై చూచుచుండును. అట్లే నీ కితరుల దోషములు తెలిసియున్నను వానిని దాచియుంచుము.

౩౫. శరీరము భగవంతునిది. ఆయన యెట్లుంచినను ఉంచనిమ్ము. దాని చింత నీ కెందులకు? "నే" నను అహమును విడువుము.

౩౬. మనో ఇచ్ఛలను పూర్తిచేయకుము. మనోకోరికయే నీ కోరిక. అనిచ్ఛచే లభించిన దానిని భగవంతుని వైపునుండి లభించినదని తలంచుము.

౩౭. భగవంతుని రహస్యమును దెలిసికోదలచిన యెడల నీ కన్ను, చెవి, నోరు యీ మూడింటికి తాళము వేయుము. అనగా భగవంతుని విషయముతప్ప, ఇంకేది చూడకుము, వినకుము, మాట్లాడకుము. అంతశ్శబ్దమును బాగుగా వినుట చెవియొక్క పని. అంతర్జ్యోతిపై దృష్టినిడుట కంటియొక్క పని. మనస్సును చింతారహి

తముజేసి హృదయకమలములోని దివ్యజ్యోతిని ధ్యానింపుము. ఈ ప్రకాశముపైననే మనస్సును ఏకాగ్రముచేయుము. అనగా దేహ భావ ముండరాదు.

౩౮. నిన్ను నిందించినను, కష్టపెట్టినను హాని చేకూర్చినను అట్టివారిపై క్రోధపడక ప్రేమతో సేవింపవలెను. వారియెడ చెడు సంకల్పమైనను జేయరాదు.

౩౯. కుటుంబ చింతనయు, నీది నాదను భేదభావమును సాధకుని మనస్సులో రాకూడదు. సర్వత్ర సమదృష్టికలిగి యుండ వలెను.

౪౦. భగవంతునికి భయపడు మానవుడే, మానవుని మాన వునిగా జేయును.

౪౧. మానవుడు ఆత్మవైపు పోనంతవరకు సత్యధర్మము లను తెలిసికొనుట చాల కఠినము. ధర్మమొకటే కాని రెండు లేవు. దీనికై నిత్యము ప్రతి ప్రాతః సాయంకాలములలో ఆ సత్య దేవుని సంగము చేయవలెను. సర్వవిచారముల తొలగించి, ఆయ నను ఉపాసింపవలయును. సత్యోపాసనయే మనలను సత్యదర్శనము చేయించును. మనము సత్యప్రాప్తికై కర్మలను చాలా చేయు దుము. కాని దాని నుపాసింపము. కర్మచే మానవుడు జ్ఞానమును పొందలేడు.

౪౨. మనస్సులో, దేవుని సంబంధమైన విచారములైనను లేక ఇష్టదేవత విచారములైనను లేక సంసార విచారములైనను, ఎట్టి విచారములు లేనప్పుడే భగవద్దర్శనము కలుగును. నిర్మల జలములో ప్రతిబింబము కన్పించునట్లు, నిర్మల నిశ్చల చిత్తము లోనే భగవత్సాక్షాత్కారమగును.

## ౨౦. శ్రీ రామ్‌లాల్‌జీ

౧. చిత్తమును భగవంతునితో జోడించుట సేవ.

౨. ప్రభు చరణకమలములయందు, తను మన ధన సర్వస్వములను సమర్పించుట చేతనే, ఆ సేవ సిద్ధించును. దీనిచే సంసార దుఃఖనివృత్తి యగును. బ్రహ్మబోధ కలుగును.

## ౨౦౩ శ్రీ కృష్ణమునిజీ మహానుభావ్

౧. భక్తునికి ఇష్టుడు లేక లక్ష్యమొకటే యుండును. తన భగవంతునిస్థానము నేర్పరచుకొనును.

౨. భక్తునికి, జనసమ్మర్దము లేని ఏకాంతస్థలము ముఖ్యావసరము. విషయవిలాస వినోదములకు చోటివ్వక, ఇష్టదేవుని తన హృదయములో, విశుద్ధాసనముపై ఆసీనునిజేసి చింతన చేయవలెను.

3 వాణిద్వారా స్మరణ, హృదయముచే ప్రభుమూర్తి యొక్క ఒక్కొక్క అంగమును ధ్యానించవలెను.

## ౨౦౪ శ్రీ రాం నారాయన్ జీ

౧. రోమాంచము కానిదే, చిత్తము ద్రవించనిదే, ఆనంద బాష్పము రాలనిదే, భగవద్భక్తి చేయనిదే అంతఃకరణ శుద్ధి కా నేరదు.

౨. త్యాగవృత్తిగల భక్తిపరులయొక్క నిష్కామ సాత్విక భక్తి మెల్లమెల్లగా నిర్గుణరూపము ధరించును.

3. అహేతుకమగు నిర్గుణభక్తి నవలంబించునట్టి మహా భక్తులు సులభముగా సంసారమున తరింతురు.

౪. జపతప యజ్ఞయాగాది కర్మలవల్ల బ్రహ్మ ప్రసన్నుడు కాడు. కేవల భక్తివల్లనే ప్రసన్నుడగును.

## ౨౦౫ శ్రీ బ్రహ్మస్వరూప సన్యాసిని

౧. ప్రార్థనచే ఆత్మశక్తి వృద్ధిజెందును. ప్రార్థనలో చాలా గొప్ప బలము కలదు. ప్రార్థనయే నిర్బలులకు బలము. అనాథు

లకు నాథుడు, దీనులకు బంధువు, సర్వము ప్రార్థనలోనే యిమిడి యున్నది.

౨. ఎవరు ఆత్మను విక్రయింపక, నవ్వుచు మృత్యువును కౌగిలించుకో గల్గుదురో, అట్టివారిని భగవంతుడు తప్పక రక్షించును. అట్టిచో నితరుల యాచించుటేల? సర్వరక్షకుండైన భగవంతుడుండ చింతించుటెందులకు?

౩. ప్రార్థనచే మనోభిలాష పూర్తియగుటే కాక ముక్తి కూడ ప్రాప్తించును. ఇది నా దృఢ విశ్వాసము.

## ౨౦౭. శ్రీ నరేష్‌జీ బ్రహ్మచారి

౧. ఆత్మజ్ఞానమును పొంది, తన వాసనలను భగవదర్పితము చేసి పిదప భగవదేచ్ఛ ప్రకారము నడచుటకు సాధించు సాధనయే భక్తి. ఈభక్తిద్వారా తుదకు యేతత్త్వము ప్రాప్తించునో అదియే భగవత్త్వము.

౨. బ్రహ్మవేత్త పరమ పదమును పొందును. ఆత్మజ్ఞాని శోకవిముక్తుడగును. రసస్వరూపుడగు బ్రహ్మముయొక్క ఆనంద రసమును గ్రోలియే జీవుడు ఆనందితుడగును.

౩. బ్రహ్మజ్ఞానము, యోగము, భగవత్తత్త్వము, ఈ మూడు విధములైన సాధనలు, సత్యయుగములోని ఋషిపథములు. ఇదే అత్యద్భుత మనోవిజ్ఞాన సాధన.

౪. సర్వకర్మలను చేయుచు శరణాగతి అభ్యాసము కొరకు సహజ సులభముగా, ఉచ్ఛ్వాసనిశ్వాసలద్వారా అప్రాకృతశక్తి యుక్తమగు మనోవైజ్ఞానికమైన శ్రీ భగవన్నామసాధన శాస్త్రము లందు జెప్పబడినది.

౫. దేహము, ప్రాణము, మనస్సు, ఆత్మ యీ నాల్గింటికి పరస్పర మత్యంత సన్నిహిత సంబంధము కలదు. కాన ప్రాణము

నాశ్రయించిన మనస్సును వశపరచుకొనుట చాల సులభమైన సుగమోపాయము.

౬. ప్రాణము నాశ్రయించి, సత్సంస్కారయుక్తమగు మనస్సుద్వారా పైనచెప్పినట్లు భగవన్నామ సాధనజేయుచో సంస్కారయుక్తమగు యీశ్వరానురక్తమైన మనోక్రియ ప్రాణముతో నేకీభవించి, భగవన్నామ సంగప్రభావముచే నామ భగవానుని యందు ఆసక్తమై, మనస్సులోని అసత్సంస్కారములు క్రమశః తొలగి, ఆత్మయొక్క స్థూలవికాసరూపమగు ప్రాణము సహాయమున, స్థూలము క్రమశః సూక్ష్మములో ప్రవేశించి, ఆత్మ రహస్యమును దెలియును. (ఆత్మయే ప్రాణము. ప్రాణమే ఆత్మ.)

౭. భగవత్ప్రేమముయొక్క లాభేచ్ఛయే, వ్యాకులతకు కారణము. వ్యాకులతచేతనే శ్రద్ధాది భక్తులుదయించును. శ్రద్ధకలుగుటకు, నిత్యనైమిత్తికాది కర్తవ్యకర్మలు, సత్సంగము, అజపానామ సాధన నియమానుసారముగ జేయుచుండవలెను.

## ౨౦౭ శ్రీ టెన్నిసన్ కవి

౧. ప్రార్థనలేని మానవజీవితము పశుపక్షులవలె నిరోధమువ్యర్థము.

౨. విజ్ఞానశాస్త్రముచే సిద్ధించు కార్యములకంటె అనేకరెట్లధికము ప్రార్థనచే సిద్ధించును.

3. ప్రార్థనవంటి మహాశక్తితో పనితీసికొనక, పనికిమాలిన త్రోవిలో పడియుండి మనము నిజముగా మూర్ఖుల మగుచున్నాము.

౪. వాస్తవములో ప్రార్థన పరమేశ్వరునితో వార్తాలాపము లొనర్చుటకొక ఆధ్యాత్మిక ప్రణాళిక. అందుచే నా పరమాత్మతో సంబంధము స్థాపించుకొనుటకు నిర్మలమైన సత్యమార్గము మన ఆంతరిక ప్రార్థనయే.

౫. భక్తుడు పరమానంద స్వరూపుడగు పరమాత్మతో ప్రార్థనయొక్క సుకోమలములైన తంతువులద్వారానే సంబంధ మేర్పరచు కొనును.

## ౨౦౮ డాక్టర్ ఫ్రైన్క్ లూబక్

౧. ప్రార్థన ప్రపంచములో అన్నిటికంటె మహత్తరమైన శక్తిగలది. అది అందఱికీ సులభము.

౨. మానవు డేది విచారించినను లేక ప్రార్థించినను అది వ్యర్థముగాక అవ్యక్తరూపమున, ఆకాశమండలములో వ్యాప్తమై వ్యక్తరూపమున వాణిద్వారా నుచ్చరింపబడి క్రియద్వారా కార్య రూపములో ప్రకటమగును.

3. సర్వజన కల్యాణమునకై నిర్మలాంతఃకరణముచే సలుప బడిన ప్రార్థన చాలా గొప్పదై వ్యాపించును.

౪, సామూహిక ప్రార్థనచే నందఱిలో ఏకత్వభావ మేర్పడి ఒకరి కొకరికి, ప్రేమజనించి, సత్సంబాధ మేర్పడును. దీనిచే ప్రార్థనకు శక్తి చేకూరును.

౫. తమ దుఃఖనివారణ కొరకు ప్రార్థించు టధమము. ఇత రుల కల్యాణార్థము ప్రార్థించు టుత్తమము. కేవలము భగవంతుని యెడ విశ్వాసముంచి, ప్రేమతో ప్రార్థించు టుత్తమోత్తమము.

౬. ప్రార్థన జీవితమునకు ముఖ్యాంగము

## ౨౦౯ శ్రీ హరికిషన్‌దాస్ గోయిందకా

౧. భగవద్భక్తునియొక్క పన్నెండు లక్షణములు వివరింప బడుచున్నవి.

1. ద్వేషరహితము, 2. మిత్రభావము, 3. కరుణా భావము, 4. మమతారహితము, 5. అహంకారరహితము, 6. సుఖదుఃఖములందు సమభావము, 7. క్షమాశీలము, 8. సదా సంతుష్టత, 9. యోగయుక్తము, 10. చిత్తవశము, 11. దృఢ

నిశ్చయము, 12. మనోబుద్ధుల భగవదర్పితము. ఈ పన్నెండు లక్షణములు గలవాడే భగవంతునికి ప్రియభక్తుడు. వీటికొరకై మానవుడేమి చేయవలయునను దానిని విచారించుకొనవలయును. ఈ క్రింద వ్రాయబడిన వాటిని చూచి గ్రహించవలెను.

1. మొదటి లక్షణము ద్వేషరహితము- సకలప్రాణులను భగవత్స్వరూపులని భావించి, ఏ ప్రాణినికూడ చెడ్డదని తలంపక, దేనికిని హానిచేయకుండుటచే ద్వేషరహితమగును.

2. రెండవ లక్షణము మిత్రభావము- ద్వేషభావము నశింపగానే మిత్రభావ మేర్పడును. స్వసుఖాసక్తి చేతనే మిత్రభావములో కళంకమేర్పడును. కాన ఆసక్తిని త్యజింపవలెను.

3. మూడవ లక్షణము కరుణాభావము - ద్వేషభావము తొలగి మిత్రభావ మేర్పడ నంతవరకు నిజమైన కరుణాభావము జనించదు. దీనికై మమతాసక్తులను త్యజించుటవసరము.

4. నాల్గవ లక్షణము మమతారహితము- వస్తువ్యక్తులను మనవిగా భావించుటే మమతారూపమగు వికారము. కావున సమస్త వస్తువ్యక్తులను ప్రకృతివి లేక ప్రభువువిగా భావించి వాటి యందలి మమతను వదలవలెను.

5. ఐదవ లక్షణము అహంకారము-దేహమే నేనని భావించుటే అహంకారము. దీనిచే 'నేను, నాది' అను భేదభావముత్పన్నమై రాగద్వేషములు దృఢమగును. దీనిని నశింపజేయుటవసరము. దీనికై నేను భగవంతుని సేవకుడనను విశుద్ధభావము మనలో స్థాపించుకొనుట కూడా ఒక విధమగు సాధన. మఱియు నేను దేహాతీతుడనను విచారము చేతనైనను ఈ అహంభావమును నాశనము జేయవలయును. అహంభావము నశించనిదే మమత్వ భోక్తృత్వములు నశింపవు. ఇవి నశింపనిదే రాగద్వేష కామక్రోధములు నశింపవు.

6. ఆరవ లక్షణము సమభావము- వ్యక్తిభావము నశించినపుడే మానవునికి సుఖదుఃఖములయందు సమభావ మేర్పడును. దీనికై ప్రతివస్తువును ప్రతిపరిస్థితిని సాధన సామగ్రిగా దలంచి సదుపయోగ మొనర్చుటవసరము.

7. ఏడవ లక్షణము క్షమ- సుఖదుఃఖములను సమముగా దలంచ నంతవరకు క్షమాశీలుడు కానేరడు. దీనికై మన సుఖదుఃఖములకు మన ప్రారబ్ధమే కారణము. కాని ఇతరులు కారని తలంపవలెను, లేదా నా మేలుకై ప్రభువుయొక్క మంగళమయ విధానమే ఈ పరిస్థితి నేర్పరచినదని భావించి క్షమించవలెను.

8. ఎనిమిదవ లక్షణము సదా సంతుష్టి- అనాసక్తునకు ఏ కోరిక లుండక, సుఖదుఃఖములయందు సమభావ మేర్పడి రాగ ద్వేషములు తొలగి మమతాభిమానములు నశించి సదా సంతుష్టి గలవాడగును.

9. తొమ్మిదవ లక్షణము యోగయుక్తుడగుట- ప్రపంచము లోని సర్వసంబంధ బంధనల త్రెంచి, కేవలము ప్రభువునే నమ్మి, తన్నుతా నాయనకు సమర్పించుకొని ఆయనవాడై యుండుటే యోగయుక్తు డనబడును.

10. పదవ లక్షణము చిత్తవశము- తన నిజవివేకానుసారము జీవితము గడుపు వానికి చిత్తము శుద్ధమగును. చిత్తము శుద్ధమగునేని స్వయమే వశమగును. చిత్తము వశముకాగానే పరాధీనత సమూలముగా నశించును.

11. పదకొండవ లక్షణము దృఢనిశ్చయము- వికల్పరహితమగు అచలప్రభు విశ్వాసమే దృఢనిశ్చయ మనబడును. ఎంత వరకు విభిన్నవస్తు వ్యక్తులయందు విశ్వాసముండునో అంత వరకు ప్రభువునందు వికల్పరహితమగు అచల దృఢవిశ్వాసము కలుగదు.

6. ఆరవ లక్షణము సమభావము- వ్యక్తిభావము నశించినపుడే మానవునికి సుఖదుఃఖములయందు సమభావ మేర్పడును. దీనికై ప్రతివస్తువును ప్రతిపరిస్థితిని సాధన సామగ్రిగా దలంచి సదుపయోగ మొనర్చుటవసరము.

7. ఏడవ లక్షణము క్షమ- సుఖదుఃఖములను సమముగా దలంచ నంతవరకు క్షమాశీలుడు కానేరడు. దీనికై మన సుఖదుఃఖములకు మన ప్రారబ్ధమే కారణము. కాని ఇతరులు కారని తలంపవలెను, లేదా నా మేలుకై ప్రభువుయొక్క మంగళమయ విధానమే ఈ పరిస్థితి నేర్పరచినదని భావించి క్షమించవలెను.

8. ఎనిమిదవ లక్షణము సదా సంతుష్టి- అనాసక్తునకు ఏ కోరిక లుండక, సుఖదుఃఖములయందు సమభావ మేర్పడి రాగ ద్వేషములు తొలగి మమతాభిమానములు నశించి సదా సంతుష్టి గలవాడగును.

9. తొమ్మిదవ లక్షణము యోగయుక్తుడగుట- ప్రపంచము లోని సర్వసంబంధ బంధనల త్రెంచి, కేవలము ప్రభువునే నమ్మి, తన్ను తా నాయనకు సమర్పించుకొని ఆయనవాడై యుండుటే యోగయుక్తు డనబడును.

10. పదవ లక్షణము చిత్తవశము- తన నిజవివేకానుసారము జీవితము గడుపు వానికి చిత్తము శుద్ధమగును. చిత్తము శుద్ధ మగునేని స్వయమే వశమగును. చిత్తము వశముకాగానే పరాధీనత సమూలముగా నశించును.

11. పదకొండవ లక్షణము దృఢనిశ్చయము- వికల్పరహితమగు అచలప్రభు విశ్వాసమే దృఢనిశ్చయ మనబడును. ఎంత వరకు విభిన్నవస్తు వ్యక్తులయందు విశ్వాసముండునో అంత వరకు ప్రభువునందు వికల్పరహితమగు అచల దృఢవిశ్వాసము కలుగదు.

౨. నీవు స్వార్థపరుడ వగుదువేని, సమాజవ్యవస్థ అదుపులో లేక ఛిన్నాభిన్నమై అశాంతి పెరిగి, కలహము, దొంగతనము, అసత్యము, వ్యభిచారము, మోసము, ఇట్లు చాలా విధములైన అనాచారాది దోషములు సమాజములో వ్యాపించును. వీటన్నిటి బాధ్యత నీపై పడును. ఈశ్వరాజ్ఞోల్లంఘన కారణమున నీకు దండన తప్పదు. కాని దానితోపాటు సమాజ 'నౌక' కూడ మునుగును. కాన జాగ్రత్తగ మెలంగుము.

3. నీవు చేయబోవు కార్యము ఈశ్వరీయ విధానమునకు విరుద్ధమైనది కాదుకదా యని, పని ప్రారంభించుటకు పూర్వమే నీ యంతరాత్మను విచారించి పిమ్మట చేయుము.

౪. సంసారములో నే కార్యమును కూడా నీ వొక్కడవే చేయజాలవు. తుదకు నీ జీవిత నిర్వాహణకూడ నీచే జరుగుట అసంభవము. అది ప్రకృతిద్వారా సకలప్రాణుల సహాయముతో జరుగుచుండును. కాన నీకు ప్రాప్తించిన సకల పదార్థములను, శక్తిని నీ వొక్కడవే అనుభవింపక అందఱికి పంచిపెట్టుము. ఇదే ఈశ్వర విధానము. ఇదియే మానవ జీవితోద్దేశము. సమాజములోని విభిన్నవర్గముల సహాయమున నీ కెంత ప్రాప్తించునో, అంతే వారి ఋణము నీపై బడును. ఆ ఋణమును నీవు తీర్చక తప్పదు. నీ జీవితము నీ కొరకు కాదనియు, సమాజము కొరకనియు, మానవ మాత్రుని కొరకనియు తలంపుము. ఇది నీ అనుగ్రహముకాదు, నీ కర్తవ్యము. ఈశ్వరాజ్ఞ (కర్మ) నిర్వర్తించుటకే నీవు జన్మించితివి.

౫. నీ వే కర్మచేసినను సమాజ హితముకొరకు, ప్రాణుల కల్యాణముకొరకు చేయుము.

౬. సమాజసేవ అన్నిటికంటె గొప్పసేవ. దీనికి మించిన సాధన, దీనికిమించిన పుణ్యము, దీనికిమించిన కర్తవ్యము ఇంకొకటి లేదు. సమాజసేవచే పరమాత్మునియందు నిజమైనభక్తి కుదురును.

౪. నీవు భగవత్ప్రాప్తి లేక ముక్తిని గోరుదువేని యెవరి ఋణమును వారికి తీర్చుము. లేనిచో జననమరణ చక్రములో పడి తిరుగుచునే యుండగలవు.

## ౨౧౨ శ్రీ దబీర్‌సాహెబు

౧. సంసారము సర్వాబద్ధము. దీనిలో పాడుపడకుండా యుండునట్టి యిల్లొకటియును లేదు. మృతినొంది మట్టిలో కలియనట్టి మానవుడొకడును కనిపించడు.

౨. ఒకనాడెవని శౌర్యశక్తులచే అరణ్యములుకూడ పట్టణములుగా మారెనో, ఇప్పుడా పట్టణములే ధ్వంసములై పాడుపడినవి.

## ౨౧౩ శ్రీ గాలిబ్‌సాహెబు

౧. ఓ ప్రపంచ ప్రజలారా! నశ్వరమగు యీ జీవితమును విశ్వసించి మోసపోకుడని, నేను నిష్కళంకముగా తెలియ జెప్పుచున్నాను.

౨. ఓ మానవుడా! దేవునికొరకు నీవు నీ ప్రాణము నర్పించితివని అనుకొన్నను, ఆయన నీకు ప్రసాదించిన ప్రాణమునే తిరిగి ఆయన కిచ్చితివి. ఇందులో ఆయనకు నీవు చేసిన మేలేమిటి? వాస్తవములో నీ కర్తవ్యమును నీవు నెరవేర్చకపోతివి. అదేదన ఏ దివారాత్రములు దేవుని స్మరణలో గడచునో ఆ దివారాత్రములే సుదినములు.

3. కోరిక లెన్నటికి తృప్తిజెందవు. వాసనలకు హద్దుపద్దులుండవు. కావున వాసనాసక్తులను అంతమొందింపుము.

౪. నీటిబిందువు నదిలో కలియునేని అది నది స్వరూపము జెందునట్లు, జీవుడు పరమాత్మను పొందగలిగనేని స్వయము పరమాత్మయే యగును, ఏ కర్మ పరిణామము మంచిదగునో ఆకర్మయే చాల మంచిగా జరుగును.

౫. ఆపత్తు లెన్ని వచ్చినను, ఎంత అశాంతి కలిగినను, ఎన్ని దుఃఖములు సంభవించినను ఏమాత్రము ప్రకటించరాదు.

ఆయన సర్వజ్ఞుడు. ఆయన కన్నియు తెలియును. ఆయన కృపలో ఆలస్యమగుటకు ఎట్టి అవకాశములేదు. కాని ఆయన మన మేలు కొరకే ఆలస్యము చేయుచున్నాడు.

౬. అఖిల బ్రహ్మాండములో ఏమియు లేనపుడుకూడ పరమేశ్వరు డుండెను. ఏమిలేకున్నను పరమేశ్వరు డుండును. నన్ను నా అహంకారమే ముంచివేసి యెటుకాకుండ చేసినది. ఒకవేళ నేను లేకుండినచో చెడిపోవున దేమి? ఈశ్వరుని అస్తిత్వముపై దృఢనిష్ఠ, మానవుని 'అహము'నకు ఇంత ప్రజ్వలితశక్తి యుండ, యెవని మనస్సు ప్రభావితము కాకుండును?

## ౨౧౪ శ్రీ జౌక్‌సాహెబు

౧. ఓ మనుష్యులారా! నేను కేకలుపెట్టి గట్టిగా చెప్పుచున్నమాట నాలకింపుడు. మీరు తెలివిగలవార లగుదురేని యీ సంసారము నుండి ఎంత తొందరగా పరుగెత్తగలుగుదురో అంత తొందరగా పరుగెత్తి దూరము పారిపొండు. ఇట్టి మదిరాలయములో బుద్ధిమంతునికి పనిలేదు.

౨. ధర్మశాలవంటిదగు సంసారము నుండి ఒకానొకదినము పోవకతప్పదని తెలిసియుండికూడ, జాగ్రతపడక, యీ క్షణిక జీవితము యొక్క దుర్లభమగు ఆయువును ప్రమాదవశమున పాడుచేసికొనకుడు.

3. నీవు లౌకికసంపత్తు లెన్ని సంగ్రహించుచున్నను, కీర్తిప్రతిష్ఠలకై అహర్నిశ మెంత ప్రయత్నించుచున్నను, వాటి హద్దులను నీవు కనుగొనకముందే, మృత్యువు నిన్ను కబళించును. కావున జాగ్రత్త వహించుము.

౪. నశ్వరమైన సంసారములో అధిక సమయము నదీప్రవాహమువలె పరుగెత్తును. మిగిలిన స్వల్పసమయమున కూడ సుఖముకంటె దుఃఖమే పదిరెట్లధిక ముండును. కాన యిట్టి దుఃఖమయ సంసారములో నెట్టి బుద్ధిమంతుడును మనస్సు చేర్చుటకిచ్చగింపడు.

౫. ఎవడు తన వాసనలను అణచలేడో, కామక్రోధములను భస్మము చేయలేడో వాడు పనికిమాలిన నరపశువగును. లోకమును జయించుటవలన శూరుడు, వీరుడు కానేరడు. కాని తనను తాను అనగా తన "అహంకారము"ను తుదముట్టించినవాడే శూరవీరుడగును.

౬. "నా వశములో నేదియును లేదు. నా యిచ్ఛతో నేదియు కాలేదు. జీవితము తెచ్చుటచే వచ్చితిని. మృత్యువు తీసికొని పోవుచో పోవుదును. నేను నా కోరికతో రాలేదు. ఇప్పుడు నా కోరికతో పోవుటలేదు." అని వీరు సదా పరవశులైయుండి పలుకుచుండెడివారు.

## ౨౧౫ శ్రీ మీర్ సాహెబు

౧. ఓ మానవుడా ! కొద్దిగ నీ కన్ను తెఱచుకొని యీ క్షణికముపై దృష్టిని వేసినచో యీ ప్రపంచము కూడ స్వప్నము వంటిదే యని నీకు బోధపడును. అప్పుడు నీ కెంత దుఃఖము, పశ్చాత్తాపము కల్గునో కొంచెము నీవే విచారించుకొనుము.

౨. దేవుని పొందుటకు యత్నించక, మన మీ సంసారములో చాలదినములు భోగవిలాసములలో పడి నవ్వుచు కాలము గడిపితిమి. కావున యిప్పుడెక్కడనో ఏకాంతములో గూర్చుని మనస్ఫూర్తిగా యేడ్చుటకు చిత్తమూయత్త పడుచున్నది

3. దేవు డందరివాడు, అందరు దేవునివారలే. ఆయనను పొందుటకు, ప్రేమించుటకు, అందఱికి సమాన హక్కుగలదు. ఇందులో పెద్ద చిన్న యను ప్రశ్నయే లేదు.

౪. భగవంతునిలో మనలో నెట్టిభేదము లేకుండెను. కాని ఏమి చెప్పుదును ? మన కోరికలే మనల నాయనతో వేరుచేసినవి. వాసనాదోషములు మనలో లేనిచో, మనము స్వయముగా భగవానులమే.

## ౨౧౬ శ్రీ వలీ సాహెబు

౧. ఇట్టి నశ్వరమగు జగత్తులో మానవజీవితము గొప్ప అదృష్టముచే లభించును. కాని మానవునికి మానవత్వము లభించుటత్యంత కఠినము.

౨. ఇతరుల దుఃఖము లనుభవించుటకును, దానికై మన ప్రాణముల నర్పించుటకే భగవంతుడు మనలను మనుష్యయోనిలో పుట్టించెను. అట్లు లేనిచో ఆయనను ఉపాసించుటకు స్వర్గములో దేవతలు, దేవదూతలు తక్కువై యుండిరా?

3. దేవతకంటె మానవు డగుట చాలా మంచిది. కాని దీనిలో అధికపరిశ్రమ చేయవలసి యుండును.

౪. మానవుడు తనకర్తవ్యము చేతనే మానవు డగును. కుటిలులు, దురాచారము గల వ్యక్తులు నరపశువులు, నరరాక్షసులు, నరాధము లనబడుదురు. తమ పావన కర్తవ్యముచే వారే దేవతాపురుషు లనబడుదురు. మానవుని హృదయములో నితర జీవులయెడ ప్రేమ యుండవలెను. లేనిచో పిశాచముకంటె కూడ హీను డనబడును.

## ౨౧౭ శ్రీ నశీం సాహెబు

౧. మానవుడు ప్రేమ ధర్మము గలవాడు. ప్రేమముందు ఆకాశముకూడ వంగును. ఈ ప్రేమచేతనే దేవదూతలు అనేక సార్లు మానవుని చరణములలో తమశిరస్సు నుంచిరి. కాని మానవుడు కొన్ని దుర్బలతలకు లోబడినప్పుడు వాడే మానవరూపముగు పశువగును.

౨. మానవుని జూచి దయ్యమిట్లనెను. "నాకు మహాత్ము డగు మానవునిజూచి నవ్వువచ్చును. ఆయన స్వయముమే చెడుకర్మలు చేసి, మా పిశాచములపై దోషముల నారోపించుచుండును."

## ౨౧౮ శ్రీ దర్ద్ సాహెబు

౧. పృథ్వి ఆకాశాది సర్వభూతములలో ఆ కరుణామయుడైన భగవానుడు తొంగిచూచుచున్నట్లు కనిపించును. ప్రతి జీవిలో ఆ సర్వజ్ఞుడే నిలిచియున్నాడు. ఈ సృష్టిలో ఆయనతప్ప మత్రింకేమి కలదు ?

౨. ప్రపంచమను వాటికలో ప్రతిజీవియను పుష్పము భగవంతుని రూపమే. ఆ వికసించిన పుష్పములలో ఆయనయే నవ్వును ప్రదర్శించును. లేనిచో ఆ తోటకు మాలి యెవరు ? తోట యెవరిది ?

3. ఓ తెలివి తప్పినవాడా! సావధానుడవు గమ్ము. ఏ విధము చేతనైనను దేవుని మరువకుము. ఒకవేళ మరువగలుగుదువేని నిన్ను నీవు మరచిపొమ్ము.

ర. ప్రతిష్ఠ, సుఖజీవితము దుఃఖములను దెచ్చిపెట్టును. సన్మానము, కీర్తి, గౌరవము సంసారిక బంధనములను దృఢపరచును.

## ౨౧౯ శ్రీ నజీర్ సాహెబు

౧. ఎవడు దేవునిభక్తిలో తన్మయుడగునో వానికి ఆయన తప్ప మఱేమియు కనిపించదు. నరకస్వర్గములు రెండింటిలో దేవుడే యుండునను భావముండును. కాన ఆ నరక స్వర్గములు రెండును ఆ భక్తునకు సమానములే

౨. అంతటను ఆయనయే యుండునపుడు ఇక చింతా విషాదము లెందులకు ? ఆయన స్వయముగా దాతయైయుండ, ఇక యీ దరిద్ర ప్రపంచములో నెవరిని యేమి యాచింప వలయును ?

3. ఎవడే మార్గమును స్వీకరించునో, ఆ మార్గముతోడనే ప్రసన్నతతో భగవంతుని జేరవలయును. నీవు వేదమును ప్రేమించువాడవైనను, ఖురానును ప్రేమించువాడవైనను, తుదకు మిగులునది మాత్రము భగవన్నామమే.

౪. పరస్పర ద్వేషములచే నెవరికిని ఇంతవర కేమియు లభించలేదు. ఈ ద్వేషము మానవుని మనస్సులో నుండి పోవునేని హిందూ ముస్లిముల కలహములన్నియు సమసిపోవును. ఇందులోనే గొప్ప మేలుకలదు. మానవుడు ధార్మికు డనిపించు కొని కూడా రాగద్వేష మలినవృత్తులను వెంటతీసికొని పరలోకమునకు పయనించుచున్నాడు.

## ౨౨౦ శ్రీ అమీర్ మీనాయి సాహెబు

౧. దేవుడు సర్వసమర్థుడు. నిన్ను ప్రేమించుచు నీ మేలును కోరి నీవడుగక మునుపే సర్వమును సమకూర్చుచుండును. అట్టి కరుణామయుని వీడి యితరులముందు చేయి చాచుటవలన లాభమేమి? దేవునియెడ విశ్వాసము గలవాడు, మానవుని యాచించుట లటువదలి, దేవునికూడ ఏమియు యాచించడు.

౨. నిజమునకు సంసారములో నెవరి కెవ్వరును కారు. మాటవరుసకు, లోకవ్యవహారమునకు స్వజనులు మఱి బంధుమిత్రులగుదురే కాని, సంకట సమయమందు భగవంతుడుతప్ప మఱెవ్వరును తోడ్పడరు. కాన యీ బూటకపు మైత్రిని త్రెంచి భగవంతుని ప్రేమించు టుచితము.

3. భగవానుడు ప్రపంచధామములో సర్వత్ర ప్రతిఅణువునందును కలడు. నీ కాయనయెడ నిజమైన ప్రీతి యున్నయెడల, నీ వాయనను విశుద్ధాంతఃకరణముతో ప్రేమించుచున్నయెడల, నీ వెచ్చట కోరిన ఆయన అచ్చటనే నిన్ను కలియును. అంతదూరమెందులకు? ఆయన నీ హృదయ మందిరములోగూడ కలడు. నీవు కోరినచో ఆయన మనోహరమూర్తి నీ హృదయములోనే దర్శనమగును.

౪. ధన సంపత్తులు మానవుని నాశనము జేయును. దీనిచే పరమార్థగామికి చాల సంకటములు సంభవించ వచ్చును.

౫. సంగ్రహపదార్థము మనిషినే కాదు, పశువునుకూడా పాడుచేయును. చూడుడు. తేనెటీగలు తేనెను కూర్చుటచే వాని తెట్టకే జనులు నిప్పంటింతురు.

## ౨౨౧ శ్రీ జాఫర్ సాహెబు

౧. విషయ సుఖభోగములందును, కీర్తి ప్రతిష్ఠలందును దేవుని మరచువానిని, క్రోధావేశములో దేవునికి భయపడని వానిని మానవుడని తలంపకుము. సుఖములో ప్రభువును మరువనివాడును, ఆవేశములో ప్రభువునకు భీతిజెందువాడే మానవుడు. ప్రతి పరిస్థితిలో భగవంతుని మరువక స్మరించువాడే మానవోత్తముడు.

౨. పరమేశ్వరుడు నీ హృదయములో నుండును. కాన, నీ హృదయమును స్వచ్ఛముగా నుంచుట నీ పరమ కర్తవ్యము. హృదయమును, కామక్రోధాది మలిన దోషములనుండి రక్షించుటావశ్యకము. హృదయమును కడిగి, తుడిచి నిరంతరము పవిత్రముగా యుంతువేని అతి దుర్లభుడగు నీ స్వామిని నీవు నిరంతరము నీలోనే జూడగలుగుదువు. అపుడు పరమేశ్వరుడు స్వయముగా నీ కోరికలను దెలిసికొని పూర్తి చేయుచుండును. ఇట్టి స్థితిని సంపాదించుకొన్నచో నీ జీవితము సఫలమై నీవు ధన్యుడవగుదువు.

## ౨౨౨ శ్రీ నాసిఖ్ సాహెబు

౧. నేను నా చిత్తమును నలువైపుల నుండి తొలగించి, ఏకాగ్రతతో, హృదయనేత్రము ద్వారా చూడగా, యే దేవుని కొరకై నేను వెదకుచుంటినో, ఆ దేవుడే నాకు నలుదిశలందు కనిపించెను.

౨. నిజమేమనగా, తాను స్వయము నశించి, తన అస్తిత్వమును దేవుని అస్తిత్వములో లీనము చేయునపుడే, దేవుని దర్శనమగును. లేనిచో, చతుర్దిశలు వెదకినప్పటికిని ఆయన దొరకడు.

ఎప్పుడాయన కలియునో అప్పుడు మన అస్తిత్వము సమాప్తమై, నేను నాది యనున దేదియు లేకుండపోవును.

## ౨౨౩ శ్రీ అక్బర్‌సాహెబు

౧. మందిరములో శంఖధ్వని కాగానే, ఆ మందిరములో కూడ నా దేవుని ఆరాధనయే జరుగుచున్నదని మసీదులో నేను గంతులు వేయుచుందును. పండితునికిని, మౌల్వీకిని నేను దూరము నుండియే నమస్కరింతును. నాకు మత మక్కర లేదు. ఎట్టి విశ్వాసముచే నా ప్రభువు నాకు లభించునో, అట్టి విశ్వాసమునే నేను కోరుదును.

౨. మందిరము, మసీదులను భేదములను పెట్టుకొని చిక్కులో బడుటచే నేమి ప్రయోజనము? ప్రభువును నీ వెక్కడనుండి పిలచిన నక్కడనే దొరకును.

3. భగవంతునితో వేరగుటకు కారణము 'నేను' అనునట్టి నా అహంకారమే. నేను ఆయనతో వేరు గాకుందునేని యీ రోజు 'నేను' అనునట్టి అహమ్ లేకుండెడిది. అనగా నా అస్తిత్వమే లేక పోవును. నా ద్వారానే ఈశ్వరుని ఈశ్వరత్వము సిద్ధించును. ఎందు కనగా ఈశ్వరుడు లేనిచో నేనుకూడా లేకుందును.

౪. పెద్దలయెడ గౌరవము, దేవునియెడ భయము, కనులలో సిగ్గు, ఇవి మానవుని ఉత్తమ విశేషలక్షణములు. సమస్త ధర్మములు వీటినే సూచించును.

౫. రాగద్వేషములు సంపూర్ణముగా త్యజించి, ప్రతి ధర్మ గుణమును ప్రేమింపుము.

## ౨౨౪ శ్రీ అమీర్ మోమిన్ సాహెబు

౧. భగవంతునిపై విశ్వాసము లేని వాడాయనను పొందకి నను, శ్రమతప్ప మరింకేమియు మిగులదు. శ్రద్ధావిశ్వాసములు లేని వ్యక్తికి ఆయన జాడయే తెలియదు.

౨. కావున సమస్త మమతాసక్తుల త్రెంచివైచి, ఆయనను విశ్వసించి, నీ జీవిత నౌకను ఆయన కర్పింపుము.

## ౨౨౫ శ్రీ బాసిత్ బిస్వాని సాహెబు

౧. రామ్, రహీమ్- ఇద్దరూ ఒక్కటే. ధర్మము, ఈమాన్ రెండు భిన్నవస్తువులు కావు. మందిరము, మసీదు వేరువేరు కావు. ఈ రెండును పరమేశ్వరుని స్థానములే. కాన ఓ మానవుడా! నీవు రెంటిచే లాభమును పొందుము.

౨. లోకములో పరు లెవ్వరును లేరు. అందరు మన వారలే.

3. ఎవడు తన పగను తీర్చుకొనుటకు శక్తిగలిగి యుండియు ప్రతీకారము చేయనొల్లడో వాడే నా నిజమైన భక్తుడని అలా ఆన తిచ్చెను.

౪. భగవద్భక్తుడు సర్వత్ర తన ప్రభువు లీలాదృశ్యములనే చూచుచుండును. అతనికి ప్రతి శుభాశుభకర్మలలో కూడ తన స్వామియే సూత్రధారిగా గోచరించుచుండును. ఇట్టి స్థితిలో నెవరు ఎవరిపై పగతీర్చ వలయును?

౫ అపరాధిని క్షమించుట చాల శ్రేష్ఠమని శాస్త్రములు కూడ ఘోషించుచున్నవి.

## ౨౨౬ శ్రీ హాలి సాహెబు

౧. ఉపదేశకుని హృదయములో దయలేనిచో, ఆ ఉపదేశ ప్రభావము ఆ యుపదేశముబొందిన వ్యక్తిపై పడదు.

౨. దేవుని సృష్టియావత్తు ఒక వైపునను, ఆయన అనుగ్రహము మరియొక వైపునను గలదు. ప్రభువు కరుణా సమీపమున ఈ అఖిలబ్రహ్మాండ మంతయును హేయమే.

3. ఓ హజ్జాగతులారా! నేనీ యింటిలో నివసించువటి దేవుని వెదకుదును. కాని ఇంటిలోని దిగుళ్ళతో, మొకరాలతో ఇతరత్రసామానులతో నాకేమియు ప్రయోజనము లేదు.

౪. ఓ శేఖ్ సాహెబులారా! మీ మనస్సు మందిరములో లగ్నముకానిచో మసీదులోనికి పోయి యేమి చేయుదురు? ఆ మందిరమున దేవుడు లేడనియా మీ యభిప్రాయము.

౫. భగవంతుని యెడ ప్రేమలేనిచో ఉపాసనా గృహమున కేగి లాభమేమి?

౬. భగవత్ప్రాప్తికి ధర్మమార్గములు వేరుగానున్నను, నీ వే మార్గము ననుసరించినను ఆయన వద్దకే చేరుదువు.

౭. ప్రభో! నాకిహపర లోకములతో నవసరము లేదు. నాకు మరేదియు అక్కఱలేదు. కేవలము నీ వొక్కడవే నాకవసరము.

## ౨౨౭ శ్రీ దాగ్ సాహెబు

౧. ఓ హిందూ ముసల్మానులారా! నన్నేల మీరు ద్వేషింతురు. నేను మందిరమునకును మసీదునకు కూడ యోగ్యుడను, సమర్థుడనుకాను. కేవలము నేను భగవత్ప్రేమనే యన్వేషించుచున్నాను

## ౨౨౮ శ్రీ బేదార్ సాహెబు

౧. ఇటు అటు ఏమియు లేదు. సర్వత్ర భగవంతుడే విశ్వవ్యాప్తుడై యున్నాడని విశ్వసింపుము.

౨. ఓ మానవుడా! ఆ భగవంతుడు సదా ప్రత్యక్షమై యున్నాడు. ఆయన ప్రకాశమును నీవు ప్రమత్తుడవై గ్రహింపలేకున్నావు.

## ౨౨౯ శ్రీ ముక్తేశ్వర్ మహరాజ్

౧. అంతరములో నిజము తెలిసియుండియు, బాహ్యమున అబద్ధమాడు వాడెట్లు కుకర్మ చేయకుండా యుండునో నీవే చెప్పుము.

౨. సత్యముకంటే మించిన ధర్మము లేదు. సత్యమే పరబ్రహ్మము. పరమేశ్వరుడును సదా సత్యము నాశ్రయించియుండును.

౩. లోకములోని ప్రజలు సత్యమార్గావలంబు లగుదురేని వారి కార్యములను పరమేశ్వరుడే స్వయముగా నెరవేర్చును.

౪. సంసారము స్వప్నమువలె క్షణికము. సమస్తసాధన లసత్యములు. స్వధర్మము, సద్వివేకమే సత్యవస్తువులు. బుద్ధిమంతుడు వీనిని జాగ్రత్తగా అభ్యసించి సాధించును.

## ౨౭౦ శ్రీ సహజాబాయి

౧. నామస్మరణ జరుగుచున్నట్లు, ఇతరులకు దెలియకుండా మనస్సులోనే స్మరించుచుండవలెను. స్మరించువానికి, భగవంతునికి దప్ప మూడవవానికి దెలియరాదు.

౨. జాగ్రదవస్థ యున్నంతవరకు నామస్మరణ జరుగుచుండి, నిద్రించునపుడు ధ్యానములో లీనము కావలెను. ఇట్లు సాధనలో లోటుకాకుండ సాధన తంతువులు తెగకుండా సదా అఖండముగా స్మరణ జరుగుచుండవలెను.

౩. జీవితములో శీలము, క్షమ, సంతోషములను సంపాదించి, పంచేంద్రియములను వశపరచుకొని రామనామస్మరణ చేయుచుండుము. ముక్తికిదేమార్గము ఉత్తమమైనది.

౪. ఓ మూర్ఖుడా ! దివారాత్రులు ఉచ్ఛ్వాసనిశ్వాసల యొక్క ఢంకా మ్రోగుచుండ, నీవు మోహనిద్రలోపడి యుంటివి. కాని ఆ ఢంకానాదమున జాగ్రత్తపడినవానికి విశ్రాంతి యెక్కడిది!

౫. ప్రతిఘటములో ఆత్మరూపమున పరమాత్మ నివసించుచుండ, ఇంక పరులెవ్వరు వారిని కష్టపెట్టు టెట్లు ? అందఱిని సంతోషపెట్టుటే సాధుధర్మము,

## ౨౭౧ శ్రీ మహాత్మ సోమవారి

[వీరు గొప్ప నిర్ద్వంద్వులు. దూరదర్శులు. ఇతరుల భావము తెలిసికొను శక్తిగలవారు. ఈశ్వరుని సర్వవ్యాపకత్వము, రక్షత్వములపై అఖండవిశ్వాసము గలవారు. గోవు, కోతి, సర్పము మొదలగు వాటినికూడా కష్టెతో బెదరింప నిష్టపడని గొప్ప

అహింసాపరులు. వీరు గర్వపరులకు, బాహ్యాచారపరులకు కడు విరోధులు.]

౧. సంకల్పము లుండరాదు. మీ కార్యములను నిష్కామములై చేయుడు. అభిమానమును త్యజించివేయుడు. మీ క్షేమము ఈశ్వరునిచేతిలో కలదు. ఒకరి నొకరు అసహ్యించు కొనకుడు. ఆచారానుసారము వర్తింపుడు. శక్త్యానుసారము దానముచేయుడు. దేశకాలముల నుపేక్షించు టుచితము కాదు.

౨. సాహసపౌరుషములకు వెనుదీయకుడు. ఈశ్వరేచ్ఛయే ఫలించును. ప్రేమయే సంసారము. సంసారములో నిర్మోహులై వర్తింపుడు. విచారించియే త్రాగుడు.

3. దుఃఖములను విన్నవించుకొనుటకై యోగులవద్దకు, తాపసులవద్దకు పోకుడు.

౪. భగవంతుని యెదుట చేతులు జోడించి నిలబడుటకంటె ఆయన భక్తులకు సేవచేయుట అధికలాభము.

౫. ఈశ్వరుడు చెవిటివాడు కాడు. కాన స్తోత్రపాఠములను బిగ్గరగా ధ్వనితో నుచ్చరింపరాదు.

౬. ప్రతికూల సమయములో యోగులు, తాపసులు వనములో ప్రవేశింపవలయును.

౨౩౨ శ్రీ లటోర్యా బాబా (హలద్వాని)

[వీరు గొప్ప విరక్తులు. శరీరము భస్మావృతము. తలనుండి పాదములవరకు పొడవైన జడలు గల్గియుండును. ఎంతవేడి, చలి యున్నను ఒక లంగోటితప్ప మఱేమి యుండెడిది కాదు. త్రికాలము లందు స్నానము చేయుచుండువారు. తనకేది లభించినను అందఱికి పంచిపెట్టుచుండువారు. సంగ్రహవృత్తియే పాపములకు మూలము. అదే మానవులను ఆసక్తిలో పడద్రోయుచుండును అని చెప్పుచుండువారు. గీతావిచారమును వ్యక్తపరచువారు.]

## ౨౩౩ శ్రీ ఘణపతిరాయజీ

౧. మానవశరీరము పరమాత్మప్రాప్తి కొరకే లభించినది. కావున శరీరముండగానే, వృద్ధావస్థ రాకముందే ఆత్మకల్యాణ సాధనా తత్పరుడగుట మానవుని పరమ కర్తవ్యము. మహాపురుషుల చేతను, శాస్త్రములచేతను ఆత్మకల్యాణ సాధన లీక్రింది విధముగా జెప్పబడినవి.

1. నిషిద్ధ కర్మత్యాగము - కామక్రోధలోభాది యుక్తమగు కర్మలను త్యజించుట.
2. భోజనసంయమము - సాత్వికాహారము, న్యాయార్జిత మితాహారము ముఖ్యము.
3. వాణీసంయమము - అనవసరముగా మాట్లాడరాదు. చెప్పినను సత్యమే చెప్పవలెను.
4. విషయముల, విషయపురుషుల సాంగత్యము చేయరాదు. వీరి సాంగత్యముచే మానవుని వివేకము శిథిలమై బలహీనమగును.
5. నియమపూర్వకమైన ఏకాంతసేవనము, ఏకాంతమున నామ జపము, భగవద్ధ్యానము చేయుటే నిజమైన సాధన.
6. ప్రతి కర్మను భగవదర్పితము చేయుట. మనోవాక్కాయముల ద్వారా అర్పింపబడిన ప్రతిక్రియయు పవిత్రమగును.
7. నిష్కామభావముచే నిత్యనిరంతరము భగవన్నామమును జపించుట. భగవన్నామజపము భగవత్ప్రాప్తికి గొప్ప సహాయము.
8. శ్రద్ధావిశ్వాసములతో మహాపురుషుల సాంగత్యము, సచ్ఛాస్త్రముల అధ్యయనము - సాధనారంభము నుండి భగవత్ప్రాప్తివరకు - ఇది జరుగుచునే యుండవలెను.

9. వివేకవైరాగ్యములు గల చిత్తము ద్వారా పరమాత్మను ధ్యానించుట. మహాపురుషుల సాంగత్యముచే హృదయములో వివేకవైరాగ్యములు మేల్కొనును.

10. నిరంతరము సావధానపరాయణులై యుండుట. సావధానులై సదా తమ కల్యాణసాధనలో మునిగియుండవలెను.

## ౨౩౪ శ్రీ జామాతముని

౧. జీవుడు దేహము కాడు, జ్ఞానాశ్రితుడు. అగ్నిగుణము దాహకమగునట్లు, సూర్యునిగుణము ప్రకాశమగునట్లు, జీవునిగుణము జ్ఞానము. జీవుడు ప్రకృతికి భిన్నుడు, చైతన్యుడు. కట్టెలో వ్యాపించి యున్న అగ్ని ఆ కట్టెచే భిన్నమగునట్లు, జీవుడు దేహముచే భిన్నుడు, అజన్ముడు, అవినాశి, నిర్వికారుడు, సచ్చిదానంద స్వరూపుడు.

౨. జీవుడు సమస్త పదార్థములకును. స్వయం తనకు తాను ద్రష్ట, ప్రకాశకుడు.

3. జీవుడు దేవుడు కాడు, మనుష్యుడు కాడు, జంతువు కాడు, స్థావర జంగములును కాడు. కేవలము హరికి దాసుడు. జ్ఞాత, కర్తయు, భోక్తయు కర్మానుసారము గమనాగమనముల బొందుచుండును.

౪. పరమాత్మ శేషత్వము, అనన్యదాసత్వమే జీవుని స్వభావము. జీవులు అసంఖ్యాలు, అనంతములు. జల స్థల అంతరిక్షాదులలో ఎక్కడైనను జీవులులేని స్థలమే లేదు.

## ౨౩౫ స్వామి శ్రీ భగవతాచారిజీ

౧. సాత్త్వికజ్ఞాన ముదయించనంతవరకు, అనేక మలినకర్మలచే అణచబడియున్న ఆత్మ ముక్తి నొందనేరదు. జ్ఞానములేనిదే ముక్తికలుగదని శ్రుతి చెప్పుచున్నది.

౨. ముక్తిద్వారా కర్మ, భక్తి, జ్ఞానము, అనన్యభక్తి సిద్ధించును. కర్మ జ్ఞానముల రెంటి నడుమ నుండు పదార్థమే భక్తి. కర్మ

యొక్క ప్రధాన సంబంధము శరీరము; జ్ఞానముయొక్క ప్రధాన సంబంధము ఆత్మ. శుద్ధ సాత్వికజ్ఞాన ముదయించగానే "ఆత్మ" శాశ్వతసుఖము పొందగలుగును. సాత్వికజ్ఞాన ముదయించుటకు సత్కర్మల ననుష్ఠింపవలసి యుండును. సత్కర్మానుష్ఠానముచే ఇంద్రియములు, అంతఃకరణము పవిత్రమై సాత్వికజ్ఞాన ముదయించును.

౩. భక్తిమార్గములో సత్కర్మ, జ్ఞానము - ఈ రెంటికి దృఢ సంబంధము కలదు. కావున శరీరకృతకర్మకు, ఆత్మకృతజ్ఞానమునకు- ఈ రెంటి సమన్వయము భక్తియను పదార్థముచే కలదు.

౪. భక్తిమార్గములో జ్ఞానకర్మలు రెండు ముఖ్యావసరములు.

౫. సన్యాసియగుటకు గురుదీక్ష అవసరములేదు. సంపూర్ణ నిష్కాంక్షక త్యాగమే దీక్ష.

## ౨౩౭. శ్రీ నరదేవ్‌జీ శాస్త్రి వేదతీర్థ

౧. రాగద్వేషరహితుడు, నిర్మముడు, నిరహంకారుడు, క్షమాశీలుడు, సదా సంతుష్టుడు, దృఢనిశ్చయుడు, నిర్భయుడు, అభయవానుడు, అనాసక్తుడు, ఉదాసీనుడు, ఉదారుడు, దక్షుడు, నిరభిమానుడు, సహనశీలుడు, మానావమానరహితుడు, శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వరహితుడు, శ్రద్ధావిశ్వాస సంగరహితాది గుణములు గల భక్తుడే భగవత్ప్రియుడు.

౨. సాంసారికవాసనల నుండి ముక్తినొందుట జీవునికి సహజముకాదు. సాధుపురుషుల సాంగత్యము లేనిదే సంసారనివృత్తి కానేరదు.

౩. పూర్వజన్మ సుకృతము, భగవత్కృప లేనిది సాధుసంగమము లభించుట చాలా దుర్లభము. సత్సంగము ప్రాప్తించువో శ్రీకృష్ణుని యెడ ప్రేమ జనించును. ఆ సత్సంగముకూడా భగవత్కృపచేతనే లభించును. ఏ భాగ్యవంతునిపై శ్రీకృష్ణుని కృప

కలుగునో, ఆయన అంతర్యామి గురురూపములో స్వయమే బోధించును.

౪. శ్రద్ధగలవాడే భక్తికి అధికారి.

## ౨౩౭ స్వామి మహేశ్వరానంద్ మహరాజ్

౧. మనకు ఎవరితో నేదైన సంబంధముండుచో వారిని జూచినను లేక వారి నామము విన్నను వారియెడ తప్పక స్నేహ భావ ముత్పన్నమగును. సంసారములోని తల్లిదండ్రాదుల సంబంధము ఆగంతుకము, అశాశ్వతము, నశ్వరము. కాని జీవరాసులన్నింటికి తల్లిదండ్రియైన పరమాత్మ సంబంధము శాశ్వతము, దుఃఖ నివారకము, సుఖకరము.

౨. విశ్వముయొక్క బాహ్యాంతరములలో సంపూర్ణముగా వ్యాప్తిజెందినట్టి భగవానుడే నిఖిల చరాచరవిశ్వమునకు ఆత్మ.

౩. జ్ఞానముగల భక్తుడు సర్వత్ర ఆయననే చూచుచు, తదన్యములైన భావము లన్నిటిని త్రోసిపుచ్చి ఆయనలోనే తన్మయుడై యుండును.

౪. యథార్థజ్ఞానము గలవాడు అభక్తుడుగా నుండలేడు. నిజమైన భక్తుడు. అజ్ఞానిగా నుండలేడు. ఇట్లు జ్ఞానభక్తుల రెంటిచే సాధకుడు కల్యాణపథము పొందగలుగును. జ్ఞానము అద్వైతరూపమగుచో భక్తి అనన్యరూపమగును. ఈ రెంటి లక్ష్య మొక్కటే. జ్ఞానములేనిది భక్తిసిద్ధించదు. భక్తిలేనిది జ్ఞానమునందునిష్ఠ కుదురదు.

౫. సత్యము, శ్రద్ధ, అద్రోహము, దానము, బ్రహ్మచర్యాది గుణవర్తనము, కామాది అనేక దోషనివారణ చేతనే భక్తి సిద్ధించునని వేదశాస్త్రముల సిద్ధాంతము.

## ౨౩౮ మహాతపస్వి అబూ సులేమాన్ దారాయి

[వీరు తుర్కిస్థానములోని "దారాబుద్" అను గ్రామములో జన్మించిరి. పరమ విరక్తుడు. సూక్ష్మదృష్టి గలవాడు. పవిత్ర హృదయుడు, కోమల స్వభావుడు.]

౧. ఈశ్వరభజనలో బాధకలిగించు వాటి నన్నిటిని వెంటనే త్యజింపుము. లోకప్రశంస కడు నిందనీయము. కాన సన్మానముల కాశింపకుము.

౨. ఈశ్వర వియోగమును సహించువాడు కడు దుర్మార్గుడు.

౩. ఆహారనియమము లేనిది హృదయము నిర్మలము కానేరదు. హృదయము నిర్మలముకానిదే భగవద్భక్తి కర్హుడు కానేరడు.

౪. శుభ్రమగు తెల్లబట్టవలె మనస్సును శుభ్రముగా నుంచుము.

౫. దేహభావన గలవారితో ఆత్మభావన గురించి చర్చింపక హరిభజన, హరిస్మరణ విషయమే చర్చింప వలయును.

౬. దేహాసక్తి గలవారికి నిర్దోషము, సత్యయుక్తమగు దైవీ సంపత్తి నష్టమగుటచేతను సంతోషము, దోషయుక్తమగు అసుర సంపత్తి నష్టమగుట చేతను దుఃఖము సంభవించును.

౭. ఎవనికి తన జీవితపు మూల్యముండదో, వాడు వెండి బంగారపు ఆభరణములను ప్రేమించి ధరించును. ఎవడు తన జీవితమే మూల్యమనుకొనునో వానికి ద్రవ్యమందు లక్ష్యముండదు.

౮. ఎవరు సంసారులను ప్రేమింతురో వారి హృదయములో భగవత్ప్రేమ జనింపదు.

౯. భగవదాజ్ఞ నుల్లంఘించువానికి భగవత్సేవ బాధాకరమగును.

౧౦. భగవత్సాధనలో లోటుండుట చేతనే పాపుల ప్రశంసలను వినుట సంభవించును. ఇది మహాగొప్ప పాపము.

౧౧. దుఃఖమునకు కారణము పాపము. ఈశ్వర స్మరణ దుఃఖమునకు అంతము.

## ౨౩౯. శ్రీ రుచిరా బహిన్‌జీ

౧. భక్తుని రసభావ ప్రేమలో ముంచి, అలౌకిక తత్త్వమును జ్ఞప్తికి తెప్పించి, అహంతా మమతలను మరపించి, దాసుని

వలె ప్రభువునకు సేవచేయించునట్టి భక్తియే అనుగ్రహాభక్తి యన బడును. ఈ భక్తి ప్రభువులేక గురుకృప లేనిది ప్రాప్తించదు.

౨. ధర్మము, ధర్మాచరణుడు ప్రభువు నేనమ్మి, ప్రభువుకు దాసులై, ప్రభువును భజించుటచే, ప్రభువు ప్రసన్నుడగును.

3. అనుగ్రహ భక్తిమార్గములో శరీరము, మనస్సు, ధనము అను మూడువిధములగు సేవలు గలవు. ఇందులో మానసిక సేవ శ్రేష్ఠము. శారీరకమైన ధనసంబంధమైన సేవాసిద్ధి కల్గుచో అహంమమతలు తొలగి, దాస్యత్వము ప్రాప్తించినచో మానసిక సేవ సిద్ధించును. హృదయములో అలౌకిక ప్రేమధార ప్రవహించును. దానిచే ఏకాత్మభావము, సేవాత్మభావము ఉదయించునేని "వాసు దేవస్సర్వ మితి"యను దృష్టిచే జగత్తులో ప్రభువుయొక్క రసరూప రసనిధి స్వరూపమును కండ్లతోజూచి, కృతార్థుడై భగవల్లీలలో జేరి లీనమగును.

౪. భక్తి చేయగా చేయగా, వైరాగ్యము జనించి జ్ఞానము ప్రకాశించును. ఆ ప్రకాశముచే హృదయములో మానావమాన ములు, సుఖదుఃఖాది ద్వంద్వములనుండి విముక్తి ప్రాప్తించును. సుఖదుఃఖములకు మనస్సే కారణము. ఆ మనస్సు ప్రభువున కర్పణ మగుచో అది ప్రభువు సేవలో అహర్నిశము దగిలియుండి, ప్రభు ప్రేమలో సదా మగ్నమై యుండునేని, జగత్తుయొక్క కామక్రోధ రాగద్వేష లోభాదులు తొలగి, సర్వకార్యములు ప్రభువుయొక్క సుఖము, ప్రసన్నత కొరకు జరుగుచుండును. ప్రభుసుఖమునకు ప్రాణమునే ఆనందముతో సమర్పించుచుండ, ఇక జగత్తులోని తుచ్ఛసుఖములను త్యజించుటలో కష్టమేమి?

౫. ఎవడు లౌకిక ప్రేమను త్యజించునో వానికి అలౌకికమగు ప్రభువుయొక్క ప్రేమ ప్రాప్తించును.

## ౨౪౦ శ్రీ నందూబాయిజీ

౧. చైతన్యము, జడము- ఈ రెంటి కలయికయే మనస్సు అనబడును.

౨. ఎవడు ఏది కోరునో వానికదే లభించును. మనస్సులో ఈర్ష్యా ద్వేషము లుండెనా, అదే లభించును.

3. మనస్సును ఆత్మలో కలుపుము.

౪. కండ్లు, చెవులు, వాణి, జిహ్వా- వీటిచే మనస్సు చంచలమగును. కాన వీటిని నీ వశములో నుంచుకొనుము.

౫. యమ, నియమ, ఆసన, ప్రాణాయామముల నలవరచుకొనుము.

౬. పిల్లలకు భూషణముల నలంకరించి తల్లిదండ్రు లెట్లు సంతోషించెదరో, అట్లే మానవులు భగవంతుని అలంకరించి పూజించి సంతోషింతురు.

౭. నీ మనస్సును భగవదర్పితము చేయుము. లేదా పవిత్రమైన గురువున కర్పించుము. వారి పవిత్రమైన మనస్సు నీకు లభించును. ఎట్లనగా, చంచల స్వభావముగల వానిని చూచినచో మనస్సులో చంచలత్వము పుట్టును. ఒక మహాత్ముని దర్శించినచో మనస్సులో శాంతి కలుగును. కాన సత్సంగము చేయుచుండుము.

౮. ప్రాణములు ఇచ్ఛారహితములు. ఇంద్రియము లిచ్ఛగలవి. నిద్రలో ఇంద్రియము లుండవు. ప్రాణములుండును. కాని అవి ఏమియు కోరవు.

౯. భగవంతుడు సత్యవ్రతుడు. కాన మనముకూడ సత్యవ్రతులము కావలెను.

౧౦. దుర్బుద్ధివి గాక, బుద్ధిమంతుడవు గమ్ము. భేదబుద్ధి లేనివాడే ఉత్తముడు.

౧౧. ప్రపంచమునుండి నీ కల్యాణము కానేరదు. అనగా ప్రపంచ విషయభోగములనుండి నీ కోరిక లెన్నిటికిని పూర్తి కానే

రవు. కావున ప్రపంచమున భిక్షమెత్తుటచే నేమి ప్రయోజనము? అందుచే సమస్త కోరికలను త్యజించుము.

## ౨౪౧ శ్రీ ఉపగుప్తుడు

౧. ఇతడు దేనిని తిరస్కరించక శాంతముగా నుండువాడు. ఒకటి చెడ్డ ఒకటి మంచి దనువాడు కాడు. "వాసవదత్త"యను స్త్రీ యితనిని మోహించి ప్రశ్నించినను, ఆమెను ద్వేషించి ధిక్కరించక మౌనము వహించి వెడలిపోయెను. మోహమునకు వశుడు కాలేదు.

౨. అడవిలో నొక పొదలో కూర్చుండి తపస్సు చేయుచుండగా, ఒక పెద్దపులి యితనిపై లంఘించ యత్నించుచుండగా నిశ్చలమానసుండై దానిముందు సంతోషముతో తలవంచెను. ఈ దృశ్యమును జూచుచున్న బోయవాడొకడా పులిని బాణముతో కొట్టెను. ఆ దెబ్బతో ఆ పులి క్రిందపడగా, దానికై యితడు చాల జాలిపడి, ఆ బోయవానితో "నాయనా! నిరపరాధమైన మృగమును సంహరించితివి కదా" యని చింతించి ఆ ప్రక్కనున్న నదిలో పులిగాయమును కడిగి, బాణమును పెరుకుచుండగా, పూర్వ మీతని మోహించిన వాసవదత్తయే ఆ సమయమున అక్కడికి వచ్చి, "క్రూర జంతువునకు ప్రాణదానము చేయుట హానికరము"అని హెచ్చరించినది. అందుకతడు గంభీరముగా నిట్లనెను. బాహ్యసౌందర్యాన్ని చాటుచేసికొని, మానవత్వమును చంపే కామము ముందు, మహాపాశములతో మానవుని బంధించివేసే మోహముముందు, స్వర్ణకిరీటము జూపి పిచ్చిపుట్టించే లోభము ముందు యీ వ్యాఘ్రము అంత హానికరమైనది కాదని చెప్పెను.

3. దుఃఖమునకు మూలము ఆశ, కామము. కావున వీనిని త్యజించుము.

## ౨౪౨ శ్రీ చిదానంద మహరాజ్

౧. మమతను త్యజించుము. ఇచ్ఛాశక్తిని త్యజించగానే ముక్తి ప్రాప్తించును.

౨. మిథిలానగరము పూర్తి భస్మమైనను అందులో నాది ఏదియు భస్మముకాదు. ఎవరివస్తువో వారే రక్షించుకొనెదరు. దానికై నాకు చింతయేల? ఈ ప్రపంచములో నాది అనునదేదియు లేదు. ఉన్నదంతయు ఈశ్వరునిదే. ఇక దుఃఖము చింత లెక్కడివి? అని జనకుడు అష్టావక్రమహామునికి బదులు చెప్పెను.

౩. ప్రతిసమయము మనస్సును జాగ్రత్తగా జూచుచుండవలెను. ఎందుకనగా అది ఏవో సంకల్పములను లోపల నింపుకొనుచుండును. జాగ్రత్తగానుండి సంకల్పములను రానివ్వకుండవలెను. ప్రతిదినము, మనస్సును శుద్ధము చేయుచుండ వలయును. లేనిచో మమత, రాగద్వేషములనెడి మలినము పట్టును.

౪. ప్రతిసమయమున సంసారము, శరీరము అనిత్యమనియు ఆత్మ నిత్యమనియు విచారించు చుండవలయును. అనగా ఆత్మ విచారము చేయుచుండవలెను. మనస్సును సంసారవస్తువులలో ఆసక్తి పొందనివ్వకుము.

౫. దానము చేయుట ధర్మముకాదు. అది మానవుని కర్తవ్యము. కాని దానిని ధర్మమనుకొనకుము. దానము చేయుటావశ్యకము. శరీరముతో నితరుల సేవ జేయుట ధర్మము. ఇది మానవుని విధి. ఎట్లు తినుట త్రాగుట పీల్చుట ఆవశ్యకమో అట్లే దానము చేయుటావశ్యకము, విధి.

౬. అసత్యమైన దానిని సత్యవస్తువుగ చూచెడి క్షుద్రమైన అలవాటును త్యజించుము. మనస్సును అంతర్ముఖము చేసిన చిత్తశాంతి కలుగును.

౭. అనపేక్ష, మౌనము, శాంతము, అద్వేషము, సమభావము వీటి నెవడాచరించునో వాడు ముక్తుడే. ఈశ్వరుడు వాని వెంబడే యుండును.

## ౨౪౩ ఒక స్వామి

౧. నీ సంకల్పములను నీవు సాక్షీమాత్రుడవై గమనించు చుండుము. అవి ఏలాటివో పరిశీలించుచుండుము. వానిచే నీలోన దాగియున్న ఆశలు, వాసనలు, కోరికలు తేటపడుచుండును. వాటిని నిర్మూలించుటకు ప్రయత్నించుము. నీవు నీ సంకల్పముల గమనించు చున్నప్పుడు వానివెంట నీవు పరుగెత్తరాదు. అందులో లీనమై పోరాదు. కేవల సాక్షీమాత్రుడవై లోపల ఏలాటివి దాగియున్నవో, ఏ రీతిగ బయలుపడుచున్నవో, అంతమాత్రమే చూచుచుండవలెను. ఈ ప్రయోగముచే నీ సంకల్పములు చాలవరకు తగ్గును.

౨. రెండవ మార్గము సంకల్పవికల్పములు నీవి కావనియు, ఎపుడో విన్నవి చూచినవి సహజరీతిగా సినిమాలోని బొమ్మలవలె తోచుచున్నవనియు, మన చిత్తవీధి యందు కనిపించు బాటసారుల వలె, ఎక్కడి నుండియో వచ్చుచు ఎక్కడికో పోవునట్టివి గాన, వాటితో మన కేమియు సంబంధము లేదనియు భావించవలెను. ఈ విధానములో నీ మనస్సు రెండు భాగములగును. ఒకటి చలన రూపమున సంకల్పముల స్వరూపముగా కనిపించునది, రెండవది వానిని గమనించుచు, నిశ్చలముగా నున్నట్టిది. అట్లు నిశ్చలముగా నున్నట్టిదే నీ నిజమైన మనస్సుగా భావించి, చలనముగా నున్న రెండవ దానితో సంబంధమును నిరాకరించి, ధ్యానములోని ధ్యేయమువైపు మరలి పోవలయును. దీనిచే సంకల్ప శూన్యత కలుగును.

## ౨౪౪ శ్రీమద్ రాజ చందర్‌జీ

౧ ఏ మానవుడు సుఖమును కోరునో, వాడు ప్రపంచపు టాశలను వీడవలెను. దేనిని కోరరాదు.

౨. రాగద్వేషము లుండరాదు. ఈర్ష్యాలోభము లుండరాదు.

3. శూరు డెవడు ? ఎవడు స్త్రీ యొక్క రూపురంగులను జూచి మోసపోడో, భ్రమించడో వాడే శూరుడు.

౪. సత్సంగమువల్ల సంసార సముద్రమును దాటవచ్చును.

౫. అన్యాయార్జితముచే జీవయాత్ర గడుపుట మహాపాపము. ధర్మమే జయము.

౬. ధనమును నీ కొరకై ఖర్చుపెట్టుకొనుము. ఇతరులకొరకై ఖర్చుపెటుము.

## ౨౪౫ స్వామి చిన్మయానందజీ

౧. ఓమ్‌ను మనస్సుతో జపించుచు, బుద్ధితో ధ్వనినివింటూ, కండ్లతో చూచుచుండవలెను. బుద్ధితో చూచుచున్నట్లు గ్రహించునదే ఆత్మ. చూచే దెవరని విచారించి, చూచుచున్నచో ఆత్మ దర్శనమగును. ఇట్లు ప్రతిరోజు 6 సార్లు జపించి ధ్యానించవలెను. ప్రతిసారి 30 నిమిషముల వ్యవధి యుండవలెను. మధ్యమధ్యకూడా అప్పుడప్పుడు జపించుచు ధ్యానించుచుండవలెను.

౨. చెడుసంకల్పములను దరికి రానీయవద్దు. చెడుకార్యములు చేయరాదు.

3. సంసారలంపటము తగ్గించవలెను. పవిత్రుడవై ఉండుము. విసుగుపడవద్దు. నిర్మల మనస్సుతో చేయుట మనవంతు, దానికి ఫలమిచ్చుట భగవదధీనము. ఏలాటి చింత చేయరాదు.

౪. మనస్సు ఇటు అటు పోవుచో దానిని మరల్చి ధ్యానములో పెట్టుచుండుము. మనస్సు నిలువనిచో జపమాలతో ఒకటో రెండో జపమాలలు ఓంహరి లేక యేదో ఒక నామమును జపించుము. జపమాల ఆగిపోయి ధ్యానము కుదురవలెను. మనస్సులో ఏ సంకల్పములు లేనంతవరకే ధ్యానించుము. సంకల్పములు రాగానే నోటితో నామము నుచ్చరించుము, మనస్సు శాంతిపొందగనే ధ్యానించుచుండుము. జపమాల కేవలము మనస్సును అలవరచుకొనుటకే అక్కఱకు వచ్చును.

౫. వాసనలు పూర్తిగా నశించగానే సంకల్పములు లేక పోవును. అపుడే శాంతి, సమాధి కలుగును.

౬. దృఢమైన వైరాగ్య ముండవలెను.

౭. కర్మ దానంతటదే విడిపోవలెను. కోరికలు లేనిచో కర్మలు నశించును.

౮. మనస్సు కలత జెందినప్పుడు ఓమ్‌ను దీర్ఘముగా స్మరించ వలెను. లేనిచో చిన్నచిన్నగా తీయవలెను.

౯. పూర్వకర్మలను ప్రారబ్ధానుసారముగా ననుభవించుచు, నూతన కర్మలను జేయకుము. ఏ కర్మలందును ఆసక్తియుండరాదు.

౧౦. ఆచరణ శుద్ధముగాను, మనస్సు శాంతముగాను ఉండ వలెను. బుద్ధిసంయమము కావలెను. భగవంతునితప్ప వేరేమియు కోరరాదు. పూర్ణజిజ్ఞాసుడు కావలెను. వీటిని యెవ డనుభవములో నుంచునో వానికి భగవంతుని దర్శనమగును. ముందు వెనుకల విచా రించరాదు.

౧౧. ఒక సంకల్పముచేసి వెంటనే రెండవ సంకల్పము జేయుచో మొదటి సంకల్పము నష్టమగును. అట్లే ప్రతి సంకల్పము నష్టమగుచుండును. సంకల్పబలము తగ్గును. కావున సంకల్పముల మీద సంకల్పములు చేయరాదు. సంకల్పాలపై సంకల్పములు జేయనిచో మొదటి సంకల్పమునకు ఆత్మబలము చేకూరును. దాని శక్తిచే అది ఫలించును.

౧౨. త్రాటిలో తరంగములు లేకున్నను, గాలిచే త్రాడు కదలి దానిలో తరంగములు పుట్టిపోవుచున్నట్లు గోచరించును. త్రాటిలో సర్పము లేకున్నను భ్రమచే ఆ త్రాడే సర్పమువలె కను పించును. అటులే వాస్తవములో లోకము లేకున్నను ఆత్మశక్తిచేత లోకము కనుపించుచున్నది.

౧౩. వాసనాక్షయము వలన మనోనాశనము సులభమని వేదాంతము విసుగులేక బోధించుచున్నది.

౧౪. అవివేకమువలన ప్రపంచముతో సంబంధము కలిగించు కొందువేని ప్రపంచము మనలను క్రమింగివేయగలదు. ప్రపంచమునకు దయాదాక్షిణ్యములు లేవు. ప్రపంచము తన ధర్మములకు లోబడి వ్యవహరించుచున్నది.

౧౫. మీ బుద్ధికి, అంతరాత్మకు నచ్చిన జీవితపు విలువలను వదలక ఆచరించవలెను.

౧౬. మనస్సే మానవుడు. మనస్సు రీతిగ వ్యక్తి వ్యవహరించుచుండును. మనస్సు చలించినంతో వ్యక్తి చలించును. విషయములవైపు మరలియుండు భాగమునకు మనస్సనియు, అంతరాత్మవైపు మరలియుండు భాగమునకు బుద్ధి యనియు పేరు. సందిగ్ధ సమయములో యెవని మనస్సు బుద్ధియొక్క సలహాల ననుసరించి మెలగునో అట్టివాని వ్యక్తిత్వము పరిపూర్ణమైనది. వ్యక్తియొక్క అహంకార జనితములగు కోరికలు ఆ రెంటి యెడబాటుకు అడ్డు తెరమై యున్నవి. మనోబుద్ధుల మధ్యనోని దూరము మరింత పెరుగుకొలది, ఆంతరవైకల్యము మఱింత పెరిగి క్షుద్రవృత్తులు జీవితము నాక్రమించును. కాన మనోబుద్ధు లేకము కావలెను. మధ్యన పేరియుండు అహంకారజనిత కోరికలను తొలగించుటవల్ల యోగము సిద్ధించును. అదియే బుద్ధియోగ మనబడును. మనస్సునందలి మచ్చలను మాపుకొనవలెను.

౧౭. గీతావిధాన జీవితమును అనుభవించగల ధైర్యమొకటి యుండిన చాలును.

౧౮. మానవునిలో యెన్నో విషయకోశము లుండును. శరీరము, మనస్సు, బుద్ధి మొదలగు యేదో ఒక విషయకోశముతో తాదాత్మ్యము కల్పించుకొని హాస్యగానివలె నటించును. ఆ హాస్య నటనమే సుఖము, దుఃఖము, బంధము అని అనుభవించుచున్నాము. ఇట్టి భావమువల్ల సంసారము మన కల్పితము కనుక అందువల్ల కలిగిన బంధములన్నియు మన స్వకల్పితములే.

౧౯. అయ్యా! ముందు నీ మనస్సునందున్న పరస్పర విరుద్ధ కోరికలను చల్లార్చుము. మనస్సును ఏకదృష్టి గావింపుము.

౨౦. ధ్యానాభ్యాసమువల్ల మనస్సు శాంతిపొందును. క్రమము తప్పకుండా శ్రద్ధతో నాచరించుడు.

౨౧. ధ్యానమునకై నీవు సులువైన ఆసనమున, వెన్నెముక చక్కగా నిలిపి కూర్చుండవలెను. ఆసనముచే రక్తము అధోభాగమున తగ్గి శిరోభాగమున ప్రవహించుచు, ధ్యానసమయమున మెదడున కధిక రక్తమును చక్కగా చేకూర్చును. ఇట్లు కూర్చుని శరీరమును సళ్లుపరుచవలెను. ప్రతి అంగమును సళ్ళు వదలవలెను. నేను వేరు, శరీరము వేరు. దేహమునందలి ప్రతి అంగమును మనస్సుతో సళ్ళుపరచుచు పరీక్షించుము. ఇట్లు సళ్ళుబారిన హస్తముల వ్రేళ్ళలో వ్రేళ్ళు కలిపి ముందువైపు కాళ్ళమీద వదలవలెను. మరల గమనింప నవసరములేని విధమున అన్ని వదలివేయవలెను. శరీరమును ప్రక్కటెముకలపై వదలివేసి, తన భారమును తొలగించుకొన్నట్లనుభవించవలెను.

౨౨. గుణమే మానవుడు.

1. ఈ స్థూలశరీరమును మనస్సు పాలించుచున్నది. మనస్సునందు విరామములేకుండ ఆలోచనలు ప్రవహించుచుండును. ఆలోచనలు ప్రవహించు కొలది కొన్ని అచ్చుగీతలను (ముద్రలను) అవి నిర్మించి పోవుచుండును. ఈ ముద్రలు వాసన లనబడును. మానవుని వ్యవహారము లన్నియు, ఈ వాసనా పత్రములనుండి ఉత్పత్తి గాంచుచుండును.
2. మన ఆలోచనల రీతి మన మార్పు సంభవించు చుండును. భావములే గుణములు. బాహ్యజీవిత విషయములందు, వారికి స్పర్శకలిగినప్పుడు వారిలోనుండి సూది రాపిడివల్ల రికార్డున కలుగు శబ్దమువలె కొన్నిటినుండి సంతోషము, కొన్నిటి నుండి దుఃఖము బయలుపడుచుండును.

3. మానవుని యందలి ఆలోచనల వ్యత్యాసమును బట్టియే ఒకరి కొకరికిగల వ్యత్యాసము కనబడుచుండును. ప్రత్యేక రకపు టాలోచనలు, వాటి ప్రత్యేక రకపు గుర్తులను అచ్చువేసి, ప్రత్యేక గుణములుగా మానవునియం దేర్పడు చుండును.

4. ఆలోచనలు, కార్యములు, సంతోష, సోదరభావముతో సత్యమార్గయాత్ర సాగించవలెను. మనస్సు కార్యము ఏకభావ ముండవలెను. భేదముండరాదు.

5. ఒక మానవునియందు మార్పుకల్గించవలెనన్న అతని ఆలోచనలవల్లనే సాధ్యమగును. కనుక గుణములను బుద్ధిపూర్వకముగా సంస్కరించవలెను. బుద్ధి ఆజ్ఞాపించగల స్థితియం దుండ వలెను.

6. ప్రపంచమున నివసించవలెనన్న గుణచర్యలు, గౌరవము, సత్యము, విశ్వాసము, ప్రేమ పెంపొంది, స్వార్థరహిత జీవితమును గడపవలయును.

7. స్థూలదేహమునుండి ఉపసంహారము.
   1) ధ్యానాభ్యాసమునకు మానవుడు చక్కని నీతినియమములు గల్గియుండవలెను. ప్రపంచ విషయములందుగల తీవ్ర ఆకర్షణలయెడ విరాగము కల్గియుండవలెను.

8. సూక్ష్మశరీర ప్రవేశము.
   1) ఎవరు తనశరీరమును ఎంతబాగుగ సల్లుపరచ కలుగుచున్నాడో, అంతటి విశేషముగ తన స్థూలశరీర నిర్మాణమునుండి, తన దృష్టిని తొలగించుకో గల్గును. దీనిచే ఆనందము, శాంతిని పొందుచున్నాడు.
   2) మనస్సును నియమించునట్టి బుద్ధిని నియమించు టగుచున్నది. నాది నేను అనునది లేకపోవుటే ముక్తి.

3) ధ్యాన సాధనవల్ల మనసును అరికట్టవచ్చును. బుద్ధిని అతిక్రమించ వచ్చును. అహంకారమును నశింపజేయ వచ్చును. చిత్తమును వృత్తిహీనము గావించవచ్చును. ఇదియే జీవితముయొక్క ముఖ్యోద్దేశము.

4) అభ్యాసప్రకారము ఓంకార జపమాచరించిన వెనుక, అంతర తూష్ణింభావము నిశ్శబ్దతను ప్రవేశించవలెను. ఇప్పటినుండి అట్టి నిశ్శబ్దతను శూన్యభావముతో పొంది యుండుటతో తృప్తి పొందకూడదు. అట్టి నిశ్శబ్దకాలమున, మన మనస్సును ఓంకారజపము సలుపుమని ఆజ్ఞాపించవలెను. అట్టి ఓంకార మనోజపము చేయునప్పుడు మన నోటియందు నాలుక కదలకూడదు. పెదవులు చలించకూడదు. బహుశః ఓంకారము మనస్సులో పలుకునప్పుడు మన గొంతు పైకి క్రిందికి కదలుచు ఓంకారము చేయుచున్నట్లగపడుచుండును. అట్టి గొంతుకయొక్క కదలికనుకూడ ఆపివేయవలెను. ఇట్లు మన నాలుకను గొంతుకను కదలనీయక బంధించిన యెడల మనస్సుతో జపముచేయుట ప్రత్యక్షముగ తెలిసి కోగలము.

5) మనస్సును జపము చేయనీయుడు. మనలోని బుద్ధి ఆ మనస్సుచేయు జపమును గమనించుచు, చక్కగా వ్యవహరించునట్లు నియమించవలెను.

6) ఇట్లు కొంతకాలము జపముచేయక మనస్సు ఆగును. అప్పుడు నిర్మల నిశ్శబ్దవిరామమును మీరు అనుభవించ గలరు. దీనిని భంగపరచరాదు. క్రొత్త ఆలోచనలు మనస్సులో తేరాదు. తాత్కాలికముగ మీ సత్య స్వరూపము అంతర్జ్యోతిని తలంచుకొని దానియందు ఏకాగ్రత గాంచవలెను. అచ్చటనుండు ప్రశాంతము జ్ఞాన

బోధ కతీతము. వర్ణింప సాధ్యముకాదు. అనుభవించి ఆనందమయము కావలెను.

9. మనస్సును స్తబ్ధించుట లేక బంధించుట.

1) శరీరము, మనస్సు, బుద్ధితో తాదాత్మ్యముపొంది, నేనొక వ్యక్తిని అను భావము కల్పించుకొని, పరిమితులకు లోనై అహంకారముచే జీవభావము ననుభవించు చున్నాము.

2) పరిమితికి లోనగు ప్రపంచ విషయముల ఆర్జవమువల్ల, పరిమితికి అతీతమగు ఆద్యంత రహితవస్తువు లభింప జాలదు. ఇదియే జీవితమున సర్వదుఃఖములకు సూక్ష్మ కారణము. దీనికిగల పరిహారము మన అవిద్య (భ్రమ) తొలగుటయే. కోరికలు నిర్మలత్వము గాంచుకొలది అవిద్య క్షీణించును.

3) శరీరము, నియమముగా, నిలుకడగాంచిన వెనుక, ఉచ్ఛ్వాస నిశ్వాసముల చక్కగ నియమించి ధ్యాన మారంభించవలెను. దీనిచే మనస్సునందు సూక్ష్మాలో చనల ప్రవాహము నివర్తించుట గమనించును. అందు వల్ల అతని ఆలోచనలు సన్నగిల్లి ఏకైక ఆలోచనతో నిండియుండును.

4) సాధకుడు చక్కగ ఆసీనుడై తన ఇష్ట మంత్రముగాని, భగవంతుని సంకీర్తనముగాని, తన చెవులందు వినబడు నట్లుచ్ఛరించ వలెను. ఏదోయొక సాకారరూపమును కండ్లతో జూచుచు, నాలుకతో పలుకుచు వినుచుండ వలెను. ఒక ప్రతీకము రామ, కృష్ణ, ఓంకారము ఎదుటయుండు టత్యావశ్యకము. ప్రతీకమును దృష్టిచే గమనించవలెను. ఓమ్ శబ్దముల ఆది అంత్యము చెవు

లకు బాగుగా వినబడు నట్లుచ్చరించవలెను. దీర్ఘముగ శబ్దము మారు మ్రోగు నట్లుచ్చరించవలెను. మీ శ్రద్ధ, సాహసములతో హృదయాంతరాళము నందుండి శబ్దము బయలుదేరవలెను. ఇట్లు అయిదు లేక పదిపర్యాయము లుచ్చరించి కండ్లు మూసికొనవలెను. బాహ్యాశబ్దోచ్చారణ జపము ముగియగనే, మనోజపము ప్రారంభమగును. నోరు మూతబడుటతో జపము చాలించక సాగుచుండ వలెను. ఇట్టి సాధన ప్రారంభమున, ఆంతరజపము చేయ యత్నించగనే నోటిలోని నాలుక, భగవన్నామము పలుకుటకో ఓంకారము శబ్దించుటకో ప్రాకులాడుచుండును. మనస్సుతో నాలుక చేష్టలను గమనించి, దానిని కదల నీయ రాదు. ఐనను అది గొంతుకలోని పీకపైకి నిక్కుచుండును. దానిని కూడ ఆపవలెను. అపుడు జపము హృదయమునుండి బయలుదేరు చుండుట గమనించ గలము. ఇప్పుడు మనస్సు బుద్ధితో తాదాత్మ్యముపొంది సులభముగా జపము చేయుచుండుట గమనించగలము.

10. సగుణ మనస్సు :

1) గుణములు సమకూడవలెనన్న తోలుత దురాశలు, దుర్గుణములను తొలగించవలెను.

2) శ్రుతులు అను చీపురుకట్టతో మనస్సు నెల్లప్పుడు ఊడ్చుచుండవలెను. సత్సంగమను క్రొత్త సున్నమును పూయుచుండవలెను. ఉపాసన యను ఆసన సామగ్రిని అందు చేర్చవలెను. పిమ్మట ధ్యానమునకు సుస్వాగత పత్ర మర్పించి అందు వసించునట్లు కోరవలెను. ఇట్టి శ్రమకు ఫలముగ ధ్యానమునందు ప్రభువు, ఆత్మ మనయందు నిండియుండగలదు.

౩) సాధకుడు అధిక ప్రయత్నమువల్ల మనస్సు పరుగులనెల్ల ఆపవలయును. మనస్సును నెమ్మదిగా, శాంతముగా దారికి తీసికొని రావలయును. విననిచో ఉపవాసములు, వ్రతములు, తపస్సులద్వారా మనస్సును నియమింప వలెను. కనికరము జూపరాదు. మనస్సు కోరినదానిని యివ్వరాదు. ఇట్టి పని గురువునుండి గాని, మరేవిధమున గాని సంపాదించలేము. కష్టపడి కృషి చేయవలయును. విచక్షణతో మెలగవలెను. క్రమముతప్పక ధ్యానము చేయవలెను. సర్వకాలములలో వివేచన చేయుచుండ వలెను. ఓర్పు, దయ, ప్రేమ కలిగియుండవలెను. మరణము సంభవించినను మోసము, కుట్ర, మోహము, ఆవేశములు వీటి జోలికి పోరాదు. ధ్యానము చేయు చుండవలెను.

౨౩. కార్యసిద్ధి రహస్యము.

1. అన్నిటికన్న దగ్గరదారి యేదనగా అహంకారమునురెండుగా విభజించి, ఆ రెండు భాగముల సందున దారి కల్పించుకొని, లోన ప్రకాశించు సత్యసామ్రాజ్యమును ప్రవేశించుటకు ప్రయత్నముచేయుటయే.

2. శ్రద్ధతో క్రమముతప్పక అనుష్ఠానము చేయుచు, ప్రతి దినమున, క్షణక్షణము, అహోరాత్రులు ఎడబాటులేక సత్య నిత్య దివ్య పరమాత్మయొక్క ఎరుకతో జీవించవలెను. జీవితమును నాటకమువలె సాగించవలెను. అందు నీ పాత్రను సక్రమముగ నటించవలెను. భగవదాజ్ఞను పాటించవలెను.

3. త్యాగములేనిది ఏ పనియు సాగదు. విరాగము పొందుకొలది అంతరమును సమీపించగలము.

4. సత్యవ్రత మవలంబించుము. అసత్యము పలికిన యెడల నీకు నీవే తగుశిక్ష విధించుకొనవలెను. మాటిమాటికి అట్లు చేయునను

తీర్మానమును పొందుట, అయోగ్య మనోవ్యవహారమునకు పశ్చాత్తాపపడుట, ఉపవసించుట, చాలాకాలము మౌనము వహించుట, మనోజపము చేయుట, ఏకాగ్రత పొందుట ఇవియే శిక్ష.

5. దివ్యసాధనయందు సాధకుని వ్యవహారము లన్నియు పసి బాలునివలె నుండవలెను. దుస్సంఘమును వదలవలెను.

6. ఏకాంతమున కూర్చొని, నీలోని వ్యవహారములను పరీక్షించి, సరిదిద్దుకొనుచుండుము. ప్రతిరోజు నీ దినచర్యను వ్రాయు చుండుము. దీనిచే నిన్ను నీ వుద్ధరించుకొనగలవు.

దివ్య జీవితము :

౧. కోరికలు వదలుము. ఆలోచనలు తొలగును. సంకల్ప వికల్పావేశములు అణగినచో అమరశాంతము లభించును.

౨. నీవుకూడ జీవన్ముక్తుడవు కాగలవు. విచక్షణతో జీవించుము. ఆంతరవిచారము కలిగి వర్తించుము. బాహ్యప్రపంచము ఎల్లప్పుడును ఇప్పుడున్నట్లే యుండును. అది దాని ధర్మము.

3, జీవితమంతయు ప్రపంచమును చక్కబెట్టుటకు వినియోగింప కంకణము కట్టుట కేవల వృథా ప్రయాస.

౪. రామరాజ్యమును ప్రపంచమున నెలకొల్పవలెనని కోరినచో, మనము ప్రతి మానవుని, ఆశారహిత త్యాగజీవితమును గడుపునట్లు తయారుచేయవలెను. వైరాగ్యము, విచక్షణ సమకూడవలెను. ఇది వేదాంతవిద్యవల్ల సాధ్యమగును.

౫. వేదాంత జీవితమును పొంద ప్రయత్నించుట దివ్యజీవితమువల్ల కలుగును. క్రిమిజీవితమును తొలగించుకొని కోరికలు, మోహములు, ఆకలిదప్పులు, పేరాసలు తొలగించుకొనువారికే దివ్యజీవితము సాధ్యమగును. అంతరవిమర్శ, ఆత్మపరిశోధనయే దివ్యజీవితమునకు ముఖద్వారము. దినపర్యంతము గడచిన జీవిత

వ్యవహారములను పరిశీలించ యత్నించుటే విమర్శ యనబడును. మనకుగల మోహావేశములు, పేరాశ, స్వార్థము, బాహ్యకోరికలు వీటిని తొలగద్రోసి ప్రేమ, దానము, ఓర్పు, అంతర్ముఖధ్యానము మొదలగు గొప్ప సుగుణములను పొంది జీవించుచో, వ్యక్తి తన మర్త్యలోకమును వదలుకొని తన నిజస్వరూప దైవపదమును పొందుచున్నాడు. ఇది చిన్మయుని ప్రత్యక్ష అనుభవపరిశ్రమ యని తెలియవలెను. చిన్మయుడు నమ్మకముగా జెప్పుచున్నను, మీరు పరీక్షించిచూడుడు, నమ్ముడు.

౬. నీ యందలి 'నేను' అను భావమును నశింపజేయుము. వెంటనే బంధములు తెగి ఆనందస్వరూపమును పొందుదువు.

౭. చిన్మయుడు నిన్ను కోరునదంతయు, పూర్ణ శ్రద్ధ విశ్వాస పూరిత పరిశ్రమచేయ సంసిద్ధుడవు కమ్మని. మిగిలినదంతయు అతి సులభము.

౮. ఈ దేహముతో తాదాత్మ్యము పొందితివా, నీవు మర్త్యుడవు. ఆత్మతో తాదాత్మ్యము పొందితివా, నీవు అమరుడవు. ఏ త్రోవ నీ కిష్టము?

౯. ఆత్మయొక్క దైవపదవి నుండి మనలను దూరము చేయునది మన అసత్య అహంకారభావమే.

౧౦. ఆలోచనలను ఆపివేయుము. వెంటనే దివ్యజీవితము చేకూరును. ఇక చేయవలసిన దేదియు నుండదు.

౧౧. నేను, నాది, నేను చేయుదునను అహంకారమే నిన్ను నాశనము చేయుచున్నది. దీనిని వెంటనే వదలుము. భగవత్ కింకరుడవు కమ్ము.

సత్యము కొఱకు ప్రయాణము :

౧. జగత్తు, జీవుడు, బ్రహ్మ వీటి విచారమును తీవ్రముగను, క్రమముగను విచారించుటవల్ల ఆత్మసంస్కార విధాన మేర్పడుచున్నది. ఇట్టి సంస్కార పరిపూర్ణమునకై జీవించుచు, జీవితమున

గల లోపములను త్రోసిపుచ్చి, జీవితశేషమును శాంతముగ గడుప గలుగుటే దివ్యజీవితము.

౨. విచ్చలవిడిగా పరుగెత్తు జ్ఞానేంద్రియములను అరికట్టుము. మనస్సు స్థిరముకాగానే, జ్ఞానోత్పత్తి కలుగును. ఆతడే పరిపూర్ణ మానవుడు.

౩. ఓ ప్రభూ! ఇన్ని సంవత్సరములు నా పరిశ్రమనంతయు వృథాపుచ్చితిని, అని వెంటనే ఆత్మవిమర్శ ప్రారంభించవలెను. కొన్ని వారముల సాధనవల్ల సాధకుడు అభివృద్ధి చెందును. కాన ఇప్పుడే ఆంతరవిమర్శ ప్రారంభించుము. దోషములను కనికరములేక త్రోసివేయుము. తెలివితో సుగుణములను సమకూర్చుము.

౪. సంసారమున దుఃఖము గలదని భయపడి ప్రపంచమును వదలిపోరాదు. ఏ మతమును పారిపోవలెనని బోధించుటలేదు. మతమును దేవళములో, ఆశ్రమములోనే కాదు, బజారునందును, ఇంటిలోను, అన్నిటియందును అనుసరింపవలయును. మనము జీవితమునందలి ప్రతి నిమిషమున, ప్రతిరంగమున కూడ చలించు పరిస్థితులకు తగినట్లు వ్యవహరించుచు, వాటి నెదుర్కొని, బలిష్ఠులమై మన ఆంతరమున బాహ్యమునకూడ, యజమానుడుగ నుండవలెను.

౫. బాహ్యరంగములను జూచి, భయపడినచో మనల నది అణచివేయును. విషయములను ధైర్యముతో నెదుర్కొనవలయును. బాహ్యరంగములను తిరస్కరించక, విరోధభావము పొందక, మమతచెందక, సమదృష్టి గలిగి మెలంగవలెను.

౬. కుంచితభావములను వదలి, విశ్వవ్యాపకభావము కలిగి యుండవలెను. సర్వం బ్రహ్మమయం.

౭. ఒక సమయములో నీకు ఒక సంకటము గలిగినచో దేవుని నిందించవద్దు. దీనభావము పొందవద్దు. ఆత్మవిశ్వాసము గల్గియుండ వలయును.

౮. ఆత్మసంస్కార కళను ఏదో యొక ప్రాపంచిక సమస్యను తొలగించుకొనుట కుపయోగించరాదు. దీనివల్ల నీ యాత్మశక్తిని దుర్వినియోగము చేసినవాడ వగుదువు. శక్తి నశించును.

౯. విశ్వప్రపంచమున అవిరోధభావముతో జీవించగలిగినచో హృదయమున శాంతము, ఆనందము సర్వదా ప్రకాశించును.

**శాంతము :**

౧. బాహ్య అవిరోధత గల వ్యక్తి ఇతరులకన్న సుఖముగ జీవించగలడు. నీవు శాంతపురుషుడవు గమ్ము. అట్టివానికే యీ ప్రపంచము స్వగృహము, కొండగుహలలో శాంత మలవడుటగాని విజయము ప్రాప్తించినప్పుడు సంతోషము కనబరచుటగాని ప్రయోజనములేదు. జీవితరంగమందలి దుఃఖసమస్యల మధ్య శాంతమును అలవాటు చేసికొని రక్షించి జీవించవలయును. దీనికే ప్రతినిమిషము నిన్ను నీవు పరీక్షించుకొనుచుండుము. శాంతమును వృద్ధిచేయుము.

౨. నీ పరిసరముల యందుండు మంచిచెడ్డలకు కూడ క్షమ గలిగి యుండుము. అహంకార పడకుము. నీ అనుభవములను జీర్ణించుకొనుము.

౩. భూత కాలానుభవములను త్యజించి వర్తమానకాలము నాచరించుము. ఇదియే దివ్యజీవనము. భూతకాలమునకై దుఃఖించుచు వర్తమానకాలమును నాశనము చేయకుము, దీనిచే రెండును వృథాయగును.

౪. దృఢ సగుణ సంపత్తితో జీవించుము. మరణ సూచక అజ్ఞానమును తొలగించుము. తేజస్సు నొసగూర్చగల జ్ఞానము ననుసరించుము. ఒక్కక్షణికము అజాగ్రతవల్ల నీ వధోగతి పాలగుదువు. కాన, సదా జాగ్రత్తతో మెలంగుము. నిన్ను నీవు పరీక్షించుకొనుచుండుము.

౫. ఆత్మను తెలిసికొన వలెనన్న మనము విజ్ఞాన రాజ్యమును కూడ అతిక్రమించవలెను. ఆత్మసాక్షాత్కారమే ఆత్మ

సంస్కారత్వమునందుగల సూక్ష్మోపదేశము. అట్లు చేయగలిగిన పురుషుడు భూమియందు దైవమానవు డనబడును.

౬. ఆధ్యాత్మిక జీవితమే దివ్యజీవనము. దివ్యజీవనమును గడుపుము.

౭. నిన్ను నీవు తెలిసికొనుము. ఆత్మయందే జీవింపుము. నీవు ఆత్మగానే యుండుము.

౮. ప్రాతః, మధ్యాహ్న, సాయంకాలములయందు, ధ్యాన మొనర్పుము. తీరిక గలిగినప్పుడెల్ల ఓం ఓం ఓం అను మహా మంత్రమును గాని, మృత్యుంజయ మంత్రమును గాని ఉచ్చరించు చుండుము.

౯. పరనింద చేయకుము. ఎల్లెడల మంచినే చూచుచుం డుము. ఇతరుల తప్పులను విస్మరించుము. సదా సంతోషముగా ఆనందముతో కాలము గడుపుము. సదా శరణాగత భావమునందే చరించుము. క్రమము తప్పకుము, నియమము తప్పకుము. అదియే గమ్యస్థానమునకు జేర్చును.

## ౨౪౬ శ్రీ అబ్రహాం లింకన్

[ఇతడు మహాకష్టజీవి, కడు బీదవాడు, నిరాడంబరుడు, నిష్కామి, సేవకుడు, నిగర్వి, పరోపకారి.]

౧. జగడ మెప్పుడు సేయకుము, పరిస్థితుల నభివృద్ధి పరుచు కొనువాడు వాగ్వాదమునకు దిగడు. జగడమువలన మనస్తత్వము పాడగును. జితేంద్రియత్వమును గోల్పోవును.

౨. దేశాభివృద్ధికై పాటుపడక మరణించుట మిగుల సహింప రానిది.

౩. ఇతరులను బాధించరాదు. ఇతరులను బానిసలుగ జేయ కుము. నీవొకరికి బానిసవు కాకుము.

౪. తన ప్రాణముల నోల్పోయినైనను తన నిశ్చితాదర్శములను నిలబెట్టుకొనవలయును.

౫. నిరపరాధిగా జీవింపుము.

## ౨౪౭ శ్రీ తత్వానందస్వామి

౧. మన ఆత్మ మృణ్మయము కాదు. కనుక దృగ్గోచరము కాని పరమాత్మను తెలుసుకో లేనంతవరకు మృణ్మయమగు శరీరమే తానని భావించునంతవరకు, మానవుడు విగ్రహారాధకుడే సుమా !

౨. మన మొక విగ్రహమును భగవంతునిగా పూజింపవచ్చును. గాని భగవంతుని మాత్రము విగ్రహముగా పూజింపరాదు. తానీ శరీరము నని తలంచువాడు పుట్టుకతోడనే విగ్రహారాధకు డగుచున్నాడు.

## ౨౪౮ సాధులక్ష్మి నరసింహశర్మ

౧ ఓ సోదరులారా! విచారించండి. మీ జీవిత మెటు బోవుచున్నదో, దేనికై పరుగులిడుచున్నదో, యిన్నినాళ్ళనుండి యేమి సంపాదించినదో కాస్త మీలో మీరు విచారించుకొనుడు.

౨. సనాతన మనగా "నేను నేనే". నేనును తెలిసికొనుటయే సనాతన ధర్మము. నే నెవడ ననే ప్రశ్న వేసికొని విచారించుకొనుము.

3. మన అజ్ఞానమును చూచుకొని మనమే నవ్వుకొనవలెను. ఇతరుల తప్పులను జూచి నవ్వుట తప్పు.

౪. శాస్త్రములనగా, మరచిపోయిన దానిని తిరిగి జ్ఞాపకము చేయుటయే.

౫. ప్రాతస్స్మరామి అను ఉదయప్రార్థన అర్థమును తెలిసికొని దాని ప్రకారము వర్తించుము.

౬. భగవంతునికి మనకు భేదములేదు. ఓతప్రోతముగానున్నాము. అనగా బట్టకు, అడ్డము నిలువు దారముల వలెగా,

మనము, భగవంతుడు ఒకటే. దారములు లేనిచో బట్టకు పేరెట్లుండదో అట్లే ఈశ్వరుడు లేనిది (జీవుడు) మానవు డుండడు. దారము లేనిది బట్ట ఉండదు.

౭. శరీరములోని ఒకే శక్తి యెట్లన్నింద్రియములలో తిరుగుచుండునో, అట్లే యీ విశ్వమంతట నొకే శక్తిగలదు.

౮. అందరిలో భగవంతు డున్నాడని, అందరిని ప్రేమించుచు, సేవించుచు, దండములు పెట్టుము.

౯. పొయ్యేటప్పుడు వట్టిచేతులతో నేడ్చుచు పోవలసి వచ్చును. కాన ఇప్పుడే జాగ్రత్త పడుము.

౧౦. నిద్ర ఒకనాడు తృప్తిపడునది కాదు. అదే మహానందము. భోగములు లేకున్నను ఉందువు కాని నిద్రలేనిచో నుండ లేవు. దాని రహస్యమేమిటో విచారించి తెలిసికొనుము.

౧౧. సనాతనుడే దేవుడు. తెలివి ఆత్మ. అంతా ఒకడే, సుషుప్తిలో వాడేకలడు.

## ౨౪౯ శ్రీ చిన్న రామదాసు

౧. నీ ప్రవర్తనలోనే ఆశీర్వాదము కలదు. నీవు పరిశుద్ధమైన ప్రవర్తన గల్గియున్నచో నిన్నందరు శుభము నొందుదువుగాక యని ఆశీర్వదింతురు.

౨. సమస్త చరాచర ప్రాణికోట్లను, దైవస్వరూపులే యను దృఢనిశ్చయ భావనతో చూచుశక్తి గలిగినప్పుడే తాను ముక్తుడగును.

3. పాపకార్యముల ద్వారా ఇతరులకు నష్టకష్టములను గలిగించుటయే గాక పుణ్యకార్యముల ద్వారాకూడ నితరులకుదుఃఖము, హాని కలిగించరాదు. భగవన్నామ సంకీర్తన జేసికొనుట యిష్టముగా నున్నను ఇతరులకు నిద్రాభంగము కల్గించకుండ నుండవలెను.

౪. మనము మలమూత్రముల విసర్జించినను, ఉమ్మి వేసినను, ఇతరులకు బాధ కలుగుచోటున జేసినచో వారు దానిని జూచి అసహ్యపడి బాధపడుదురు. కావున నట్టి పనిని యెవ్వరికి బాధ కలుగని చోటుననే జేయవలయును. మనకెంత గొప్ప పదవి, ధన మున్నను ఇతరులను హీనముగా జూడరాదు. బాధపెట్టరాదు.

౫. మనస్సుతో, వాక్కుతో, శరీరముతో నితరులకు బాధ లేకుండ ప్రవర్తించుటలో మిక్కిలి ప్రజ్ఞాశక్తి, నేర్పరితనమును గల్గియుండవలయును.

## ౨౫౦ శ్రీ తపస్యానంద స్వామి

౧. మానవునకు సాత్త్విక ఆహారమే శ్రేష్ఠము. పాలను యెక్కువగా కాచరాదు. దీనిచే జీవాణువులు నశించును.

౨. ఖరీదుగల ఆహారమును తినరాదు. కాలేయ, మూత్ర కోశ, మధుర రసోత్పత్తికి కారణ భూతమగు, విలువగల ఆహార మును త్యజించుము.

3. చేదు, పులుపు, ఉప్పు, మిగుల వేడికలిగించు ఉద్రేక కరమగు ఆహారములు రాజసములు. నూనె, మినుములు, పులుపు, పెరుగు, వేపుళ్ళు, మంచిగుమ్మడి, మిరపకాయలు, చింతపండు మొదలగునవి త్యజించవలెను.

౪. తినుటయే జీవితలక్ష్యము కలవాడు మహాపాపి. పోషణ కవసరమగు నంతమాత్రము తినువాడు ఋషి లేక యోగి.

౫. ధ్యాన నిష్ఠయందున్న వారికి స్వల్పాహారము చాలును. ఉదయము, తేనె నిమ్మరసము తీసికొనుట మంచిది. దీనివలన రక్త శుద్ధి, ఆరోగ్యము, పుష్టి చేకూరును. ఉసిరికాయలను తినుటవల్ల ఆరోగ్యాభివృద్ధి సమకూరును.

౬. సూర్యనాడి ప్రసారము కుడిముక్కు రంధ్రము ద్వారా జరుగుచున్నప్పుడు ఆహారము తీసికొమ్ము. సూర్యనాడి ఉత్తేజ

మును గలిగించును. అది ఆహారమును బాగుగా జీర్ణింపజేయును. రాత్రులందు ఎడమప్రక్కన పరుండుట మంచిది. దీనిచే ఆహారము బాగా జీర్ణమగును. భోజనమైన వెంటనే వజ్రాసనము నందుండుము. ఆహారము సక్రమముగా జీర్ణించుట కిదియొక సాధనము.

## ౨౫౧ భక్త నీలకంఠుడు

౧. [నీ వితరులపై నాధారపడి వారికై యెదిరి చూచుచున్నావా? నీకా దీనజన ప్రసన్నుండగు విశ్వనాథునియందు నమ్మకము లేదా? ఉపాసనకు బయలుదేరితివా? తపమాచరించ వచ్చితివా? ఈ వనమున గొప్పతపస్వివై సంచరించు చున్నావా? అని అతని అంతర్వాణి పలికెను. దీనిచే ఆయన కన్నులనుండి నీరు కారసాగెను.]

౨. ఎవడు తనను సర్వాంతర్యామికి అర్పించుకొనునో, సర్వమును తన ఆత్మస్వరూపముగ భావించునో అట్టివానిని విశ్వంభరుడుపేక్షించునా? అట్లు జరిగిననాడు ఆయనను విశ్వంభరు డనువారెవరు?

3. వీరు ఏకాకియై, యే ఆధారములేక ఋషికేశమునందలి నీలకంఠపర్వతమునందు ధ్యానించువారు. వీరివల్లనే ఆ పర్వతమునకు నీలకంఠ పర్వతక్షేత్రమని పేరు వచ్చినది. వీరు పాలుతప్ప మఱేమియు గైకొనువారు కారు.

౪. ఒకరోజు తీక్ష్ణప్రతిజ్ఞ చేసి, నీరుకూడ ముట్టక కొన్ని రోజులు ధ్యానించెను. ఎన్నిబాధలు వచ్చినను ఓర్చుకొనెను. శారీరక బాధ లాయుననేమి చేయగలవు? ఆయన ప్రాణములు గిలగిల కొట్టుకొనుచున్నను పట్టువిడువకుండెను. శంకరునకు దయవచ్చి దర్శనమిచ్చెను. ఏ యుగమునందైనను, ఎవడైనను ఇట్టి పట్టుదల పట్టుచో కార్యము సిద్ధించును.

## ౨౫౨ శ్రీ కరుణానంద స్వామి

౧. భోగలాలసుడు పేదపురుగువలె నీచజీవితుడై నశించును.

౨. మనస్సును జయించవలెనని పట్టుదలయున్నచో మనస్సు కోరిన దానిని మానవలెను.

3. ఆహారము, కలహము, దురద, మైథునము- ఈ నాలుగు అభ్యాసము చేయుకొలది హెచ్చును. తగ్గించుకొలది తగ్గును.

౪. అమితముగా తినుటవలన ఆయువు క్షీణించును. రోగము జనించును. యోగము లభ్యముకాదు. నిదుర, మరపు హెచ్చును. కామరోషాదులు వృద్ధిగాంచును. మలమూత్ర బాధ హెచ్చును. నరకము ప్రాప్తించును.

## ౨౫౩ శ్రీ రామకృష్ణానంద స్వామి

౧. భక్తిగాని, జ్ఞానముగాని చమత్కార ప్రదర్శనము కాదు. చరిత్రశుద్ధి, చిత్త నిర్మలత, శీలనిష్ఠ, హృదయవిశాలత, భావౌన్నత్యము- ఇవి జ్ఞానమును, భక్తిని గుర్తింపజేయు చిహ్నములు.

౨. వస్తురూపముగా గాని దేహ సహాయరూపముగా గాని యితరులను యాచించుటయందు ప్రీతియుండుట అశుద్ధము. వ్యర్థ సంభాషణయందు ప్రీతి, వ్యర్థముగా తిరుగుటయందు ప్రీతి మొదలగున వన్నియు కామముయొక్క సంతానమే.

3. అహంకారమే యీశ్వరుని మఱపించి, యీ సమస్త వస్తువులు 'నా' వను భ్రాంతి పుట్టించును.

౪. నేను, నాది అను భావమే పైశాచికము. నాదేమియు లేదు. ఇదంతయు నీదనుటయే దైవికము.

౫. మానవుని దురభ్యాసమును మాన్పింపగలిగితివా, వానికి మేలొనర్చినట్లే. దుర్మార్గులను విజృంభించ నివ్వకుడు. కాని మనస్సులో ఈర్ష్యాద్వేషము లుండరాదు. ప్రేమచే సాధించవలెను.

## ౨౫౪ శ్రీ వాసుదాసస్వామి

౧. భక్తిపథమునకు లోకభయము విశేష ప్రతిబంధకము. లోకుల నిందాస్తుతులను లెక్కచేయరాదు. లోకులచిత్తము వనువ

రించి పోవువా డెన్నడును బాగుపడనేరడు. సమస్త కోరికలను వీడుము.

౨. ఈ ప్రపంచ మొక సత్రము వంటిది. నీ వొక బాటసారివిగా కాలము గడుపుము.

౩. వృథా మాట్లాడకుము. మౌనము వహించుము. ఇటు నటు చూడకుము. చూడవలె, తినవలెనను వాంఛను వీడుము.

౪. నీ ఆత్మ చెప్పినట్లాచరించుము. పొట్టకూటి విద్యకై ఎన్నెన్నో బాధలుపడి, విద్య నేర్తురుకాని అదంతయు వ్యర్థమే సుమా! కుతర్కములకు, వాదవివాదములకు దిగకుము. సదా జపించుచు స్మరించుచుండుము.

౫. కీర్తిప్రతిష్ఠలకు లోనుగాకుము. గర్వము, అహంకారము వీడుము. వినయముగలవాడు బాగుపడును. గర్వముగలవాడు చెడును.

౬. ఎల్లప్పుడు నీ దోషములను నీవు కనిపెట్టుచుండుము. ఇతరుల దోషములను చూడకుము.

౭. పొట్టకూటికి ఏల ప్రాకులాడెదవు? భక్తి మంచిదైతే భుక్తి దానంతటదే వచ్చును. ఇది ప్రకృతి విధానము.

౮. దానధర్మములు జేయ ధనము కోరుటకంటె, ఆశలు మానుట చాల మేలు. నీ ప్రారబ్ధ మెట్లుండునో అట్లే జరుగును. అడుసుద్రొక్కనేల, కాలుగడుగనేల?

౯. మన సర్వనాశనమునకు కలిమిలేములే కారణములు. అర్థమును నమ్మి తిరుగుట వ్యర్థము. నీవారే నిన్ను మోసపుత్తురు. నీ వద్ద నున్న ధనమునుగాక నిన్ను ప్రేమించువారు ఎవరూ లేరు. కాన దీనికై ఏల ఇంత వెతలుపడుట? నేను లేకున్న నా వారి గతి ఏమగును? అని విచారించకుము. ఎవరి గతి వారిదే, అందఱికి స్వామియే కలడు. ఎవ్వరిపైనను ఆ పెత్తనమును స్వామి పెట్టలేదు.

సర్వరక్షణభారము స్వామిదే. లేనిపెత్తనము మన మేల పూన
వలయును ?

౧౦. తేలు, పాము, పులి మొదలగువాటిని జూచి భయపడ
నేల ? వానిలో భగవంతుడు లేడా ? దైవమే మనల చెరుపదలచిన
మనల మనమే రక్షించుకొనగలమా ? దీనికై యితరుల సహాయ
మేల కోరవలెను ? ప్రాణులే అంతయు గావించుచున్నచో ఇక
హరితో పని యేమి ? కష్టములు వచ్చినప్పుడు పాపములు నశించెనని
సంతోషించుము. సుఖము వచ్చినప్పుడు పుణ్యములు సమసెనని
వ్యసనపడుము.

౧౧. కష్టములు కలిగినప్పుడే నీ తెలివితేటలు, బలము, ఓర్పు
తెలిసికొందువు. మన పరాధీనత, బంధుజనుల తోడ్పాటు, లోక
వాస్తవ్యము అపుడే బయలుపడును. కష్టముల వలననే గర్వ
మణగును.

౧౨. శరీరమును రోగరహితముగా, బలసహితముగా నుంచ
వలెను. మనోబలము, దేహబలము - ఈ రెండు నుండిన ఆత్మ
లాభముండును.

౧౩. భగవంతుడు తొలగించిన దానినిగాని, తానై మాను
కొనినదానిని గాని మరల గ్రహింపరాదు.

౧౪. దేనినిగాని నాది అని అనుకోరాదు. మనదే అనుకొని
మనమే వినియోగించుచో, చోరునకును మనకును యేమి భేదము.
ఇంతకంటె కృతఘ్నత ఏమి కలదు ?

౧౫. లోభివి కాక, నీ కున్నదంతయు నితరులకై వినియో
గించుము.

౧౬. సాధుసాంగత్యమే మేలు. లేనిచో సంగరహితుడవు
కమ్ము.

౧౭. ఏ దుర్గుణము నైనను నీవు గెలువదలచినచో, దాని
యందు దయాదాక్షిణ్యములు విడిచి, అది కనిపించునపుడెల్లను

ప్రాయశ్చిత్తముగా నొక పూట యుపవసింపుము. క్రమముగా కలుషమెల్ల హరించును.

౧౮. మనస్సును జయించవలెనని పట్టుదల యున్నచో, మనస్సు కావలెనన్నదానిని మానవలెను. వలదన్నదానిని చేయవలయును.

౧౯. ఏ దుర్గుణమును బాయ నీకిచ్ఛపొడమునో, దాని నే మాత్రము స్మరించరాదు. 'ఇది చెడ్డది, దీనిని నే గెలిచెదను' అనుచు స్మరించుటచే అది మరింత బలపడును. కాన దానికి వ్యతిరేకమైన గుణమును నీవు సదా స్మరించుచుండుము.

౨౦. దేనిపై నీకు వేడుక కల్గునో దానివలన కలుగు దోషములనెల్ల తక్షణమే లెక్కింపుము. సుందరమైన వాటిపై దృష్టి పడిన మొదల వాటి తప్పులనే వెదకుము. వాటిని బాగాచూడకుము, స్త్రీలను చూచిన, వారిని తల్లులుగా భావించి మనస్సున వారి పాదములకునమస్కరించుము. వారిపై పై దృష్టినుంచకుము.

౨౧. నిన్ను నీవు శోధించుకొనుచు, ఆత్మపరీక్ష చేసికొనుచుండుము. దీనికై నియమమును ఏర్పాటు చేసికొనుము. నియమము లేనివాడు చెడును. నా జీవితోద్దేశమునకు ఎంతదగ్గరకు చేరితిని అని ప్రతి దినము విచారించుకొనుము.

౨౨ నిద్రను తగ్గించుకొనుము. రాత్రి ఆహారము తగ్గించిన నిద్ర వశమగును. శుద్ధ సాత్త్వికాహారముచే నిద్ర తగ్గును. ఎక్కువ నిద్రచే తొందరగా ముదిమివచ్చును. ఇది మత్తును, మాంద్యమును, అలసటను గలుగజేయును. మహనీయులందఱు నిద్ర తగ్గించియే మహాత్ములైరి.

౨౩. ఆహారము, కలహము, దురద, మైథునము అనునవి అభ్యాసము చేయుకొలది హెచ్చును. తగ్గించిన తగ్గును.

౨౪, ఆహారము అల్పము, సాత్త్వికముగా నుండవలెను. అమిత భుక్తివలన ఆయువు క్షీణించును, రోగముకలుగును. నిద్దుర,

మఱపు హెచ్చును, కామరోషాదులు వృద్ధి చెందును. మలమూత్ర బాధ హెచ్చును. నరకము ప్రాప్తించును.

౨౫. ప్రతిదినము ఏకాంతమున నిన్ను నీవిట్లు తర్కించు కొనుము. నే నెవడను? ఈ సంసార మెవరిది? వీరందఱెవరు?

౨౬. గౌరవకాంక్షగలచోట భక్తి నిలువదు. దీనిచే అహంకారము పెరుగును. తృణముకంటె నీచుడవై, వృక్షముకంటె సహిష్ణుతకలవాడవై అభిమానమును త్యజించి పరులను సన్మానించుచు, సంకీర్తన చేయుచుండుము.

౨౭. దైవము మనవాడైయుండ ప్రపంచమునకేల భయపడవలెను. ఇతరుల మెప్పును బొందుటకై యే పనియు చేయరాదు. భగవంతుడు మెచ్చితే చాలును.

౨౮. మనముచేయు కార్యము లన్నిటికి సిగ్గులేదు. కాని భగవత్ భజన సేయుటకై సిగ్గుపడుట చాల లజ్జాకరము.

౨౯. భజన చేయుటచే నీవు తరింతువు. ఇతరులు విని వారు తరింతురు. ఇతరులు పని పాటలలో నుండి భజన చేయలేరు. కాన నీవు వారికి వినిపించి మేలును చేయుము. కాన భజనకై లజ్జించకుము.

౩౦. ధనికుల, నాస్తికుల చరిత్రలను పఠింపరాదు. వ్యర్థ ప్రసంగములు జరిగినచోట, భగవన్నామముచే నీటిని ప్రోక్షించి, శుద్ధి చేయవలెను. శ్రీరామకృష్ణ పరమహంస వ్యర్థ ప్రసంగములు చేసినవారి నోటిని గంగాజలముతో కడిగించి, పిదప ఆ స్థలమును కూడ, ఆ పరిశుద్ధోదకముచే శుద్ధి చేసెడివారు.

౩౧. మనస్సు లయమగుచున్నదా? ఆనందము కలుగుచున్నదా లేదా? యని అప్పుడప్పుడు యోచించవలెను. మనస్సును బట్టియే ఇతరుల ఆనందమును, మనోబలమును ఆధారపడియుండును.

౩౨. ఓ దైవమా! నా మనస్సును నీ వైపు త్రిప్పుకొనుము. భోజనమునందు ఎంత ప్రీతి యున్నదో అంత ప్రీతి నీయందు కలుగునట్లు అనుగ్రహింపుమని ప్రార్థించుము.

## ౨౫౫ శ్రీ మాణిక్యమ్మ యోగిని

౧. చిత్తైకాగ్రత కావలెనన్న పూర్ణవైరాగ్యము, దృఢనిశ్చయము, త్యాగము కావలెను. నీ ప్రాణమును అడ్డుపెట్టియైనను అన్నిటిలో తెగింపు జేసికొనుము.

౨. ఈ శరీరము నాది అని ఎంతవరకు మమతయుండునో అంతవరకు జన్మరాహిత్యము కాదు.

౩. సంసారములో నుండదలంచుకొన్న, దుఃఖములను సహించుచు, ఓర్పుతో సంతోషముగా నిష్కామ సేవ చేయుము. లేనిచో పూర్ణత్యాగివై సమస్తముచే అసంగుడవు కమ్ము.

౪. సత్కర్మలవల్ల జన్మరాహిత్యము కాదు. కాని పుణ్యము లభించును. పూర్ణత్యాగము వల్ల అనగా, నిస్సంకల్పము, వాసనా రహితము, కర్మరహితము వల్లనే జన్మరాహిత్యమగును.

౫. పూర్ణసమర్పణ భావమే భక్తి.

౬. గురువు లేక అంతరాత్మ భగవంతుడు. అన్నియు మనలోనే యున్నవి. అంతయు నొకటే. భావమే వేరు. నేను అనువాడే వాడు. నిన్ను నీవు తెలిసికొనుము.

౭. ఏ కోరికలు లేక నిస్సంకల్పుడవు కమ్ము. తుదకు మోక్షమును కూడ కోరకుము.

౮. నీవు నీ నిష్ఠలో నిస్సంకల్పుడవై యుండుము. నీకర్తవ్యము అంతే. ఆపై ఏమి జరుగునో ఆ బాధ్యత నీది కాదు. దానికై చింతించరాదు.

౯. ద్వంద్వముండువరకు దుఃఖము తప్పదు.

౧౦. ఇతరులపై నాధారపడకుము. అన్యాయముగ దేనిని కోరకుము. కోరినను దొరకదు. దొరకినను దుఃఖమే దొరకును.

౧౧. రాతిని, చెక్కను బొమ్మగాచేయువాడవు నీవే. దానికి నీవు తండ్రివేకదా! అది నీకు దేవుడెట్లగును? కాని, ప్రథమములో దానినే దేవుడని భావముంచి, కర్మచేయుచుండుచో, భక్తి గలిగి, జ్ఞానముకలుగును. దానిచే నిన్నునీవు, నీ నిజస్వరూపమును తెలుసు కొనగలవు. పెద్దలు అందుకొఱకే దేవాలయములేర్పాటుచేసినారు.

౧౨. శరీరము నాది కాదనుట మాటలవల్లకాదు. అనుభవములో రావలయును.

౧౩. కర్మపూర్తియే జన్మరాహిత్యము. పాత బాకీ తీర్చుకొనుము. క్రొత్త బాకీ చేయకుము.

౧౪. సత్యానికి ప్రాణమునైన పణముగాఒడ్డి, దృఢప్రతిజ్ఞచే సత్యమును పాలించుము. సత్యపథములో నెన్నో పరీక్షలు వచ్చును. దానిలో నెగ్గవలెను. సత్యవ్రతమువల్లనే శక్తికలుగును.

౧౫. అభిమానమును, అహంకారమును త్యజించుము. నేను అను భావముండగాదు.

౧౬. వానిని నమ్మి వాడెట్లుంచునో అట్లే యుండుము. భారము ఆయనదే.

౧౭. నీ మృత్యుసమయమున నీ కెవ్వరు సహాయముచేయరు భార్యాబిడ్డలు, ధనసంపత్తి, ఎవరు ఏది నీ వెంటరాదు. కాన వారిపై నీకు మోహమేల?

౧౮. రోగము కర్మయొక్క ఫలమే. దానిని సహించి అనుభవించవలయును. దానికి భయపడి, రోగపీడ, దుఃఖనివారణను తప్పించుకొనుటకై ప్రయాసపడరాదు. సహజముగా పీడనుసహించి, కర్మమును బాపుకొనుటే కర్మరాహిత్యము.

౧౯. వివేకము నాదరించి, అంతరాత్మ చెప్పినట్లాచరించుము.

౨౦. శరీరమొక కట్టె. ఆత్మ నిప్పు. పరమాత్మ బూడిద. అనగా కట్టెను నిప్పు కాల్చును. తదుపరి బూడిదయగును. కట్టె,

నిష్ఫు మాయమగును. అట్లే శరీరము, జీవుడు ఆత్మతో ఏకీభవించి
నచో జీవుడే దేవుడగును.

## ౨౫౬ శ్రీ తురీయానందస్వామి

౧. ధ్యానములో కొందఱు తమ మనస్సును శూన్యముగా ఉంచుటకు ప్రయత్నింతురు. కాని అది ఎట్లు సాధ్యము? మనస్సు సంకల్ప వికల్పాలతో నిండియుండును. ఒక సంకల్పమును తరిమిన వెంటనే, పుట్టెడు ఇతర సంకల్పములు గుమిగూడి గుసగుసలాడును. ఈ రకమైన సాధనాపథమును నాస్తికమార్గ ప్రియులే అనుసరింతురు. నిరంతర భగవద్ధ్యానము ద్వారా, భగవంతునిపై ప్రేమను అభివృద్ధి పరచుకొనుటే ఉత్తమ మార్గము. ఈ విధానములో మనస్సు సర్వ వాంఛలనుండి విముక్తమై పరిశుద్ధ మగును.

## ౨౫౭ శ్రీ నిత్యానందము

౧. నేను, నీవు ఇద్దఱు లేని నాడే అదే నిర్విశేషము. అనగా నేను బ్రహ్మమును అనువాడొకడు, నీవే బ్రహ్మవు అనువాడొకడు - యీ యిద్దఱు లేని నాడే శుద్ధ బ్రహ్మము.

## ౨౫౮ నరేంద్రుని తల్లి

౧. నాయనా! ప్రాణభయము కలిగినను అసత్యమాడకుము.

౨. సదుద్దేశమును గలిగి ఎల్లరు నీమంచితనమును గుర్తించి, నీయంతటి మంచివాడు లేడనిపించుకొనుము.

3. ఇతరుల స్వాతంత్ర్యమునకెన్నడును ఆటంకము కలిగించకుము.

[ఈ దివ్యబోధలను శిరసావహించి, నరేంద్రుడు తన దివ్య జీవితమును ప్రకాశవంతము జేసికొనెను.]

## ౨౫౯ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి

౧. విషయేతర సంపర్కముతో కాలమును వృథాచేయకుండ, ఉన్నసమయమందే దైవచింతనచేయుట లాభము, తక్కిన దంతయు నష్టము.

౨. పాపమును ధర్మముచే నివృత్తి చేయుము. అధర్మానికి విరుగుడు ధర్మము. పాపానికి తల్లి ఆశ. ఈ ఆశావశమైన ప్రాణికోటి యంతయు పాపనియుక్తమగుచున్నది.

౩. మనస్సునకు ఏ కార్యము చేయరాదని తోచునో అదే పాపము. ఏది చేసిన మంచి శుభమని తోచునో అదే పుణ్యము. ఎల్లప్పుడు మానవుడు పుణ్యము కావలెనని కోరుచు, పాపకార్యములు చేయుచుండును.

౪. మానవుడు పుణ్యఫలమును కోరునుగాని పుణ్యమును కోరడు. పాపఫలమును కోరుకోనడు కాని పాపములను యత్నశీలముగా జేయుచుండును

౫ మన పాపకార్యములకు మన మనస్సే సాక్షి.

౬. కామము విఘ్నమైనప్పుడెల్ల క్రోధము పుట్టుకొని వచ్చును.

౭. రజోగుణభావములైన కామక్రోధములే మనము చేసెడి పాపములకు కారణము. మహాశనుడు (ఎక్కువ భుజించువాడు) కాముడు. మహాపాపి క్రోధుడు. ఆశతో జేసినది పాపము. ఆశారహితముగా జేసిన పుణ్యము.

## ౨౬౦ స్వామి రామేశ్వరానంద్ జీ (హరిద్వార్)

౧. సమస్త సంసారము భగవత్స్వరూపమే.

౨. పరమాత్ముడు జ్ఞాన స్వరూపుడు. జగత్కల్యాణము కొరకు సాకారరూపము దాల్చును. పరమాత్మునికంటె భిన్నమగునది వేరొకటిలేదు.

౩. భక్తిచేత జ్ఞానవైరాగ్యములు కలుగును. భక్తి, జ్ఞానము రెండూ ఒకటే.

౪. రాగద్వేషములు లేనిదే ద్రోహచింతన పుట్టదు.

౫. సంసారమొక గొప్ప సంత. దీనిలో పుణ్యపాపము లను వస్తువులు దొరకును. వీటినుండే జననమరణములు లభించును.

ధర్మాధర్మము లను రెండును పుణ్యపాపము లగును. దీనిచే జనన మరణ దుఃఖములు లభించును.

౬. అంతర్గుహాలో భగవంతుడు కలడు.

౭. నన్నెవరు (పరమాత్మను) తెలిసికొనుచున్నారో వారే భవసాగరమును దాటుదురు.

౮. సచ్చిదానందమే భగవత్స్వరూపము.

౯. శ్రద్ధాభక్తుల వలననే భగవత్ప్రాప్తియు జ్ఞానమును కలుగును.

౧౦. అంతఃకరణము పవిత్రముగా, స్థిరముగా నుండువానికే భగవద్దర్శన మగును.

౧౧. శరీరము, ధనము, స్త్రీ పుత్రాదుల యందలి మోహ మును త్యజించుము.

౧౨. మోహాపేక్షను తొలగించి, ఆ తదుపరి భగవత్స్మరణ, కీర్తన చేయుచుండుము.

౧౩. ఆత్మ పరమాత్మ ఒక్కటే. తనను, పరమాత్మను వేరుగా దలంచువాడు పశుతుల్యుడు, మూర్ఖుడు. కర్మ లేకుండ కేవలము జ్ఞానముచేత మోక్షము లభించదు. ఎవడు తద్రూపు డగునో వాడు వానిని ప్రాప్తించును.

౧౪. దుఃఖమునకు హేతువు జన్మ. జన్మకు హేతువు శుభా శుభకర్మలు, కర్మలకు హేతువు వాసనలు. రాగద్వేషములకు కారణము అజ్ఞానము. అజ్ఞాన నివృత్తిచే జ్ఞానము కలుగును. జ్ఞానము నకై కృషిచేయ నవసరము లేదు.

౧౫. ఎవడు భగవంతుడు, తాను ఒకటేయని తలంచునో వానికి కేలాటి యిచ్ఛ ఉండదు. జ్ఞానముచే ఆత్మ బ్రహ్మమయు డగును. ఎవని అంతఃకరణములో శ్రద్ధ, భక్తియుండునో వానికి జ్ఞానము కలుగును.

౧౬. అంతఃకరణములో సంసార చింతన లేకుండుటే అంతఃకరణ శుద్ధి పవిత్ర మనబడును.

౧౭. ఎవడు భగవన్మయు డగునో వాని బాహ్యాంతరముల నుండి, సంసారము వెడలి పోవును. ఎవడు ఏలాటి ఋణగ్రస్తుడు కాడో వాడు మూడు ఋణాలనుండి విడబడును. వాడే సుఖపడును.

## ౨౬౧ శ్రీ చిన్మయ రామదాసు

౧. సజ్జనులతోను, భక్తులతోను స్నేహము చేయుము. దీని వలన పుత్ర మిత్ర బంధు గృహాదులపై గల మమకారము నశించుచుండును.

౨. భగవంతుని, గురువులను భజించుచు సేవించుచుండుము. దీనివలన విషయభోగములపై గల ప్రీతి నశించుచుండును.

3. దానధర్మములను జేయుచుండుడు. దీనివలన ధనముపై మోహము తగ్గును.

౪. ఇతరులకు సేవ జేయుచుండుము. దీనివలన అహంకారము నశించుచుండును.

౫. నీకంటె తక్కువ వారికిని, నిన్ను బాధించు శత్రువులకును మేలు చేయుచుండుము. నమస్కరించుచుండుము. దీనివలన అందఱిలోను సమానముగా నున్న దేవుని చూచెడి దృష్టి వృద్ధియగుచుండును.

౬. దేవుని (గురుని) మంత్రము జపించు చుండుము. దీని వలన మనస్సు శుద్ధమై శాంతినొందుచుండును.

౭. ఈ శరీరము నశించి పోవును గదా! యని గుర్తులో నుంచుకొనుము. దీనివలన సుఖదుఃఖములకు, స్తుతినిందలకు, లాభ నష్టములకును చలించని స్థితి కలుగుచుండును.

౮. మనోవృత్తులను తెలిసికొనుచు, సాక్షిగా నిర్వికారముగా నున్న ఆత్మను ధ్యానించుచుండుము. దీనివలన దేహమే నేను అను బుద్ధి నశించుచుండును.

ధ్యాన మెవరికి కుదురును? :

౧. శరీరముతోను, వాక్కుతోను, మనస్సుతోను ఏ ప్రాణి కిని అపకారము, అన్యాయము, మోసము చేయనివారికి భగవద్ధ్యానము కుదురును.

౨. ధనముపై, తిండిపై, భోగములపై, అలంకారములపై, కీర్తిప్రతిష్ఠలపై ప్రీతి లేని వారికి ధ్యానము కుదురును.

౩. మానవులపై, వస్తువులపై, దేహముపై మమకారము లేనివారికి ధ్యానము కుదురును.

౪. కామ, క్రోధ, లోభ, ద్వేష, భయాదులు లేనివారికి ధ్యానము కుదురును.

౫. పెత్తనముపై, అధిక సంపాదనపై ప్రీతినుంచక, లభించిన దానితో తృప్తిపడు వారికి ధ్యానము కుదురును.

౬. స్తుతినిందలకు చలింపక, పరోపకారబుద్ధితో వర్తించు వారికి ధ్యానము కుదురును.

౭. గురువే (దేవుడే) నాకు దిక్కు. గురువు చెప్పిన ధర్మములను ఆచరించుట, గురు (దైవ) ధ్యానము నాకు ఆహారము లను నిశ్చయముతో నున్నవారికి ధ్యానము కుదురును.

౮. భూత, భవిష్యద్వర్తమాన విషయములను మరచిన వారికే పరమాత్మ ధ్యానము కుదురును.

౯. అందరూ నా వారేయని తలంచువారికిని, నా కెవ్వరును లేరని నిశ్చయించుకొనిన వారికిని ఆత్మధ్యానము కుదురును.

## ౨౬౨ శ్రీ కుసుమాంబగారు

౧. స్త్రీలను దూరమునుంచి చూస్తే మహిమాన్వితము, ఆనందమూను, సమీపిస్తె సర్వనాశనము.

౨. సుఖముకలిగించే వస్తువు తమవద్ద నున్నప్పుడు దానిని వదలివేయడమే నిజమైన త్యాగము.

3. ఏ పనులు చేసిన మానవుడు సిగ్గుపడవలసి వచ్చునో ఆ పనులను ఎప్పుడూ చేయకూడదు.

౪. తన ప్రాణముకంటె ఎక్కువగా మనలను కాపాడిన తల్లిని ప్రేమతో పూజింపవలయును.

౫. కరుణామయుడగు శ్రీకృష్ణ పరమాత్మను మఱువక స్మరింపవలయును.

## ౨౬౩ కామకోటి పీఠాధిపతి జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి

౧. మన పుట్టుకకు కారణం కామము. చావునకు కారణం కాలుడు. కామకారణంగా కలిగిన వస్తువు కాలగ్రస్తమై నశించి పోతుంది. కామవీక్షణంతో మోడుకూడా చిగురిస్తుంది. కాలదర్శనంతో ఎండిపోయి జీర్ణిస్తుంది. కామం లేకపోతే పుట్టుక లేదు. కాలం లేకపోతే చావులేదు. ఈ రెంటినీ జయించాలంటే పరమేశ్వరుని శరణు పొందాలి.

౨. ఈశ్వరానుగ్రహం కలుగవలెనంటే మనము చేసే ప్రతి పనిని ఈశ్వరార్పణం చేయాలి. అతని ఆజ్ఞ శిరసావహింపక ఊరకే స్తోత్రం చేసినంత మాత్రాన అతడు సంతోషించి అనుగ్రహించడు. ఆయనకు కావలసిందేదీ లేదు. దానివల్ల ఆయనకు గౌరవమూ లేదు, అగౌరవమూ లేదు. అట్లాగే మనకర్మలవల్ల గూడా ఆయనకు కావలసినదేదీ లేదు. విహితమైన కర్మాచరణం మన చిత్తశుద్ధికోసమే.

3. ఏడుస్తూ దేహం వదలితే మళ్ళీ ఏడ్చే దేహమే వస్తుంది. అందుచేత దేహం వదలేటప్పుడు ఆనందంగా ఉండాలి. ఏలాటి దుఃఖసమయంలోనయినా మనశ్చలనం లేక ధర్మాన్నే ఆనందంగా అనుసరించే వ్యక్తి ఒకడున్నాడంటే అట్టివ్యక్తి రాముడే. "నాయనా! రాఘవా! ఏ ధర్మాన్ని నీవు ధైర్యంతో, నియమంతో వదలక అనుష్ఠిస్తున్నావో ఆ ధర్మమే నిన్ను కాపాడుతుంది." అని తల్లి ఆశీర్వదిస్తున్నది.

౮. 'ధర్మము తలను కాపాడుతుంది' అని ఒక సామెత ఉంది. అడవిలో రాఘవుని తల కాచింది ధర్మమే. రావణునికి పది తలలున్నప్పటికీ తాను చేసిన అధర్మం ఒక తలనయినా కాచలేకపోయింది.

౯. వ్యాపకమయిన దైవ వస్తువుకంటె పెద్ద వస్తువుగాని, చిన్నవస్తువుగాని మరొకటి లేదు. అంతా దైవముచే నిండి ఉంది. తనకు వేరయిన వస్తువొకటి ఉన్నదనే తలపు కలిగితే చాలు, భయం, కోపం, ఆశ ఇటువంటివేవో పుట్టుకొస్తవి. ఆ వేరు వస్తువు వల్ల కష్టం కలుగుతుందేమో అనే భీతిచేత కోపం, ద్వేషం ఇట్టివి కలుగుతవి. ఆ వస్తువు మీద అభిలాష కలిగితే ఆశ ఏర్పడుతుంది. "అంతా ఒకటే, రెండు అనేది లేనేలేదు" అని నిశ్చయం కలిగితే రాగంలేదు, ద్వేషంలేదు, ఏమీలేదు. ఒకటి అనేది సత్యం, రెండు అనేది మాయ.

ప్రపంచమును సత్యమని చూచేవానికి, ప్రపంచాని కాధారము భర్త ఈశ్వరుడు. ఈ దృశ్యప్రపంచమును జ్ఞానముచే చూచే వానికి ఈశ్వరుడే సర్వమూ వ్యాపించినట్లు తోస్తుంది.

౧౦. కామమనేది వెలుపలి ఆశ. వెలుపలి కామము కావాలని అనుకొనే వాడెన్నటికిని శాంతిపొందడు. ఏదో పెద్ద పదవో ఒక స్త్రీయో, ఒక సంపదో, ఒక గౌరవమో, ఒక స్తోత్రమో, ఇట్టివి సంప్రాప్తమైతేనే మన కానందం, సంతోషం, లేకపోతే దుఃఖం, లేక కొరత అని తలపోయడం శుద్ధ తెలివితక్కువ పని. వెలుపలి వస్తువులవల్ల కలిగే ఆనందం, లోనఉబికే ఆనందంయొక్క బిందువే. చూడబడే వస్తువులన్నీ లోపలఉన్న ఆనందపు శాఖలే కదా! అది కావాలి, ఇది కావాలి అని సబ్బండు కోరికలతో మనము వస్తువులను తరుముకొంటూ పోతే ఏమిఫలం? అన్నీ లోపలనే ఉన్నవి. అని తలిస్తే, అతడు శాంతిని పొందుతాడు.

౧౧. ధర్మశాస్త్రిలు విధించిన పనులు చెయ్యి. చిత్తశుద్ధి ఏర్పడ్డ తరువాత పరమాత్మ లాభం కలుగుతుంది. దీనియెడ విరోధమేమీ లేదు. అని ఆదిశంకరు లంటారు.

౮. ఎవని కేర్పడిన కర్మ వాడు ప్రప్రథమున చేయాలి. భయమో, కామమో, దుఃఖమో ఏదో మనోమాలిన్యం ఉన్నదంటే చిత్తశుద్ధి ఏర్పడలేదన్నమాట. దుఃఖం, భ్రాంతి, మాలిన్యం, భయం ఈ మొదలయినవి పోతేనే భగవంతునితో సంలాపం చేసేస్థితి కలుగుతుంది. చిత్తశుద్ధి ఏర్పడవలెనంటే కర్మ చేసే తీరాలి. కామాదులను పోగొట్టుకోడానికే కర్మ చేయాలి. కర్మలుచేసి చిత్తశుద్ధిపొంది ఇంద్రియాలను గెలిచి, ఆసక్తితో ఆశ వదలితే సాక్షాత్ భగవంతునిలో చేరుట కష్టతేని త్రోవ. ఈ జగమంతా రామమయంగా చూచేవానికి అట్టి జ్ఞానస్థితిని పొందిన వానికి ఎట్టి పనిన్నీ లేదు. "తస్య కార్యం నవిద్యతే."

౯. మనుజులై పుట్టినందుకు సత్యం తెలిసికోవడమే ఫలం. సత్యం తెలిసికొనక చస్తే మేనుతాల్చి పుట్టినందుకు ఫలం పొందలేదన్న మాట.

౧౦. కొంచెం పరిశీలిస్తే సత్యం ఈశ్వరుడే అని తేలుతుంది. సత్యవస్తువుయొక్క ఎరుక సరిగా నాటుకొంటే "నేను, మేము" అనే మాటలు వాడుకలోనుంచి ఎగిరి పోతవి.

౧౧. ఆయువున్న కాలంలో మన మీ దేహాన్ని ఆధారంగా చేసికొని పరమాత్మ స్వరూపంలో ఐక్యం కావడానికి ప్రయత్నం చేయాలి. అపుడే మనుష్యత్వానికి ఫలం.

౧౨. జన్మసాఫల్యం పొందడానికి తప్పకుండా అష్టాంగ యోగము అనుష్ఠించవలెను. ఈ యోగానికి యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి అనేవి అష్టాంగములు. వీనిలో అహింస, సత్యం, ఆస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం అనేవి యమములో అంతర్భాగాలు. అపరిగ్రహం అంటే గ్రహించకుండుట. దేహధారణకు కావలసిన దానికంటె ఎక్కువ గ్రహిస్తే అది దొంగతనం, మనకు కావలసిన దాని

కంటె ఎక్కువ గ్రహించ కుండటమే అపరిగ్రహం. ఇట్టినియమం ఉంటేనే సత్యవస్తువును చూడడానికి వీలుకలుగుతుంది. భగవంతుని అనుగ్రహం దొరుకుతుంది. సత్యాన్వేషణకు, బ్రహ్మసాక్షాత్కారానికి అబద్ధాలాడ రాదు. దొంగతనం చేయరాదు. అహంభావం పూనరాదు. ఈ మొదలయిన పెక్కు విషయాలను సాధనాలనుగా, సహాయాలనుగా గ్రహించాలని మన శాస్త్రాలు చెప్పుచున్నవి.

౧౩. మంచిగుణాలు, దైవభక్తి మొదలయిన వానిని పెంపు చేయడానికి కావలసిన దోహదాలను ప్రభుత్వం చేయవచ్చు. అపుడు ప్రజల నీతి చెడిపోయినది, ఈ కలహాలను పోలీసు బందోబస్తు ద్వారానే అణచాలి, అనేమాట ఉండదు. దానికోసం ద్రవ్యం వ్యయపరచడం ఉండదు. అన్నీవదలి తోకపట్టు కున్నటులు "స్వాతంత్ర్యం" అనే పదానికి అర్థమేమిటో తెలియకముందే మనం స్వాతంత్ర్యం పట్టుకొన్నాం. ప్రజాప్రభుత్వం మతసంబంధ విషయాలలో ఉత్సుకతచూపక, దైవభక్తికీ రాజ్యాంగానికీ సంబంధమేమిటి? అని తలిస్తే శ్రమలూ, వ్యయములూ ఎక్కువ అవుతూనే ఉంటవి.

౧౪. ప్రతివాడు ఆత్మానుభవం కలిగి జన్మరాకుండా చేసికోవడానికే, అట్టి ఆత్మసాక్షాత్కారానికే మొదటిమెట్టు 'యమం' యమంలో ఒకటియే అపరిగ్రహం. మనుష్యులు తమ అక్కరకు మించి ఒక పూచిక పుల్లయినా వాడరాదు. అదే అపరిగ్రహం. అపరిగ్రహం ఆత్మ సాక్షాత్కారానికి సాధనం. కడుపునకు కూడు, త్రాగడానికి నీరు, ఉనికికి ఒక పూరిపాక, కట్టకోడానికి ఒక గుడ్డ, ఇవి ముఖ్యావసరాలు. ప్రాణాలు కాపాడుకోడానికి ఈ నాలుగున్నూ పరికరాలు. ఇవి అన్నీ భూమినుండి ఉత్పన్నమవుతవి. కడపట మనము కలిసేదికూడా ఆ భూమిలోనే.

౧౫. సృష్టిలో మనకు దొరికే ఈ వస్తువులను పొదుపుగా వాడుకోవాలి. మానరక్షణకోసం మనం బట్టలు కట్టుకుంటాం.

పత్తితో నేయబడిన బట్టలతో, మనకు ఆ ప్రయోజనం తీరుతుంది. ఆడంబరంగా ఉండాలని వెలగల దుస్తులను కట్టుకొనకపోతే యేమి? అట్లా కట్టుకుంటేనే కాని ఇతరులు గౌరవంతో చూడరని దురభిప్రాయం కాక, ఇందుకు వేరే కారణం ఉందా? ఒక కుటుంబం, వెలగల బట్టలకై చేసే ఖర్చుతో దాదాపు అయిదు కుటుంబాలకు కావలసిన సాధారణమైన బట్టలు దొరుకుతవి. ఆడంబరంకోసం కట్టే బట్టలు పట్టుబట్టలే అయివుంటే, అవి మనకు పాపాన్ని ప్రోగుచేసి పెడతవి. పట్టుబట్టకు ఒకటింటికి లక్షలాది జీవాలను చంపాలి. మనము కట్టుకొనేబట్టలు సాధ్యమయినంతవరకు హింసచేయకుండా ఉండే ఉపాయాలవల్ల ఉత్పత్తి అయేవిగా చూచుకోవాలి. మనమూ కట్టేబట్టలు సాధారణు లందరూ కట్టుకొనే టటువంటివిగానూ ఉండాలి.

౧౬. ప్రజలందరూ సుఖంగా బ్రతకటానికి ప్రభుత్వం ఎన్నో కట్టుదిట్టాలు చేస్తుంది. కాని లేమికిమాత్రం దినదినాభివృద్ధి ప్రజల ఆర్థికజీవనం ఎంతో పెరిగిందని మురసిపోతారు. దానికి గుర్తు ఏమిటయ్యా అంటే, ఇదివరకు రెండుసార్లు కాఫీ త్రాగేవారు ఇప్పుడు నాలుగుసారులు కాఫీతాగడం, గుడిసెలలో ఉండేవారు మేడలలో ఉండడం, రెండుబట్టలతో కాలం గడిపేవారు ఇరవై బట్టలు సేకరించి ఉంచుకోవడం. ఆర్థిక జీవనాభివృద్ధికి ఇవి గుర్తులని అనుకోవడం సరికాదు. మనకు కావలసిన వస్తువుల నన్నిటినీ ఇలా పెంచుకుంటూనే పోతే, దేశంలో ఎప్పుడూ దారిద్ర్యమే తాండవిస్తూ వుంటుంది. మానప్రాణాలు కాపాడుకోవడానికేవి తప్పనిసరో అట్టివి అందరకూ అందుబాటులో ఉండాలి. అందుకే దిట్టమైన చట్టాలుండాలి. అలాటి స్థితికలగాలి. అది సవ్యమయినది అని అనుకుంటే పరమదరిద్రులు తమజీవితం ఎలా గడుపుకొంటారో అలాగే వసతి వాడలున్న శ్రీమంతులు కూడా గడుపుకొనడానికి ప్రయత్నించాలి. దరిద్రులు గుడిసెలలోఉంటే శ్రీమంతులు కూడా

గుడిసెలలో ఉండాలి. పొద్దున్నే అతడు గంజితాగితే, ఇతడున్నూ వెసులుబాటు ఉన్నదని కోరికలు పెంచుకోక గంజి తాగాలి. దానినే అపరిగ్రహమని అంటారు. అపరిగ్రహ దోషం ఉండే అంతవరకూ ఈశ్వరానుగ్రహం కలుగదు. జన్మసాఫల్యం కోరే వారు తమతమ అవసరాలుమించి ఒకింతయినా పరిగ్రహం చేయ రాదు. కలిగినవారు లేనివారికి సాయంచేయడమే పుణ్యం. అదే వారికి మోక్షప్రదం. ఈ సంగతి తెలియక ఇంత ఉన్నవారు తమకు వచ్చిన పట్టుబట్టలు, వెలగలబట్టలు కట్టుకొని తిరిగితే వీరినిచూచి లేనివారు గూడ వారివలె తిరగడానికి ప్రయత్నిస్తారు. అట్లా వారిని అనుకరించి అప్పుల పాలవుతారు. పట్టుపుట్టాలవారు చెడిన తరగతి లోనివారే. ఇక వజ్రాలనగల వారున్నారు. ఇందులకై చేసే వ్యయమంతా పచ్చిదుబారా.

ఇకమీద కాఫీ తాగను, వెలగలబట్టలు కట్టను. విలాసము లకై ఖర్చుచేయను' అని సంకల్పంచేస్తే దానివల్ల మిగిలేధనంతో అయిదు కుటుంబాలు సుఖంగా బ్రతుకుతవి. జీవిత సముపాయానికి మనం ఎక్కువ వస్తువులను సేకరించినకొద్దీ శాంతి ఉండదు. సౌఖ్యమూ ఉండదు. ఇట్టి దుబారావల్ల మళ్ళీ దారిద్ర్యంతప్పదు. దుఃఖంతప్పదు. దుబారావ్యయాన్ని వదలిపెడితే అన్నికుటుంబాలూ బాగుపడుతాయి. అష్టాంగయోగములో మొదటిదే అపరిగ్రహం, అహింసఅనేవి. ఏ ప్రాణికిన్నీ మనవల్ల హింస కలుగరాదు. డబ్బు ఉంది కదా అని అనవసరమైన వస్తువులకు దుబారాఖర్చు చేయ రాదు. అలాచేస్తేనే, చేయడానికి ఉంకిస్తేనే తొందరగా బ్రహ్మ సాక్షాత్కారానికి దాపుతోవ దొరుకుతుంది.

౧౭. మోక్షమనేది చచ్చిపోయిన తరువాత ఏదో లోకానికి పోయి అనుభవించడం కాదు. అది ఈ లోకంలోనే చేతికందిన పండువలె కరతలామలకం కావాలి. ఇప్పుడు మోక్షమబ్బితేనే చచ్చిన తరువాత మోక్షమబ్బడం. ప్రస్తుతం దుఃఖంతో కష్టంతో

జీవితం గడపి చచ్చిన తరువాత మోక్షం వస్తుందని ఎదురుచూస్తే ప్రయోజనం లేదు.

౧౮. మరణానికి ముఖ్యకారణాలు నాలుగు. అవి భయమూ, కోపము, కామము, దుఃఖము. కామక్రోధాదులకు అరిషడ్వర్గమని పేరు. వీనిని జయించడమే మోక్షం. అది చనిపోయిన తరువాత దొరికే వస్తువుకాదు.

౧౯. బాల్యం మొదలుకొని కామక్రోధాదులను అణచినవాడు చిరంజీవి అవుతాడు. ఈ లోకంలోనే మనకు అట్టిస్థితి కలిగిందా లేదా అని పరిశోధన చేసికొంటూ ఉండాలి. ఈ లోకమే ఆ పరీక్షకు ఒరిపిడిరాయి. మనకు శిశుస్వభావం ఏర్పడిపోవాలి. భయముగాని, దుఃఖముగాని మనసులో అతుక్కొని పోకుండా చేసికోవాలి. ఈ పక్వస్థితి మరింత బాగాపండితే మనమున్నూ సాక్షాత్ దక్షిణామూర్తివలె ఉండిపోతాం.

౨౦. దుఃఖంవేరు, బాధవేరు. దేహంలో బాధఉండవచ్చు. ఎంత బాధవున్నా కొందరు చాలా ధైర్యంతో సహిస్తారు. మరికొందరు అయ్యో అమ్మో అని దొరలి దొరలి ఏడుస్తారు. బాధ లేకుండా జీవించడం మనకు చేతగానిపని. కాని ఎంత బాధఉన్నా దుఃఖంఉన్నా బహిర్గతం కాకుండా ఓర్చుకోవడం మనకు చేతనయినదే. అందుచేతనే ఏడుస్తూ ప్రాణాలు వదలడం మరణమనిన్నీ, శోకం ఏమాత్రమూ లేకుండా ప్రాణాలువదలడం మోక్షమనిన్నీ చెప్పడం. ఆ స్థితికే అమృతం అని పేరు. ఆ స్థితిని ఇచ్చుటనే మనం పొందాలి. మనము శిశువుల సారళ్యం, ఋజుత్వం అలవాటు చేసుకోవడమే దానికి ఉపాయం. శిశువే దైవం కావాలి. వయస్సు వచ్చినా మనం బాలురలాగా ఉండాలి. "నీవు శిశువవు అయితే భగవంతుడ వవుతావు" అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. ఎట్టి కష్టాలువచ్చినా ఓరిమితో ఆనందంగా ఉండడమే అమృతత్వమనిన్నీ మోక్షమనిన్నీ చెప్పుతారు. శరీరం వదలుటకు ముందే

ఈ లోకమునందే ఈ శరీరం ఉన్నప్పుడు కామ, క్రోధ ప్రకోపం ఓర్చుకోవాలి. శిశువులవలె సహజస్థితికి వచ్చేరీతి అలవాటు కావాలి. చనిపోయిన తరువాత వైకుంఠంలోనో, కైలాసంలోనో ఆ స్థితి మనకు దొరుకుతుందని అనుకోవడం పొరపాటు.

౨౧. ద్రవరూపములో ఉన్నప్పుడు నేతికి రంగు లేదు. కాని చలికాలములో నేయి పేరినప్పుడు లేదా గాలి తగిలినప్పుడు గడ్డకట్టి తెల్లనిరంగు ఏర్పడుతుంది. అట్లే భక్తకోటి హృదయసీమలో ప్రేమ శైత్యం అధికమైతే, అఖండాకార నిరాకార పరమాత్మ ఘనీభూతమై ఒక రూపునెత్తి ఆవిర్భవిస్తూ ఉన్నది.

౨౨. మనకు మిగుల ప్రియులగు బిడ్డలనో, బంధువులనో తలచినతోడనే వారి స్వరూపము మనస్సున పొడకట్టును. కాని వీరిని తలచి ఏమి ప్రయోజనము? ఎన్నడో ఒకరోజు వీరందరు మనలను వదలి చనెడివారే. లేదా మనమైనా వారిని వదలిపోవలసిన వారమే. వియోగములో ఏమిభేదమున్నది? ఒకరి నొకరు ఎంత ప్రేమించి, అభిమానముంచినను, ఆనందముగానున్నను అంత కంతకు ఎవరో ఒకరు ఏడువవలసినదే. వియోగము కలిగియేతీరును. వియోగము లేనిస్థితి, స్వామియందలి స్థితి, అందు దుఃఖమునకు తావేలేదు. ఆ ఆనందమూర్తి మనోనేత్రములకు గోచరించినచో మనకు మంత్రసిద్ధి యయినదని అర్థము.

౨౩. మన మేమార్గమున వెళ్ళినను మనరాకకై ఆయన నిరీక్షించుచునే యుండును. నీ రుచికితగిన మార్గములో వెళ్లు! మధ్యలో ఆగకు! నీ వెపుడు వచ్చిచేరుదువు? అని నిరీక్షించెడి వాడొకడున్నాడు, ఆ కృపాసముద్రము నాలుగుదెసలనూ వలయితమయియున్నది. శ్రద్ధలో లోపించక, ఆరంభించిన కార్యమును మధ్యలో వదలక ప్రయత్నించుచునే యుండుము. ఇన్ని మార్గము లున్నవే యనిన, యాత్రికులు పెక్కుమంది. వారి రుచులు అనేక విధములు.

౨౪. ఈశ్వరుడు తక్క తక్కినదెల్లయు మృతమే. మరణము మరుజన్మకు బీజకారణము. మరుజన్మలేక మరగిపోవుటకు అమృతమని పేరు. అమృతముగ నుండునదొక్కదైవమే. మృతులమగు మనకు అమృతస్థితి నీయగలశక్తి ఆయనకు కలదు.

౨౫. మనము తలచినది తలచినట్టు చేయజాలకుండ జేయునది సంసారబంధము. బంధింపబడినవానికి స్వేచ్ఛకొరత. మన మందరము బద్ధులమే. ఎదుటివారు ఎదురుచూచెడి తెరగున మనము నడచుకొనలేకున్నాము. అది అటుంచి మనము మన మనసు చెప్పినటులయినను నడుచుకొన లేకున్నాము. ఎవరో మనలను గట్టి త్రాళ్ళచే కట్టినట్లు తోచును. మనబంధములు మన కెపుడు తొలగును? ఎంతదుఃఖము, ఎంతవిచారము కల్గినను కామక్రోధముల వశము కాకుండ, నిరంతరానంద స్థితిలోనుండెడి పక్వస్థితి ఎపుడు కల్గునో, అప్పుడే మన బంధములు వీడిపోవును. ఇట్లు విడువటమే మోక్షము. అందుచే మనము మోక్షమును వెదకికొనుచు పోకుందుముగాక! మోక్షము మనమున్నచోటనే కలదు. సంసారము మనలను వదలిపోవలెను. దానివలన దుఃఖము, చింత మనల నంటకూడదు. అదియే నిజమైన విడుదల. దీనికి ఈశ్వరప్రార్థనయే ముఖ్యము.

౨౬. పశువులవలె, మృగములవలె మనము మరణించిన యెడల నీ మతమున నున్నందులకేమి ప్రయోజనము? దుఃఖముతో నసువుల బాసిన దుఃఖభాజనమగు పునర్జన్మ సిద్ధముగా నుండును. అందుచే అవసానకాలమున ప్రయాణసమయమున ఆ ముక్కంటి స్వరూపమును హృదయస్థముచేసి ఆనందముగా కళేబరమును వదల వలెను. దీనికై ఈశ్వరకటాక్షముండవలెను. ఆ కటాక్షమునకై ఈశ్వరుని నిరంతరము స్మరించవలెను.

౨౭. అరణ్యములో ఎన్నియో పశు, పక్ష్యాదులు వృద్ధి చెందుతూ, ఆడుకుంటూ, జీవిస్తూనే ఉన్నాయి. మనము రేపు

ఏమిచేయాలి ? మరునిముసములో మనము చేయవలసిన పని యేమిటి ? అని అవి మనఃక్లేశము పొందడంలేదు. మనుష్యునకు బుద్ధిఉంది. అందువల్లనే మరుసటిరోజును గూర్చి అతనికి చింత, నిన్నటినిగూర్చిగాని, రేపటినిగూర్చిగాని చింత ఎందుకు ? రేపటిని గూర్చి ఏడువవలసిన అవసరం కనిపించదు. అన్నీ ఈశ్వర సంకల్పాన్ని అనుసరించి జరుగుతాయి. జరిగేది జరుగనీ, ప్రస్తుత మేదో అదే కర్తవ్యము. దానిని గమనించి చేస్తేచాలు.

౨౮. అందరి సుఖమే మనసుఖము. అందరిక్షేమమే మన క్షేమము. 'లోకాస్సమస్తా సుఖినోభవన్తు'. అనే ప్రార్థనయే మనము అనవరతము చేయవలసినది. ఈ మనోభావము సార్వజని కము కావాలి. అప్పుడందరి ఆపదలు తొలగుతాయి.

౨౯. అడవిలో నొక పులిని చూచిన తోడనే మనిషి భయ కంపితుడగును. సౌందర్యముచే నుద్దీపించు నొక మగువనుచూచి పురుషుడు కామ వివశుడగును. ఏ స్థితియందు మగువ సౌందర్యము కామమునుగాని, వ్యాఘ్రదర్శనము భీతినిగాని కల్గింపదో అదియే శాంతము. ఆ స్థితియందు వస్తుదర్శనముగాని, వస్తుస్మృతిగాని ఎట్టి మనోవికారమును గల్గించదు. ఆ స్థితి మనసుయొక్క అసంగత్వ మును స్వచ్ఛతను తెలుపును. సత్త్వరజస్తమోగుణముల ననుసరించి మనోవృత్తుల మార్పులను గ్రహింపదగును.

౩౦. కర్మలు ఫలవంతములగుటకు మూడు అంగములు అవ సరము. అవి ఈశ్వరానుగ్రహము, పురుషప్రయత్నము, అదృష్టము. ఈ మూడు లేనిచో మన ఈప్సితములు సిద్ధించవు.

౩౧. సంస్కృతిగల మానవుడు సమస్త జనానీకమునకు మిత్రుడు. అతనికి విరోధులెవ్వరును లేరు. అతని హృదయ వైశా ల్యము, ఎల్లరిని తన అనురాగపు హద్దులలోనికి తీసుకొని వచ్చు ఇచ్ఛకల్గినదై యుండును. మనకు ఉన్నదంతయు ఊరివారికి యిచ్చి

వేసిన మనగతి ఏమిటి? అన్న ప్రశ్న అతని భావనాకాశమున ఏనాడునూ పొడసూపదు. అదియే అతని సంస్కృతి.

3౨. ఆదిశంకరులు మానవజాతికే యొక చిరతరమైన సేవ చేయదలచి ప్రపంచములో కష్టాన్ని, దుఃఖాన్ని ప్రతిఘటించుటకు సత్యజ్ఞానముకంటె తాను ఈయగల బహూకృతి వేరులేదని నిశ్చయించిరి. అందుచే ప్రాపంచిక బాధానివారకములైన ఉపదేశములనే వారు చేసిరి. బాధ, దుఃఖము సర్వత్ర ఉండునది. వ్యక్తి, సమాజము, దేశము, ఏదియూ సంతోషముగా నుండుటలేదు. ఒక దుఃఖముపోయిన, వేరొక దుఃఖము వచ్చుచున్నది. మనోదేహములకు రెండిటికిన్నీ వ్యథలే. వ్యాధియొక్క మూలకారణమును వెదకి నిర్మూలించవలెను. మన దుఃఖమునకు కారణమేమి? ఎందుకీబాధ? దేహముండుటచేతనే బాధలు. ఈ దేహముతో మనస్సు కలసియున్నది. కనుక దేహము పోయినగాని దుఃఖముపోదు. ఐతే ఆత్మహత్య చేసికొనడమా? అది ఉన్నబాధ కాక లేనిబాధ తెచ్చిపెట్టును. ఈ దేహము సంచితకర్మ కారణమున కల్గినది. ఆత్మహత్య దుష్కర్మ. అది మరొక జన్మకు కారణమగును. ఈ జన్మలో చేయు కర్మలే కలుగబోవు జన్మముయొక్క దేహధారణకు కారణములవుతవి. దుఃఖనాశనమునకు దేహనాశనము అవసరము. దేహనాశనమునకు కర్మనాశనము అవసరము. కర్మ నశించుటకు కర్మకారణములను నాశము చేయవలెను. కర్మకారకులు కామక్రోధాదులు. మనది కానిదానిపై కోరిక కల్గును. అది లభించిన పిదప దాని నితరులు లాగుకొన్నప్పుడు క్రోధము కల్గుచున్నది. అందుచే కర్మక్షయమునకు కామ క్రోధములు పోవలెను.

కామక్రోధములు బాహ్యవస్తు సంబంధమైనవి. ద్వేషముకాని, కోరికగాని మనవికాని ఇతరములగు వస్తువులపైన కామక్రోధములు పోవుటకు ద్వైతబుద్ధి పోవలెను. "ఉన్నదంతయు ఒక్కటే" అదియే ఉపనిషత్తులుచాటు సత్యము. మనమందరమూ

ఒక్కటే అన్న సత్యమును గ్రహించినపుడే ద్వైతబుద్ధి పోవును. బహిః ప్రపంచమున చూడబడు విస్తారవస్తుజాలము, నామరూపాదులు, సమస్తము ఆ పరమాత్మయొక్క ఆకృతులే. ఆ పరమవస్తువు వివిధాకృతులతో కనిపించుచున్నదను విషయమును గుర్తుంచుకొనవలెను. కార్యములు అనంతముగానున్నను కారణమొక్కటే. కారణము సత్యము. కార్యములు దాని ఆకృతులు. ఆ కారణమే సత్యము. అదియేచిత్తు.

ఈ పరమ సత్యమును గ్రహించిన ద్వైతవైవిధ్యమంతయూ ఆ ఏకరూపుని ఆకృతులే అని గోచరించును. అపుడు మనకు ద్వైతబుద్ధియుండదు. మనముకాక మరొకరు అపుడు మనకు కానరారు. కోరిక, ద్వేషము ఏదియును అప్పుడులేదు. ఆశా ద్వేషములెపుడు లేవో కర్మకారణమున్నూ నశించుచున్నది. కర్మలేనపుడు కర్మఫలమున్నూలేదు. కర్మఫలము లేనిచో దేహము, దేహసంబంధములైన దుఃఖములు ఏమియు ఉండవు. శంకరులు ప్రపంచమునకు చేసిన దుఃఖనివారకమగు మహోపదేశము ఇదియే.

౩౩. మన మనోమాలిన్యములను పోగొట్టుకొనుటకు, నిస్సంగత్వము అలవరచుకొనుటకు, దేవుని ప్రార్థించవలెను. "సాంగత్యదోషము పోవలెనన్న నిస్సంగితో సంగిత్వమును పెంచుకొమ్ము." అని తిరువళ్ళువరు బోధించును. దేవుడొక నిస్సంగి. ఆయనతోడి సాంగత్య మభివృద్ధి అగుకొలది మన సాంగత్యదోషము లన్నియు, ఒక్కటొక్కటిగా జారిపోవును. దైవప్రార్థన క్రమమార్గమున చేసిన ఆయన తన సాంగత్యమును మనకు చేకూర్చి, ప్రాపంచిక విషయములలో నిస్సంగత్వమును అలవాటు చేయును. విషయ బద్ధమగు మనస్సును మరల్చి, చిత్తస్వాస్థ్యము లభించునట్లు చేయును.

౩౪. నిరుద్యోగమగు మనసు వృథా భాషణములను చేయ నిచ్ఛగించును. అంతటితో నితరులనుగూర్చి దూషణ ప్రారంభమగును. కామాదులు తలయెత్తును. సత్కార్యాచరణము చేయు

చున్నచో చెడుతలపులు పుట్టవు. దుస్సాంగత్యమను వ్యాధికి సత్సాంగత్యమే చికిత్స.

35. వర్తన చక్కబడుటకు నిరంతర సత్కార్యాచరణ మవసరము. అపుడు చెట్టయును చెట్టు వ్రేళ్ళతోసహా ఎండిపోయి సమూలముగా నశించును. దురాలోచనలకు ఎడమీయ గూడదు. వట్టి ధ్యానజపాదులతో ప్రయోజనములేదు. అదియును ఒక వాడుకగా అయిపోయి మనస్సును సంస్కరించక కలుషమునకు లొంగునట్లు చేయును. మహాత్ముల చరిత్రలు స్వయముగా వ్రాయుటయందు గాని లేక చూచి వ్రాయుట యందుగాని కాలము గడుపుట మంచిది. అపుడు మనలను కళంకితులుగా చేయుటకు కలుషమునకు వీలుండదు.

36. సత్కార్యములు చేయుట అనునది ఆధ్యాత్మిక జీవనమున కొక అంగము. దీనితోపాటు పరమేశ్వరునికి మనము పరిపూర్ణముగా ఆత్మార్పణము చేయువలెను.

37. "ఎన్నడైన నీకు శరీరమున జబ్బుచేసిన, ఆ వ్యాధిని ద్వేషింపక, ధృతితో ఓర్చుకొమ్ము. ఈ వ్యాధి సైతము, దైవనియుక్తమగు తపస్సుగా లెక్కించుము. వైద్యులు జబ్బుసేసినపుడు పథ్యమును విధింతురు. అది యొక విధమైన తపస్సే." వేళయు వ్యవస్థయు లేక కనబడిన దంతయు తినెడి అలవాటు కల్గినవారికి ఇదియొక తాత్కాలిక నియమము.

38. పారమార్థిక జీవనమునకు అనన్యభక్తి, నిరంతర సత్కార్యాచరణము, ఆత్మార్పణము అనునవి అత్యవసరములగు అంగములు. సర్వకర్తలను ఈశ్వరార్పితముచేసి మనము జీవితములను గడపవలెను.

39. అర్జునా! లే! లెమ్ము. నీవు యుద్ధమునుండి వారు చచ్చెదరని, వీరు చచ్చెదరని దుఃఖమునకు భయపడి విరమించుకొనిన, అదితప్పు. నీకు అహంకారము, మమకారము ఇంకను

వదలలేదని అర్థము. నీవు క్షత్రియుడవు. యుద్ధముచేయుట నీ విధి. ఇప్పటికి మనస్థితిలో నీకు కర్తసన్యాసమునకు అధికారములేదు. నిస్సంగికి కర్మ అవసరములేదు. కాని నీకు కాదు. నీ పెద్దలయందును, బంధువు లందును, గురువుల యందును సంగముంచి వారెక్కడ నశింతురోయని దుఃఖించు చున్నావు. అందుచే నీవు కార్యవిముఖుడవు కారాదు. అకర్తృత్వసిద్ధి నీకు ఇంకను లభించలేదు. అట్టి సిద్ధిని నీవు పొందవలెనననిన, నీ స్వధర్మము నీకు ఏ కర్మను విధించి యున్నదో, దానిని నీవు చేయక తప్పదు. అని భగవానుడు అర్జునుని మందలించును.

౪౦. మన లోపములు మనము సంస్కరించుకొనని పక్షమున లోకక్షేమముకొరకు యత్నించుటకు మనకు అధికారములేదు. దుఃఖమునకును క్రోధమునకును లొంగినవాడు ఇతరుల దుఃఖ క్రోధముల నెట్లు తొలగించగలడు ? భ్రాంతియుక్తుడైన మానవుడు ప్రపంచములోని యితరుల భ్రాంతినెట్లు పోగొట్టగలడు ? మానసిక దౌర్బల్యమును అణచి దుఃఖాతీతుడై ఆత్మోపలబ్ధి నందుకొనిన వాని ఉనికి ప్రపంచ సౌఖ్యమునకు కారణమగును. అతడు ప్రపంచ సంస్కరణ కొరకు పాటుపడ నవసరములేదు. లోకక్షేమము నకై యత్నపడ నక్కరలేదు. అతనిని చూచి లోకము తన్ను, తన వర్తనము సంస్కరించు కొనును. అట్టి పవిత్రవర్తనము కలిగినాడు లోకక్షేమము తానుగ సిద్ధించును. దుఃఖాదులు తొలగవలెనన్న జ్ఞానమే సాధనము. జ్ఞానప్రాప్తికి చిత్తశుద్ధి అత్యావశ్యకము. అది సంగరాహిత్యముతో దైవమునందు భారమువైచి స్వధర్మము చేయుటచే కల్గును. అట్టి జ్ఞాని పవిత్రహృదయుడై తన యునికి చేతనే లోకసంగ్రహ మాపాదించును. తన్నుద్ధరించుకొన్నవాడే ఎదుటివారిని ఉద్ధరించ గలడు.

౪౧. మనస్సులో మంచితనం లేకపోతే పిచ్చి అంకురించడం ఆరంభ మవుతుంది. దానివల్ల తనకూ ఇతరులకూ దుఃఖమే. మన

లోని మంచితనాన్ని మనం ఇబ్బంది చేసినకొలదీ శాంతి పెరుగుకొంటూ పోతుంది. మరువక ఈశ్వరస్మరణ ప్రణిధానముచేసి కృతకృత్యు డగుటే జన్మసాఫల్యం.

౪౨. మనము ప్రతిరోజు చేసే కార్యక్రమము పరిశీలిస్తే పరమేశ్వరునికై వెచ్చించేకాలము పదిక్షణాలే. మన తీరిక అంతా వ్యర్థప్రసంగాలతోనూ, వృథాలోచనలతోనూ, కయ్యాలతోనూ, వియ్యాలతోనూ గడిపేస్తున్నాము. మనం ప్రతి దినమూ వార్తాపత్రికలు చదువుతాం. దీనివల్ల బాధలేదు కాని దానిలోని విషయాలను చర్చించడంవల్ల ఫల మున్నట్లు కనిపించదు కాలాన్ని ఇట్లా వమ్ముచేయడానికి బదులు భగవత్స్మరణకై వినియోగిస్తే పాపభయం ఉండదు.

౪౩. పాపం విరగడ కాకపోతే ఆనందం అందదు. పాపక్షాళనానికి కావలసిన హంగు మనస్సు. దేహము, శాస్త్రము, తీర్థము, క్షేత్రము, ఇవన్నీ ఇహలోకములోనే ఉన్నవి. వరుస పుట్టుక ఏదో మనకు తెలియదు. కనుక ఈజన్మలోని పాపా లీ జన్మలోనే పోవాలి. మనం చేసిన పాపంకొద్దీ మరుజన్మలో పసులముగా కానీ, కీటకాదులముగా కానీ పుట్టితే పాపనివృత్తికి అవకాశం తక్కువ. ఉత్సవాలు, జపతపాలు, పూజాపురస్కారాలు, పరోపకారాదులు ఇవన్నీ పాపమోచకాలున్నూ, చిత్తశోధకాలున్నూ. కార్యం చిన్నదయినా పెద్దదయినా మనము చిత్తశుద్ధితో చేయాలి.

౪౪. పాపాలు చేశాననే భయం అక్కరలేదు. బ్రహ్మజ్ఞానం అనే తెప్పవల్ల ధర్మాన్నీ, అధర్మాన్నీ అతిక్రమించాలి. పాప సముద్రాలు దాటి పోవడానికి జ్ఞాననౌకను మించినదేదీ లేదు. ధ్యానానికి మనమెంత మెక్కువకాలం వీలుచేసుకుంటే అంత మేలు. ఐశ్వర్యమున్నా సరే, లేకున్నాసరే, ధ్యానం మాత్రం వదలకుండా ఉండాలి. మనము మాత్రం చేయడమేకాదు. మన అభిరుచులతో ఏకీభావమున్న మన చుట్టుప్రక్కల నున్నవారిని గూడా చేయండని

చెప్పాలి. వారొకవేళ మనమాట పాటించకపోతే మనం కినుక పడరాదు. కాని వారి వారి విధులను మెత్తగా వారికి గుర్తుతేవాలి. మంచిమాటకు కరగని మనసంటూ ఉండదు. వేరు వేరు పనులను క్రమక్రమంగా తగ్గించుకొని, ధ్యానకాలాన్ని పొడిగించుకొని, యీశ్వర స్మరణలో మునిగి తేలుతూ ఉండాలి. ఇట్టి మేలిపనిని అడ్డము, ఆకాలేకుండా నిర్వర్తించవలెను.

౭౫. నిజానికి దారిద్ర్యం అంటే ఏమి? నేను దరిద్రుడను అని చెప్పుకోవడమే తృప్తికలవాడు నిత్యసంతోషి, 'నేను దరిద్రుణ్ణి' అని సొద వెళ్ళబోసుకుంటే ఒక్క నయాపైసా యిచ్చే పుణ్యాత్ముణ్ణి చూపండి. అంతో ఇంతో దేవుడిచ్చాడు, అని తలపోస్తే సంతోషంగానైనా బ్రతుకవచ్చు.

౭౬. మనం యిపుడు బతికున్నామంటే జన్మరాకుండా చేసుకొనే పనులు వెనుకజన్మలో మనము చేయలేదన్నమాట. మన బ్రతుకంతా ఆకలి దప్పులు పోగొట్టుకోడానికే అని తోస్తుంది. దీనికి కారణం దేహాభిమానము. ఈ అజ్ఞానం పోవడానికి ఆత్మజ్ఞానం ఒక్కటే మందు.

౭౭. ఒకడు చేసిన సత్కార్యాన్ని మనము మెచ్చుకోవడం వల్ల ఆ సత్కార్య ఫలితముగా వాళ్ళకు చెందే పుణ్యము మనకూ అంటుతుంది. ఒకడు పుణ్యకార్యము చేస్తాడనుకొందాము. అతడు తన్ను ఇతరులు స్తుతిస్తుంటే విన్నాసరే, లేదా తన్ను తానే పొగడకున్నాసరే, వాని పుణ్యఫలం కొంత లోపిస్తుంది. అందుచేత ఎవరినైనా మనము మెచ్చుకోవాలన్న ఉద్దేశముంటే పరోక్షంగా మెచ్చుకోవడం మేలు.

౭౮. మనలోఉన్న అవగుణాలు తొలగిపోవాలంటె దానికి వాసుదేవ భజనమే ఔషధం. కామజయానికీ, కాలవిజయానికీ ఈశ్వరభక్తియే సాధనము.

౪౯. వేదోక్తములైన కర్మలను అనుష్ఠిస్తూ తమ తమ ఆశ్రమ విధులను పాటిస్తూ వచ్చినామంటే అది మనోమాలిన్యం పోగొట్టి చిత్తశుద్ధికి కారణమవుతుంది. చిత్తశుద్ధి ప్రాప్తించేసరికి మనకు మన స్వరూప మేమిటో బోధపడుతుంది. మనమూ ఆ చిదానందాంబుధిలోని కణలేశమే అని గుర్తెరుగుతాము. ఈ జ్ఞాన ముదయిస్తే ఈశ్వర సాయుజ్యమూ, పరమానందానుభూతి కలుగుతవి.

౫౦. నేను నా ధర్మాన్ని పాటించకపోతే నా కర్తవ్యాన్ని నెరవేర్చకపోతే లోకమంతా నన్నే అనువర్తిస్తుంది. అప్పుడు ఆ దోషానికి నేను కారకుడ నవుతాను. ఇట్లు ఎవనిమట్టుకు వాడు తన సంగతిని తాను ఆలోచించుకొని చూడాలి.

౫౧. అందరినీ నియమించేవాడు యముడు. ఇంద్రియములను తన స్వాధీనములోనికి తెచ్చుకొన్నవాడు యమి. ఎఱుకతో ఇంద్రియములను నియమించుకో గలవాడు "చూడవద్దు" అని అనుకుంటే కన్ను చూడదు. లోపల అణగిఉంటే వెలుపల ఎట్లున్నా ఫరవాలేదు. కాని వెలుపలి అణకువ లేకపోతే లోపల అణకువ ఎట్లా సిద్ధిస్తుంది? కావున 'నీ దృష్టిని తగ్గించుకో, జనసంగంలో ఉండకు. ఇంద్రియ వ్యాపారాలను మితంచేసుకో.

౫౨. దేహమే ఒక దేవాలయము. జీవుడు ఈశ్వర స్వరూపము. దేహాన్ని మనము దేవాలయముగా పరిగణిస్తే, ఆలయాలను ఎట్లు పరిశుద్ధముగా ఉంచడానికి ప్రయత్నిస్తామో, అట్లే దేహాన్ని శుద్ధంగా ఉంచుకోడానికి ప్రయత్నించాలి. దాని కడకు అశుద్ధ పదార్థాలను చేరనీయరాదు. అశుద్ధ పదార్థ సేవనంవల్ల దేహములోనున్న మంత్రశక్తి చెడిపోతుంది.

౫౩. ఎటువంటి కష్టములు వచ్చినప్పటికీ, ఎటువంటి వ్యాధులు వచ్చినప్పటికీ దైవస్మరణ మాత్రం మనము వదలరాదు. అంత్యకాలంలో ప్రాణావసాన సమయంలో ఏ స్మరణతో

ఉంటామో దాని కనుగుణంగా మరుసటి జన్మలో శరీరము కలుగుతుందని గీత చెపుతుంది. ఈశ్వర స్మరణతో దేహాన్ని వదలినట్లయితే ఈశ్వర స్వరూపంలో ఐక్యమవుతాము. దుఃఖిస్తూ ప్రాణాలను వదలితే దుఃఖభాజనమైన మరొక శరీరం మనకు లభిస్తుంది.

౪౯. మతమంటే అంబికా చరణారవింద ధ్యానమే. ఆ ధ్యానఫలముచే మనము పూర్ణులమగుదుము. పుట్టినందులకు పూర్ణులు కావాలి గాని ఎద్దువలె, మొద్దువలె జీవితములో ఏ వికాసమూ లేకుండా అవసానకాలంలో గొడ్డువలె మరణించడం ఏమి గొప్ప? శాంత్యానందాలు చిప్పిల్లుతున్నప్పుడు, అనాయాసముగా దైన్యరహితంగా మనము ప్రాణాలను వదలగలిగినట్లయితే, అదియే పూర్ణత్వము. ఆ పూర్ణత్వమే మన లక్ష్యమైతే ఆ లక్ష్యసిద్ధికోసం పాటుపడటమే మన ఉద్దేశమైతే మనకు ఆహారం కావాలి, ఉద్యోగం కావాలి. లేకుంటే ఏదీ అక్కరలేదు. పెళ్ళాం అక్కరలేదు. బిడ్డలు అక్కరలేదు. సంసారం అక్కరలేదు.

లోకములో పుట్టిన వాళ్ళందరూ ఏనాడో ఒకనాడు గతించవలసినదే. కావున అంబికా పాదాలు ధ్యానిస్తూ ప్రాణాలను వదలడమే అమృతము, పూర్ణత్వము, మోక్షము.

ఇదే మన లక్ష్యమైతే మన మతమైతే, మనము ఎంతవరకు పూర్ణంలో పడ్డాము? ఎంతవరకు సాధన అందుబాటులోనికి వచ్చింది? ఇంకా గమ్యం ఎంత దూరములో ఉంది? అని అపుడపుడు ఆత్మపరీక్ష చేసుకుంటూ ఉండాలి. కామం మనలను బాధిస్తున్నదా! కోపంతో మనము ఊగిపోతున్నామా! మన చిత్తశుద్ధి ఏమాత్రము? అన్న విచారం అప్పుడప్పుడు ఉంటూఉండాలి. ఇట్టి ఆత్మశోధనకు అనుకూలముగా ఉండేదే స్వప్నము. స్వప్నావస్థలో మనకు కామక్రోధాదులు కలుగుతున్నంతవరకు కావలసిన చిత్తశుద్ధి లభ్యంకాలేదనే అనుకోవాలి. ఈ చికిత్స, ఈ విచారం ఉన్నంతవరకూ మనము జీవిత ప్రయోజనంకోసం పాటుపడుతున్నా

మని అర్థం. లేకుంటే మన జీవితాలు వ్యర్థం. ఆత్మశోధనలేక మనము బ్రతికి ప్రయోజన మేమి?

ఊరివారికి మహాభక్తుడు అన్న అభిప్రాయముండవలె నని పాటుపడే వేషధారుల కలలలో దొంగలే కనిపిస్తుంటారు. అట్టివారికి స్వప్నములోనూ కామచింతనలే ఉంటాయి. నిజమైన భక్తి కల వారికి ధ్యానంలో తన్మయంగా ఉన్నట్లో, నామజపం చేస్తున్నట్లో, స్వామిదర్శనం చేస్తున్నట్లో కలలు వస్తుంటవి. మన భక్తిని ఈ విధముగా స్వప్నమూలంగా శోధించుకోవచ్చు. అనుదినము ఆత్మశోధన చేసుకుంటూ ఆత్మసంస్కారానికి పాటుపడాలి. పూర్ణత్వమే మన లక్ష్యం అన్న నిశ్చయంతో, ఆ లక్ష్యసిద్ధికై తీవ్రసాధన చేయాలి.

౫౫. ఐహిక విషయాలకోసము యిన్నేండ్లు ప్రాకులాడితివి కదా! ఇంత కష్టపడి నీవు ఆర్జించిన దేమిటి? దౌర్బల్యం కొంచెమైనా తగ్గిందా? వేదాంత బోధనలను, ఆచార్యుల ప్రకరణ గ్రంథాలలో సెలవిచ్చిన సూక్తులను ఆచరణలోనికి తెచ్చి చూడుము. అప్పుడు నీ జీవితము సంస్కారమగును.

౫౬. వివాహానికి మూడే ఉద్దేశాలు. మొదటిది మంచి సంతానోత్పత్తి. స్త్రీలు జీవితపరమావధి పొందాలి, వారికి చిత్తశుద్ధి ఏర్పడాలి, ఇందుకు ఒక ఆలంబనం ఉండాలి అని రెండో ఉద్దేశం. మూడవది పురుషునికి గృహస్థాశ్రమంలో కర్మానుష్ఠానం ద్వారా శ్రేయఃప్రాప్తికి ఒక సహాయం అవసరము. ఇదంతా కలిపి చూస్తే లోకకల్యాణానికి తోడ్పడే ప్రజను పొందడానికి వివాహము ఏర్పడ్డదన్నమాట.

స్త్రీ భర్తను చాయవలె అనుసరించాలి. పతియే ఈశ్వరుడన్న భావన ఉండాలి. పెళ్ళికిముందు పరమేశ్వరుడే భర్తయని

పూజిస్తూ, పెండ్లియైన తరువాత భర్తయే పరమేశ్వరు డన్నభావం అలవర్చుకొనవలె.

పురుషుడు ఒక్క గురువును నిర్ణయించుకోవాలి. స్త్రీ అట్లే ఒక్క పురుషునికి తన మనస్సు అర్పించాలి. మనస్సుకు తోచిన దంతా చేయడం వదలిపెట్టాలి.

౫౭. ఆత్మకు సంబంధించిన కార్యాలలో ద్రవ్యంతో సంబంధం ఉండరాదు. అట్లుంటే పేదవారి కందరకూ దోషం ఏర్పడుతుంది. కర్మానుష్ఠానికీ, డబ్బుకూ లంకెపెట్టడం తప్పు. బీద సాదలు మొదలుకొని మహారాజులవరకు చేయవలసిన కర్మలు ఈలాగే నడిచేవి. ప్రస్తుతం సామాజిక వ్యవస్థ మారిపోయింది. ఇదంతా వ్యాపారసౌఖ్యాలు వృద్ధియైన దోషం. వస్తువులను అమితంగా నిలవచేయడం లక్ష్యమైంది. చిత్ర విచిత్రాలయిన బట్టలు కట్టడం, పెట్టడం ధ్యేయమైంది. గ్రామాలువదలి నగరజీవనం ప్రారంభించారు. భూములను అమ్మి, సర్టిఫికెట్లుగా మార్చుకొన్నారు. నేర్చుకొన్న విద్యకు తగిన ఉద్యోగాలు దొరకవు. గ్రామాలను వదలి నగరప్రవేశం చేసినందువల్ల కలిగినది దారిద్ర్యమే.

౫౮. సుకృతాన్ని సాధించేది ధర్మం. ఏ పనిచేస్తే మంచిదో అదే ధర్మం. సుఖంకోరి ఏ దానం చేస్తామో అదే ధర్మం. ఇట్లా ధర్మం అర్థానికీ, అర్థం కామానికీ సాధనమవుతున్నవి.

"మనకు ఏ 'అర్థమూ' వద్దు. ఈశ్వరుడు ఇచ్చేదేదో, ఇవ్వనీ" అని నిష్కామంగా చేసేధర్మం మనోమాలిన్యం తొలగిస్తుంది. అట్టి ధర్మం అర్థకారకమూ, కామకరణకమూ అవడమేకాక మోక్ష సాధన మవుతున్నది. కామ్యధర్మం ఆ జన్మకు ఉపయోగపడి, నిష్కామ్యధర్మం మోక్షపాదక మవుతున్నది.

౫౯. సర్వమూ వాసుదేవమయం. ఈ సర్వములో తాను ఉన్నాడు. ఎప్పుడైతే మనకు ఈ జ్ఞానము కలుగుతుందో, అప్పుడు

ఇంద్రియ సౌఖ్యాలపై విముఖత ఏర్పడి, బాహ్యవిషయాలు మనో వికారం కలిగించడానికి అశక్తాలై పరిపూర్ణ మనోనిగ్రహం సిద్ధించి, ఎంతటి కష్టాలు వచ్చినప్పటికీన్నీ జారిపోని మానసిక నిశ్చలతా, మనశ్శాంతీ ఏర్పడుతుంది.

కోపంలో చిక్కుకొన్న వానికి కాని, కోరికలతో చిక్కుకొన్న వానికి కాని వివేచనాశక్తి అంతరించిపోతుంది. అందుచేత వాడు చేసే ప్రతిపనీ, దుర్మార్గంలోనే నడుస్తూ ఉంటుంది. అట్లుకాక ఇచ్ఛలన్నీ మనస్సుకు లొంగిపోతే, మనస్సు నిశ్చలమై సతతమూ ఆత్మధ్యానం చేస్తుంటుంది. అట్లు ఎడతెగక ఆత్మచింతన చేసే వ్యక్తికి అచిరకాలంలో ఆత్మసాక్షాత్కారం కల్గుతుంది. ఆశలన్నిటినీ ఒక్కచోట చేర్చి, 'ఇది వద్దు, ఇదివద్దు' అని ఒక్కటొకటే వదలినావంటే అదే మోక్షానికి మార్గం. మనస్సును ఏకాగ్రత చేసి భక్తితో చూడు, నీకు మోక్షం కరతలామలకం.

౬౦. మన బుద్ధికి తోచినవే మంచిచెడ్డలని తీర్మానించడం కంటె శాస్త్రమే ప్రమాణమని ఉండటం మంచిది.

౬౧. ఈశ్వరానుగ్రహంలో అచంచలమైన విశ్వాసం అలవరచుకొని ఎటువంటి కష్టాలు వచ్చినప్పటికీ ఓర్చుకోగల సహనశక్తి పెంపొందించుకోవడమే ప్రస్తుతం మనకున్న వ్యాధిని కుదర్చగల పరమౌషధము. ఆ సహనశక్తి మనకు ఒక్క భక్తివల్లనే లభిస్తుంది. భక్తిని పెంపొందించడానికి ఏర్పడిన సంస్థలే ఆలయములు. అందుచేతనే ఆలయనిర్మాణం మనపెద్దలు ఒక విశిష్ట కార్యంగా ఎంచేవారు.

౬౨. ప్రపంచంలో ఎంతో వైవిధ్యంతో కూడిన ప్రాణికోటిలో ఒక్క మానవుడు మాత్రం నిలువుగా పెరుగుతున్నాడు. తక్కినవన్నీ అడ్డంగా పెరుగుతున్నవి. అందుచే మానవునికి భౌతికంగానే కాక, పారమార్థికంగా కూడా ఎత్తుగా పెరుగవలసిన

ఆవశ్యకత ఎంతైనా ఉన్నది. అట్టి ఔన్నత్యం వానికి ఒక్క జ్ఞాన మూలంగానే కలుగుతున్నది. ఆ జ్ఞానమే వానికి శాంతి నిస్తున్నది. మృగములకంటె మనిషి ఎన్నోవిధాల బాధపడుతున్నా, వానికి జ్ఞానమువల్ల ఔన్నత్యం సహజంగా కల్గుతున్నది.

౬౩. ధర్మాన్ని పాటించిన రామచంద్రమూర్తికి తిర్యక్కులు (మృగములు) సహితం సాయపడినవి. అధర్మవర్తనం చేసిన రావణాసురునకు సొంత తమ్ముడే సాయపడలేదు.

ధర్మానికి ఏ కాలంలోనూ, ఏ దేశంలోనూ అడ్డులేదు. అందుచే ధర్మాన్ని పాటించడం మనకు అత్యావసరం. మన ద్రవ్యాన్ని ధర్మద్రవ్యంగా మార్చుకోవాలి. అది కాలపరిణామవశం కాక, సార్వకాలిక ప్రయోజనకంగా ఉండాలి.

౬౪. మనకు భక్తి ఉన్నదా లేదా అనడానికి సాక్ష్యం దైవాజ్ఞలను మీరి నడవకుండా ఉండటం. 'నాకు భక్తి ఉన్నది, కాని నేను భగవదాజ్ఞప్రకారం మాత్రం నడుచుకోవటంలేదు.' అని అంటే అర్థంలేని మాట. నిజమైన భక్తికి చిహ్నం విహితకర్మానుష్ఠానం. వారి వారి కర్మలను వారు చక్కగా ఆచరించి, పరమాత్మకు అర్పించడం అలవరచుకోవాలి.

౬౫. సత్యము భూతహితమై ప్రియకరంగా ఉండాలి. సత్యం సర్వజీవ క్షేమకరం కావాలి. కామకారణంగా, క్రోధకారణంగా హృదయంలో నుండి వాగ్రూపంతో బహిర్గతమయ్యేది సత్యం కాజాలదు. సత్యం ఇతరులకు అగౌరవకారకం కారాదు. వారికి పాతాన్నీ సంపాతాన్నీ కల్గించగూడదు. మనకూ, ఇతరులకున్నూ క్షేమాపాదకంగా ఉండాలి. ఏ మాటకానీ హితముగా శాంతముగా చెప్పాలి. సత్యభాషణానికి ముఖ్య ప్రయోజనం చిత్తనిరోధం. సత్యవ్రతుని వాక్కు రిత్తపోదు.

౬౬. 'నాకు డబ్బంటే ఆశలేదు' అని జాగ్రదవస్థలో అంటూ ఉంటాము. ఆ మాటనే స్వప్నంలోసహితం అనగలిగితే

కాంచనవిజయం కలిగినదనే చెప్పాలి. అట్లే స్వప్నంలో కూడా సత్య భాషణులము కాగలిగితే సత్యము మనకు సిద్ధించినదని చెప్పగలము. అప్పుడు మనము ఏది చెప్పితే అదే కొనసాగుతుంది.

౬౭. ఐహికవస్తువులు స్థిరముగా ఉండేవికావు. అందుచేత పేరుప్రతిష్ఠలకూ, ధనార్జనకూ మనము జీవితమంతా ధారపోయ వలసిన అవసరం లేదు. మరి యత్నపూర్వకంగా మనము దేనికై పాటుపడాలి? పాపదూరమైన పుణ్యజీవనానికే శ్రమించాలి.

ఐతే పుణ్యజీవనం సిద్ధించే దెట్లా? ఒకటి మనము ఇదివరకు చేసిన పాపాలను నాశం చేసుకోవాలి. రెండవది అటుమీదట పాపా చరణకు పూనుకోక పాపబుద్ధిని తొలగించుకొని చిత్తనైర్మల్యాని కోసం పాటుపడాలి. పాపనాశనానికి మార్గమేమిటంటే భగవంతునిపై భారంవేసి, మన రక్షకుడు అతడే అనీ, జరిగేది ప్రతియొక్కటీ అతని ఎరుకలోనిదే అనీ, మనకు జరిగే మంచీ చెడ్డా రెండూ ఆయన ఇచ్ఛాపూర్వకంగానే జరుగుతున్నవనీ, జరిగేవన్నీ మన మంచికే ననీ దృఢనిశ్చయంతో ఉండటమూ, తన్ను పరిపూర్తిగా స్వామికి అర్పణచేసుకొని ఈశ్వరప్రవాహంలో తేలిపోవడమూ ఇవే శరణా గతికి కీలకము. మరి పాపబుద్ధి తొలగించుకోడానికి మార్గ మేమిటంటే మనము దొరికిన ప్రతి క్షణమూ భగవచ్చింతనకు వినియోగిస్తూ, అతని నామజపం చేస్తూ ఆయన పుణ్యకథా శ్రవణం చేయడమే.

౬౮. చేసిన పాపాలను తొలగించడానికి శరణాగతియే మందు. భావిజీవితములో దుష్టచింతనలు లేక సచ్చారిత్ర మలవడటానికి భక్తియే మార్గము. జీవితము గడవడానికి ప్రతి ఒక్కరూ ఏదో ఒక వృత్తిని అవలంబించవలసిన ఆవశ్యకత ఉన్నది. వృత్తిలో ఉన్నంత వరకూ చేతిలోని పనిమీద మనస్సు లగ్నమై ఉంటుంది. విరామ కాలంలోనే మనస్సు పాపచింతనలపైకి పోయే అవకాశముంది. అందుచేత పాపచింతనల బారినుండి తప్పించుకోవాలంటే మనము విరామకాలమంతా భగవచ్చింతనలో గడపటానికి అలవాటు

పడాలి. నామజపమో, సత్సంగమో, సత్కథాశ్రవణమో, పూజాది కాలలో మగ్నులమైపోవడమో, ఎప్పుడూ భగవచ్చింతనలోనే గడపడానికి ఏదో ఒక మార్గాన్ని అన్వేషించాలి. పాపాచరణ జ్ఞానేంద్రియాలతో కానీ, కర్మేంద్రియాలతో కానీ జరగకుండా జాగ్రతపడాలి. భగవంతుడు సర్వజ్ఞుడు. అతనికి అన్నీ తెలుసు. అతని ఇష్టానుసారమే జరగనీ అన్న భావనా, అసంగత్వమూ మనకు అలవాటు కావాలి. ఈ విధముగా ఈశ్వరశరణాగతి, ఈశ్వరభక్తి మనము పెంపొందించుకుంటే ఈశ్వరప్రసాదము మనకు లభిస్తుంది.

౬౯. చదువు యొక్క ముఖ్య ప్రయోజనం వినయము. వినయమంటే అణకువ. అణకువలేని చదువు ఒక చదువు కాదు. తన్ను తాను సంయమించుకొనే మంచిగుణము విద్యచే అలవడాలి. చదువురాని గ్రామీణుల మంచితనం పట్టణాలలోని ప్రజలకు లేదు. కొండజాతివారికున్న సుగుణాలు విద్యావంతుల కున్నట్లు కనబడదు. వారికి మేజస్ట్రేటు కోర్టులుగాని, హైకోర్టులుగాని లేవు. యూనివర్శిటీలు, కాలేజీలు అధికంగా ఉన్నచోటులలో న్యాయస్థానాలున్నా ప్రబలినవి. మోసము, దగా, లంచగొండితనము, అన్యాయము, జేబుదొంగతనము ఇవన్నీ పట్టణములయందే అధికముగా కనబడతాయి.

చదువుయొక్క ప్రయోజనము గుణము. కాని మన చదువుల వల్ల గల్గిన గుణాలు విపరీతాలు. స్కూళ్ళలో చోటులేదని షిఫ్టు పద్ధతిలో చదువులు నేర్పుతున్నాము. ఈ విద్యవల్ల రావలసిన వినయము మాత్రం మనకు అంటుటలేదు. మనదేశములో బాలికలకు, స్త్రీలకు సహజగుణము వినయము, సిగ్గు. స్వాభావికమైన స్త్రీ గుణాలను సయితము ఈ చదువులు పోగొట్టుచున్నవి. ఈ కాలపు చదువులు వినయము నేర్పక, మనలను పశువులనుగా చేస్తున్నవి. ఈ కాలములో చదువని వారికంటే చదివినవారే ఎక్కువ కష్టపడు

తున్నారు. అనవసరములైన వ్యవహారాలు బోలెడు కల్పించుకొని, తాము కష్టపడి, ఇతరులను కష్టపెడుతున్నారు.

విద్యయొక్క ప్రయోజనము సత్యస్వరూపుడగు భగవంతుని తెలిసికోవడమే. కాని ఈ కాలపు విద్యార్థులకు దైవభక్తే ఉండటం లేదు. మరి ఈ చదువులకు ప్రయోజన మేమి? విద్యకు బదులు అవిద్య అధిక మవుతున్నది.

౭౦. నగరజీవితాలతో నాగరికత ముదిరింది. నాగరికత ముదిరిన కొద్దీ గ్రామాలు క్షీణించిపోయినవి. గ్రామస్థులు నగరవాసులయినారు. గ్రామజీవనములో పొదుపు ఉండేది. వారికి ఆడంబరాలు తక్కువ.

గృహాడంబరమూ, వేషాడంబరమూ నాగరికతకు తోబుట్టువులు. బుద్ధి విషయాలలో చిక్కి, పాపాచరణకు పూనుకొంటున్నది. ఆశలకు అంతులేకుండా ఉంది. అవి తీరేకొద్దీ క్రొత్త ఆశలు, క్రొత్తపాపాలు, పాపమూలంగా జన్మపరంపర కల్గుతుంది. నాగరికతా ఫలంగాకల్గే దోషాలు మనకు అంటనట్లు మన బుద్ధిశక్తులను పరమేశ్వరార్పణచేసి వాస్తవ ప్రయోజనము పొందడానికి, జన్మ రాహిత్యంకోసం, ఈశ్వరానుగ్రహం కోసం అందరమూ పాటు పడుతూ ఉందాము.

౭౧. లోకాంతర శ్రమలనుండి విశ్రాంతి ఏర్పడితే ఆనందానుభూతి కల్గుతున్నది.

౭౨. మనము సంపాదించే ద్రవ్యములో ఒక్కకాసైనా మనవెంట రాబోదు. వచ్చేది భగవచ్చింతన. కావున విషయేతర సంపర్కంతో కాలము వృథాచేయకుండా ఉన్న సమయములో దైవచింతన చేయడం లాభం. తక్కినదంతా నష్టం.

౭౩. మానసికముగా కొంత, దుష్టాలోచనలతో, వాచికముగా కొంత, ఉత్సాహ పూర్వకమైన అశుద్ధభాషణలలో, కాయికంగా కొంత, అధర్మచేష్టలతో, ద్రవ్యమూలంగా జరిగే దుష్కృ

యారూపంగా కొంత, ఇట్లు మనము నిరంతరమూ పాపకార్యములు చేస్తున్నాము. పాపము చేస్తున్నామని మన మనసే చెప్తుతుంది. మనము అనుకోని పనులు చేసేటట్లు మనలను ఏదో ఒక అంతశ్శక్తి ప్రోత్సాహం చేస్తూ ఉంటుంది. ఇట్లు చేస్తూ చేస్తూరాగా, పాపాచరణం ఒక అభ్యాసంగా తయారయింది. దీనినుండి తప్పించుకోవాలంటే త్రికరణాలతో చేసే కార్యాలు శుద్ధంగా ఉండేటట్లు, ద్రవ్యం సద్వినియోగ మయ్యేటట్లు జాగ్రత్తపడాలి.

పాపాన్ని ధర్మంచేత నివృత్తిచేయవలె. అధర్మానికి విరుగుడు ధర్మం. పాపానికి తల్లి ఆశ. ఆశావశమై ప్రాణికోటి పాపం చేస్తుంది. ఏది చేయరాదని మనసుకు తోస్తుందో అదే పాపము. ఏది మంచిది, శుభమని తోస్తుందో అదే పుణ్యము.

మానవుడు పుణ్యఫలాన్ని కోరుతుంటాడు. కాని పుణ్యకార్యం చేయాలని కోరడు. పాపఫలాన్ని కోరుకోడు. పాపకార్యాలను ప్రయత్నపూర్వకముగా చేస్తూ ఉంటాడు. మన పాపకార్యాలకు మన మనస్సే సాక్షి.

రజోగుణ భావాలైన కామక్రోధాలే మనముచేసే పాపాలకు కారణము. మహాశనుడు కాముడు. మహాపాపి క్రోధుడు.

ఆశారహితముగా చేసేకార్యము పాపముకాదు. ఆశతో చేస్తేనే పాపము. పాపాచరణం ఒక అభ్యాసమైపోయి, త్రికరణాలతోనూ మనం పాపంచేస్తున్నాము. పశువులకు వాగింద్రియము లేదు. అవి తమ భావాలను భాషారూపంగా వ్యక్తం చేసుకోలేవు. భగవంతుడు హృదయంలో ఉన్నది ఉన్నట్లు చెప్పనీ అని మనకు వాగింద్రియం ప్రసాదించాడు. మనం అట్లు చేయకపోతే వీడు మనుష్యుడుగా పుట్టికూడా గొడులాగున్నాడని మరొక జన్మలో పశుజన్మ మనకు నిర్దేశించవచ్చు. భగవన్నామం రసించడానికే రసనేంద్రియం ఏర్పడింది. దేనిని అభ్యాసం చేసినా, చేసినపనినే మరల చేయాలన్న సంకల్పం ఏర్పడుతుంది. అది మంచిదైనా

సరే, చెడ్డదైనాసరే, ఈ సంకల్ప పరంపరలే వాసనలు. సత్కార్యాలకు ప్రోత్సహించే సద్వాసనలను అలవరచుకోవాలి. నిష్కామ కార్యాచరణలో పాపబీజాలకు తావులేదు.

అందుచే ఉన్నదాంట్లో ధానధర్మాలు చేసుకోవాలి. లేనిది మనకు రాదుకదా! ధర్మానికి దానికై నిర్దేశించిన ద్రవ్యాన్ని గృహావసరాలకు వినియోగించరాదు. మనము సంపాదించే ద్రవ్యం మొత్తం మనది కాదనే జ్ఞాపకం వుంచాలి. ఈ అర్థానికి ప్రయోజనమూ, సంబంధమూ ఈ దేహ మున్నంతవరకే. దేహానంతరం కూడా ప్రయోజనం కావాలంటే అది ధర్మ ద్రవ్యం కావాలి. అప్పుడు అది ఏ దేశములోనైనా చెల్లుతుంది. ఎవరు చేసినధర్మం వారికి చెందుతుంది. వాక్కు నిచ్చినందుకు వేయిమార్లైనా ఈశ్వర నామం జపం చేయాలి. వ్యర్థప్రసంగాలవల్ల పాపము, దానివల్ల కలిగే ఉపద్రవము భగవన్నామ స్మరణతో తొలగిపోతుంది.

ఒక్క క్షణకాలమైనా వ్యర్థంచేయరాదు. హృదయము భగవన్నివాసమని గమనించక, దురాలోచనలతో నింపి, దుర్గంధ భూయిష్టంచేసి మనము ఆయనకు స్వదేశంలోనే చోటులేనట్లు చేశాము. అందుచే ఆయనను ఆహ్వానించి, ఆయన సింహాసనంలో ఆయనను ఉపవిష్టుని చేసి, మనము ఆయన సాన్నిధ్యంలో కూర్చోవాలి. నియతిగా ఆహారం ఎట్లు గ్రహిస్తున్నామో, ధ్యానమనే ఆహారాన్ని దానితోపాటు గ్రహించాలి. అది ఈశ్వరానుగ్రహానికి అనుకూలిస్తుంది.

౭౮. దండమువలె క్రింద సాగిలపడి "ఈ దేహము నాది కాదు, నీది" అన్న భావముతో దైవసన్నిధిలో చేసేదే సాష్టాంగ దండప్రణామము. ఇట్లు చేస్తూవస్తే పాపము క్షీణించి అహంభావము క్రమేణ అంతరిస్తుంది. అహంత పోయి భగవత్సాన్నిధ్యంలో మనము ఎంతెంత పడతామో అంతంత మన మహిమ పెరుగుతుంది.

దేహాంతర ప్రయాణసమయంలో మనస్సు అచలంగా ఉండాలి. పాపభయం లేనప్పుడు మనస్సు అచలంగానే వుంటుంది. కామక్రోధాలు లేకపోతే పాపభయం లేదు. వీనిని ధ్వంసం చేసేదే ధర్మం. మనముచేసే పాపాలు స్మరిస్తే ఒకపూట అన్నానికైనా మనము పాత్రులమా అని అనిపిస్తుంది. దేవుడు కరుణాళువు కనుక, దేనినీ లెక్కించక, పాపాత్ములమైన మనకు పలుసౌకర్యాలు చేస్తున్నాడు. ధర్మకర్మలే కాక, సర్వకర్మలనూ ఈశ్వరార్పణ చేయాలి. ఈశ్వరుణ్ణి హృద్దేశంలో ప్రతిష్ఠించినామంటే మన పాపాలు పోకార్చి, స్థిరమైన పరమసౌభాగ్యం ఆయన ప్రసాదిస్తాడు.

౭౨. పితృదేవతలు ఎక్కడ ఉన్నా అమావాస్య తర్పణ ఫలం వారిని చేరుతుంది. కాని నరకములో వారికి చేరదు. నరక లోకములో ఉండేవారికి ఉపయోగపడేవి కొన్ని ఉన్నాయి. మురికి గుడ్డల నీరు, వెంట్రుకల నుండి కారేజలం, హస్తప్రక్షాళనం చేసుకున్న ఉదకం – నరకంలో ఉన్నవారిని ఉద్దేశించి ఇస్తే వారికి తృప్తి కలుగుతుంది. అందుకోసమే ధోవతిని పిండేందుకూ, శిఖోదకాన్ని పిండేందుకూ, మంత్రాలున్నాయి. ఆంధ్రదేశములో ఉత్తరాపోశనకు వెనుక మిగిలిన నీటిని విస్తరి కుడిభాగములో వదలుతూ 'రౌరవే పుణ్యనిలయే పద్మార్బుద నివాసినాం' అంటూ ఒక మంత్రం చెబుతారు. అనగా "పద్మార్బుదాలు ఎన్నో కోట్ల సంవత్సరాలు, అన్ని ఏండ్లుగా రౌరవనరకములో బాధపడుతున్న వారికి ఈ జలం యిస్తున్నాను, అక్షయమైన వారి దప్పి దీనితో తీరుగాక" అని ఉత్తరాపోశనానంతరం పై మంత్రం చెప్పుతారు. దాక్షిణాత్యులు వైశ్వదేవం చేస్తారు. దానికిబదులు ఆంధ్రదేశంలో భోజనకాలంలో ఐదు బలుల నిస్తారు. అంటే ప్రత్యేకంగా అన్నం తీసి ప్రక్కన ఉంచుతారు. ఆపోశనానంతరం మంత్రం చెప్పి జలం వదలి ఉపసంహారం చేస్తారు.

౭౬. మనమందరము ఆ ఈశ్వరానుగ్రహంకోసం తీవ్రమైన యత్నం చేయవలసి ఉంది. సకల శ్రేయఃప్రాప్తికి ఆయన అనుగ్రహమే కారణం. ఈశ్వరుడు మన కిచ్చిన ఆయుస్సంతటినీ తదనుగ్రహ సంపాదనకోసమే వ్యయపరిస్తే సార్థకమవుతుంది. ఇతరవిధాల గడపిన ఆయుస్సంతా వ్యర్థమే అవుతుంది. కాబట్టి నీ బ్రతుకు ఫలవంతం కావాలంటే స్వామి అనుగ్రహంమీదనే దృష్టిని నిలిపి ఉంచు. ఈశ్వరానుగ్రహ సంపాదనాన్ని ఏమరి ఒక్కక్షణం గడపినా నీ బ్రతుకంతా నిరర్థకమైపోతుంది. 'నీ వంతుకు వచ్చిన కర్మను లెస్సగా ఆచరించు' అనేదే ఆ యాజ్ఞ. స్వస్వకర్మానుష్ఠానమును మించిన ఈశ్వరపూజా, ఈశ్వరారాధనమూ లేదు. ఇతరులకు, మనకు కూడా శ్రేయంగూర్చే కర్మల నాచరించుటవల్లనే జన్మము చరితార్థమగును.

౭౭. ఉదారము, నిర్మలమునైన మన వైదికధర్మమును అనుసరించక పోవడంవల్లనే మన మతము దుర్బలమై మనము కష్టనష్టముల పాలగుట తటస్థించినది. వైదికధర్మము తదనుయాయులను పరిశుద్ధులనుచేసి, ఈశ్వరానుగ్రహపాత్రులను గావింపగలదనీ, ఇతర మతములు పుట్టకముస్నే వైదికధర్మం లోకమంతటికీ మేలు చేకూర్చే మార్గం ఉపదేశించిందనీ మనము గ్రహించి ఇతరులకు తెలియజెప్పవలసిఉంది. వేదములయం దేమాత్రమో భక్తిగల మన కందరకూ ఇది విహితమైన పని. వైదికధర్మావలంబులు ఇతర మతస్థులను కండని చేరబిలుచుట మన పని కాదు. అనాదియైన వేదమే సకల శ్రేయములకు మూలమని మనము గ్రహించినచో చాలును. ఇంతకంటె మన కిపుడు పరమధర్మము లేదు. ఒక్క గమ్యమునకే పెక్కు మార్గము లున్నవని వేదముతప్ప ఇతరమతము లంగీకరింపవు. ఈ పరమార్థమును గ్రహించుభారము మనపై నున్నది. కాని వేద విహితానుష్ఠానముపై శ్రద్ధలేక ధర్మాచరణమున ఇతర మతస్థుల కంటె వెనుకబడియున్నచో యీ పరమార్థము నుపదేశించే అర్హత మనకు కలుగదు.

౭౮. మతములు మార్చుకొనుటకంటే మన పెద్దల మతాన్ని త్యజించుటలోనే ఎక్కువ అపచారమున్నదని గ్రహించాలి. పూర్వాచారాన్ని వదలుకొనుట పాతిత్యకారణమన్నారు.

మన మతస్థులను ఇతరమతాలు తమలో చేర్చుకుంటున్నా, మన మతము యితరులను తనలో చేర్చుకోకపోయినా మన మతము బాగానే వుంటున్నదికదా! దీనికి కారణమేమిటని ఆలోచిస్తే, సదనుష్ఠానంవల్లనే మతాలు సజీవంగా ఉంటవేకాని, అన్యులకు ప్రవేశమిచ్చి మతస్థులసంఖ్యను పెంచటంవల్ల కాదని స్పష్టమవుతుంది. కనుక మనమందరము సదనుష్ఠానపరులము కావలసియున్నది. దేవాలయాదులందు మన ధర్మప్రతిష్ఠాపనలపట్ల మనకు శ్రద్ధ సన్నగిల్లడం శోచ్యం. శిథిలావస్థలోనున్న చర్చిగానీ, మసీదుగానీ అరుదుగా కనిపిస్తవి. మరి మన జీర్ణదేవాలయాలు లెక్కకు మిక్కిలిగా కనుపిస్తున్నవి. పెద్దలు విధించిన ధర్మాల నాచరిస్తూ ఉంటేనే ఏ మతమయినా బ్రతుకుతుంది. ఎవరిధర్మము వారు ఆచరిస్తూఉంటే లోకానికి శ్రేయం లభిస్తుంది. అట్టి ధర్మాచరణము లోపించుటవల్లనే మనతోపాటు లోకంకూడా పాపపంకంలో దిగబడియున్నది.

మతములన్నింటినీ ఒక్క అచ్చున పోయనక్కరలేదు. మనకు మతైక్యం కావాలిగాని, ఏకమతంకాదు. అనేకత్వమం దేకత్వం దుర్లభంకాదు. ఎవరిమతములందు వారుండి, స్వధర్మాచరణచేస్తూ, సకలమతాలకు ప్రభువైన సర్వేశ్వరుణ్ణి ఉపాసించుదుముగాక!

౭౯. అన్ని మతములందు ఈశ్వరుడొక్కడే. ఈశ్వరుని కల్యాణ గుణములపట్ల ఈ మతాలలో భేదంలేదు. క్రైస్తవం, ఇస్లాము, హిందూమతము, అన్నీ ఒక్క పరమాత్మనే ఈశ్వరుడుగా పేర్కొంటున్నవి. విచారించిచూస్తే, మతములన్నీ ఈశ్వరునకు సమాన లక్షణాలు చెపుతున్నట్లు తేలుతున్నదికదా! ఒకరి

మతాన్ని ఒకరు తూలనాడుట యెందుకు? మతాన్ని నిందిస్తే, దాని ఈశ్వరుని నిందించినట్లేకదా! అది మహాపచారమవుతుంది. ఆస్తిక బుద్ధులయినవారు మతాలు మారనక్కరలేదు. పరమత ఖండన మెప్పుడూ విద్వేషానికి కారణమవుతుంది.

౮౦. మన దోషాలనెత్తి చూపినవారిపై మనకు సామాన్యంగా కోపంవస్తుంది. నిజానికి మనదోషాలన్నింటినీ వారెరుగరు. ఎరిగివుంటే మరీ నిందిస్తారు. ఎవరిదోషాలు వారికే బాగా తెలుస్తవి. కనుక ఎవరిని వారే నిందించుకొని, సరిదిద్దుకోవలసి ఉంటుంది. అలాచేయక, మన దోషాలను కప్పిపెట్టుకొంటాము. తప్పుచేసినపుడు పశ్చాత్తాపముచెంది, ఆ తప్పును పరిహరించుకోవాలిగాని, దాచిపెట్టుకుంటే ఏమిప్రయోజనము? ఏనాటికానాడు నిజదోషములను పారజూచుకుంటే ఆత్మపరిశుద్ధికి మార్గమేర్పడుతుంది. ఆలా నిజదోషాలను గ్రహించి సరిదిద్దుకొనే శక్తిని జగదంబ మనకను గ్రహించుగాక అని వేడుకొందాము.

౮౧. కష్టాలు అందరికీ కలుగుతవి. కష్టాలు వచ్చేసరికి వాటిని భరించలేక భగవంతుణ్ణి నిందిస్తాము. ఈ కష్టాలుగూడ మనమేలుకే వచ్చినవని గ్రహించలేము. మన్నుదినే బిడ్డచేతులను తల్లి కట్టివేస్తుంది. కట్టివేసినందుకు బిడ్డ ఏడుస్తుంది. తల్లి నవ్వుకొంటుంది.

మనకు కలిగే మేళ్లు ఈశ్వరుని నిర్హేతుక కటాక్షంవల్లనే లభిస్తున్నవి. కష్టాలుకూడా ఏదో కారణంవల్లనే కల్పిస్తాడు భగవంతుడు. మనకా కష్టాలే కనుపిస్తవికాని కారణం కనిపించదు. మనము వర్తమానాన్నే చూస్తాముగాని భూతమును, భవిష్యత్తును చూడలేము. కనుక వర్తమానంకోసం దుఃఖిస్తాము. మన మేలుకోసమే కష్టాలను కల్పించడమనేది ఈశ్వరవిలాసము. వెనుకముందులు పారజూచుకొనే నేర్పుంటే మన జీవితములో కష్టాలకంటే సుఖాలే మనపాలి కధికంగా వచ్చినవని స్పష్టపడుతుంది.

ఈ కష్టాలనేవి మనలోనున్న పాపమనే రోగానికి ఔషధంవంటివనీ, దుఃఖానుభవంవల్ల పాపాలకు ప్రాయశ్చిత్తం కలుగుతుందనీ అప్పుడు తెలిసికొంటాము. జ్ఞాన వైరాగ్యముల సాహాయ్యంతో దుఃఖముల ననుభవించేశక్తి ప్రసాదింపుమని ఈశ్వరుని ప్రార్థించుదాము. భక్తులు దుఃఖములచే కుంగిపోరు. మనమేస్థితిలోనున్నా కష్టాలనేవి తప్పవు. అవి పూర్వజన్మములందు మన మార్జించుకొన్నవి. పూర్వ భవకర్మలనుండి మన చిట్టాలకెక్కిన ఉతారు (బాటోవరు)లవి. అవి మనలను వెంటాడుతవి. అనుభవమువల్ల తప్ప అవి నశింపవు. దుఃఖహరణానికి జ్ఞానమే పరమౌషధము.

౮౨. ఎవరేవిధంగా అర్చించినా ఈ అర్చనలన్నిటిని పొందే ఈశ్వరుడొక్కడే అనే మూలమంత్రంపై ప్రజల దృష్టిని ప్రసరింప జేయుటే మనము చేయవలసింది. ఎవరి ఇష్టదేవతపై వారికి భక్తిని పెంపొందించుటే అంతకంటే మంచిపని.

౮౩. ఐహికవస్తువులందు మనకుండే అనురక్తి, సంగమూ- ఇవే దుఃఖానికి బీజములు. ప్రియవస్తు జాతమునుండి ఈ బలవంతపు ఎడబాటు లేకపోతే దుఃఖానికి కారణముండదు. వీటన్నిటినీ ఒకనాడు విడచిపోక తప్పదు. మరి ఆ యెడబాటు దుఃఖరహితం ఎలా అవుతుంది? అనేది ప్రశ్న. నిస్సంగము, వైరాగ్యము అనేవే దీనికిమందు.

తలపులు, పలుకులు, చేతలు అనే వాని శక్తిని విశ్వమంతటా చెలామణి అయ్యే ద్రవ్యంగా మార్చుకోవచ్చు. అది మన చేతిలోని పని. పరలోక ప్రయాణం సుఖంగా జరగాలంటే మన మనో వాక్కాయకర్మలు అందుకనుగుణంగా ఉండాలి.

౮౪. నానావికారభాజనమైన ఈ సృష్టికి మూలద్రవ్యములు పంచభూతములు. ఆ భూతములను పంచేంద్రియములచే మనము గుర్తిస్తున్నాము. ఈ యింద్రియాలలో ఒక్కొక్కదానివల్ల ఒక్కొక్క విధమైన సౌఖ్యం మనకు లభిస్తూ ఉంటుంది. మన మా

విధంగా సంతోషాన్ని, సౌఖ్యాన్ని అనుభవించేటప్పుడు ఈ భూత ములు, వాని గుణములు, ఆగుణాలను గ్రహించే ఇంద్రియాలు- ఈ సమస్తమూ ఆ పరమేశ్వరుని అభివ్యక్తులుకదా, ఈ సృష్టియంతా ఆ యీశ్వరమయంకదా అని స్మరిస్తూ ఉండాలి. మన పంచేంద్రి యాలకు ఇలా సౌఖ్యాన్ని కల్పిస్తున్న ఈ వస్తుజాతాన్ని మళ్ళీ ఆ పరమేశ్వరునికే అర్పించాలి. అలా ఈశ్వరార్పితమైన పదార్థము లను తత్ప్రసాదంగా మనము మళ్ళీ స్వీకరించి అనుభవించాలి. ఇలా పంచేంద్రియ సౌఖ్యానికి కారణభూతములైన వస్తువులను ఈశ్వరునకర్పించడాన్ని పంచోపచారములంటారు. మనము ఇష్ట దైవాన్ని జపిస్తూ మానసపూజ చేసేసమయమందు ఈ పంచో పచారములను నెరపుతూ ఉంటాము.

శ్లో. పృథ్వ్యాత్మనే గంధం సమర్పయామి,
వాయ్వాత్మనే ధూపం దర్శయామి,
అగ్న్యాత్మనే దీపం దర్శయామి,
ఆకాశాత్మనే పుష్పాణి సమర్పయామి,
అమృతాత్మనే నైవేద్యం సమర్పయామి.

అంటూ ఈ విధంగా-ఇట్లు జ్ఞానేంద్రియ పంచకాన్ని, వాని అనుభవానికి మూలమైన భూతజాతాన్ని భక్తిపూర్వకంగా పర మాత్మ కర్పించి, తిరిగి వానిని తత్ప్రసాదముగా స్వీకరించినట్ల యితే, ఇక ఆ ద్రవ్యాలను, ఇంద్రియాలను పాపకార్యములకోసం ఉపయోగించడమనేది ఉండదు.

ఇంద్రియద్వారాన ఆనందంకూర్చే యీ రూప, రస, గంధాది సూక్ష్మగుణములేకాక గృహారామ వస్తువాహనాది స్థూల పదార్థాలుకూడా మనకు సంతోషాన్నిస్తున్నవి. వీనినిగూడ ఈశ్వరునకర్పించి పిమ్మటనే మనము అనుభవించవలసి యుంటుంది. అలా అర్పించడాన్నే షోడశోపచారము లంటారు. అట్లే సంగీత నృత్యాదిభోగాలను సహితం స్వామి కర్పించిన

పిమ్మటనే మనము అనుభవించాలి. వాటినే చతుష్షష్టి ఉపచారము లంటారు.

ఈ ఉపచార పరంపరనే పూజావిధానమంటారు. అయితే ఈశ్వరపూజకింత ఆడంబరమెందుకు? ఊరకే మనసా ధ్యానిస్తే చాలదా? అని అడుగవచ్చు. నిజమేకాని, మనకు సౌఖ్యాన్ని ఇస్తున్న ఈ పదార్థములన్నీ ఈశ్వరునివల్లనే పుట్టినవనీ, ఈశ్వర మయములనీ నమ్ముతాడు భక్తుడు. ఆ విశ్వాసంవల్లనే సౌఖ్య కరములైన ఆ పదార్థాలన్నిటికి దాతయైన స్వామికే వాటిని భక్తితో నివేదించి, తిరిగి వాటిని స్వామి ప్రసాదముగా స్వీకరించ టంలో ఎంతో కృతజ్ఞత, వినయము, విశ్వాసము, ఇమిడియున్నవని గ్రహించాలి. భక్తుడు శుచియైన సత్పదార్థాన్నే ఈశ్వరున కర్పి స్తాడు. అట్లు నివేదితంకానిదేదీ తాను అనుభవించడు. ఈ అర్చనా విధానంవల్ల భక్తునకు సత్పదార్థ సేవనం, సదాచరణం అలవడి అతడు సుచరిత్రుడూ, సువ్రతుడూ, పవిత్రుడూ ఔతాడు. స్వామియే సకలసౌఖ్యప్రదాతయనే విశ్వాసముగలవారు పంచోప చార పూర్వకమైన మానస పూజా విధానమందు ఆ స్వామిని వివిధ పదార్థములచే అర్చించుతారు.

౮౬. బ్రహ్మనిష్ఠులైన సన్యాసులకు, బ్రహ్మచారులకేతప్ప ఇతరులకు భిక్షాజీవనము పనికిరాదు. పనిపాటులొల్లక భిక్షాటనం చేసే సోమరితనాన్ని మాన్పుటకు రెండుపాయములు కన్పిస్తున్నవి. 1. బహుజనులకు విరివిగా పనికల్పించుట, 2. సంపన్నుల భోగాను భవాలకు నిరుపేదల కష్టజీవనానికి ఉండే వ్యత్యాసాన్ని తగ్గించుట. వీనిలో మొదటిపని ప్రభుత్వానిది. రెండవది ప్రజలది. జీవనపు టంతస్తు (స్టాండర్డు ఆఫ్ లివింగ్) పెరుగవలెనంటూ నేడు పఠించే మంత్రాలకు ఫలితమేమిటంటే, భోగాసక్తి పెరుగుటయే. భోగాలను విడనాడి, గ్రాసవాసోదైన్యం లేకుండా, మితముగా, సౌమ్యముగా బ్రతకడమే నిజమైన సోషలిజమనిపించుకుంటుంది. శీతవాతా

తపములనుండి రక్షించే సముచిత వస్త్రధారణము, జిహ్వాచాపల్యం కోసంకాక శరీరధారణకోసం భుక్తి- ఇదే సోషలిజపు లక్షణము. దేహధారణమాత్రమైన భుక్తియే అపరిగ్రహమనిపించుకొంటుంది. దేశసంపదను విజ్ఞానాభివృద్ధికి, దేశరక్షణకు వినియోగించాలేకాని భోగానుభవాలకై వెచ్చించకూడదు. జీవనవ్యయాన్ని సరళజీవనానికి సరిపడేటట్లు తగ్గించాలిగాని పెంచగూడదు. అలాచేస్తే ప్రజలందరకు సరిపడేకూడు, గుడ్డ, నివాసము లభిస్తవి.

నేడు అదనపు సంపదగల దేశాలు, ఆ సంపదను రాజకీయంగా తమతో ఏకీభవించే దేశాలకు, యుద్ధంలో తమకు తోడ్పడే దేశాలకు పంచిపెట్టడం జరుగుతూఉంది. ఇది కూడనిపని. అదనపుసంపదను పేదదేశాలకు, ప్రజలకు ఇవ్వడం న్యాయము. ఏ దేశానికా దేశం తమకున్న సంపదతో తృప్తి చెందుట నేర్చుకుంటే, జీవనపు టంతస్తులను కృత్రిమంగా పెంచవలసిన అక్కర కలుగదు. అధిక జీవనపు టంతస్తు ననుభవించే దేశాలు ఆ యంతస్తును కాపాడుకోవడానికెప్పటికప్పుడు విదేశ విపణులను ఆక్రమించుకొంటూ ఉండడం, ఆ కృత్రిమపు వాపు ఎప్పుడు బుస్సున తీసిపోతుందో అని భయపడుతూ ఉండడం తప్పదు. మింటిమెత్తు పెరిగిన వానికి పడిపోతానేమో ననే భీతి వెంటాడుతూనే ఉంటుంది. ఇతరదేశాలను అనుకరిస్తే, ఎప్పటికైనా మనకూ ఈ దురవస్థ పట్టుతుంది.

౮౭. మనస్సు శూన్యంగా ఉన్నప్పుడే కామము, తత్సంబంధి సల్లాపాలు చల్లగా దానిలో ప్రవేశిస్తవి. అట్లుకాక ఎప్పుడు సచ్చింతనముతో ఉండే మనస్సుల దరికి కామం అడుగు పెట్టదు. కాబట్టి దుస్సంగాన్ని విడిచిపెట్టవలెనంటే సతత సత్సంగ మలవరచుకోవాలి. ఎప్పుడూ సదాచరణ చేస్తూఉంటే అదే అలవాటవుతుంది. అంతట ఆ పాపపు దుంపలు ఇగిరి, ఎండి, చచ్చిపోతవి. కనుక పాపానికెప్పుడూ చోటుపెట్టకు. సదాచరణ అలవాటు

చేసుకో. మనస్సుకు, నోటికి, చేతికి మంచిపనులు చెప్పి చేస్తూఉంటే పాపము నీ మనస్సు దరికి రాకుండా తొలగిపోతుంది.

౮౮. మనో నిర్మలత్వంవల్ల సద సద్వివేచనం లభిస్తుంది. దానిచే అసత్కామం నశించి, వైరాగ్యం అలవడుతుంది. కామము లేనిచోట క్రోధభయాదులు పుట్టవు. కామ క్రోధాది నాశనముచే పరిపూర్ణానందము, పరమశాంతి లభిస్తవి. మనస్సును, చిత్తమును అలా క్షాళితం చేసికొన్న దినమే సుదినము. కామవృత్తివల్ల కామ నాశం కలుగదు. మనోనిగ్రహమే వాటికి మందు.

౮౯. వర్ణమునుబట్టి, పదవినిబట్టి ఎవరును అహంకరింప రాదు. వర్ణాభిమానములు నశింపవలెనంటే స్వధర్మానురక్తి, భక్తి జ్ఞానములే సాధనాలు. వివేక విజ్ఞానధనులైన పవిత్రులు భక్తి జ్ఞాన ప్రపూర్ణులగుటచే వర్ణాభిమానం వారినంటదు. మానవుని కర్మ ప్రవృత్తియందు ధర్మం లోపించగానే, హృదయం భక్తిశూన్యము, బుద్ధి జ్ఞానశూన్యము అవుతుంది. అంతట వర్ణాభిమానాలు ప్రకోపిస్తవి. మన శాస్త్రాలు వర్ణాహంకృతి దూష్యమనీ, పాపమనీ చెప్పుచున్నవి. ఏ వర్ణానికి విహితమైన ధర్మాలను ఆ వర్ణం శ్రద్ధా భక్తులతో ఆచరించవలెనేకాని స్వర్ణాభిమానం వహించకూడదు. ఏ వర్ణమువాడైనా తన్ను నికృష్టునిగా ఎంచుకోవాలేగాని ఉత్కృష్టత నాపాదించుకోకూడదు. మన తప్పులను దిద్దుకునే వివేకాన్ని, శక్తిని పరమేశ్వరుడనుగ్రహించుగాక!

౯౦. ఇతరవస్తువులయందే ఆశ కలుగుతుంది. మనకంటే ఇతరము లేకపోతే అంతా మనమే అయిపోతే ఆశలేదు. ఆశ లేని కారణంగా యత్నమూ లేదు. ప్రయత్నపూర్వకమైన పాపమూ లేదు, పాపములేనందున దేహము, దేహము లేనందున దుఃఖమూ లేదు. మనము చేసే ప్రయత్నములన్నీ దుఃఖంలేకుండా ఉండాలనే కదా!

'రెండవది' అని ఒకటి ఉంటే అది మనకంటె శక్తివంతు మైతే దానినిచూచి మనకు భీతి కలుగుతూ ఉన్నది. అది అందంగా ఉంటే మనము దానికొరకు అర్రులు చాస్తున్నాం. రెండవ వస్తువు అనేదే లేకుంటే ఆశ లేదు, ద్వేషమూ లేదు, భయమూ లేదు. రెండవ వస్తువు ఉంటేనే భయము. రెండవ వస్తువు లేకుండా చేసేది అద్వైతమే.

౯౧. మనలో ప్రతి ఒక్కరూ కొంతకుకొంతైనా సాముహిక సేవలో పాల్గొంటూ దుఃఖములోనూ కష్టములోనూ చిక్కుకొన్న యిరుగుపొరుగు వారికి స్వార్థం వదలుకొని పరోపకారం చేయుట అలవరచుకోవాలి. సేవాధర్మాన్ని స్మరించినప్పుడు యావజ్జీవమూ పరులకొరకే పాటుపడిన అవతారమూర్తి శ్రీకృష్ణపరమాత్మ, దాసత్వంలో తన వ్యక్తిత్వమే మరచిపోయిన రామభక్తశిఖామణి ఆంజనేయుడూ స్మృతిపథంలో మెదులుతారు.

౯౨. ప్రజలకు ఏదోవిధమైన బాధ, భీతి, కష్టము, నష్టము, విచారము, దుఃఖము ఉంటూనే ఉన్నాయి. అటువంటి అభాగ్య సోదరులను చూచినప్పుడు వారిని తాపశమనంగా ఓదారుస్తూ జాలితో కూడిన నాలుగు ఉత్సాహ వాక్యాలు పలకటము, చేతనైన సాయం చెయ్యటము ఎంతో అవసరము. రోగులకు సేవను, చికిత్సను చేయుట, దుర్మార్గుల వలలో చిక్కుకొన్న బలహీనులను రక్షించుట, నిస్సహాయముగా ఉన్నవారికి ధనరూపముగా గాని, దేహశ్రమతోగాని సాయంచేయుట వీనినన్నిటిని మానవసేవగానే పరిగణించాలి. దుఃఖములో చిక్కుకొన్న దురదృష్టవంతుల చింతలను దూరం చేయడానికి మనము పూనుకోవాలి. ధర్మం కొంచెం చేసినాచాలు. మానవుల కష్టాలను సాధ్యమైనంతవరకు దూరీకృతం చేసే అభిలాషను మనము వృద్ధి చేసుకోవాలి.

౯౩. అద్వైత సిద్ధాంతమును చక్కగా అర్థము చేసుకోవలెనంటే, మొదట వివేకచూడామణిని, పిదప 'అపరోక్షానుభూతి'ని చదువవలె

౯౪. మీరు ఏ కార్యంచేసినా సరే! కర్త యొక్క ముఖ్యోద్దేశము ప్రేమయే అయి ఉండాలి. ఇచ్ఛా ద్వేషాలకు, క్రోధమాత్సర్యాలకు అందులో తావుండరాదు. మనము చేసే ప్రతిఒక్క పనిలోను ఈ ప్రేమ అనేది ఓతప్రోతమై ఉంటే ప్రపంచములో ఎట్టి గడ్డుసమస్యలనైనా సరే, మనము అవలీలగా సాధించగలము. భారత దేశపు ఋషులు, మహాత్ములు పాశ్చాత్య దేశాలకు ఇచ్చే సందేశం ఇదే.

౯౫. ప్రతి భారతీయునకు రాముని శీలమే లక్ష్యము. ప్రతి భారతీయునకు రామనామమే మహామంత్రము. మనలను పీడించే రుజా వైవిధ్యానికి రామనామామృతమే మందు.

౯౬. మనము చూచే వస్తువులకు రంగు ఉన్నది. బొమ్మలకూ, బట్టలకూ మనము రంగు వేస్తాము. దానిని తుడిచి వేరేరంగు కూడా వేయవచ్చు. ఏ రంగుగల వస్తువైనా నిప్పులో వేస్తే బొగ్గయి నల్లనవుతుంది. అందువల్ల ఈ కనబడేరంగులు సత్యం కాదు. అన్నీ నిప్పులో నల్లబడుతున్నవి. పోనీ ఆ నలుపైనా సత్యమా అంటే అదీ కాదు. ఇంకా కొంత సేపు అగ్నిలో పుటం వేస్తే భస్మమౌతుంది. అపుడు నలుపు తెలుపవుతుంది. ఆ తెలుపు సత్యము.

౯౭. అగ్నిలో పుటం వేసినపుడు ఏవస్తువుయొక్క స్వరూప స్వభావాలు మార్పుచెందవో ఆ వస్తువు సత్యమనీ, తక్కినదంతా అసత్యమనీ, గ్రహించాలి. ఈ భావనకు చిహ్నంగా మనకు నుదుట భస్మము నలదుకొంటాం. అగ్నిలోపుటం వేసినట్లు తత్వాన్ని పుటం వేసి కారణాలు వెదుకుతూపోతే అన్ని కారణాలకు కారణమైన పరమకారణం తెలుసుకుంటాం. అది లేకపోతే సృష్టే లేదు.

౯౮. మనకు మూడు విధములైన తల్లులున్నారు. మొదటిది, కన్నతల్లి. స్తన్యమిచ్చి, మనలను పెంచుతుంది. రెండవది, ప్రజలందరికీ పాలిచ్చి పెంచేది గోమాత. మూడవది ...

రమూ ఇచ్చి దేహవర్ధనమూ, ఆత్మవర్ధనమూ చేసేతల్లి, జన్మభూమి. అచేతనమైనా, ఆమెలో దైవసాన్నిధ్యమున్నది. అందు చేతనే ఆమెను భూదేవి అని వ్యవహరిస్తున్నాము. ఈ మూడు తల్లులకూ మూలమైన తల్లి పరాశక్తి. కావున మనము కన్నతల్లికీ, గోమాతకూ, భూమాతకూ, ఆ జగన్మాత స్మరణతో సేవచేయాలి. ఈ సేవలన్నీ ఆ పరాశక్తికి సేవలే.

## ౨౬౪ శ్రీ కేశవపూర్‌జీ మహారాజ్

౧. శిక్ష, సదాచారములే మన జీవితమునకు గౌరవము. సదాచారము నుల్లంఘించువారికి యజ్ఞయాగజపతపాదులు మేలొనర్చలేవు. సదాచారము లేనిది హృదయము శుద్ధికానేరదు. హృదయశుద్ధి కానిది మానవుడు శుభమును పొందలేడు.

౨. జలములో, దారిలో మలమూత్రాదులు విసర్జించి, అపవిత్రపరచుట అపరాధము.

౩. అహింసాపరులు, కల్యాణము కోరువారు, శారీరక హింసతోపాటు, మనోవాచక హింసలనుకూడా త్యజించుటవసరము. లేనిచో మనశ్శుద్ధి కానేరదు. మనశ్శుద్ధి కానిదే ఆత్మప్రాప్తి అసంభవము.

౪. హృదయమునకు బాధకలిగించు మాటలను ప్రయోగింపకుము. చాడీలు చెప్పకుము. కపటాభిమానములను త్యజింపుము.

౫. కలహమునకు మూలము నవ్వు. రోగమునకు మూలము దగ్గు. కావున సావధానుడవై మెలంగుము.

౬. మూర్ఖులు, పిచ్చివారలు, అంగహీనులు, వ్యసనులు మొదలగువారిని తిరస్కరింపకుము.

౭. నీకేది అప్రియమో దాని నితరులకు జేయకుము.

## ౨౬౫ హజరత్ అలి రదీ సాహెబు

౧. ఓ ముసల్మానులారా! మీ పరీక్షార్థమై మీ రిచటికి పంపబడితిరి. కావున చావకముందే సంసారము నుండి మీ మనస్సును వేరుచేయుడు.

౨. ప్రపంచవస్తువులను జూచి సంతోషించువానికి తుదకు దుఃఖమే సంభవించును.

౩. మీ సత్యపాలనను ఇతరుల యెదుట ఋజువుచేయుటకు యత్నించకుడు.

౪. హృదయమును విప్పదలంతురేని భగవంతుని యెదుట విప్పుడు.

౫. వడ్డీవ్యాపారముతో పొట్టనింపుకొనువాని ముఖము చూడకుడు.

౬. ఓ ప్రజలారా! జాగ్రతపడుడు. మీ కొకనాడు చావు తప్పదు. కావున విషయాసక్తులు గాక ప్రపంచము నొక ధర్మశాలగా దలంచి, అన్నిటితో అసంగులై సత్కార్యములు చేయుడు.

౭. ఓ మహమ్మదీయులారా! భయపడుచో భగవంతునికే భయపడుడు. ఇతరుల భయపెట్టనప్పుడే మీరు భగవంతునికి భయపడగలుగుదురు.

౮. ఇతరులపై వైరముంచి ద్వేషింపకుడు. చెడు తలంపకుడు. చెడు చేయకుడు.

౯. ధనవంతులను దరిద్రులను ఏకరీతిగా జూడుడు. బీదలను దయతో సేవింపుడు.

## ౨౬౬ మహాతపస్వి అబ్దుల్లా మనాజయిల్

౧. నీలో భేదభావ ముండువరకు నియమముగా నిత్యము భగవంతుని ప్రార్థించుచుండుము.

౨. మృత్యువుకంటె మొదలే నీవు సిద్ధమైయుందువేని, ఇక నీకు మృత్యుభయ మేల?

3. కర్తృత్వాభిమానుడవు గాకుము.

౪. మనస్సులో కామవాసనలు, బాహ్యవ్యవహారములో భగవత్ప్రార్థన యీ రెండూ ఎట్లు పొసగును. దీనిచే నీవు భగవత్సన్నిధానమున తలయెత్తలేవు.

౫. కోరిక నిన్ను దాసుని జేయును. ఏ కోరిక లేనివాడే భగవంతునికి దాసుడు కాగల్గును. లేనిచో వస్తు దాసుడగును.

౬. దేనికిని ఆశ్చర్యపడనివాడే తత్వజ్ఞుడు.

౭. సంసారముపై దృష్టి యున్నంతసేపు భగవంతునిపై దృష్టి పోనేరదు.

౮. అందఱికీ, నీకు నీ పుత్రాదులందఱికీ, సృష్టికర్త భగవంతుడే యగుచో నిక వారికి నీ వెందులకు విధాతనని తలంతువు. దీనిచే బంధమేర్పడినది. నీకును వారికిని నాశము చేకూరును. కాన ఆయనయందే నిర్భరుడవు కమ్ము.

౯. ఈశ్వరప్రాప్తికి త్రోవ ఈశ్వరునిలోనే కలదు. కాని పుస్తకములలో లేదు. ఆ యీశ్వరుడు నీలోనే నీకు ఆత్మరూపమున బోధించును.

## ౨౬౭ శ్రీ సత్యదేవుజీ

౧. దుఃఖము విధాతయొక్క దండనవిధానము కాదు. అది ఆయన అనుపమానమైన అనుగ్రహము.

౨. దుఃఖభోగమునకు, దుఃఖప్రభావమునకు అంతరమును జూడుడు. కామనా పూర్తిలో సుఖము, కామనా అపూర్తిలో దుఃఖము భాసించును. ఎట్లన, ఒకని ప్రియపుత్రుడు మరణించినా డనుకొనుడు. ఆ పుత్ర వియోగదుఃఖము తప్పించుకొనుటకై ఇతరుల సంతానమున కాశించును. అదే దుఃఖభోగము.

3. సిద్ధార్థుడొక శవమును జూచి, నాకుకూడా చావు తప్పదని విచారించి దుఃఖ మనుభవించెను. తన జీవితములోనే మృత్యు

వును దర్శించెను. ఇదే దుఃఖప్రభావము. దుఃఖమును విచారించు చుండుట దుఃఖభోగము. దుఃఖకారణమును వెదకుట దుఃఖప్రభావము. సుఖభోగములో ఆదినుండి అంతమువరకు దుఃఖము మిశ్రితమై యుండును. సుఖభోగ మనుభవించువానికి దుఃఖ మనుభవించక తప్పదు.

౪. వస్తు పరిస్థితులలో సుఖము కలదని భావించి, వాటిని భోగింప తలంతురు. అవి నశించగానే సంతాప మేర్పడును. ఇదే దుఃఖభోగము.

౫. దుఃఖమును భోగించువాడు ఇతరులకు దుఃఖమును కలిగించును. ఎవనిపై దుఃఖప్రభావము పడునో వాడు తెలిసికొని ఇతరులకు దుఃఖమును కలిగించడు.

౬. దుఃఖము సంభవించగానే, సుఖమువైపు పరువులెత్తుట. ఇది దుఃఖ మనుభవించు వాని లక్షణము.

౭. విచార శీలుడు సంయోగములో వియోగమును, జీవితములో మృత్యువును, సుఖములో దుఃఖమును దర్శించును. వాస్తవిక జీవితమునుండి అభిన్నుడగుటకు వ్యాకులత జెందుచుండును.

## ౨౬౮ శ్రీ జగదీశ్‌చంద్ర శాస్త్రి

౧. చెవులు, నాలుక మొదలగునవి ఇతరుల కొరకేగాని మన కొరకు కావు. ఇతరుల మాటలు వినుటకు చెవులు, ఇతరులు వినుటకు మాట్లాడుటకు నాలుక అవసరము. కాని అంతరాత్మకు చెవులు, నాలుకతో అవసరముండదు. అంతరాత్మలో మనము స్వయమే వినుచుందుము. స్వయమే చెప్పుచుందుము. ఇతరుల మధ్య, మన మధ్య ఎడముకలదు. అందుకే మనకు చెప్పుటకు నాలుక, వారికి వినుటకు చెవులు అవసరమగును. మన కొరకై చెవులు, నాలుక ఏవియు అవసరముండవు. అనగా అంతరాత్మకై ఏ ఇంద్రియముతోను పనిలేదు. అట్లే పరమాత్మకు శరీరము లేకున్నను సమస్త కార్యములు జరుగుచుండును.

౨. శరీరము లేకనే, ఆత్మ యీ శరీరము నెట్లు నడుపు చుండునో, అట్లే అశరీరుడగు భగవంతుడు సంసారమును నడుపు చుండును.

౩. మానవుడు చెడు, మంచి సర్వము చేయగలడు. కాని భగవంతుడు తన నియమమునకు విరుద్ధముగా ఏమియు చేయలేడు.

౪. ఆత్మ, శరీరము వేరు వేరు పదార్థములు. దేహమునే ఆత్మగా దలంచుట అజ్ఞానము.

౫. కేవల మొకమూర్తిలోనే భగవంతుడు కలడని సేవింప రాదు. సమస్త సంసారమును భగవద్రూపముగా దలంచి సేవింప వలయును.

౬. రాతితోను, కట్టెతోను జేయబడిన విగ్రహములనే మూర్తిగా భావించి పూజింపక, భగవంతుడుగానే భావించి పూజింపవలయును.

## ౨౬. శ్రీ లాల్ రాం గోపాల్‌జీ

౧. ఆత్మ విరుద్ధముగా వర్తించుటే ఆత్మహత్య యన బడును. ఆత్మహంతకులు పశు పక్షి యోనులందు జన్మింతురు.

౨. సుషుప్తిలో, సమాధి అవస్థలో, మోక్షప్రాప్తిలో పర మాత్మ దర్శన మగును. ప్రతిరోజు గాఢనిద్రలో భగవత్సంబంధ మేర్పడును. దానిని వాణిద్వారా వర్ణించుట వీలుకాదు. కావున గాఢ నిద్రలో నున్న జీవుని నిద్రను భంగపరచరాదు.

౩. యమ నియమముల పాలన భగవత్ప్రాప్తికి సోపానము.

౪. నీటిలోని పద్మపత్రమువలె, సంసారములో నివసింపవల యును.

౫. ఉపవాస మనగా దైవగుణములు, దైవస్వభావము మనలో ప్రవేశించుట. దీనిచే మానవుడే మాధవు డగును.

# ౨౪౦ శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

౧. భగవంతుని చూపిస్తావా? మఱియు ఈ పువ్వువాసన చూడనిస్తావా? అని ఒకరు ప్రశ్నించ, భగవంతుని విషయ మట్లుంచి, మొదలీ పువ్వు వాసనను జూడుము. వాసనను చూడ లేనట్లే భగవంతుని జూడలేవు. అనగా వాసన ముక్కుతో ఆఘ్రా ణించును. కాని కంటితో చూడలేదు. ఇంద్రియములకు భగవం తుడు చిక్కడు.

౨. నొప్పి అనుభవించుచున్న వానికే ఆ నొప్పి బాధ తెలి యును. కాని ఇతరులకు దెలియదు. అట్లే భగవంతు డనుభవము వల్ల నెఱుకపడును కాని చూపించలేరు. చూచినను చెప్పలేరు. వాక్కునకు నేత్రములకు గోచరించువాడు కాడు.

3. సినిమా తెరపై బొమ్మలను జూచుచుండు నటులే, జగత్తును మాయాతెరపై జీవులను జూచుచుండుము. తెర ఆధా రము పైననే సినిమా బొమ్మలు కనిపించుచుండును. కాని ఆ బొమ్మలు కన్పించుచున్నంతవరకా తెర కనిపించదు. అట్లే భగ వంతుని ఆధారము పైననే జగత్తు నిలచియున్నది. కాని ఈ దృశ్య జగత్తును మనము చూచుచుండు నంతవరకు, ఆ ఆధారభూతుడైన భగవంతుని మనము దర్శించలేము. జ్ఞానములో భేదములేదు. కాని వస్తువులో భేదము కలదు.

౪. అద్దములో కనిపించు వస్తుభేదము ఆ అద్దము ముందరికి బోవు వస్తువుల భేదమేకాని అద్దముయొక్క భేదము కాదు. అద్దము నిష్కళంకము. అట్లే జ్ఞానము, సంతోషము, క్రోధము మొదలగు నవేవి ఆ ఆత్మముందుకు పోవునో అవే ప్రతిబింబించును. కామ క్రోధాదులు, శాంత శమాదు లన్నియు మనలోనే కలవు. ఆత్మ అద్దము వంటిది. కావున దాని ముందరి కేదిపోవునో అదే ప్రకట మగును. ఆత్మప్రకాశము జగత్తులోని వస్తువులందు పడుట చేతనే, అవి ప్రకాశించుచున్నవి. రంధ్రములుగల ఘటములో దీపము వెలి

గించిన, ఆ రంధ్రముల ద్వారా ఆ దీపజ్యోతి ప్రకాశించి, బాహ్య వస్తువుల కనిపింప జేయునట్లు శరీరములోని ఆత్మప్రకాశము, శరీరపు నవరంధ్రముల ద్వారా బాహ్యవస్తువులందు ప్రసారితమై వాటిని ప్రకాశింప జేయుచుండును.

౫. ఉచ్ఛ్వాసనిశ్వాసలకు నీవు కర్తవుగావు, ఎందుకనగా అవి నీతోపాటు పుట్టినవేగదా! అందుకే నీవు కర్తవు కానేరవు. కర్త భగవంతుడే. అవి లేకుంటే నిజమునకు నీవే ఉండవు.

## ౨౭౧ శ్రీ విద్యాశంకర భారతీ స్వామి

౧. ప్రపంచము నిన్నాకర్షించకుండా యుండు నంతవరకు, వాసనాక్షయము కానంతవరకు నిష్కామకర్మ చేయుచుండుము.

౨. నేను చేయుచున్నానను కర్తృత్వ భావమును వీడి ఫల మందాశను విడిచి యెన్నికర్మలు చేసినను వాటి ఫలము నీకు లభించదు. ఇదే కర్మయోగసారము. ఇదియే జీవన్ముక్తి, నిత్యముక్తి. బ్రతికియుండగానే ముక్తిని బడయుటుత్తమము. ఇది సర్వాత్మ భావమువల్లనే లభ్యమగును.

3. ప్రపంచము సత్యముకాదు, అబద్ధముకాదు. అనిర్వచనీయము. ప్రపంచ మొకశక్తి. శక్తిపరివర్తన చేతనే ప్రపంచము గోచరించును. ప్రపంచము వస్తువుకాదు. వస్తుత్వము లేకుండా మారునది ప్రపంచము. అందులకే అది మిథ్య యనబడును. వస్తుత్వము లేక కనబడునదే తుచ్ఛము. కుందేటి కొమ్మువలె కనబడదు. భగవచ్ఛక్తి ఒక్కటే నిత్యము. దానికి మార్పులేదు. ఈ రెంటికి మధ్యనున్నదే ప్రపంచము. ఇదే మిథ్య. అనగా ఉన్నది లేదు. స్వప్నము వంటిదే ప్రపంచము. మట్టి సత్యము, ఘటము వ్యవహారము. అట్లే భగవంతుడు సత్యము. వ్యవహారమునకై సౌకర్యమునకై ప్రపంచ పదార్థము లేర్పడెను.

౪. ప్రతిక్రియయు భగవత్సేవ గురించియే జరుగవలయును. భూమిపై కాలుపెట్టబోయే ముందే భూమికి మ్రొక్కి పిదప కాలు

పెట్టుము. నీ స్వార్థమునకై కాలుపెట్టకుము. చెట్టుపుల్లను త్రెంచ బోవునపుడు మొదట చెట్టుకు నమస్కరించి పిమ్మట పుల్లను త్రెంచుము. అప్రయోజనముగా నీ స్వార్థము కొరకు త్రెంచకుము. ఎందుకన ఆ చెట్టులోకూడ భగవంతుడు కలడు. భగవదాజ్ఞ లేకుండ నీకు దానిని ముట్టుటకు హక్కులేదు. నీ శరీరముతో సహా నీకు గోచరించున దంతయు నీదికాదు. నీది కాని దానిని నీదను కొంటివా నీవు దొంగవే.

౫. నిన్ను నీ వెట్లు ప్రేమింతువో అట్లే అన్ని జీవులను ప్రేమించుము.

౬. పాలు బంగారు గిన్నెలో నున్నను, వెండి గిన్నెలో నున్నను, మట్టికుండలో నున్నను, పాత్రల ఉపాధిభేదమే కాని పాలలో మాత్రము భేదము లేదుకదా! అట్లే శరీరములు, జాతు లన్నియు వేరు వేరు కాని అందఱిలోని ఆత్మమాత్ర మొక్కటియే. జాతులే ఉపాధి భేదములు. వీటి భేదము తప్పదు. ఏలన, ఇది సృష్టి సిద్ధాంతము. ఆ గిన్నెల స్వభావములు వేరు వేరైనట్లే జాతుల స్వభావములు కూడ వేరు వేరుగానే యుండును.

౭. రజ్జు సర్పభ్రాంతి మూలమున, అజ్ఞానదశలో రజ్జు సర్ప ముగా గోచరించును. జ్ఞానదశలో అదే త్రాడుగా విశదమగును. అట్లే అజ్ఞానదశలో ప్రపంచ రూపము గోచరించి, జ్ఞానదశలో ఆ ప్రపంచ రూపమంతయు బ్రహ్మరూపముగా గోచరించును. సర్ప భావ మున్నప్పుడు త్రాడు కనిపించినదా? లేదు. రజ్జుభావమున్న ప్పుడు సర్పభావముండదు. స్వప్నములో శరీరభావముండదు. శరీరభావముండిన స్వప్నముండదు. అట్లే ప్రపంచము కనిపించిన, భగవంతుడు కనిపించడు. భగవంతుడు కనిపించునేని జగత్తు కని పించదు.

౮. దానము చేయునపుడు, దానము పుచ్చుకొనువాడు భగవత్స్వరూపుడని భావించి దానము చేయుదువేని, నీ మమకారము తగ్గును. కావున వానిని నీకుపకారిగా దలంచుము.

౯. సర్వము భగవత్స్వరూపమే. కాన జడచైతన్యము లన్నిటిని భగవత్స్వరూపులుగా దలంచి పూజింతువేని, దీనికి పై మెట్టగు నిరాకారభావ మేర్పడును. అనగా కనిపించున దంతయు బ్రహ్మ భావముగా దలంచు స్వభావమేర్పడును.

౧౦. నిన్ను నీవు నిమిత్తమాత్రునిగా దలంచి, వ్యవహరించుచు, నాటకసూత్రధారివలె నీ పాత్రను చక్కగా నిర్వహించుము. గర్వించి కర్తృత్వమును నీ నెత్తిపై వేసికొనకుము.

౧౧. ఎవనిచే ఏ జీవికిని భయముండదో, ఏ జీవికిని యెవడు భయపడడో, వాడే అద్వైతజ్ఞాని.

౧౨. ప్రారబ్ధములో నున్నట్లే జరుగును కాని పురుషార్థ మేమియు లేదని ఒక డనును. నొసట వ్రాసినట్లే జరుగునని యొక డనును. జాతకము లేదు, దైవము లేదు, అంతయు దేవుని ప్రేరణతోడనే జరుగునని మఱొకడనును. అంతఃకరణ చోదనప్రకారమే సర్వము నడచునని ఇంకొకడనును. సత్పురుషులకే అంతఃకరణములో దైవప్రేరణ గల్గును. పవిత్రహృదయులకే అంతఃప్రేరణ వినబడును. దైవము లేదు, ప్రారబ్ధము లేదు, కర్మచేతనే ఫలము లభించును. కాన పురుషార్థమే కారణమని కర్మవాది యనును.

౧౩. పూర్వజన్మ ప్రకారమే యిప్పుడు జరుగుచుండును. విధిని తప్పింప నెవరితరము? ప్రారబ్ధము స్వతంత్రముకాదు. కర్మవల్లనే ప్రారబ్ధ మేర్పడును. బ్రహ్మలిఖితము కూడా కర్మననుసరించియే యుండును. కర్మసిద్ధాంత ప్రకారమే అంతఃకరణ ప్రేరేపించును. పూర్వజన్మలోని పురుషప్రయత్నమే యీ జన్మలో ప్రారబ్ధమగును.

౧౪. పై కెగురవేసిన ఱాయి క్రిందబడుట కర్మసిద్ధాంతము. విమానములో పై కెగురుట పురుషసిద్ధాంతము.

౧౫. నదీప్రవాహములో కొట్టుకొనిపోవుట కర్మసిద్ధాంతము. ప్రవాహమున కెదురీత పురుషసిద్ధాంతము.

౧౬. ప్రారబ్ధకర్మను తెలిసికొని, దానిని పురుషప్రయత్నముచే త్రిప్పుకొనవచ్చును. అనగా ప్రారబ్ధానుసారము బుద్ధిపుట్టినను దాని మంచిచెడ్డల తెలిసికొని, చెడ్డదానిని పూర్తిచేయకముందే మంచిదానిని పూర్తిచేయుటే పురుషార్థము. అనుభవించవలసిన కర్మ అనుభవించక తప్పదు. ఆగామి సంచితమును తప్పించుకొనవచ్చును. ప్రయత్నముచే దొంగతనము చేసిన, బందిఖానాలో పెట్టబడును. ఆ కర్మఫలమును అనుభవింపకతప్పదు. బందిఖానానుండి బయటకు వచ్చిన తదుపరి. సంస్కారమువల్ల మళ్ళీ బుద్ధిపుట్టుచో దానిని తప్పించుకొనుటకు యత్నించుటే పురుషార్థము.

౧౭. భక్తిస్వరూపమే ప్రేమ. ప్రతిఫలాపేక్ష లేకుండ ప్రేమతో చేయబడు సేవయే భక్తి.

౧౮. ప్రయోజనమునకై చేయబడుసేవ భక్తికాదు. ప్రపంచ వ్యవహారములో ప్రయోజనము లేకుండ ఏ కార్యము చేయరు.

౧౯. 1. వ్యవహారభక్తి 2. నిమిత్తభక్తి 3. కారణభక్తి 4. ద్వైతభక్తి 5. అద్వైతభక్తి 6. స్వస్వరూపభక్తి యని భక్తి ఆరువిధములు.

1. కోరికతో జేయబడునది వ్యవహారభక్తి.
2. నిమిత్తముతో చేయునట్టి భక్తి నిమిత్తభక్తి.
3. కారణములేక చేయబడునది కోరికలేని భక్తి.
4. చెట్టుకు తీగకు గల సంబంధము. అనగా చెట్టుకు తీగ అల్లుకొనునట్లు, భక్తుడు భగవంతుని వియోగమును సహింపలేడు. ఇదే ద్వైతభక్తి.

5. నదులకు సముద్రమునకు గల సంబంధము. అనగా నదులన్నియు సముద్రములో కలసి, తమ నామరూపములను నశింపజేసికొని సముద్రమయమగును. ఇదే అద్వైతభక్తి.

6. సూర్యుడు నీటిలో ప్రతిబింబించునపుడు రెండుసూర్యులుగా కనిపించును. సూర్యుడు లేనిది ప్రతిబింబ ముండదు. నీళ్ళు లేకున్నను ప్రతిబింబముండదు. ఒకటే ఉపాధి భ్రమచే రెండుగా కనిపించును. ఇదే భ్రమ. అట్లే దేవునియొక్క ప్రతిబింబమే జీవుడు. నీళ్ళను మనస్సులో జీవుడను ప్రతిబింబము కనిపించును. అటులనే దేవుడొక్కడైనను ఉపాధి భేదముచే జీవులనేకములుగా కనిపించును. ఇదే స్వస్వరూపాను సంబంధభక్తి.

౨౦. మానవుని కార్యములన్నియు నిష్ఫలమైనప్పుడే మానవుడు భగవంతునివైపు తిరిగి ప్రార్థించును.

౨౧. అర్జునుని పురస్కరించుకొని శ్రీకృష్ణుడు జగత్తునకు జ్ఞానోపదేశము జేసెను.

1. గీత జ్ఞానప్రధానమైన మోక్షగ్రంథ మయ్యెను.
2. కైకేయీ మూలమున శ్రీమద్రామాయణము ధర్మగ్రంథమాయెను.
3. పరీక్షిత్తు, శమీకఋషి మూలమున భాగవతము భక్తి ప్రధానమైన గ్రంథమాయెను. భగవంతుడు, మానవుల పుట్టించకముందే, శరీరరక్షణమునకు అన్నమును, ఆత్మ సంరక్షణ కాధ్యాత్మికవిద్యను సృష్టించెను. అనగా వేదమును సృష్టించెను.

## ౨౮౨ శ్రీ చల్లా చంద్రమౌళిశాస్త్రి

(స్థానవిద్వాంసులు_శారదాపీఠము-శృంగేరి)

౧. కోరిక ఆర్పి తీర్చుట, తీర్చి ఆర్పుట అని రెండురకములు. ఆర్పుట అనగా కోరిక మీది మమత్వమును తుడిచివేసి, పిమ్మట

ఆ కోర్కెను నిష్కామముతో తీర్చుట. కోరికను తీర్చి పిమ్మట దాని అశాశ్వతమును తెలిసికొని, మళ్ళీ అట్టికోరిక కలుగకుండా పూర్తిగా దానిమీది మమతను తీర్చుట. కోరికను ఆర్చితీర్చ వలయునా లేక తీర్చి ఆర్చవలయునా అనుదానిని బాగుగా విచారించి, దానిమూలమును దెలిసికొని ఆచరింపవలయును.

౨. ఆత్మనశించునదికాదు. శరీరముండునదికాదు. కాన దీనికై దుఃఖమెందులకు? తప్పనిదానికై విచారించుటేల?

3. ఋణము తీరువరకు కర్మచేయువలసినదే. ఋణమనగా నిత్య కర్తవ్యకర్మలు. దృఢవైరాగ్యము కలుగువరకు కర్మతప్పదు. దృఢవైరాగ్యము వాసనాక్షయము కానిదే సన్యాసము స్వీకరించుట కధికారములేదు.

౪. ఆత్మదృష్టితో కర్మచేయుదువేని, దాని ఫలము నిన్ను బాధించదు. నీ ప్రతిక్రియ యజ్ఞరూపమై యుండవలయును. అనగా స్వార్థరహితమై పరోపకారపరమై యుండవలయును.

౫. కర్మలను, క్రియలను నీవు ఆపలేవు. కనుక భగవంతునిపై దృష్టిపెట్టి చేయుచుండుట అభ్యసింతువేని కొన్నాళ్ళకు వాటంతటవే జరుగుచుండును.

౬. ప్రకృతిలోనున్న శక్తియే మనలో కలదు, ఆ శక్తిని మనము సంపాదింతుమేని మనకు దివ్యదృష్టి మొదలైన గొప్ప శక్తులు చేకూరును. కాని ఆ ప్రకృతిశక్తిలో మనము లీనమైననాడే ఆ శక్తి మనకు లభించును. అనగా పంచభూతములందు కోరికలేక అనాసక్తులమైనప్పుడే ఆ శక్తి లభించును.

౭. జగత్తులో మన యవసరములు తీర్చుచున్నవన్నియు మన కంటె గొప్పవే. అవి మనకు పూజ్యములే. కాన వాటిని గౌరవించ వలయును. ఒక చిన్న పెంకైనను అక్కరకువచ్చుచో గౌరవించ వలయును. ఇదే మన ధర్మము. అందువల్లనే హిందూమతములో

చెట్లు, గుట్టలు, పశుపక్ష్యాదులు, కీటకములు, పంచభూతమయ మగు జడ చైతన్యములన్నిటిని పరమాత్మస్వరూపముగా భావించి, పూజించు సిద్ధాంతము కలదు.

## ౨౭3 ఆచార్య కృష్ణాజీ

౧. వాణి మాధుర్యముగను, ఓజస్విగను ఉండవలయును. సదా ఓంకారోచ్చారణచే వాణి పవిత్రమగును. పశువుకు మానవునికి ఇంతేభేదము. నీతలంపును మొదట మననమను జల్లెడచే వడియగట్టి, తదుపరి వాక్కుద్వారా బయటికి పంపుము. ఎందుకన లోకులువిని ఛీఛీ అనకుందురుగాక !

౨. నీ మాటలచే నితరుల మనస్సు నొవ్వకుండునట్లుగా విచారించి మాట్లాడుము.

3. అహంకారముచేత మలినమగు వాక్కును బయటికి వెడలనీయకుము. అది అసహ్యముగా నుండును. దుర్గంధపూరితమైన మాటలను లోకులు సహించరు.

౪. వాక్కులో అసత్యముండరాదు. వదరుబోతుతనము మంచిదికాదు. మొదలు శబ్దమును తూచి, తూచి పలుకుము. మాట్లాడుటకంటె మౌనమే మంచిది. ఒకవేళ మాట్లాడవలసి వచ్చిన సత్యముగను, మధురముగను, మితముగను మాట్లాడుము. బయటికి వెళ్ళినమాట తిరిగి రాకూడదు. అనగా నీమాట వ్యర్థము కారాదు.

౫. ప్రేమయుక్తమైన మధురవాక్కుచే సమస్తజగత్తును జయించవచ్చును.

౬. పరనింద లేకుండునట్లుగా నీ వాక్కును నియమించుము. పరనిందాపరుడు దుర్జనుడే.

౭. మాటకు విలువ యుండవలయును. కన్ను పవిత్రముగా నుండవలెను. చెడు చూడరాదు. చెడు తలంచరాదు.

౮. నీతో సహా సంపూర్ణముగా భగవంతునకు సమర్పితుడవు కమ్ము.

౯. సృష్టిలోని మానవులందఱిని నీ సహోదరులుగా దలంచి ప్రేమతో వారిని సేవించుము.

౧౦. మొదట వాణిని ఉపాసించుము. అనగా దానిని సదా జాగరూకతతో కనిపెట్టుచుండుము. ఎందుకనగా అది అసత్తు కారాదు. మొదట వాణిని సంస్కరింపవలయును.

౧౧. జలమును వడియగట్టి త్రాగుము. నడుచునప్పుడు పవిత్రహృదయముతో క్రిందచూచుచు నడువుము.

౧౨. పరధనమున కాశించకుము 1. ధనము శ్రమపడు వానిదే నని శూద్రుడనును. 2. జన్మాధికారముచే ఈ ధనము నాదని వైశ్యుడనును. 3. రాజ్యమేలునట్టి క్షత్రియునిదే యీ ధనమని క్షత్రియుడనును. 4. ధర్మశాసనము నిర్మించునట్టి బ్రాహ్మణునిదే యీ ధనమని బ్రాహ్మణుడనును. 5. ధనము యెవరిదీకాదు. అది అందఱిది. జగత్తుదని వేదములు ఘోషించును. నిజమునకు ధన మెవ్వరిదీకాదు.

౧౩. ఎవని హృదయములో ధనసంపత్తులందు మోహ లోభములుండవో వాడే పవిత్రుడు.

౧౪. మమ (నాది) అను యీ రెండక్షరముల జపించు వానికి మృత్యువు ప్రాప్తించును. మమత్వముచే భేదమేర్పడ్డి కలహములు సంభవించును.

౧౫. న మమ-ఇది నాదికాదను యీ మూడక్షరముల జపించువానికి అమృతము ప్రాప్తించును.

౧౬. ఇచ్చుచు పొమ్ము, కాని తీసికొనకుము. ప్రతి పనిలో ప్రతి సమయమందు యీ భావమునే అనుసరించుము.

౧౭. పంచభూతములు 'ఇదం నమమ' అనుచుండును. అనగా అవి ఇచ్చుచుండునేకాని తీసికొనవు.

౧౮. స్వార్థమును త్యజించి, సకలజీవులను దేవతలుగా భావించి, వానిని సత్కరింపుము. మొదట అందరిని తృప్తిపరచి, పిదప మిగిలిన దానిని ప్రసాదరూపమున గ్రహించుము. తనకొరకే పాకముచేసికొనుట అసురపద్ధతి. లోభమే పాపమునకు మూలము.

౧౯. జీవన్ముక్తుడవు గాదలంతువేని, నాది నాది అను తలంపును పూర్తిగా త్యజింపుము.

౨౦. తనను తాను ప్రశంసించుకొనువాడు తనను తాను నశింపజేసికొనువాడగును.

౨౧. ఇతరులపై నీ ఉపకార ముండునట్టి పనిని జేయుము. అనగా నీ ఉపకారము వారి దోషములు హరించునట్లుగా నుండవలెను.

౨౨. ద్రోహులను శిక్షింపకుము. కాని వారిలోని ద్రోహభావములను నశింపజేయుము.

౨౩. స్త్రీ స్వతంత్రురాలు కాదు. బట్టకు పడుగుపేకలు ఆధారములు. పడుగే పురుషుడు. పేకయే స్త్రీ. పడుగు ఆధారము పైననే పేక నిలిచియుండును. కాన స్త్రీ, పురుషుని ఆధీనమై యుండును. పురుషుడు స్వతంత్రుడు. స్త్రీ పురుషాధీనము.

## ౨౭౪ శ్రీ స్వామిరాం

౧. ఏకాదశి అనగా పది ఇంద్రియములు, మనస్సు ఈ పదునొకండును కలసి ఏకాదశి అనబడును. ఈ పదునొకండింటిని పవిత్రపరచుటకై ఏకాదశీవ్రతమేర్పడినది. అష్టమినుండి పూర్ణిమ వరకు ఆహారమును తగ్గించి, శరీరమును తేలికపరచవలయును. ఆ కాలములో చంద్రుడు పురోగతిలోనుండును.

౨. యుక్తాహార మనగా న్యాయముగా సంపాదించిన దానిని పవిత్రభావముతో, భగవద్భక్తితో, ప్రసన్నహృదయముతో వంట చేయువారు ఆహారము సిద్ధము చేయవలెను. తినువారు కూడా

ప్రసన్నహృదయముతోను భగవద్భావముతోను భుజింపవలెను. ఈ విధముగా వర్తించుటే యుక్తాహార మనబడును. దీనిని అన్నమయ కోశమందురు. ఈ దేహము పంచ (5) ప్రాణములు, పంచ (5) కర్మేంద్రియములు, పంచ (5) జ్ఞానేంద్రియములు, చతుష్టయము (4) చేరసి పందొమ్మిది (19) ఇంద్రియ అవయవములను ముఖముల ద్వారా పోషింపబడు చుండును. ఈ దేహమునకు పవిత్రాన్న మెట్లవసరమో అట్లే వాక్కు, నేత్రములు, మనోబుద్ధి చిత్త అహంకారములు మొదలగు ఇంద్రియము లన్నియు నిర్దోషములుగా పవిత్రములుగా నుండుటే యుక్తాహార మనబడును. అయుక్తముగా మాట్లాడి శబ్దమును, క్రూరదృష్టితో చూచి నేత్రములను అపవిత్రము చేయుచుందుము. కావున యుక్తాయుక్తములను చాలా జాగ్రతతో జూడవలయును. అయుక్తమైన దానిని ఏ ఇంద్రియము ద్వారానైనను లోనికి పోనీయరాదు. సర్వేంద్రియములు నిర్దోషములై, దేహము పవిత్రమై, జీవుడు పరిశుద్ధుడైనప్పుడే శరణాగతుడు భగవద్దర్శనమునకు పాత్రుడగును.

3. విహారమనగా ప్రాణమయ కోశము. ప్రాణమయ కోశాధారము పైననే అన్నమయకోశ ముండును. ఈ ప్రాణవాయువును కూడ పవిత్రము చేయవలయును. శ్వాసతో భగవన్నామమును జోడించి నియమముగా స్మరించుచుండ వలయును. ఈ స్మరణతో పాటు భావ ముంచుదువేని, నీవు అదే అగుదువు. దీనిని ప్రాణమయ కోశమందురు.

౪. మనోమయ కోశము, మనస్సులో దుస్సంకల్పములు జనించుటే అయుక్తమనబడును. వికల్పరహితమగు సంకల్పము లే యుక్తమనబడును. వికల్పములచే ఆత్మబలము తగ్గును. వికల్పములు లేనిచో సంకల్పమునకు బలముచేకూరి వాక్కు శుద్ధియగును. నీ వన్నది సత్యమగును. వికల్పముల వలననే మనకు దుఃఖములు కలుగు చుండును. మనస్సుతోపాటు భగవత్స్మరణను జోడించి

స్మరించవలయును. ప్రతిమాటయందు భగవదేచ్ఛయను పదమును జేర్చి వ్యవహరింప వలయును. అంతర్బాహ్య కర్మలందు భగవద్భావన యుండుటే యుక్తమనబడును. దీనిని మనోమయ కోశమందురు.

౫. విజ్ఞానమయ కోశములో మానవత్వ మేర్పడును. మొదట మానవుడవు కమ్ము. తదుపరి నీవే మైన కాగలుగుదువు. భేదభావముండక జ్ఞానయుక్తమై యుండ వలయును. జ్ఞానముతో విజ్ఞానమును జేర్చవలయును. బుద్ధితో భగవద్భావన జేర్చుదువేని బుద్ధి యుక్తమగును. లేనిచో వితర్కబుద్ధి యగును అనగా ప్రతి దానిని ఖండించి భేదము కల్పించును.

## ౨౭౫ మహాత్మ హోషం సాహెబు

౧. ఈ రోజు నీ కొరకు నీ వేమి చేసితివో దీనిని మొదట విచారించి పిదప మఱొకటి విచారించుము.

౨. ప్రార్థనకు మొదలు హృదయమును ప్రాయశ్చిత్తముచే పరిశుద్ధము చేయుము.

౩. ఇతరులను అన్యులనుగా దలంచుటే అధర్మము. (భేద బుద్ధియే అధర్మము.)

౪. పాపముచేతనే మనస్సు రోగగ్రస్త మగును.

౫ నీవు విచారించు దానిని భగవంతుడు తెలిసికొనును. నీవు చేయు దానిని చూచును.

౬. ఇతరుల యాచింపకుము. అపరిగ్రాహకుడవు కమ్ము. స్వాదిష్ట భోజనమును స్వీకరింపక సాధారణ సాత్వికాహారమునే గ్రహింపుము.

౭. అహంకార రహితుడవై మెలగుము. నీ వేమి చెప్పినను దానిలో అభిమాన ముండరాదు.

౮. నిందించుట పాపమునకు మూలము. కాన ఎవ్వరిని నిందింపకుము.

౯. ఇతరులకు కీడొనర్పక సదా సర్వదా మేలొనర్పు చుండుము.

౧౦. నిష్కపట భావమున ప్రార్థన చేయుము. నిస్పృహ భావమున మాట్లాడుము. నిరాశచే, నిష్కామ భావమున సేవ చేయుము.

౧౧. ఇచ్ఛాసక్తులచే చేయబడు ధ్యానము అధర్మము.

౧౨. నీకు ఆకలి జ్ఞాపక మున్నంతవరకును, అది లేనిచో దుఃఖము గోచరించు వరకును గృహమును వీడకుము. కూటిపై ఆశ కలవాడు నిజమైన విరక్తుడు కాడని తలంచుము.

## ౨౭. ఆచార్య రజనీశు

౧. భగవంతుని పొందుటకు సర్వమూర్తులను, సర్వవిగ్రహ ధారణలను వీడవలసియుండును. నిర్మిత కల్పనల మాయాజాలము అన్నిటిని త్రెంపవలసి యుండును.

౨. స్వ-అజ్ఞానమె సంసారము. ఆత్మజ్ఞానమే మోక్షము.

౩. ప్రభువును తెలిసికొనుటకు ఎటుపోవలసిన పనిలేదు. కేవలము స్మరింపవలయును. ఏమి చేయవలసిన పనిలేదు. కేవలము నే నెవడనని తెలిసికోవలసి యుండును. తెలిసికొనుటే పొందుట. క్రియచే భగవత్తత్త్వము చేకూరదు. నిష్క్రియలోనే భగవత్తత్త్వము ప్రకటమగును.

౪. ఆయనను పిలువవలదు. ఆయన పిలుపునే మనము వినవలయును. ఇది పరిపూర్ణ నిశ్చల చిత్తమైన మౌనములోనే సిద్ధించును. ప్రార్థన యనున దొకటి లేదు. పరిపూర్ణమౌనమే ప్రార్థన. ప్రార్థన క్రియకాదు. అదొక అవస్థ.

౫. సర్వమును త్యజించుటకు సాహసించువాడే ఆయనను పొందగలుగును.

౬. భౌతిక నిర్ణయము లన్నిటిని విడచిన వాని చిత్తము లోను, తార్కిక ధారణలన్నిటిని త్యజించిన వాని చిత్తములోను,

మానసిక ఆగ్రహ అనుమానములను త్యజించినవాని నిర్మల చిత్తములోను సత్యము తాండవించును.

౭. నిర్విచార, నిర్వికల్ప, నిశ్శబ్దతగల ప్రదేశమందు ధర్మము ప్రవేశించును.

౮. నీవు నీ సమస్తావరణములను తొలగించినప్పుడే, నిజస్థితి బయలు పడును. ఆ నిజస్థితియే నిన్ను అజ్ఞానమునుండి తొలగించుటకు హేతువగును. ఆ అజ్ఞాన బోధయొక్క తీవ్రసంతాపమే నీ క్రాంతికి మూలము.

౯. శాంతి అభ్యాసముచే చేకూరునది కాదు. అది కేవలము సద్భావము వలన చేకూరును. శాంతియే మన స్వరూపము.

౧౦. తనను తాను తెలిసికొనుటే జ్ఞానము.

౧౧. యాచించు వానికే లభించును. దీనికై కేవలము తనను తాను సమర్పించుకొనుటకు సాహసింప వలయును.

౧౨. తనను సమర్పించుకొనుటకు, తాను నశించుటకు, శూన్యుడగుటకు సాహసింపవలయును. తాను నశించుట కిష్టపడువాడు పూర్ణుడగును. మరణించుటకు సిద్ధపడువాడు అమరుడగును.

## ౨౭౭ స్వామి విచిత్రానందజీ

౧. కేవలము వేయిమాటలకు ఒకే మాట, వేయిమంత్రములకు ఒకే మంత్రము, సర్వదుఃఖక్లేశములకు 'మందు' సేవా శుశ్రూషయే. మానవపూజయే మాధవపూజ. దీనికై విద్యాధనము లక్కరలేదు. కేవలము దయార్ద్రహృదయము అవసరము. హృదయస్థుడగు ప్రభువుకు హృదయము ప్రీతికాని, మస్తిష్కము ప్రీతి కాదు.

౨. సుఖముకోరుదువేని స్వార్థమును విడిచి, ఇతరులను సుఖపెట్టుటకు ప్రయత్నింపుము. సమయమతిస్వల్పము. కావున దానిని వ్యర్థపుచ్చకుము.

౩. బలిదాన మొనర్చిన పిదపనే ఏమైన లభించును. కేవలము పొల్లుమాటలచే ఏమియు లభించదు.

౪. నిరాడంబర, సాధారణ సత్యవ్రత విధానమున నీ జీవితము నేర్పరచుకొని, యితర జీవులను ప్రేమతో సేవింపుము.

౫. సేవావిధానము లనేకములు గలవు. కాని వానిఫలము కేవల మంతఃకరణసిద్ధియే.

౬. అంతమునకు కేవలము ఒకటి మిగిలియుండునదే ఏకాంతము. అట్లు ఏకాంతమున విగతస్పృహుడై సేవచేయువాని హృదయము శుద్ధమై, అహంకారము నశించి, అప్రయత్నముగా భజన స్వయమే జరుగును.

౭. పిసినిగొట్టుతనము, స్వార్థము నీ మెడను అదిమిపట్టియుంచును.

౮. ఈ అహంకార మొకచోట అజ్ఞానరూపమున, మఱొకచోట త్యాగరూపమున వినోదము సలుపుచుండును. 'నేను త్యాగిని' అను అహంకారము చాలా చెడ్డది.

౯. అందరిని బ్రహ్మరూపులుగానే భావించునపుడు, ఇక ఏవగింపు, అసహన మెందులకు ? ఈర్ష్యాద్వేషములెవ్వరిపై ప్రయోగించెదవు ? విశ్వప్రేమానందానుభవమునుండి వంచితమెందులకు ! అందఱిని ప్రేమతో జేరదీసి ఆయన దయకు పాత్రుడవుకమ్ము.

౧౦. నీవు రుచిని, శృంగారమును, అవమానమును లెక్కచేయక సేవా సత్యముల గౌరవింపుము. ఈ సిద్ధాంతముపైననే మనపూర్వులు మహాపురుషులైరి.

౧౧ యజమానత్వభావమే ఆపదలకు మూలము. యజమానత్వపంక్తిలోనీపేరు స్వయముగ వ్రాసికొని, వానిని కాపాడు భారము నీ నెత్తిపై వేసికొని ఆపదలను కొనితెచ్చుకొనకుము. నీకు లభించిన దానిని సద్వినియోగము జేయుము. యాచింపకుము. దాతవు

కమ్ము. నీతోటి సహోదరులకు సేవచేయుటకే, భగవంతుడు నీకు ఈ అవసరము కల్పించినందులకు అదృష్టవంతుడనని తలంచి ఆయనను ప్రార్థింపుము.

౧౨. మనస్సు రెండుచోట్లకు పరువెత్తును. ఒకటి లాభముండుచోటునకు, రెండవది రుచిగల పదార్థములుండుచోటునకు. భజనలో దానికి రుచి, లాభము కనిపించదు. కాన మనస్సు దాని కలవడదు. మనస్సును నిగ్రహించుటలో లాభము లేదు. దానిని ప్రేమతో బుజ్జగించితివేని నీ వశమగును. దాన నీపని చేకూరును.

౧౩. మనము బాగుపడుటకు ప్రయత్నింపక కేవలము బాగనిపించుకొనుటకే ప్రయత్నింతుము.

౧౪. స్వార్థము, కర్తృత్వము నశింపజేయుటవలన నిజమగు సుఖము లభించును.

౧౫. నిజస్వరూపజ్ఞానము కలిగిన పిదప అప్రయత్నమున తనంతటతానే ధ్యానము స్థిరమగును. ప్రయత్నముచే చేయబడు ధ్యానము ప్రమాదమునకు దారితీయును.

౧౬. ఓ సహోదరా! ముక్తికొరకు చింతింపకుము. నీ కర్తవ్యమును నెరవేర్చుకొనుము. మానవజీవితమును నెలకొల్పుకొనుము. వ్యవహారమును పవిత్రపరచుకొని అందఱిని ప్రేమింపుము. స్వార్థభావముల త్యజింపుము. హృదయము అద్దమువలె నిర్మలము కాగానే, నీవు నిత్యముక్తుడవని నీకు తెలియును. నీవు బద్ధుడవు కావు. బద్ధుడనని భావించుట వట్టి భ్రమ. హృదయములో ప్రేమభావము జనించగానే ముక్తి నీ యెదుట ముకుళితహస్తయై నిలుచును.

౧౭. కేవలము జ్ఞానము తెలిసికొని సంతోషించుటే సరిపోదు. తెలిసినదాని ప్రకారము వర్తించు టవసరము. గర్వపడరాదు. గర్వము అజ్ఞాన మూర్ఖత్వములకు నిలయము.

# శ్రీ మహాత్మ బ్రహ్మనిష్ఠ నథూరాంజీ

౧. ఆత్మ కభిన్నుడైన, అద్వితీయ సచ్చిదానంద స్వరూప బ్రహ్మను సంశయరహితమున, దృఢనిశ్చయముతో, పరిశుద్ధ మనస్సుతో, పరమప్రీతితో, సతతము విచారముద్వారా ధ్యానమొనర్చుటే నిదిధ్యాసమనబడును.

౨. నిదిధ్యాసముచేతనైనను లేక ఎట్టి నిర్గుణోపాసనచేతనైనను బ్రహ్మసాక్షాత్కార మగును. బ్రహ్మసాక్షాత్కారము కానంతవరకు ముముక్షువు బ్రహ్మవిచార నిదిధ్యాసములను లేక నిర్గుణోపాసనను చేయుచుండవలయును.

3. కేవలము మాటలచేత ముముక్షువుకు బ్రహ్మసాక్షాత్కారమగుట అసంభవము. వైరాగ్యమువలన అంతఃకరణ స్థూలత్వము తొలగి, నిదిధ్యాసరూపమున అంతఃకరణ మేకాగ్రత జెంది నిశ్చల మగునేని బ్రహ్మసాక్షాత్కార మగును.

౪. మందబుద్ధివలన గాని, లేక బ్రహ్మవేత్తయు, సత్శాస్త్రముల అప్రాప్తిచేతగాని, బ్రహ్మవిచారము చేయుటలో అసమర్థుడగు ముముక్షువు, నిర్గుణోపాసన తెలిసిన సద్గురునిద్వారా నిర్గుణోపాసన విషయము తెలిసికొని నిర్గుణబ్రహ్మము నుపాసింపవలయును.

౫. తన ప్రారబ్ధకర్మను భోగించుచున్నను, ఉత్తమమైన శ్రద్ధ యుండునేని, సుఖపూర్వకముగా ముముక్షువు నిర్గుణబ్రహ్మ నుపాసింపగలుగును.

౬. నిర్గుణధ్యానము లేక నిర్గుణబ్రహ్మ నుపాసించు సాధకులకు తమ అంతఃకరణములోని దుర్వాసనలను, శుభవాసనలద్వారా వినాశ మొనర్చుటకు ప్రయత్నించు టవసరము.

౭. నిర్గుణ బ్రహ్మోపాసనచే అంతఃకరణము పవిత్రమై ఏకాగ్రత వృద్ధిజెందును. అంతఃకరణము మెల్లమెల్లన బ్రహ్మలో విరామము జెందును.

౮. నిదిధ్యాసపరులగు ముముక్షువులు, "బ్రహ్మస్వరూపము"ను సద్గురునిద్వారా, సచ్ఛాస్త్రములద్వారా తెలిసికొని, తమ బుద్ధిని బ్రహ్మలో స్థిరపరచుటకు, ఆదరపూర్వకముగా ఏకాంతములో విచారింపవలయును. ఇట్టి ప్రయత్నమువలన ఆత్మకు అభిన్నుడైన బ్రహ్మ సాక్షాత్కారమగును.

౯. లయవిక్షేప కషాయాది రసాస్వాదములను ఈ నాలుగు దోషములు నిదిధ్యాసపరిపక్వములో, విఘ్నములు కల్పించునట్టివి. వీటిచే అంతఃకరణలో తమోగుణము వృద్ధియగును.

౧౦. నిదిధ్యాసపరులగు ముముక్షువులకు సంసారమందు సత్యమును, దేహాదులందు ఆత్మబుద్ధిని ఉత్పన్నము జేయునట్టి శృంగారరస ప్రధానములగు కావ్యముల, నాటకముల, వార్తాదులను వినరాదు, చదువరాదు. దీనికై ప్రతి కార్యములో దేహబుద్ధినుంచక, సదా సావధానులై మెలంగవలయును.

౧౧. ముముక్షువులకు నిదిధ్యాస పరిపక్వమైనప్పుడే, ఈ ఆత్మే నాకును, జగత్తుకును వాస్తవిక స్వరూపమను అనుభవము కలుగును. అంతరాత్మకు అభిన్నమైన బ్రహ్మజ్ఞానముచే వాడు సర్వాత్మ భావమును పొందును.

౧౨. పరమాత్మలో, సద్గురునిలో, బ్రహ్మవేత్తలలో, వేదాంతశాస్త్రములో పరమప్రీతి గలిగి, దేహాదుల నుండి ఆత్మబుద్ధిని, దృశ్యజగత్తునుండి సత్యబుద్ధిని, వివేక విచారముల ద్వారా శిథిలమొనర్చి, ఎట్టి నిదిధ్యాస విఘ్నములకైనను పరాజితుడుగాక, పరమాదరముచే సతతము నిదిధ్యాసముచేయు ముముక్షువు, తన నిదిధ్యాస పరిపక్వమున అజ్ఞానమును నివృత్తిచేసి, సర్వవ్యాపక సచ్చిదానంద బ్రహ్మసాక్షాత్కారము నొందుటకు సౌభాగ్యము పొందును. అట్టి భాగ్యము పొందిన తక్షణమే, ఆ ముముక్షుత్వము నశించి, బ్రహ్మవిదుడగును.

# శ్రీ స్వామి బోధానందపురిజీ

౧. ప్రతిజీవి కోరునది అఖండ శాశ్వతసుఖమే. అది జ్ఞానము వల్ల ప్రాప్తించును.

౨. ఏయే యింద్రియముల ద్వారా యేయే భోగములు యెంతవర కనుభవింపవలసిన ప్రారబ్ధ పుణ్యాసంచిత ముండునో, అంతవర కనుభవించి, ఆ పుణ్యాభోగము సమాప్తి కాగానే ఆ ఇంద్రియశక్తి నశించును. అనగా కీర్తిభోగ మున్నంతసేపు కీర్తి, ఆహారభోగ మున్నంతసేపు ఆహారము లభించి, సంచితము నశించగానే భోగములుకూడా నశించును. కాన వివేకముతో మెలంగుము.

3. పశువు ఒకచోట దెబ్బతిన్నచో, ఆ చోటుకు పోవుటకు జంకును. కాని మానవుడు మృతి నొందుచుండు ఇతరులను, తనవారిని స్వయముగ తన చేతులతో పూడ్చుచు, తగులబెట్టుచు కూడా మృత్యువునకు జంకదెందులకో ! ఇది కడు ఆశ్చర్యము.

ర. కారణము లేక కార్యముండదు. కావున మీ రెందులకు జీవించుచున్నారో కాస్త విచారించుకొనుడు. ఇన్నాళ్లు బ్రతికి యెంతో కష్టపడి యేమి సంపాదించితిరో చెప్పుడు.

౫. పశు పక్ష్యాదులు మానవాధీనములై చెప్పినట్లు చేయుచుండును. ఆడించినట్లు ఆడుచుండును. అట్లే మానవులుకూడా కర్మాధీనులై ప్రారబ్ధ కర్మానుసారము సుఖదుఃఖము లనుభవించుచుందురు.

౬. సంచిత పుణ్య సుఖ మనుభవించు కాలమున, ఒక పాప సంచిత దుఃఖము సంభవించునేని, ఆ సుఖమును తొలగించి, దుఃఖ సముద్రములో ముంచును. పుణ్యకర్మలో నీ దోషము కలదు. కావున పుణ్యకర్మకూడా తుదకు దుఃఖరూపమే. ఎందులకనగా కర్మ పాప పుణ్యముల మిశ్రితము. అందుచే సుఖదుఃఖములుకూడా మిశ్రితములే. శాశ్వతములు కావు. కర్మబంధమునుండి తప్పించుకో దలచిన, జ్ఞానమార్గ మవలంబింప వలయును.

౭. విషయ భోగానంద మనుభవింపదలచిన, ఇంద్రియములు బాగుండి, వస్తువులుకూడా బాగుండి, వాటితోపాటు మనస్సేక మైనప్పుడే అట్టి ఆనందము కలుగును. లేనిచో నిరర్థకము. సుఖము ఇంద్రియములలో, వస్తువులలో లేదు. మనలోనే యున్నది.

౮. అహంకార మమకారములే దుఃఖమునకు కారణము. ఇవి యింటి దొంగలు. వీటిని మరచి సుఖముకొరకు ఇతరత్ర వెద కుట వెఱ్ఱితనము.

౯. జన్మ ఉన్నంతసేపు దుఃఖము తప్పదు. కావున జన్మ రాహిత్య మార్గ మవలంబింప వలయును.

౧౦. మలవిక్షేప దోషములు తొలగినప్పుడే నీ స్వస్వరూప దర్శనమగును. మలమనగా వాసనలు. విక్షేపమనగా చిత్త చాంచల్యము.

౧౧. అజ్ఞాన మనగా తన స్వరూపమును తెలిసికొన లేకుం డుట. అజ్ఞానముచే అవివేకము, అవివేకముచే రాగద్వేషములు, వీటిచే అహంకార మమకారములు, వీటిచే కర్మ, దీనిచే జన్మ, జన్మచే సుఖదుఃఖములు ప్రాప్తించును.

౧౨. మానవుడు పుట్టినది మొదలు చచ్చువరకు చావువైపే పోవుచుండికూడా నేను బ్రతుకుచున్నానని అనును. ఇదే అజ్ఞా నము. ప్రతిక్షణము ప్రకృతి పరివర్తన జెందుచునే యుండును.

౧౩. ప్రకృతి, జీవుడు, దేవుడు– ఈ మూడింటిని తెలిసికొన వలయును. మొదట నిన్ను నీవు తెలిసికొంటివా, మిగిలిన రెండును నిరాయాసముగా వాటంతటవే తెలియబడును.

౧౪. నేను, నేనని పలుకువాడే దేవుడు. ఒకడు దేవుడు లేడని చెప్పు ననుకొనుడు. వానిని నీవున్నావా ? అని ప్రశ్నింప, నేనున్నానని బదులు చెప్పును. 'ఆ' నేనున్నానని చెప్పునట్టి నేను నేనని పలుకువాడే దేవుడు. నీవు లేకుంటే దేవుడు లేనట్లే నీవుంటే దేవు డున్నట్లే. కావున దేవుడు లేడనుటకు వీలులేదు.

౧౫. సత్తు చిత్తు ఆనందమే భగవత్స్వరూపము. ఈ సత్తు చిత్తు ఆనందము మనలోకూడ నున్నవి. సత్తు అనగా మూడు కాలములలో మార్పుచెందనిది. నేను, అను తత్త్వమునకు ఎప్పుడును మార్పులేదు. కావున 'నేను, అనునదే సత్తు. ఇదే ఆత్మ, ఇదే పరమాత్మ. చిత్తు అనగా జ్ఞానము తెలిసికొనునది. ఆనందమనుభవించువాడు ఆత్మయే. ఈ మూడు గుణములు ప్రతి జీవిలో గలవు. ప్రతి జీవిలోనుండి నేను నేను అని అనువాడే- దేవుడు. కావున, ఆయన మనకు చాలా సన్నిహితుడు. ఎంత సన్నిహితముండునో అంత ప్రేమ అధికముండును. నిజమైన ప్రేమ ఆత్మ సంబంధముతోనే కలుగును. భావసంబంధముతోకూడా కలుగును. ఇద్దరి భావ మొకటైనప్పుడు కూడా ప్రేమ కలుగును. ఆత్మ సంబంధముతోను, భావ సంబంధముతోను ప్రేమకలుగునప్పుడు, నేను బ్రహ్మను అందరిలో నుండునట్టి ఆత్మ నేనేనని భావించుచో ఎంత ప్రేమ జనించునో మీరే విచారించుడు. ఇట్టి ప్రేమచే రాగద్వేషములు తొలగి, స్వార్థము నశించి, విశ్వప్రేమ జనించి, జీవులందఱు మనవారే అగుదురు. దీనిచే విశ్వశాంతి చేకూరును.

౧౬. నమస్కారము ఆత్మ స్వరూపభావమున చేయుచుందుము. విశ్వమే విశ్వరూపము. శ్రీకృష్ణు డర్జునునికి చూపించిన విశ్వరూప భావమిదియే. విశ్వములోగల జీవులన్నియు విశ్వస్వరూపులే. పంచభూతములచే చేయబడిన ప్రతివస్తువు, ప్రతివిగ్రహము పరమాత్మ వస్తువే కనుక ఆ మూర్తికేది సమర్పించినను అది ఆయనకే ముట్టును.

౧౭. ఇచ్చువాడు పుచ్చుకొనువాడు- ఇద్దఱు భగవత్స్వరూపులనే భావించి పాత్రాపాత్రులను విచారించక మీరేమి చేసినను, ఏమిచ్చినను, తిట్టినను కొట్టినను ఆయనకే చెందును. కావున ప్రతి జీవిని భగవత్స్వరూపునిగా దలంచి సేవింపుడు. ఇదే భగవద్గీతాసారము. ఇదియే వేద తాత్పర్యము.

౧. ఆత్మశాంతికి, అఖిల విశ్వశాంతికి మానవులు ధర్మదీక్ష వహించవలెను. అధర్మజీవనుడు ఆత్మశాంతి పొందలేడు. పరప్రీతి కలిగింపలేడు. ధర్మమయ జీవనము తరుగైనపుడే లోకము కడగండ్లకు, కల్లోలములకు గురి అవుతుంది, శోకాంధకారం క్రమ్ముకొంటుంది. ధర్మనారాయణుని, ధర్మస్వరూపుణ్ణి ఆరాధించడము ప్రతి మానవునకు కర్తవ్యము.

౨. మానవుడు తనలోని అరిషడ్వర్గము లనే పశువులను సంహరించి, తన పరిశుద్ధాత్మను విశ్వేశ్వరునకు సమర్పించుట అనేదే ధర్మము.

3. బ్రహ్మదృష్టితో, బ్రహ్మైక్యానంద శ్రీకి దారితీసే ప్రతి నిస్వార్థకర్తకూడ ఒక ధర్మమే.

౪. జీవుడు తన ప్రకృతి దృశ్యములను, వాసనలను విడచి స్వస్వరూపమైన దేవుని పొందడమే ధర్మాశయము.

౫. ఆత్మధర్మమును అవలంబించువాడే స్వతంత్రుడు. అట్టివాడే ధర్మపురుషుడనబడును. అనిత్యములైన దేహధర్మములను సత్య ధర్మములుగా పాటించిన సార్థకము కాదు.

౬. ఎవరి వాంఛలకు వారే బానిసలు. దేహదృష్టిని దేవునిపై త్రిప్పుకోవడము చేత బానిసతనము తప్పుతుంది. ధర్మగుణము హెచ్చుతుంది. దేహదృష్టితో కూడిన జీవితమంతా బానిసతనమే. దేహాభిమానమే నరకము. ఇదే దైవ విముఖత్వమునకు రూపము.

౭. ఇంద్రియ సుఖములకని ఇల్లు వీడుట ధర్మముకాదు. ఈశ్వరసుఖమునకు, ఈశ్వరానందమునకు, ఈశ్వరచింతనకు ఇల్లుగాని, మరేమైనా సరే విడువవచ్చును. విముక్తి స్వరూపుడైన పరమాత్మతో సంయోగానుభూతి పొందడమే నిజధర్మము, నిజమైన విముక్తి. అట్టివానిని చెరసాలలు సహితము బంధింపలేవు. దేహానికి బానిసలైనవారిని ఎండినగడ్డిపోచకూడ కాలపాశమై బంధించును.

౮. ఆత్మనిమగ్నత, అంతర్ముఖత, స్వస్వరూపనిష్ఠ, బ్రహ్మజ్ఞానము, ఈ నాలుగే నిజమైన ధర్మములు. స్వాతంత్ర్యమును ప్రసాదించునవి ఇవియే. భౌతిక దేహాచరణలయందు వేరు పేర్లు పెట్టబడి, అంతర్ ధర్మమును వీటియందిమిడ్చి ఆచరించుటకై సత్యము, శాంతము, ప్రేమ, అహింస అను నాలుగు రూపముల ధరించి చరించుచున్నవి. ప్రతి కార్యమందు, ప్రతి తలంపునందు, ప్రతి విషయమునందు ఈ నాలుగు సిద్ధాంతములను పాటించుటే ధర్మమునకు సూత్రమగును.

౯. స్త్రీకి లజ్జ అతి ముఖ్యము. అది స్త్రీకి ఒక ఆభరణము. లజ్జ విడిచి చరించుట స్త్రీకి ధర్మవిరుద్ధము. అంతయేగాక దీనివలన అనేక అపాయములకు గురియగును. లజ్జగల స్త్రీ పేరు ప్రతిష్ఠల కాశింపదు. ముఖస్తుతి గౌరవములు ఉమ్మివేసిన మలినమువంటివి. నేటి స్త్రీలు స్వేచ్ఛను అవిరళముగా వినియోగించుకొనుటచే ధర్మగ్లాని ఆవరించినది. వినయము, శీలము, సత్యప్రవర్తనము, పతిసేవ, మానమర్యాదలతో ప్రాణమునొడ్డి ప్రతివ్రతధర్మమును పాటించుటే స్త్రీలయొక్క అతి ముఖ్య ధర్మము.

౧౦. ముక్తికి ఆత్మశుద్ధియే కారణము. జాతివర్ణములు కారణములు కావు. కాని ఆత్మశుద్ధి ధర్మాచరణవలననే కలుగుచున్నది. ధర్మమునకు జాతివర్ణములు అత్యావసరము. జాతి వర్ణాశ్రమముల స్వధర్మాచరణవల్లనే ఆత్మశుద్ధి, ఆత్మశుద్ధివలననే మోక్షము లభించును. మోక్షమునకు జాతివర్ణములు ప్రధానము కాకపోయినప్పటికినీ ఆత్మశుద్ధికి ఆచరణ అత్యావసరము. ఆచరణవలన అనుభవము, అనుభవమువలన సత్యము, సత్యమువలన శుద్ధి, శుద్ధివలన మోక్షము లభించును.

౧౧. దేవాలయాల ఆశయం దేహమునే దేవాలయముగా భావించి, జీవుని దేవునిగా ప్రవర్తింపగజేసి మానవునిలోని మాధవత్వమును జాగ్రత చేయడం. అందుచేత ఆలయాల ఆచార

వ్యవహారములన్నియూ బ్రహ్మజ్ఞాన వికాసమునకు అనుకూలమై యుండవలెననే వాటి ఆశయము. బ్రహ్మజ్ఞాన వికాసమునకు అనుకూలపడే ధర్మకర్మములన్నియూ శాస్త్రవిహిత కర్మములే. అనుకూలపడని కర్తలన్నియూ శాస్త్రవిరుద్ధ కర్తలే. మన ప్రాకృతభావాలను, కర్మలను, బోధలను, ఈశ్వరాభిముఖముచేసి సత్య, శాంతి సాక్షాత్కారమును కలిగించడానికే వివిధ మందిర ఆలయాలును. దేవతారాధనా విధానములన్నియూ నరునకూ నారాయణునకూగల సనాతన సంబంధాన్ని, మానవునకూ మాధవునకూగల మాధుర్యమతాన్ని, జీవునకూ బ్రహ్మకూగల, అవినాభావ సంబంధాన్ని స్ఫురింపజేసి, సన్నిహితముచేసి, శాశ్వతానుభూతిని చేకూర్చడానికే! వాని ప్రయోజనము.

౧౨. భగవంతుని ఎవరేభావముతో కొల్తురో వారి కావిధముగా ఆయన గోచరించును.

౧౩. పరమాత్మ ఒక్కడై,అద్వితీయుడై యుండికూడ వివిధములగు దేవతా నామములతో వ్యక్తమగు చున్నాడన్న సత్యసూత్రమును మన పూర్వులు గ్రహించిరి. ఈ తత్త్వమునుగూర్చి ఋగ్వేద మందనేక మంత్రములలో నుద్ఘోషింపబడినది.

౧౪. ప్రాచీనులు, దేవమందిరములను విజ్ఞాన మందిరములని భావించేవారు. గుడి యెంత పవిత్రముగా ఉంటే, గుండె అంత నిర్మలంగా ఉంటుందని తలంచేవారు. గ్రామ ప్రజ లెటువంటివారో ఆ గ్రామమందున్న గుడిగోపురాలనుబట్టే ఊహించెడివారు. గుడిని పవిత్రముగా వినియోగించుకొనుచుండిన ఆ పురప్రజలు పాపభీతి కలిగి, సద్వర్తన కలిగియున్నారని ప్రాచీనులు తలంచెడివారు. అట్టి విజ్ఞాన మందిరములను, ఆత్మోపదేశ ఆలయములను నేడు కేవలము దర్శనీయముగా కూడ పాటింపక, అవివేక విహార మందిర ములవలె తయారు చేయుటము, చీట్లపేకలు నిర్విఘ్నముగా ఆడు

కోవటము, జూదముగీతలతో చదరంగపు ఆటలతో కలిపురుషుని విహారస్థలముగా ఎన్నో గుళ్లు నేడు కనిపించుచున్నవి. ఇదే ధర్మ విరుద్ధము. దేవాలయమును గ్రామమునకు హృదయము వంటిదిగా భావించి దానికి తగిన పరిశుభ్రతలు, పవిత్రతలు కలిగించి ఆ పవిత్ర ఆలయమును పరమాత్మ సంచార స్థలమువలె తలంచి, అందరికీ ఈశ్వర సేవానందములో బాధ్యతకలదని అందరి హృదయములూ విశ్వసించిన, ఆనాడు మానవుని యందున్న మాధవత్వము మాణిక్యమువలె ప్రకాశించును. ఇదియే దేవాలయములను నిర్మించుటలో సత్యము, ధర్మము, దేవాలయ మందిరాలలో మానవులకు సత్యవికాసములకు కావలసిన ఏర్పాట్లు గ్రామాధికారులు గాని, భక్త శ్రేష్ఠులుగాని చేయవలెను.

౧౫. మిథ్యా ప్రపంచ మోహితుడవు గాకుము. సత్యమైన పరమాత్మను నమ్ముము.

౧౬. మానవ జీవితాశయ మేమి? వారు పొందవలసిన స్థానమేది? కేవలము పశు పక్షి మృగాదులవలె తిని, త్రాగి, నిద్రించి, భోగభాగ్యము లనుభవించి కడకు మరణించుటయేనా? కాదు, కాదు. మానవ జీవిత గమ్యమే బ్రహ్మ సాక్షాత్కారము. భోగాలతో కూడిన భవనములుగాని, ధనరాసులు గాని, మరి యే లౌకిక విషయాలు కానీ స్వస్వరూపమైన స్వాత్మయైన పరమేశ్వరుని తెలిసికొనకుండా శాంతిని ముమ్మాటికిని కలిగింపలేవు.

౧౭. మానవునికి పరమాత్మ పరాయి వాడైనాడు, ప్రపంచము దగ్గరి బంధువైనది. ఏమి చిత్రము! తెల్లవారితే కాంచన వాంఛ, ప్రొద్దుమునిగితే కామినీవాంఛ. ఇదే మానవుని జీవితాదర్శమా? మానవుడు ఒక దినము గడపుటచేత తన అమూల్య జీవితములో ఒకదినము వృథాగా గడచి పోయినదని తాను మృత్యు గహ్వరంలోనికి సమీపిస్తున్నానని తలపోయడు కదా!

౧౮. దుర్వికార నిలయమైన కలలో నామస్మరణము, మందిర సందర్శనము ప్రధానసాధన.

౧౯. మానవులలో ఒకరితో నొకరు విరోధము వదలి, పరస్పరము నమ్మకము కలిగి యుండవలెను. అందువలన లోకమునకు సుఖము కలుగును. అపుడే విధమైన అశాంతియు, అనాచార అక్రమ, అన్యాయములును మానవులను సమీపింప లేవు.

౨౦. సత్యమందు మానవునకు శ్రద్ధ కలిగినపుడే ధర్మ కర్తలను ఆదరింపగలడు. జనులందరు అవశ్యము ధర్మలక్షణములను గ్రహింపవలెను. ఎందుకన పరమేశ్వరుడు మనుష్యులందరినీ పరమ యత్నశీలురుగను, ధర్మాచరణయుతులుగను రచించెను. బ్రహ్మను, సత్యవిద్యను, ధర్మాచరణమును జనులు సేవింపవలెను.

## ౨౮౧ స్వామి అవధూతేంద్ర సరస్వతి

౧. ఓ మానవుడా ! బ్రహ్మ ముహూర్తముననే లెమ్ము భగవంతుని భజింపుము. ఏ భావముతో భజింతువో, ఆ భావమే నీలో బలపడును. కావున, సదా భగవద్భావమున మెలంగుము. నామస్మరణలో ఖర్చూ లేదు, కష్టమూ లేదు.

౨. ప్రారబ్ధముచే వచ్చిన దానిని ఆదరింపుము.

౩. క్రోధమును శాంతింప జేయుము.

౪. భగవదర్పితము చేసియే భుజింపుము. అది భగవద్భజన కొరకే భుజింపవలెను.

౫. నామస్మరణ చేయునపుడు ఆ నామమునందే దృష్టి నుంచుము. లేదా ఆ స్వరూపమునందు దృష్టిపెట్టుము.

౬. తినుట, త్రాగుట మొదలగు కార్యములలో ప్రతి ప్రాణియు సమానమే. కాని నీవు మానవుడవు కదా! కావున నీ మానవత్వము పోగొట్టుకొని పశువు గాకుము.

౭. ఆస్తి పెరిగిన కొద్దీ మనస్సుకూడ పెరుగును. అనగా మనస్సు వ్యథ జెందును. ఆస్తికి మూల్యము పెరిగినట్లు, నామమునకు కూడ మూల్యము పెరిగినప్పుడే, ఆ ఆస్తి సదుపయోగమగును.

౮. ధన సంపత్తులకును, కీర్తి ప్రతిష్ఠలకును ఆశించు వాడెన్నటికిని భక్తుడు కానేరడు. నేను భక్తుడను, జ్ఞానిని, యితరులు అజ్ఞానులు అను అహంభావము చాలా చెడ్డది. దీని వలన మానవుడు పతనమగును. అన్నిటికంటె భక్త మదము బహుచెడ్డది. జగత్తును హరిమయముగా భావింపవలయును.

౯. శ్రీనివాస నిలయమని యింటికి పేరుపెట్టి, తిరిగి దానినే నాది అని భావించుట చాలాదోషము. ఇటులే, నీది కాని దేహాది వస్తువులను కూడ నాది, నావి అనుకొనుట మహాగొప్ప ప్రమాదము. ఇదియే దుఃఖమునకు కారణము.

౧౦. నామ పరాయణుడు తృణమువలె వినయముకలిగి ప్రవర్తింపవలయును.

౧౧. వృక్షములు, నదులు, పర్వతములు, సాధువులు, పృథ్వి ఈ ఐదూ ఓర్పు గలిగి యుండునట్లు నీవును ఓర్పుకలిగి, నిత్యము పరోపకారము నిమిత్తమే జీవింపుము.

౧౨. ఓ మానవా! నీవు, మనుష్యాధముడవు గాక, మాధవుడవు గమ్ము.

## ౨౮౨ శ్రీ సరోజబాల

[శ్రీ సరోజబాల గుజరాత్ దేశములోని సూరత్ అను పట్టణమున 1-11-1956 తేదీన జన్మించెను. ఈమె తండ్రి పేరు పండిత శ్యామసుందరశాస్త్రిగారు. రెండుసంవత్సరముల ఆరునెలల ప్రాయమందే ఈమె గాయత్రి మంత్రము పఠించెను. నాల్గవ సంవత్సరమున అక్షరాభ్యాసము చేసిరి. ఆరవ సంవత్సరమున, ప్రవచనము ప్రారంభించినది. 8-2-1967 వ తేదీన హైదరాబాదుకు వచ్చినప్పుడు ఈ బాల వయస్సు పది సంవత్సరముల మూడుమాస

ములు. ఈమె పాండిత్య మపారమైనది. సకల శాస్త్ర పురాణేతి హాసములు, కంఠోపాఠము. ఉపన్యాస ప్రవాహము చెప్పనలవి కాదు. ఇంత చిన్నప్రాయమున అంత గొప్ప పాండిత్యమబ్బుట ఆశ్చర్యకరము. ఇది పూర్వజన్మ సంచితమే కాని వేరొకటి కాదని. లోక వాడుక.]

ఈమె ఉపన్యాసములోని కొన్ని సుభాషితములు :

౧. ఓ మహాజనులారా! మొదలు మీరు మానవులు కండు. ఈ మానవశరీరము మాధవుని పొందుట కొరకే లభించినది. దీనిని మరువకుడు. జ్ఞానముతోపాటు ప్రేమ, భక్తి లేనిది పరమాత్మ ప్రాప్తి కడు దుస్తరము. ప్రేమోత్పత్తి కొరకు శ్రద్ధ అవసరము. దానికై సత్సంగము, సత్సంగమువలన ఆసక్తి నశించి, భావ ముత్పన్న మగును. భావమునుండి శ్రద్ధ, శ్రద్ధవలన విశ్వాసము, శ్రద్ధావిశ్వాసముల వలన నిజమైన ప్రేమ జనించును. ప్రేమచే భక్తి, భక్తివలన ముక్తి లభించును.

౨. నామసంకీర్తన వలన మనస్సు వశమగును. సంకీర్తనా పరుడు నమ్రుడై, సహనశీలుడై మెలగవలెను. మానము కోరక, యితరులను సన్మానింపవలయును. మనస్సు విషయములనుండి తొలగ నంతవరకు భగవత్ప్రాప్తి కలుగదు.

౩. యమ, నియమాదులను పాలింపక రామనామము భజిం చిన అది సిద్ధింపదు. సత్య అహింసలను పాలించుట అత్యవసరము. రామనామము అన్నిమంత్రములకంటె ఉత్తమమైనది.

౪. ఆశాతృష్ణలను అతిప్రయత్నమున త్రెంచవలెను. అవి నశించుట కడు దుస్తరము. కావున, సంతోషము నవలంబింపవల యును. ధర్మము నెప్పుడును త్యజింపరాదు.

౫. ఓ ధనవంతులారా! లోభమునకు వశ్యులు కాకుడు. అది మిమ్ముల మోసపుచ్చి వెళ్ళిపోవును. ధనమును ఖజానాలోను.

బ్యాంకులోను దాచిపెట్టకుడు. ఒకచేతితో సంపాదించి రెండు చేతులతో దానముచేయుడు. భోగవిలాసములను త్యజింపుడు. సావధానులుకండు. దానము చేయుడు, పుణ్యము సంపాదింపుడు.

౬. సిగ్గూ, శరమూ పోవునట్టి యే పనులును చేయరాదు.

౭. పగలెల్ల పాపము చేయుచు కేవలము రెండుగంటల కాలము పూజ చేయుటవలన ముక్తి లభించునా? రెండుగంటలు భజించి, యిరువదిరెండు గంటలు ధనసంపత్తుల, భార్యాబిడ్డల ఆసక్తిలో తగిలియుండువానికి, భగవద్భక్తి యెట్లు కుదురును? సత్యసాధకుడే భగవంతుని పొందగలుగును. నిత్యనిరంతరము నాలుకతో భగవద్భజన, మనస్సున స్మరణ, చేతులతో పని చేయుచుండవలెను.

౮. ఓ మానవుడా! మనోవాక్కాయములచే యే ప్రాణికిని హాని కలిగింపకుము. ఏ జీవికిని అహితముగాకుండ ప్రవర్తించుటే ఉత్తమమైన సత్యపాలనము.

౯. ఇతరుల వస్తువులపైన దృష్టినుంచకుము.

౧౦. జిహ్వనుండి అసత్యమును తొలగించి సత్యమును నిలుపుము.

౧౧. నిజమైన బ్రహ్మచారి దేవునితో సమానుడు. కావున బ్రహ్మచర్యవ్రత మవలంబింపుము.

౧౨. పరస్త్రీ వైపు చూడకుము, తల వంచి క్రిందచూస్తూ నడువుము, ఒకవేళ దృష్టి గోచరమగునేని ఆమెను మాతగా దలంపుము. కండ్లు మూసికొనుము, భగవంతుని స్మరింపుము.

౧౩. పవిత్రమైన సాత్వికాన్నమును మితముగా భుజింపుము. అధిక భోజనమువలన కడుపు బరువెక్కును, రోగములు పెరుగును. ఆయువు క్షీణించును. రామనామము నిలచిపోవును. ప్రాణవాయువు ఆగిపోవును. నరకమునకు దారితీయును.

౧౪. తామసాహారములను, ఉల్లి, యెల్లి మొదలగు పదార్థములను తినరాదు. వానివలన మనోబుద్ధీంద్రియములు మలినమగును. సదాచార మాచరించుట ఉత్తమము.

౧౫. స్త్రీకి పతియేదైవము. పతిని సేవించుటే ఉత్తమ ధర్మము.

## ౨౮౩ కుమారి గీతాభారతి మహామండలేశ్వరి

౧. మానవుడా! ఆలస్యము విడచి ఆత్మోన్నతి కొరకు ముందుకు నడువుము. సుఖశాంతుల ధనాగారము నీలో నిండి యున్నది. గీతను పఠింపుము. అది నీవే ఈశ్వరాంశీయుడవని తెలుపుచున్నది. కాని, నీవు మోహనిద్రలో మగ్నుడవై పడి యుండి చాలా కాలము గడపితివి. ఆలసింపక, మేలుకొనుము. నీవు అజరుడవు, అమరుడవు. కావున మృత్యు భయమును విడువుము. సంసార ప్రేమ బంధమును త్రెంచెదవేని ఆత్మ సాక్షాత్కారము పొందెదవు.

౨. ఓ బుద్ధిలేని మానవుడా! మృత్యువు సమీపించినప్పుడు, ఏ శాస్త్రములును నిన్ను రక్షింప జాలవు. కావున భగవంతుడగు గోవిందుని మరి మరి భజింపుము. బాల్యమున ఆట పాటలలో, యౌవనమున స్త్రీ ఆసక్తిలో, వృద్ధాప్యమున గృహచింతనలో, దగిలియుండి పరమాత్మచింతనలో, ఎప్పుడును మనస్సు పెట్టవైతివి కదా! నిజములో గోవిందుని భజించుటే ముఖ్యము.

౩. మాంసపు కండలు కరిగి శరీరము ముడుతలు పడినను, తల వెంట్రుకలు తెల్లబడినను, పండ్లూడినను, వృద్ధుడై కర్రసహాయమున నడుచుచున్నను మానవుడు తృష్ణను విడువనొల్లడు. ఓ మూఢా! భగవంతుని భజింపుము.

౪. మరి మరి పుట్టుచు, చచ్చుచు, తల్లి గర్భవాస దుఃఖము సహించుచు దుస్తరమగు సంసార సాగరమున పడియున్న ప్రాణు

లను, ఓ భగవానుడా ! నీవు ఉద్ధరింపుము. ఓ మానవుడా! దీనికై భగవంతుని భజింపుము.

౬. లోకమునకు చూపుటకు మానవుడు జడలు పెంచుకొనును. ఒకప్పుడు తల గొరిగించుకొనును. మరొకప్పుడు కాషాయ వస్త్రములు ధరించును. పొట్టనింపుటకు ఇట్లు అనేకరూపముల ధరించుచున్న పాఖండులను జూచుచుకూడ మానవుడు తన దృష్టిని మరలించుకొనుట లేదు. నిజమునకు వాడు గోవిందునే భజింపవలయును.

౭. వృద్ధాప్యమున కామవికారములు చప్పబడును. జలము ఎండిపోయిన సరోవరము వ్యర్థమగును. ధనము నశించిన పరివారము దూరమగును, పరమాత్మ జ్ఞానము కలిగిన సంసారము సారహీనమగును. కావున, భగవంతుని భజింపవలయును.

౮. మానవుడు విరక్తుడై సర్వసంగపరిత్యాగియై కూడ ఆశాపాశములనుండి విడబడడు. కావున వాడు భగవంతుని భజింపవలయును.

౯. ఎంతవరకు మానవుడు ధనసంపాదనలో దగిలియుండునో అంతవరకు వాని పరివారము వానిని ప్రేమించును. వృద్ధాప్యమున శరీరము శిథిలమగును. అప్పుడు ఎవరును మందలించరు. కావున గోవిందుని భజింపవలయును.

౧౦. సర్వమును త్యజించి, పుణ్య పాప మార్గముల నుండి వైదొలగి విరక్తుడవుగమ్ము. విచారింపుము. నీవు, నేను, ఈ లోకము సర్వము మిథ్యయే ! ఇట్టి నశ్వరములకై శోక మెందులకు ? వాస్తవములో గోవిందుని భజింపవలయును.

౧౧. అజ్ఞానుల మనస్సులో మోహ, మాయావేగముల నింపునట్టి స్త్రీల స్తనభాగమును కటిప్రదేశమును చూచినప్పుడు, యీ అంగములన్నియు మాంసము, క్రొవ్వు, రక్తముల వికారములనియు

మలమూత్రపాత్రము లనియు, అంతఃకరణమున మరి మరి విచారింపుము. గోవిందుని భజింపుము.

౧౧. గీతను పఠింపుము. భగవంతుని నిరంతరము ధ్యానింపుము. సత్పురుషుల సత్సంగమున చిత్తమును లగ్నము చేయుము. దీనులకు, దుఃఖితులకు సేవచేయుము. భగవంతుని భజింపుము.

౧౨. ఓ సహోదరా! నీ భార్య ఎవతె? నీ పుత్రు డెవడు? నీ వెవనివాడవు? నీ వెవడవు? ఎటునుండి వచ్చితివి? వీని యథార్థమును తెలిసికొనుము. ఈ లోకము బహు విచిత్రమైనది. దీనిలో అసత్యవస్తువు సత్యముగ గోచరించును. కావున భగవంతుని భజింపుము.

౧౩. సుఖేచ్ఛకొరకు స్త్రీసంగమము చేయుదురు. కాని దానిచే శరీరమున రోగము జనించును. సంసారమున అందరు మృతినొందుచుండుట చూస్తూకూడ మానవుడు పాపముచేయుట విడువడు. నిజమునకు భగవంతుని భజింపవలయును.

౧౪. శరీరమున జీవమున్నంతవరకు అందరును ఆదరింతురు. కాని ప్రాణవాయువు వెళ్ళిపోగానే ఆ శరీరమునే చూచి భార్య సహితము భయమొందును. కావున భగవంతుని భజింపుము.

౧౫. మోక్షమునకై ఎన్ని తీర్థములు సేవించినను, ఎన్ని దానధర్మములు చేసినను మోక్షము లభింపదేని, నూరు జన్మములు ఇట్లు కర్మములు చేసినను మోక్షము లభింపదు. కావున, దానికై పరమాత్మను భజింపవలయును.

## ౨౮౪ స్వామి శ్రీ బోలే బాబాజీ మహరాజ్

౧. ఒకకుక్క ఎముకను కొరుకుచుండ, దానిని లాగుకొనుటకు కొన్ని కుక్కలు దానిపైబడి కరువ మొదలిడ, ఆ బాధకు తాళలేక కుక్క ఎముకను విడిచి పరుగెత్తును. ఆ ఎముకకొరకు కుక్కలన్నియు కీచులాడుకొనుచుండ మరొక బలమైన శునకము

దానిని లాగుకొని కొరుకుచుండెను. అట్టి దృశ్యమును ప్రజాపతి పుత్రుడగు అరుణిచూచి తనలోతాను ఇట్లనుకొనెను: 'ఓహో! దుఃఖమంతయు ప్రాణుల స్వార్థకృత్యములలోనే కలదు. కాని త్యాగములలో లేదు. ధనముండునంతవరకును భయముండితీరును. దొంగలు ధనికుల ధనసంపదలను తస్కరించుటకు పొంచియుందురు. పుత్ర, మిత్రాదులుసైతము పీడింతురు. రిక్తహస్తుని ఎవ్వరూ ఏమీ చేయలేరుకదా! నెత్తిమీది బరువు క్రిందికిదింపగానే బరువు భారము తగ్గి శరీరము తేలికపడును. సుఖము కలుగును. త్యాగమే సుఖస్వరూపము. విషయములను మనస్సున చింతించినచో దుఃఖము సంభవించును. సంగమే పతనమునకు హేతువు. స్నేహము ముక్తి మార్గమునకు అవరోధమని తలంచి అరుణి ప్రజాపతిలోకమున ప్రవేశించి అతనినిట్లు ప్రశ్నించెను.

౨. "ఓ బ్రహ్మదేవా! మానవుడు కర్మఫలముల ననుభవించుటకు దేహముండకతప్పదు. దేహముండిన కర్మచేయక తప్పదు. ఇట్లు సంసార చక్రము నడుచుచునే యుండునుగదా? కర్మలన్నియు పుణ్యాపాపమిశ్రితములే. కావున జన్మ, మృత్యువులు తప్పవు. కనుక ఓ దేవా! ఈ కర్మబంధమునుండి ముక్తుడై ఆనంద స్వరూపములో స్థితుడగుటకు ఉపాయమేమిటో చెప్పుమనిన, బ్రహ్మదేవు డిట్లనెను: "ఓ అరుణీ! ఇచ్ఛ లుండునంతవరకు కర్మ లుండితీరును. ఇచ్ఛలుడుగగానే కర్మలుడుగును. కావున దేహ గేహ స్త్రీ పుత్రాదులందలి మమత మోహాసక్తులను, ఇహపరాదులందలి ఇచ్ఛలను త్యజించి కౌపీనధారుడవై ప్రారబ్ధానుసారము లభించిన దానిని ప్రాణరక్షణార్థము సంతోషముగా అనుభవించుచు సదా భగవద్ధ్యాన పరుండవై చరించుము. సమస్తమును త్యజించినవాడే పరమపదము పొందును."

## ౭౨. మహామండలేశ్వర్ స్వామి జితేంద్రపురి మహరాజ్

౧. ఇంద్రియ సంయమముచే సుఖశాంతులు లభించును.

౨. బ్రహ్మచర్యపాలనచే స్మరణశక్తి, ధారణశక్తి, ఇచ్ఛాశక్తి, ఉత్సాహశక్తి, శరీరాది శక్తులన్నియు బలవంతములై పవిత్రములగును. మానవుడు రోగ శోక మోహ కామక్రోధాది రహితుడగును.

3. ఇంద్రియములకు దాసుడగువాడు మనస్సునకు బానిసమై సదా రోగ శోక కామ క్రోధాదులచే పీడింపబడుచుండును. సంయమ హీనుని జీవితము పశుసమానము.

౪. పూర్ణబ్రహ్మచర్య వ్రతముచే దేశ, సమాజ, ఆత్మ కల్యాణములు కలుగును.

౫. విషయవాంఛారహితుడే స్వతంత్రుడు.

౬. బ్రహ్మచర్య వ్రతస్థుడు మొదట తన జిహ్వను జయించుట అత్యవసరము. నేత్రేంద్రియములను నియమించి దిక్కులు చూడక నేలనుచూచుచు నడువవలెను. క్రమశః తక్కిన ఇంద్రియములను అదుపులోనికి తేవలయును.

౭. 'నిస్స్వార్థుడై అందరి మేలుకొరకు జీవించుచు, అందరికి ప్రేమపాత్రుడు కావలెను. భావనాతరంగములు ఎటువైపునకు పరుగెత్తునో అటు వైపునకే ప్రేమధార ప్రవహించవలెను. మనస్సంకల్పములకు ప్రేమను జోడింపవలెను. భారతీయ ఋషుల, సాధు సత్పురుషుల ఉపదేశము, ఉద్దేశముఇదియే. విశ్వప్రేమయే అమోఘమైన అస్త్రము. దీని ప్రభావముననే మానవుడు సంసారమును, విశ్వమును జయించగలడు.

౮. భగవంతునితోపాటు జ్ఞాన, ప్రేమ, ఆనందప్రకాశాది దైవశక్తులు సర్వత్రా కలవని తలంచువాని హృదయములో అజ్ఞాన, రాగద్వేష, దుఃఖ, అహంకారాది ఆసురీశక్తులెట్లు ప్రవేశించును?

౯. చిల్లికుండలోని నీటివలె ఆయువు క్షీణించుచు మృత్యువు శిరస్సుపై తాండవమాడుచుండు క్షణభంగురమగును. దేహ

సుఖమునకు బద్ధుడవు కాక అసార సాంసారిక తుచ్ఛపదార్థములందలి మమత, అహంకారములను విడచి ఆ, అచల, సనాతన, ఆనంద నిధియగు ఆత్మ తత్త్వమును నిరంతరము చింతించుచుండవలెను.

౧౦. అగాధమైన అమృతము ఆనందమయ శాంతసముద్ర హృదయములో తరంగితమైయుండ, జీవుడు అజ్ఞానియై మమత్వ మను పాశమున బంధింపబడి బహిర్ముఖుడై ఒక్కొక్క తుచ్ఛ బిందువు కొరకు వ్యాకులుడై దుఃఖించుచుండును. ఇదెంత ఆశ్చర్యము !

౧౧. ప్రతి పరిస్థితిలోను విశుద్ధ ఆనందమును కలిగియుండు వాడే సత్పురుషుడనబడును.

౧౨. నీవు మహాత్ముడవు కాగోరుదువేని బాహ్యాడంబరము లన్నింటిని విడిచి ఆత్మస్థితుడవుకమ్ము.

## ౨౮౬ శ్రీ భగవతానందజీ మండలేశ్వర్

**సంతుమహిమ :**

౧. భగవత్ప్రాప్తికి ముఖ్యసాధన సత్సంగము. నిజమగు సాధువు లభించినపుడే సత్సంగము సంభవించును.

౨. బ్రహ్మ త్రికాల బాధ్యుడని తెలిసినవాడే సాధుపురుషుడు. ఆచారమే ధర్మలక్షణము. సదాచారపరుడే సత్పురుషుడు.

౩. సత్యమే సనాతనధర్మము. సత్యమే సత్పురుషుల ధర్మము. సత్యమే పరమగతి.

౪. నిస్వార్థులు, శాంతచిత్తులు, ఉదారహృదయులు, పరోపకారులు, స్వయముగా తాము భవసాగరము దాటి ఇతరులనుకూడా దాటించువారు ఈ జగత్తులో కలరు. కావున, ఓ జిజ్ఞాసువులారా ! మీరు వారిని సేవించి కల్యాణమార్గమును తెలుసుకొనుడు.

౫. తమ సదుపదేశములద్వారా సజ్జనులను, దుర్జనులనుకూడ సన్మార్గములందు నడుపుటకు సత్పురుషులే సమర్థులు.

౬. కుసంగమును త్యజించువాడే మాయను జయించగలుగును. సత్పురుషుల సాంగత్యముచేయువాడే మోహాసక్తుల త్యజింపగలుగును.

౭. ద్రోహముచేయకుండుట, దానమిచ్చుట, సదా సత్యమే పలుకుట- ఈ మూడింటి నాచరించువాడే సత్పురుషుల పదవి నొందును.

౮. భక్తి సాధనలన్నింటిలోను సత్పురుషుల సాంగత్యమే శ్రేష్ఠమైనదని శ్రీరామచంద్రుడు భక్త శబరితో పలికెను.

౯. సత్పురుషుల క్షణకాల సాంగత్యము భవసాగరము దాటించు నావవంటిదని శ్రీశంకరాచార్యులునుడివెను.

౧౦. నివృత్తి పరాయణుడగు సత్పురుషుడు సదా సంతుష్టుడుగానుండును.

౧౧. సర్వత్ర బ్రహ్మభావము నిశ్చయమైన మహాజ్ఞాని సర్వమును బ్రహ్మస్వరూపముగా జూచును. తన్మయుడగును.

౧౨. సాంసారిక బంధములనుండి బయటపడు పురుషుడు దుఃఖములనుండి విముక్తుడు కాగలడని శ్రీ సురేశ్వరాచార్యులు అనిరి.

౧౩. రాగద్వేషములను త్యజించుటయే మోక్షసాధనకు మార్గము. కల్యాణపథమును అనుసరింప దలచినవారు శీఘ్రముగ సత్పురుషుల సాంగత్యము పొందవలెను. ఇది వేదవాక్యము.

౧౪. జీవితము అనిత్యము, క్షణభంగురము. మృత్యువు ఎప్పుడు వచ్చునో ఎవరి కెరుక ? కనుక రేపటి పనిని ఈ రోజు, ఇపుడే చేయుటకు పూనుకొనుము.

౧౫. తాను త్రికాల బాధ్యుడగు బ్రహ్మస్వరూపుడని తలంచువాడే సత్పురుషుడు.

## ౨౮౭ బాబా రామదాస్ మహరాజ్

౧. సత్పురుషులందరికి సేవచేయుచు వారి హితబోధలు వినుచుండవలెను. ఎందుకనన ఏ సత్పురుషుని ఉపదేశమువలన కల్యాణమగునో ఎవరి కెరుక ?

౨. సాధువు యే మతస్థుడైననూ, ఎట్లున్ననూ అవశ్యముగా వారికి సేవ, శుశ్రూష చేయుము.

3. భగవత్ప్రసాదములో మంచిచెడ్డలు ఎంచరాదు. అది యెట్లున్ననూ భగవత్ప్రసాదమే.

౪. పశువును విక్రయించిన పిదప దాని మంచిచెడ్డలను గురించిన చింత యుండనట్లు ఒకసారి సమర్పింపబడిన పిదప మళ్లీ శరీరాదులందు చింత ఎందులకు ? శరీరాదులకు యజమాని ఈశ్వరుడే, ఇక మనకు చింత దేనికి ?

## ౨౮౮ స్వామి విశుద్ధానంద్ జీ భారతి

సాధు తత్వము :

౧. సాధుపురుషుడే భారత దేశమునకు స్మృతికారకుడు. సందేశము నిచ్చువాడు. మానవజాతికి ప్రేమ, జ్ఞాన, శాంతిపాఠములు నేర్పువాడు. సత్పురుషుడే, పాపతాపములచే పీడితులైన మానవులను ఉద్ధరించువాడు. అట్టి మహానుభావులకు ప్రణామములు.

౨. మనదృష్టి పోయినంతవరకు మానవుడు ఏదో ఒక సాధువు చరణముల నాశ్రయించి యుండునట్లే కనిపించును.

3. సాధు సత్తములను అధికముగా సృజించు దేశమే గొప్ప దేశము. తమ సాధుపురుషుల ఉపదేశములను పొంది పాటించు జాతియే గొప్పజాతి.

౪. ఆస్తికుడైన ప్రతిహిందువు తాను ఎవరో ఒక ప్రాచీన మహర్షి యొక్క సంతానమని తలంచును.

౫. సమస్తజాతికి ఈశ్వరీయ దివ్య అలౌకిక జ్ఞానమును ప్రసాదించుటకే మహాతపస్వియైన విశ్వామిత్ర మహర్షి గాయత్రీ మంత్రమును ఆవిష్కరించెను. ఈ ఒక్క మంత్రములోనే అఖండమైన జ్ఞానసంపద యిమిడియున్నది. ఈ మంత్రము పరమాత్మతో మనకు సంబంధం కలిగిస్తుంది. భారతీయ సంస్కృతిని పరిపోషించిన మంత్రము కూడ యిదే.

౬. బ్రహ్మసత్యము, బ్రహ్మార్పణము, నేనే బ్రహ్మను అను పరమాత్మ శక్తిగల ఈ మూడు మంత్రములు ప్రతి హిందువునకు తెలియును.

సత్సంగము :

౭. పరశవేది స్పర్శమాత్రమున ఇనుము బంగారమగునట్లు సత్సంగ ప్రభావమున నీచాతి నీచుడగు మానవుడు సైతము సాధువుగా మారును.

౮. సద్విచారము, పవిత్రహృదయముతో భగవత్సన్నిధానమున విలపించుట, సత్పురుషుల సాంగత్యము - ఈ మూడు కల్యాణ సాధనములే.

సాధు లక్షణములు :

౯. ఒక సాధువు తన ముఖ్య శిష్యుని కిట్లుపదేశించెను :

1. విశ్వమంతయు భగవంతుని మందిరమని తలంచుము.
2. సర్వభూతములను ఆయన విగ్రహములుగానే భావించి పూజించుము.
3. సర్వధర్మములను భగవత్సాన్నిధ్యమునకు జేర్చునట్టి మార్గములుగానే భావింపుము.
4. నీ హృదయములో ఆయన స్వరూప ప్రతిమను ప్రతిష్ఠించి ఆయన చింతనలోనే లీనుడవుగమ్ము. ఈ రోజు నీకు నేను ఈ సందేశమును వినిపించవలసియుండి వినిపించితిని. ఇక నేను నీతో సెలవు తీసుకొనుచున్నానని చెప్పి వెళ్ళిపోయెను.

తిరిగి కనిపించలేదు. బాహ్యవేషములచే సాధువులను గుర్తించుట చాలా కష్టము. అర్హుడని తెలుసుకున్న శిష్యునకే సాధువు లుపదేశింతురు. సత్పురుషుల లక్షణ మిదియే.

౧౦. సాధువు కర్తృత్వాభిమానముల విడిచి సర్వకర్మలను చేయుచుండును. తన ఆత్మలోనే సుఖ మనుభవించుచుండును. బంగారమును మట్టితో సమానముగా చూచును. ఈ జగత్తును పిచ్చి ఆసుపత్రిగా తలంచును. సంసారులు దేహ, గేహాసక్తులై తిరుగుచుందురు. సాధువులు భగవదాసక్తులై చరించుచుందురు.

సాధుపురుషుని జ్ఞానము :

౧౧. ఓ జిజ్ఞాసువులారా! సత్యాసత్యములు రెండును అతని యొక్క రూపములే. నీవు ఆయననే వెదకుము. నీ క్షుద్ర అహంకార మమకారములను త్యజించుము. నీ చిత్తమునుండి అహంభావమును త్యజించుము. నీ మనో ఇంద్రియముల నిగ్రహించి, నీ హృదయస్థితుడగు పరమాత్మునిలో ఐక్యభావమున స్థిరపడుము. ఈ నీ జీవితము విద్యుద్దీపమువలె క్షణభంగురము. పరమాత్ముడొక్కడే నిత్యుడు.

౧౨. ఓ సాధకులారా! సర్వాసక్తులను త్యజించి నారాయణుని శరణుపొందుడు. స్థావర జంగమ చైతన్యములన్నియు ఆ ప్రభువుయొక్క స్వరూపములే. మీరు ఆయన గుణములనే పొగడుడు. ప్రేమచే ఆయననే పూజింపుడు. ఆయన నామమునే స్మరింపుడు. ఆయన కృపవల్లనే దుఃఖములన్నియు తొలగును. ఆయన కృపయనెడి కవచమును ధరించితిరేని కలియుగ ప్రభావము మీపై పడనేరదు. ఆయన భక్తిని ప్రచారము చేయుదురేని ఈ ఘోర కలియుగములో కూడ మీరు సత్యయుగ సామ్రాజ్యమును స్థాపించగలుగుదురు.

౧౩. మానవుని ఆత్మ యెపుడు ఈ అత్యంత జీవిత సంగ్రామంనుండి ఓడిపోవునో, అపుడు అతడు అంతమునకు ఒకానొక

సాధుపురుషుని చరణసన్నిధానముననే విశ్రాంతి గైకొన వెదకును. ఎందుకన సాధువే మానవునిలో ఈశ్వరతత్త్వమను జ్వాలను ప్రకటింపగలుగును. దానిచే జన్మజన్మాంతరముల పాపతాపములు భస్మమై ద్వంద్వముల నుండి విముక్తుడై పరమాత్మ స్వరూపుడగును.

౧౮. అతని పొందుటకు భక్తి, జ్ఞాన, నిష్కామకర్మ, ఏకాంత ప్రార్థన, ధ్యానయోగాది అనేక ఉపాయములు కలవు.

౧౯. ఎవడు తన అంతఃకరణమున ఆ విశ్వాత్ముని ఆత్మస్వరూపునిగా అనుభవించునో, వాడే అతనిని అఖిల విశ్వములలో వ్యాప్తునిగా అనుభవించును.

౧౬. కేవలమాయన నొక్కని తెలుసుకొందువేని ఈ జీవితములోనే ఆ సత్యస్వరూపుని పొందుదువు. నీ జీవిత ముండగనే ఆయనను తెలుసుకొనకపోతివేని నీ జీవితమంతయు వ్యర్థమగును. ఏ ధీరపురుషుడు ఆత్మను సర్వభూతములలో చూచునో వాడు సర్వమును తెలిసికొని ఈ ద్వంద్వమయ జగత్తుయొక్క బంధనమునుండి విడబడి, అమరత్వమును పొందును.

## ౨౮౯. శ్రీ దరియా సాహెబు

[ విద్యాగంధము లేకున్ననూ, విస్తృతమైన యాత్రల ద్వారానూ, నిరంతర సాధనద్వారానూ అపారమైన లోకానుభవము సంపాదించి తమ మహనీయమైన బోధనలచే, అజ్ఞానాంధకారములో కొట్టుమిట్టాడుతున్న దుఃఖిత ప్రజలకు వెలుగుబాట చూపిన మహానుభావుడు దరియా సాహెబు. వీరు రమారమి మూడు, నాలుగు శతాబ్దముల క్రితము మార్వాడీ ప్రాంతములోని రేన్ అను గ్రామమున జన్మించిరి. వీరు బాల్యమునుండియే భక్తిభావము గలిగి సత్యాన్వేషణమునకై దేశసంచారము గావించి దివ్యపురుషులను, క్షేత్రములను సందర్శించిరి.]

౧. మానవుడు కేవలము తన మూఢ సంప్రదాయములచే బంధితుడై యుండునంతవరకు దుఃఖమునుండి విముక్తుడు కాజాలడు. తత్ఫలితముగా అతని జీవితము వ్యర్థమగును.

౨. సంసార బంధములో చిక్కుకొని ఈశ్వరుని స్మరించి తరించుట దుర్లభము. అట్లని సర్వమును సన్యసించిన మాత్రమున కూడా ఇది సులభసాధ్యము కాజాలదు. సంప్రదాయ తత్త్వము తెలియని వారికి ఈ రెండునూ బహుకఠినములే.

౩. మానవుడు ఘట ఘట నివాసియగు ఆత్మారాముని మరచి, భ్రమలోపడి, ప్రలోభములకు లోనై కాశీ, గయ, మధురాది తీర్థయాత్రలలో భగవంతుని వెదకబూనుట వెర్రితనము కాక మరేమిటి?

౪. మనస్సులోనుండి అపవిత్రములైన ఆలోచనలను పారద్రోలకుండా జప, తప, ఆసనాది చర్యలను ఎన్నింటిని ఆచరించిననూ, వేష భూషణము లెన్ని ధరించిననూ వ్యర్థమే.

౫. బ్రహ్మభావము లేని కర్మములన్నియు నిరర్థకములే.

౬. గురూపదేశమున హృదయ గుహలోని బ్రహ్మమును తెలిసికొనుటయే శ్రేష్ఠము.

౭. మా జాతియే బ్రహ్మజాతి, రాముడే మా తలిదండ్రి, సత్యమే మా నిష, అనాహత నాదములోనే మా నివాసమని భావించుటే జీవన్ముక్తి.

౮. సత్యాన్వేషణ సాధనలో పరిపక్వస్థితికి చేరిన మానవుడు దైవత్వమును పొందును.

## ౨౫౦ స్వామి మిత్రసేన్‌జీ మహరాజ్

**సాధు భావమును పొందుటలో విఘ్నములు :**

౧. ఈ క్రింద తెలుపబడిన చిన్న చిన్న విఘ్నములనుండి కూడ సాధకుడు దూరముగా నుండవలెను. లేనిచో మునుముందు యివియే బలవత్తరములై సాధకుని నాశము చేయును.

1. సభాసమితులలో సమావేశమగుట.
2. అనావశ్యకములగు పత్రికలను చదువుట.
3. వ్యక్తి, వస్తు, పరిస్థితులందు విశేషముగ మమతనుంచుట.
4. మఠము, లేక ఆశ్రమాదులను స్థాపించుట.
5. సాధనలో ఆలస్యము, అశ్రద్ధ, అవిశ్వాసముండుట.
6. శాస్త్రార్థము చేయుట.
7. తాను సాధువు, ఇతరు లసాధులని తలంచుట.
8. పరదోషములను చూచుట, వాటిని ప్రకటించుట.
9. పరుల నవమానించుట.
10. పరచర్చ చేయుట.
11. నాటక, సినిమాదులను చూచుట.
12. అసత్ గ్రంథములను చదువుట.
13. అశాస్త్ర కార్యములం దభిరుచి కలిగియుండుట.
14. పెద్దలను సన్మానింపకుండుట.
15. ఇతర ప్రాణులను అసహ్యించుకొనుట.
16. విపత్తిలో భయపడుట.
17. సంపత్తిలో సంతోషించుట.
18. తన కర్తవ్యమును మరచుట.
19. సంసార పదార్థములనే జీవిత లక్ష్యమని తలంచుట.
20. సిద్ధుల కాసించి చమత్కారములను చూపుట అను వీటి వలన, సాధకుడు పతితుడగును.
21. కీర్తి ప్రతిష్ఠలను త్యజించి నప్పటికిని మనస్సులో వాటి వాసనలు ఉండితీరును. ఆ వాసనలను కూడ త్యజించువాడే నిజమగు సాధువు. త్యాగ స్మృతియు నుండరాదు. కావున సాధకులకు యిట్టి కీర్తి, ప్రతిష కామనారూపములగు ప్రధాన విఘ్నములను పరిత్యజించుట అత్యవసరము.

సాధు భావమును పొందు నుపాయములు :

౧. ఓ సాధకుడా ! సాధుభావమును పొందుటకు, నీలోని సాధు, అసాధు స్వభావములను జూచుచు, తెలిసికొనుచుండుము. సాధు వగుటకు గాని, సాధు వనిపించుకొనుటకు గాని లేశమాత్ర మైనను ఆడంబర భావము మనస్సులో నుంచకుము. వ్యవహార ములో కాని, లేక శారీరక జీవితములోగాని యే మాత్రమైనను, మార్పు చెందనీయకుము. జరుగుచుండున దంతయు భగవదేచ్ఛ యనియే భావింపుము. శరీరము ప్రభువుదే అయినపుడు, ఇక ఆడంబరాది వేషము లెందులకు ? ఉన్నదున్నట్లు జరుగనిచ్చుటే సాధుసిద్ధికి ప్రధాన సాధనము. ఇది మంచిది, అది చెడ్డదను భావముకూడ మనస్సులో నుంచకుము. ఈశ్వరప్రాప్తికై దేశము, కాలము, మొదలగు వేటితోను అవసరములేదు. దేశకాలము లన్నియు ఈశ్వరాధీనములే. సర్వవ్యాపకుడగు పరమాత్మను నీలో వెదకి కనుగొనుము. ప్రతి సమయమందును భగవన్నామమును భజించుచు, ఆ ప్రభువే దేహరూపుడై సర్వకర్మములు చేయుచున్నా డని భావింపుము. అనగా, (లేని వానిని వెదకుట కాదు. ఉన్న వానినే వెదకుట, ఆ దేవుడే తనను తాను వెదకుచున్నాడని భావము.) గోపికలు, ఇట్లే వెదకిరి. ఇదియే ప్రేమసాధనకు మొదటి మెట్టు. వెదకుట పొందుటకే, చేయుట అగుటకే.

౨. ఓ సాధకా ! సాధు భావమును పొందినవాని జీవితము, వాని సర్వావస్థలు ప్రభువులోనే లీనమై యుండును.

## ౨౫౧ శ్రీ ముకుంద వల్లభ్‌జీ మహరాజ్

ఊర్ధ్వ రేత ప్రాణాయామము :

౧. పవిత్రస్థలమందు పరిశుభ్రుడై ఒక అసనముపై కూర్చుండి నాభియందు దృష్టినిలిపి కుడి, ఎడమ, రెండు నాసికలలో, మొదట ఏదో ఒక నాసికద్వారా మెల్లమెల్లగా వాయువును పీల్చి, ఉదర

ములో నింపి, ఎంతసేపు సుఖముగా ఆపకలిగితే అంతసేపు అక్కడ ఆపి, పిదప రెండవ నాసికద్వారా మెల్లమెల్లగా ఆ వాయువును, బయట విడచి, ఎంతసేపు సుఖముగా, బయట ఆపకలిగితే అంత సేపు ఆపి, తదుపరి రెండవ నాసికద్వారా పై విధముననే చేయ వలయును. ఇట్లు చేసినచో, ఒక ప్రాణాయామ మగును. ఇటులే ప్రతిరోజూ కనీసము పదకొండు పర్యాయములు చేయుచో వీర్యము బ్రహ్మరంధ్రములో ఆకర్షింపబడి, అక్కడనే స్థిరపడును.

౨. మూత్రముద్వారా, స్వేతరజము (వీర్యము) పడిపోవు వారు పైన చెప్పబడిన ప్రాణాయామక్రియ చేసినచో, (రజ) వీర్యము పడిపోక, ధాతు క్షీణ, ప్రదరాదిరోగములు సమూలముగా నశించును. ఎప్పుడైన, వీర్య స్ఖలితమగునని తోచినను లేక కామోద్రేకము గోచరించినను, వెంటనే ఏడు పర్యాయములు, ప్రాణాయామ క్రియను చేయవలెను. వీర్యధారణకై ఈ క్రింద నుదహరింపబడు పంద్రెండునియమములను ఆచరింపవలయును.

1. కడుపునిండుగా తినకుము. గరిష్ఠభోజనము చేయకుము. విశేషించి, రాత్రి కడుపును ఖాళీగా నుంచుము.
2. వేడి వేడి పదార్థములను భుజించినవెంటనే విచార, విషాద సమయమున జలము త్రాగకుము.
3. ఒకే ఆసనముపై అధికముగా కూర్చుండు అభ్యాసముండుచో శరీర వ్యాయామము తప్పక చేయుము.
4. రాజసాన్నమును, అత్యంత వేడిపదార్థములను, నూనెపదార్థ ములను, పులుపు, కారము, ఉప్పని వస్తువులను తినకుము.
5. కల్లు, సారాయి, మొదలగు నిషావస్తువులను త్రాగకుము.
6. ఒత్తిగిలి పరుండుటతప్ప, వెలికిలగా గాని, బోర్లగా గాని పరుండుటచే స్వప్నదోషములే గాక, స్మరణశక్తి కూడా క్షీణించును.

7. లంగోటిని తప్పక కట్టుకొనుము. కాళ్ళను ముడుచుకొనక, తిన్నగా చాచి పరుండుము.
8. మలమూత్రముల వేగమును ఆపకుము.
9. అశ్లీల, శృంగారచరిత్ర ల ను, నాటకాదులను చూడ కుము, వినకుము.
10. మలవిసర్జన అద్యంతములందును, పరుండ బోవునపుడును, జననేంద్రియ ముఖ ద్వారముపై మూడు నిమిషములసేపు స్వచ్ఛమగు చల్లని, సన్నని నీటిధారను పోయుము.
11. భోజనానంతరము పుక్కిలించి తత్కాలమే మూత్రవిసర్జన చేయుము.
12. స్త్రీలతో ఏకాంతమున మాట్లాడుట, మనస్సుతో విషయ ములను చింతించుట మానుము.

## ౨౯-౨ దండీస్వామి, శివానంద సరస్వతి

౧. ఓ మానవులారా! జీవుని జీవితము, కమల పత్రము పందలి జలమువలె క్షణభంగురము. స్త్రీ పుత్రాదులును, ఐశ్వ ర్యాది సుఖసంపత్తులును, కీర్తి ప్రతిష్ఠాదులును చూచుచుండగనే నీటిమీది బుగ్గలవలె నశించును. ఇట్లు అనిత్యమగు సంసార సాగర మును దాటుటకు, సహజమగు సరళోపాయము కేవల మొక సత్సం గమే. వివేకమే జీవునికి పరమహితుడు. హృదయములో వివేకము ప్రవేశింపగానే పాపములు నశించును. కామవాసనలు సమసిపోవును.

౨. సత్సంగ ప్రభావమున, అడవి జంతువులు కూడ భగవ త్కృపకు పాత్రులై తమ జీవితములను ఉద్ధరింప జేసికొనును.

3. కర్రతో చేరియుండుటచేత యినుము నీటిపై ఈదునట్లు, పుష్పము నాశ్రయించి తుచ్ఛ కీటకముకూడ దేవతల శిరస్సుపై కెక్కునట్లు, సత్పురుషుల సాంగత్యమువలన విషయాసక్తుడగు మాన వుడుకూడ పాపములనుండి విడబడి భగవత్సన్నిధికి జేరును.

४. త్రాటిచే కట్టబడిన బొక్కెన నీటిలో మునిగినను మళ్ళీ పైకి చేదుకొన బడునట్లు, ఎవని జీవితమను త్రాడు ఏ సత్పురుషుని చేతిలో నుండునో, ఆ సత్పురుషుడు, పాపభారముచే, పాపరూప మగు సంసారమను మురికిగుంటలో మునుగుచున్న మానవుని లేవ నెత్తి సత్యమార్గమున పెట్టి పుణ్యవంతునిగా జేయును.

౫. ఓ మానవా! దుర్జన సాంగత్యముచే సజ్జనుల చారిత్రము కూడ దూషితమగును. కావున తప్పక దుస్సంగమును త్యజింపుము. ప్రలోభమయమగు సంసారములోని సర్వపదార్థమందలి మమతను, దేహాభిమానమును విడిచి స్థావర, జంగమ జీవులన్నిటిని ప్రేమదృష్టితో సేవింపుము. తల్లిదండ్రులను సేవించుచు వారి ఆజ్ఞలను పాలింపుము. దోషములను తొలగించుకొని పాపరహితుడవై సత్యవ్రతుడవు కమ్ము. సదా సాధుసాంగత్యమున చిత్తమును సాధువుగా మార్చుము. సత్పురుషుల సేవచేయుచు సాధుపదవిని పొందుము. అనునయ వినయములద్వారా విద్వేషుల సంతోష పెట్టుము. నీ గుణములను దాచియుంచుము. దీనులను, దుఃఖితులను ఆత్మభావమున ఆదరింపుము. ఇట్టి సదాచారమున జీవితము పవిత్రమైనపుడే నిజమగు సాధుపురుషుడు లభించును. అట్టి సాధువును యథార్థముగా తెలిసికొన గలుగుదువు.

## ౭౩ ఒక సత్పురుషుడు

౧. ఓ మానవులారా! ప్రతిరోజు ప్రాతఃకాలమున ఈశ్వరుని భజించుటకు ధన మవసరమా?

౨. వినయపూర్వకముగా మాట్లాడుటకుకూడ ద్రవ్యము కావలయునా?

3. మనతో వ్యవహరించు మానవుని ప్రేమించుటకు ఏమైన ధన వ్యయమగునా?

४. ప్రతికూల ప్రసంగమునకు బెదరక ధైర్యముగా నుండుటకును డబ్బు ఖర్చగునా?

౫. పరిచితులను ఆదరించుటకు రొక్కము కావలయునా ?

౬. ఇతరులు పిలిచినపుడు అయ్యా ! అని ఉత్తర మిచ్చుట కును కాసు లవసరమా ?

౭. తల్లిదండ్రుల ఆజ్ఞను పాలించుటకును సొమ్ము కావల యునా ?

౮. ప్రతిపనియందు, ఈశ్వరుని స్మరించుటకును ధనమక్కర పడునా ?

౯. సత్యాచరణకై, విచారశక్తి వృద్ధికై పైకము కావల యునా ?

౧౦ తన జీవితమును దిద్దుకొని అధ్యాత్మికోన్నతికై ప్రయ త్నించుటకు పైస అవసరమా ?

౧౧. ఈ పని పూర్తిచేయుదునని నిశ్చయించుటకు కూడ రూపాయి కావలయునా ?

౧౨. సాధు సాంగత్యమున వారి గుణము లనుకరించుటకై ధన మవసరమా ?

౧౩. ఆత్మస్థితుడై అఖండానంద మనుభవించుటకు కూడ, డబ్బే కావలయునా ?

౧౪. ప్రతినిత్యము అరగంటసేపు ఉత్తమ గ్రంథములను చదువుటకును ధనము కావలయునా ?

౧౫. ప్రారబ్ధమును దూషింపక ప్రయత్నశీలు డగుటకును, పైసలు ఖర్చుచేయ వలసివచ్చునా ?

౧౬. ఓ సోదరులారా ! తమ జీవితములను బాగుపరచు కొనుటకు పై ఉపాయములను అనుకరించుడు. ధనము దుఃఖ ప్రదమే కాని, సుఖప్రదము కాదు. కావున సాంసారిక ప్రలోభనల కాశింపక, కేవలము సత్యమునే అనుసరించుచు, సర్వపదార్థములలో ఈశ్వరుని చూచుట నేర్చుకొనుడు.

## శ్రీ ఆత్మదర్శి బాబానగీన్ సిద్ధవేది

భగవద్జ్ఞాన రహస్యములు – మొదటి ఉపదేశము :

౧. ఈశ్వరుడు నీలోకలడు. నీవు నిర్వర్తించు ప్రతి కార్యముసు ఆయన చూచుచుండును. నీవు ప్రతి కార్యమును ఆయన ప్రకాశములోనే చేయుచుందువు. ఆ భగవద్జ్ఞానమే ఈశ్వరుడు. లేక పరమాత్మ. నీవు దానిని కేవలము జ్ఞానమని తలంతువు. కాని ఈశ్వరుడని తలంచవు. ఇది పొరపాటు. నీలో సాక్షీరూపుడై యుండి సదా నిన్ను ప్రేరేపించుచుండునది ఈశ్వరుడే.

౨. సూర్యుడు భూమికంటె అనేక వేలరెట్లు పెద్దగానుండినను, ఒక చిన్న జలపాత్రలో అతని పూర్తిబింబము ఇముడును. ఇట్లే భగవద్జ్ఞానముకూడా అన్నిటికంటె అనంతమైయున్నప్పటికిని చిన్న మస్తిష్కములో ఇమడును. జ్ఞానమే ఈశ్వరుడు. ఇదే సత్యము.

3. మానవుడు జ్ఞానమును తన గుణమని తలంచును. లేక ఈశ్వరుని గుణమని తలంచును. ఇది అతని భ్రమయే. జ్ఞానమే ఈశ్వరుడు.

౪. కండ్లు మూసుకొని విచారించుము. నీ అంతర్యామియగు పరమేశ్వర స్వరూప జ్ఞానమును ప్రేమించుము. దానిని ఉపాసించుము. ఇదేపూజ. ఇట్టిపూజను మహాత్ములగు పరమహంసలు చేయుదురు.

౫. భగవద్జ్ఞానమను ప్రకాశములేనిది నీవేమీ చేయజాలవు. కాని నీవు చేయునదంతయు నీ జ్ఞానమునకు తెలియును. నీలోనుండు ఈశ్వరుడు చూచుచుండగానే నీవు చెడుకర్మలు చేయుచుందువు. ఇది దుఃఖహేతువు. కనుక అట్లుచేయకుము. భయముకలిగియుండుము. సంసార కర్మములలో ఇట్టి భయము ఒకవిధముగా సమాధి లేక ఈశ్వరస్మృతి. రాజువెంటనుండు వాడెట్లు పాపకార్య

ములకు కర్తకాడో, భగవంతుడు ఎల్లప్పుడు నీవెంటనున్నట్లుగా తలంతువేని నీవుకూడా పాపకార్యములకు కర్తవుకావు.

౬. మానసిక కల్పనలలో ఎప్పటికిని చిక్కకుము.

రెండవ ఉపదేశము:

౧. భగవద్జ్ఞానమే ఈశ్వరుడు, పరమాత్ముడు. దానినే ప్రేమించుము. ఆయననే సహాయముకోరుము. వివేకమును ఆదరింపుము.

మూడవ ఉపదేశము:

౧ బాహ్యాంతరములలో కనుపించునదంతయు భగవద్జ్ఞానము లేక ఈశ్వరుడగు పరమాత్మయే. దీనికంటె ఇతరమేమియు లేదు.

౨. సంకల్పములు మనస్సులో పుట్టును. మనోరాజ్యము వాస్తవములో భగవద్జ్ఞానముయొక్క ప్రేరణ లేక తరంగములు. అనగా జ్ఞానమెపుడు స్థిరమగునో అపుడు మనోరాజ్యము అభావమగును.

3. స్వప్నము, జాగృత జగత్తు అనునవి మానవుని మనోరాజ్యములు లేక కల్పితములు. నిజమునకు ఏమియు లేదు. ఇదంతయు సంకల్పము మాత్రమే.

౪. వృత్తులన్నియు నివృత్తికాగానే నిజజ్ఞానము లేక స్వస్వరూపము ప్రాప్తించును.

౫. ప్రతి విభూతిలో భగవంతుని దర్శించుటయే ఉపాసన యనబడును.

౬. సంసారములోని ఒక అణువుకూడ నశించదు. కేవలము స్వరూప పరిణామము జెందును.

౭. సమస్త నామరూపములు భ్రమ లేక కల్పనమాత్రములే. భగవద్జ్ఞానముతప్ప మరేమియునున్నట్లు గోచరించదు.

౮. నీవు కూడ సృష్టినిజూచుచు సగుణ బ్రహ్మను దర్శించుము. సమాధిలో సమస్త ప్రపంచము అదృశ్యమైనపుడు భగవద్జ్ఞానమును జూచుచు నిర్గుణబ్రహ్మ సాక్షాత్కారము పొందుము. బ్రహ్మకంటె ఇతరమేమియు లేదు. దీనిని విస్మరింపకుము.

నాలుగవ ఉపదేశము :

౧. ఎంతవరకు తాను తనను బ్రహ్మగా తెలుసుకొనడో అంతవరకు మానవుడు అభయపదమును పొందలేడు.

౨. ఆత్మ సమర్పణమగుటే ముఖ్యము. నేనను కర్తృత్వ ముండరాదు. సంకల్పశూన్యమగుట మొదలగునవి అన్నియు భగవద్జ్ఞానమువలననే సంభవించుచున్నవని నిశ్చయించుట, జీవన్మృతునివలె వర్తించుట, తనను తాను భగవంతుని చేతిలోని సాధనముగా తలంచుట, దేనియందును స్మృతిలేక కేవలము భగవద్జ్ఞానములోనే సావధానుడగుట- ఇట్టి అభ్యాసములు, సంయమముల చేతనే ఇటువంటి అవస్థ ప్రాప్తించును. అట్టి స్థితిలో భగవద్జ్ఞానము తప్ప మరేమియు కనిపించదు. కర్తృభావము కలుగదు.

౩. 'నేను' అను పదమునకు అర్థము వాస్తవములో భగవద్జ్ఞానమే. ఇదే మానవుని నిజస్వరూపము.

౪. ఎవరు అహంగ్రహోపాసనను నిరాకరింతురో వారు ఈశ్వరుని మానవునిగా తలంతురు. ఎందుకన అట్టిదీనులు తమను బ్రహ్మకంటె భిన్నులుగా భావించెదరు. అట్టివారు ఎన్నటికిని బాగుపడనేరరు.

అయిదవ ఉపదేశము :

౧. ప్రకృతి, మాయ, శక్తి, అవిద్య, అజ్ఞానము, సంకల్పము, వృత్తి, అంతఃకరణము, ఆదికారణము, ప్రాణము, అహంకారము, మహత్తు మొదలగు నామములన్నియు ఒకే ఒక ఆభాసమాత్రమగు

అవిద్యలే. ఎట్లు ఒకే వ్యక్తి అనేక నామరూప వేషములతో పిలువబడునో అట్లే వేర్వేరు అవస్థలతో ఆ ఒకే అవిద్య వేరు వేరు నామములతో పిలువబడును.

౨. భగవద్జ్ఞానములో ఏ ప్రకాశము లేక చైతన్యముకలదో అదే ఆత్మ, అదే బ్రహ్మము, అదే సత్యవస్తువు, కల్పన, సంకల్పము కూడ. అదియే మాయ, అజ్ఞానము, ప్రకృతి, శక్తికూడ అదే. కాని ఈ రూపములలో దాని స్వరూపము ఆభాసమాత్రమే, కాని సత్యము కాదు.

ఆరవ ఉపదేశము :

౧. వాస్తవములో మానవదేహము విరాట్పురుషుని ఆకృతియే.

౨. జాగ్రత్త! ఈగనుకూడ సమానదృష్టితో చూడుము. ఎందుకన అదికూడా ఈశ్వరునిస్థానమందు ఉచ్చపదవి కలిగియున్నది.

## ౨౬౫ పండిత, ప్రతివాది భయంకర శంకరానంద సరస్వతి మహరాజ్

౧. లక్ష్యము స్థిరనిశ్చయమగునేని ఇంద్రియములు స్వయమే సంయమము లగును. భగవత్ప్రాప్తియందిచ్ఛలేని కారణముననే, సాధనలో మనస్సు లగ్నముకాదు. పరిశుద్ధాహారముచే, ముందు వెనుకల విచారములను మరచుటచే, వర్తమాన పరిస్థితిని సదుపయోగపరచుటచే మనస్సు నిశ్చలమగును.

౨. జీవించి యుండగానే ముక్తుడు కానివాని జీవితము వ్యర్థము. పశు పక్షులవలె, మానవుని జీవితము భోగము కొరకు గాక, యోగముకొరకే వచ్చినదని మరువకుము.

3. సంయోగములో వియోగము కలదని భావించితివేని, దుఃఖము కలుగదు.

४. ఎవడు ఈశ్వరునివలన కాని, జగత్తువలన కాని ఏమియు కోరక, సంసారమం దాసక్తి లేనివాడో ప్రపంచము తానే ఎవని అనుగమించి తిరుగుచుండునో, ఎవని భగవంతుడే ప్రేమించునో అట్టివాని జీవితము ఉత్కృష్టమైన జీవితము.

౫. చేయుటకొరకే వినుము, ముక్తికొరకే చేయుము.

౬. తల్లి ఋణమునుండి ముక్తుడగుటకు ఆమె ఆశీర్వాద మావశ్యకము. ఆమె దయలేనిది ఎవనికిని మేలు చేకూరదు.

౭. నీకెపుడు, నీదనున దేదియు లేకుండునో, అపుడే భగవంతుడు నీవాడగును.

౮. లోకకల్యాణము కోరువాడు ఎట్టి తప్పుడు కార్యములను చేయరాదు. ఎవడు ఏ తప్పు చేసినను దాని పరిణామము అందరికి చెందును.

౯. నీలో గల శక్తిని సంపూర్ణముగా వినియోగించి, నీ కర్తవ్యమును పూర్తిచేయుము. పిదప ఏది కానున్నదో అది యగును. దాని ఫలితమునకై చింతింపకుము. నీకు ప్రాప్తించిన ప్రతిదానిని సదుపయోగము చేయుము. కష్టములను సహింపుము. నిన్నుద్ధరించుటకొరకే దుఃఖము వచ్చును. సుఖములోనే దుఃఖము కలసియుండును. కావున సుఖమున కాశింపకుము.

౧౦. నీ లక్ష్యమెటుపోవునో నీ మనస్సు అటే పోవును. కావున మనస్సును నిరోధించి భగవంతుని యందే లక్ష్యముంచితివా, మనస్సు నిశ్చలమగును.

౧౧. నీ జీవితమును గురించి నీవు చింతింప కుందువేని, భగవంతుడు స్వయమే నిన్నుగూర్చి చింతించును. ఇది భగవద్విధానము.

౧౨. జీవన్ముక్తు డగుటయు, భగవదాజ్ఞను పాలించుటయు నిజమైన భక్తి.

౧౩. నిన్ను నీవెట్లు తలంతువో నీ జీవిత మట్లే ఉండవలెను. అనినట్లు ఆచరించువాడే ఉత్తముడు. నీవు ప్రపంచముతో ఎట్టి

సంబంధము పెట్టుకొంటివో, దాని కొరకైనను భయపడుము. ప్రపంచము నిన్ను ఎట్లు తలంచునో అట్లు నీ జీవితము లేనిచో అప్రతిష్ఠపాలగుదువు. నీ జీవితము నిష్ప్రయోజన మగును. నీవు నిజముగా ఎటులున్నావో, ఇతరులు నిన్నుగూర్చి ఎటుల తలంచుచున్నారో విచారించుకొనుము. కొంచెము నిదానించి నీ అంతరాత్మను అడుగుము. అది నీకు నిజము తెలుపును.

౧౪. పరులదోషములను చూడకుము. దీనిచే పరిణామము మహా చెడ్డదగును.

౧౫. మానవుడు తన హక్కును చూచుకొనును కాని, తన కర్తవ్యమును చూడడు. ఇది చాల గొప్ప తప్పు. దృష్టాంతమునకు చూడుడు– రోడ్డుపై కసవు పారవేయుటకు, పంపునుండి నీరు తీసికొనుటకు, తనకు అధికారము (హక్కు)కలదని తలంచి, వాటిని ఉపయోగించుకొనును కాని వాటిని శుభ్రపరచుటయు, వాటిని కాపాడుటయు తన కర్తవ్యమని భావింపడు. ఇట్లు అనేక కార్యములందు అశ్రద్ధ చూపుచుండును. ఇది గొప్ప పొరపాటు.

౧౬. శరణాగతుడ వగుటకు మొదట సంసారములోని సమస్త ఝంఝాటములను విడువుము.

౧౭. నీవు అను టొకటి చేయు టొకటియా! ఇది యెంత లజ్జాకరమైన మాట! ఇతరుల మేలుకొరకు నీ ఆచరణ పవిత్రముగా నుండవలయును.

౧౮. ఎంత దరిద్ర దశయందైనను ధర్మ విధానమునకు విరుద్ధముగా వర్తింపకుము.

౧౯. ప్రపంచములోని పదార్థములను తనవిగా భావించి దాన మిచ్చువాడును, ఇచ్చువానివిగానే తలంచి పుచ్చుకొను వాడును ఇద్దరును ద్రోహులే. సర్వపదార్థములు, సర్వేశ్వరునివి లేక ప్రకృతివి. వాటిని తనవిగా భావించుట దొంగతనము, పాపము. ఇదియే దుఃఖమునకు కారణము.

౨౦. ఓ మానవుడా! తలంచితివా అందరినీ నీ వారినిగానే తలంచుము. లేదా అందరినీ పరులనుగానే తలంచుము. గుణములను, మనస్సును నీవిగా భావింపకుము. వాటినిభగవదర్పితము చేయుము.

౨౧. వృద్ధాప్యవస్థలో స్వేచ్ఛగా జీవించుటకై సంగ్రహము చేయకుము. సోమరివిగాక, వృద్ధాప్యములోకూడ స్వధర్మ కర్మచే జీవితము గడుపుము. పరాధీనుడవై జీవించుట వ్యర్థము. ఋణగ్రస్తుడవు గాకుము.

౨౨. పరిస్థితి, అవస్థలను చూచి అభిమాన పడకుము. భయము చెందక సమభావముతో వర్తింపుము.

౨౩. పుచ్చుకొనుట విడచి, ఇచ్చుట నేర్చుకొనుము. నీకు నీవే నాయకుడవు కమ్ము. నీకు నీవే గురుడవు కమ్ము. నిన్ను నీవే శాసించుకొనుము. అపుడే దేశ సేవకుడ వగుదువు.

౨౪. అందరిలో ఆత్మ లేక భగవంతుడు ఒకడే కలడు. ఇక ద్వేష మెవరితో? ప్రేమించు టెవరిని? మృత్యువును మరువక భగవంతుని స్మరించు చుంటివా, తరింతువు.

౨౫. సంపూర్ణత్యాగముచే ప్రపంచమంతయు నీ స్వాధీనమగును.

౨౬. దేనిని నీది అని అనుకొనక, శరీరమును లోకమునకును, మనస్సును భగవంతునకును అర్పింపుము. దేనిది దాని కిచ్చివేయుదువేని ముక్తుడ వయ్యెదవు.

౨౭. ఒకరు మంచివారు, వేరొకరు చెడ్డవారని తలంపకుము. భగవంతు డిట్టివాడని నిర్ణయింప బోకుము. ఏలన, వేప ఆకు, మేక తినుటకు తియ్యగానుండును. అదియే మానవుడు తినుటకు చేదుగానుండును. ఇది ప్రకృతియొక్క లక్షణము. నిజమునకు వేప ఆకు తీపిగా నున్నదా, లేక చేదుగా నున్నదా అని నిర్ణయించుట ఎవరి తరము? ఇటులే ప్రపంచములోని ప్రతివస్తువు, ప్రతివ్యక్తి వాస్తవముగా ఎట్లుండునో, మంచియో చెడ్డయో

తెలిసికొనుట కష్టముకదా! ఇక భగవంతుడు ఎట్టివాడు, ఎక్కడ నుండును అను విషయమును గ్రహించుట ఎవనికి సాధ్యమగును? అట్టి పనికిమాలిన ఆలోచనలో పడుట వృథా కాలయాపనయే కాని, వేరొకటి కాదు.

## ౨౯౬ శ్రీ పండిత మహీలాల్‌జీ శర్మ (మధుర)

౧. జీవుడు ఈశ్వరాంశుడే కాని ఆయనతో వేరై సంసారాసక్తిలోపడి బద్ధుడగును. భగవంతుడు జీవునకు దూరుడు కాడు. ప్రతిజీవిలోనుండు దేవుడు జీవుని ప్రతికార్యమును చూచుచుండును, వినుచుండును.

౨. బ్రహ్మప్రాప్తికై త్యాగివై నీ జీవితమును అర్పింపవలసియుండును. ఆత్మశక్తి కోరుదువేని, కేవలము అంతఃకరణను పరిశుద్ధము చేసికొన వలయును.

3. ఉపాసన అనగా దేవునియందు లక్ష్యముంచి ఆయనను సమీపించుట, స్మరించుట. ఆయన సంబంధముచే ఆయన గుణములు ఉపాసకునిలో చేరును. నిష్కామకర్మచే మనస్సు శుద్ధమగునే కాని, జ్ఞానము ప్రాప్తించదు. ఉపాసించుటచే జ్ఞానము, ఆనందము కలుగును.

౪. ఆత్మసమర్పణ మగుట ముఖ్యము. దానికై అంతర్వాణి ఆజ్ఞను పాలింపవలెను. శాంతిచే అంతరాత్మ బోధ వినబడును. అహంభావము నశించినపుడే శాంతి చేకూరును.

౫. ఇతరులను బాగుపరుచుటకు ప్రయత్నింపకుము. మొదట నీవు బాగుపడుము. ఇదియే మహా గొప్ప లోకసేవ యగును. ఇతరులకు నీవు బోధింపదలచిన దానిని నీ వాచరింతువేని నీ ఆచరణయే వారిని బాగుపరచును.

౬. భగవత్ప్రాప్తికై ఆలసింపకుము. రేపటి మీద పెట్టకుము, రేపు ఏమగునో యెవరి కెరుక? జీవితము క్షణభంగురము. ప్రతిజీవిని ప్రేమించుము. ప్రేమచేతనే భగవత్ప్రాప్తి కలుగును.

౭. పవిత్రాచారము చేతనే బాహ్యాంతరములు శుద్ధము లగును. ఆహార, విహార, ఆచారము లెట్లుండునో, అటులే విచారములు ఉత్పత్తి యగుచుండును.

౮. నిర్మల జ్ఞానముకొరకు చిత్తశుద్ధి అవసరము. చిత్తమును నిర్మలముగాను, శాంతముగాను కావింతువేని ఆత్మదర్శనమగును. సంకల్ప,వికల్పములను నిరోధించుటే యోగము. ఈ యోగమే చిత్తశుద్ధికి మూలము. చిత్తశుద్ధిచే సర్వేంద్రియములు శమించును.

౯. నీ కర్తవ్యమును నీవు నెరవేర్చక, జపతపము లెన్ని చేసినను వ్యర్థమే! నీకు లభించిన పరిస్థితిలోనే నీ ధర్మమును వివేకముచే పూర్తిచేయుటే ముక్తి.

౧౦. ధర్మము, సంప్రదాయములలో భేదముకలదు. ధర్మము మారదు, సంప్రదాయము మారుచుండును. సంప్రదాయము మానవ సమాజముచే ఏర్పడును కావున, మారుచుండును. ధర్మము భగవద్విధానము. కావున మారదు.

౧౧. ఏ రోజు, ఏ ఘడియ భగవద్భక్తి నీ హృదయములో ప్రవేశించునో? కావున సదా, సర్వదా నీ హృదయమును పవిత్రముగా నుంచుకొనుము.

౧౨. దేహదృష్టిని విడచి, ఆత్మదర్శివి గమ్ము. దేహాభిమానము త్యజించినపుడే దేహదృష్టితొలగి, ఆత్మదృష్టి అలవడును.

౧౩. కర్మచే ప్రారబ్ధము ఏర్పడును. కర్మ వివేకముచే కలుగును. వివేకము భగవంతుని కృపచే లభించును. కావున నీ ప్రారబ్ధముచే నీ కేది లభించినను దానిని నీదిగా భావింపక భగవత్కృపగా దలంచుము.

౧౪. ఉదయము నాలుగు గంటల నుండి ఎనిమిది గంటల వరకు సత్వగుణ ప్రభావము, ఎనిమిదినుండి పన్నెండు వరకు రజోగుణ ప్రభావము, పన్నెండు నుండి నాలుగువరకు తమోగుణ

ప్రభావము, సాయంత్రము నాలుగునుండి రాత్రి యెనిమిది గంటల వరకు మరల సత్వగుణ ప్రభావము, రాత్రి ఎనిమిది నుండి పన్నెండు వరకు రజోగుణము, పన్నెండు నుండి ఉదయము నాలుగు గంటల వరకు తమోగుణ ప్రభావము ఉండును. [ఉదాహరణకు చూడుడు.] ఉషః కాలమున నాలుగు గంటలకే లేచి భగవంతుని ప్రార్థింతురు. ఉదయమున వ్యవహారములో గమనింపుడు - క్రయ, విక్రయముల లోను, బోనిపూట అబద్ధమాడకు, ఒకే మాట చెప్పుమనియు, ప్రొద్దుననే అబద్ధమాడరాదని వాడుక కలదు. సత్వగుణ ప్రభావము శాంతము కావున, అందరును ఉదయమున శాంతముతో మెలంగు దురు. ఎనిమిదినుండి పన్నెండు వరకు గృహ కార్యములలోను, తినుట, త్రాగుటలోను, రాకపోకలలోను, వ్యవహారములలోను తగిలియుందురు. ఇదే రజోగుణ ప్రభావము. పన్నెండు నుండి నాలుగు గంటలవరకు పనిచే అలసట జెంది, విసుగుగొని, మనస్సు స్వస్థతలేక, క్రోధస్వభావులై యుందురు. ఇది తమోగుణ ప్రభా వము. నాలుగునుండి రాత్రి ఎనిమిది గంటలవరకు మరల సత్వ గుణప్రభావమగుటచే దేవదర్శన సంధ్యావందనాది సత్కర్మలు చేయుచుందురు. ఎనిమిదినుండి రాత్రి పన్నెండు వరకు రజోగుణ ప్రభావము. కావున, లెక్కలుసరిచూచుట, సినిమా మున్నగు భోగ కార్యములలో కాలము గడుపుదురు. రాత్రి పన్నెండునుండి నాల్గు వరకు తమోగుణ ప్రభావమున స్త్రీ భోగము, నిద్రలో కాలము గడుపుదురు. భగవంతుడు మన మంచికొరకే గుణములను సృష్టిం చెను. కాని, వాటిని విజ్ఞానముతో విచారించి, ఏ సమయమున ఏ గుణ ప్రభావముండునో, గమనించి వివేకముతో కార్యము చేయుట మంచిది, అది సఫలమగును.

## ౨౯౭ పరమహంసల సుభాషితములు

౧. తన్ను చంపుకోవాలంటే ఒక గుండుసూది చాలు. ఇత రుల నెవరినైనా సంహరించాలంటే బాకులు, తుపాకులు కావలె,

తాను తరించాలంటే ఒక్క ముక్క చాలు. లోకాన్ని ఉద్ధరించాలంటే వాగ్వైఖరి, శబ్దఝరి, శాస్త్రవ్యాఖ్యాన కౌశలము, ఎంతో రాద్ధాంతము కావలసియుండును. వాంఛాతీతుడవైతే వాంఛ ఫలిస్తుంది.

## ౨౯౮. గాంధిగారు రాజగోపాల్‌కు వ్రాసిన లేఖ

౧. భాయీ రాజగోపాల్! భగవంతుడు సర్వశక్తిసంపన్నుడు. కనుక ఏమైనా చేయగలడు. ఎవరు ఏ రూపములో ఆరాధిస్తారో వారికి ఆ రూపములో భగవత్సాక్షాత్కారము లభిస్తుంది. కాని నేను భగవంతుని ఏదో ఒక సాకారమూర్తిగా దర్శింప కోరడంలేదు. నిరాకార, నిరంజన, ఆత్మస్వరూపాన్ని సాక్షాత్కరింప చేసికో గోరుచున్నాను. కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యాదులకు లోనుగాక, వికార రహితుడనై ఆత్మ స్వరూపమును పొంద గోరుచున్నాను. ఈ లక్ష్యసిద్ధికై సర్వస్వమును త్యజించడానికి సిద్ధముగా ఉన్నాను. జీవిత పరమలక్ష్యము భగవత్సాక్షాత్కారమే!

౨. రామునకు, అల్లాకు, గాడ్‌కు ఏమీ భేదంలేదు. నామ భేదమే కాని సర్వవ్యాప్తమైన ఆ పరాత్పరుడు ఒకడే!

## ౨౯౯. ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్

[౧. పెషావరు జిల్లాలోని ఉత్మాంజయి అను గ్రామమున ఖాన్ వంశీయుడగు, బహారాంఖాన్‌కు 1890 వ సం. లో, గఫార్ ఖాన్ జన్మించిరి. వీరు బాల్యము నుండియు శాంతి ప్రియుడు, సేవాభావముగలవాడు. దౌర్భాగ్యవశు లంచగొండితనమనిన ఆతనికి తలనొప్పి. అత డొకనాడు ఒక సిపాయివద్ద కేగి, లంచముతో మీ చేతులను మలిన మొనర్చుకొనకుడని హెచ్చరించెను.

౨. గఫార్ ఖాన్, యెప్పుడును మూడవ తరగతి పెట్టెయందే ప్రయాణము చేయును. వెంబడి ఒక చిన్న సంచి మాత్రముండును. అందు రైల్వేగైడ్, ఒక జోడు గుడ్డలు మాత్రముండును. నిరాడంబరమైన వేషము. ప్రశాంతములైనవాక్కులు, పరిశుద్ధత, వినమ్రత,

నిస్స్వార్థత, అతని వదనము(ముఖము)నందు తాండవించుచుండును. అతని నిజముగ పకీరని అనవచ్చును. అతనికి పదవులపై ఆసక్తి ఆవంతయులేదు. 1934 వ సం. లో అతనిని కాంగ్రెసు గద్దె నెక్కింప భారత దేశమంతయు సిద్ధమైనప్పుడాతడు "నేను జన్మతోడనే సిపాయిని. సిపాయిగనే మరణింతును" అని పలికెను. తనకు లభ్యమైన పదవిని నిరాకరించెను. అతనికి దుఃఖము గిట్టదు. అతడు సేవకొరకే జన్మించెను. అందులకే బ్రదుకును, అందుననే సిద్ధినొందును. మహాత్యాగి, ఆధ్యాత్మికుడు. అతనికి వినోదముల పైనను, విలాసముల పైనను రోత. ద్యూతాది వ్యసనములాతనికి పనికిరావు. తుదకు పొగ త్రాగుట కూడ నాతడెరుగడు.]

మతము :

౧. మతమునకు గొప్పతనము దాని ననుసరించు జనసంఖ్య వలన కలుగదు. ఆచరణలో లేని మతవిశ్వాసము వ్యర్థము. ఇస్లాం మతమునందలి ముఖ్య సిద్ధాంతములు సదాచారము, శ్రద్ధ, ప్రేమ. ముక్తి నపేక్షించు వాడొనర్పవలసిన కృత్యములు రెండే. అవి ఏకేశ్వరోపాసన, సత్క్రియాచరణ. ఇదియే ఖురాన్ షరీఫు వక్కాణించుచున్నది.

౨. సర్వ మతములును మూల సిద్ధాంతమునందొక్కటియే యని అతని నమ్మకము. ఆయా మతములుద్భవించిన దేశముల శీతోష్ణాది భేదములచే ఒకటి రెండు భేదము లుండవచ్చునని అతడనును.

3. ఇస్లాం, హిందూమతములు రెండును, మానవుడు శుచిగా నుండవలెననియే బోధించుచున్నవి. కాని దేశకాలములను బట్టి భేదములుండును.

४. భగవంతుని యందును, జాతి యందును, మాతృ దేశమందును భక్తి కలిగి యుండవలెను. ఎట్టి సమయములందును దౌర్జన్యమునకు పూనరాదు. తాముచేయు సేవకు ప్రతిఫల మపే

క్షింపరాదు. అతి ధైర్యముతో సర్వ త్యాగములు చేయవలెను. దోషరహితమగు జీవితము గడుపవలెను.

## ३०० డాక్టర్ రాంచందర్ జీ మహేందర్

౧. చెడ్డపనులు చేయుచును, మంచివాడనిపించుకొనుటకు ప్రయత్నించువాడు, అప్రతిష్ఠపాలు కాకూడదనియు, ధనప్రతిష్ఠలు పోవుననియు, అబద్ధపు గౌరవము పాడగుననియు భయపడుచుండును. ఈ భయములన్నిటిని స్వయము మనమే కల్పించుకొంటిమి. కావున, సర్వభయములను త్యజింపుము. నిజమైన మానవులము కావలెనన్న మనము సంపూర్ణముగా నిర్భయులము కావలయును.

౨. నీ జీవితములో ఎప్పుడైనను నలువైపులనుండి ప్రతికూలము, దుఃఖము పొడచూపుచేని, నీ ఆత్మ స్వరూపమును ధ్యానింపుము.

౩. నీ ఆత్మను బ్రహ్మార్పణ మొనర్పుము. పరుల దోషములను చూడకుము. దుస్సంగము నుండి వైదొలగుము. స్వార్థరహితుడవు గమ్ము. వీనిచే అంతఃకరణము పవిత్రమగును.

౪. స్నేహము, కరుణ, ప్రసన్నత, క్షమ ఈ నాల్గింటిని ఆచరించినచో అంతఃకరణము నిర్మలమగును.

౫. ఎవనివద్ద దాచుకొనుటకు ఏమియు లేకుండునో వాని జీవితము ధన్యము.

౬. ప్రపంచమును బంధింపకుము. నిన్ను నీవు బంధించుకొనుము. సిపాయి ధనాగారమును కాపాడుచుండునట్లు నీ యింద్రియములను జాగ్రతతో కనిపెట్టుము. ఇంద్రియములను పాపవశము కానీయకుము. వాటిని వశపరచుకొనుము. లేనిచో ధర్మమను ధనాగారమపహరింపబడును.

౭. అబద్ధమాడువాడు ఆత్మద్రోహియగును. అట్టివాడు ఎల్లప్పుడు రోగములచే దుఃఖము లనుభవించుచుండును.

౮. అవసరము కంటె అధికము మాటలాడరాదు, అట్లు మాట్లాడిన మాటకు విలువయుండదు. దాని పరిణామము కూడ బాగుండదు.

౯. సంసారుల హేళనకును, సంతోషమునకును, నిందలకును నీ వాలోచింపకుము. నీ నిజమైన సత్యకర్మములను ఆపకుము.

## ౩౦౧ ప్రొఫెసర్ అద్వైతి

౧. ఇపుడు నీకే సంసారము నరకముగను, దుఃఖరూపముగను కనిపించుచున్నదో దాని నాత్మజ్ఞానముచే సుందరముగను, స్వర్గముగాను మార్చివేయుము. స్వయము ప్రసన్నుడవై ఇతరులను ప్రసన్నుల జేయుటే ఆత్మదర్శనము.

౨. నీ వెచ్చటనుందువో అచ్చట సత్యముగా, సుందరముగా ప్రేమతో ప్రవర్తించుటకే జీవింపుము. నీవు దీనికొరకే జన్మించితివి.

3. సృష్టివలన నీకే శక్తి లభించినదో, దానిని సరిగా సదుపయోగము చేయుదువేని ఆనందము దానంతటనదే నీలో నుండి ప్రకటమగును. ఆనందమును బయట వెదకుట మూర్ఖము, అజ్ఞానము.

౪. ప్రతి పనియందు జ్ఞానము, ప్రేమ ఉండి తీరవలయును. జ్ఞానము దారి జూపును. ప్రేమ ఆపనిని సుందరముగా చేయించును.

౫. బాహ్యాంతరమున నీ వొక్కడవే కలవు. ఇక నెవరిని ధ్యానింతువు? ప్రతిచోట నీవే నీవు కలవు. నీకంటె వేరొకడు గలడని తలంచుటే భ్రమ.

౬. కీర్తి ప్రతిష్ఠలకు సంతోషించువాడు మూర్ఖుడు.

౭. నీవు ఒకడవే జీవించుటకును, ముక్తుడవగుటకును యిచ్ఛగించుట స్వార్థము, అజ్ఞానము. పరులకొరకు జీవించుటే జ్ఞానము. అందరి మేలుకొరకే జీవింపుము. ఆత్మభావము ననుసరించితివా బాగుపడెదవు. మొదట నీవు బాగుపడి, పిదప ఇతరులను బాగుజేయుటకు ప్రయత్నింపుము.

౮. విలాసవస్తువులే దరిద్రమునకు దారిదీయును. భోగలాలసుడవై షద్రుచుల కాశించి జీవింపకుము. ఇతరుల కొరకే జీవింపుము.

౯. నిజమైన ఆకలికంటె, రుచికాశపడి ఒకముద్దైన ఎక్కువ తింటివా, నిజముగా ఆ ఒక ముద్దయే నీ జీవితమును హరింపజేయును. ఇటులే సర్వ విషయ వాసనలు వర్తించునని తలంపుము. సుఖ భోగముల వెనువెంట పరువులెత్తుట పశువుకంటె హీనము.

౧౦. కనబడుచున్నదంతయు ఆయన రూపమే. సమస్త ప్రపంచము ఆత్మదర్శనమునకు మహా గొప్ప దర్పణము.

౧౧. మానవుడు తన లోటును పూర్తిచేసికొనుటకు ఏ స్వర్గమును వెదకుచుండునో, ఆ స్వర్గమును ఈ లోకములోనే ప్రతిష్ఠింపవచ్చును. అది స్వార్థము విడిచి, నేను అను అహంభావమును నశింపజేసికొని, అందరిని తనవలె తలంచి, ప్రేమతో మెలగుటే సత్యం శివం సుందరమనబడును. ఇదే స్వర్గము. దీనిచే మానవుని కొరత తీరును.

౧౨. అందరిని సన్మానింపుము. సన్మానము లేని జ్ఞానము వ్యర్థము. సన్మానమువలననే ఆత్మశక్తి పెరుగును. హృదయములో న్యాయము, సత్యము, ప్రేమ యుండవలయును.

౧౩. మానవుడు కేవలము తనకొరకే జీవింపరాదు. వ్యక్తిగత శరీరము విశ్వము నుండి విశ్వము కొరకే లభించినది. కావున సర్వశక్తులను విశ్వముకొరకే వినియోగించుట మానవుని కర్తవ్యము. జీవితోద్దేశ్య మిదియే.

౧౪. హృదయకవాటమును విప్పుము. భేదములేక, నిశ్చింతుడవై, భయరహితుడవు గమ్ము. అంతఃకరణమును పవిత్ర మొనర్పుము. నేను, నాది అనుదానిని పరిత్యజింపుము. దుఃఖములకు భయపడకుము. దుఃఖములే నీకు మేలు చేకూర్చును. దీన దుఃఖితు

లకు సేవచేయుము. ఎవరిని మోసపుచ్చకుము. అందరిని ప్రేమిం పుము. ఎంతవరకు యితరులపై ఆధారపడియుందువో, అంతవరకు నీకు ఉన్నతి చేకూరదు. అదేమగునో, కొంచెము నిరాశ్రితుడవై చూడుము. దేహము, మనస్సుల ఆహారము ప్రాకృత జగత్తులో కలదు. కావున యితరులను యాచించుట హీనము నీవు నీ ఆత్మ స్వభావమునసుసరించి జీవింపుము.

౧౫. గుణములనుబట్టి చూచినచో, మానవునికి ఈశ్వరునకు అత్యధిక భేదముండ వచ్చును, కాని జీవేశ్వరుల యిద్దరి స్వరూప ములో భేదముండనేరదు. జీవుడు క్షుద్రుడని మతము బోధించును, జీవుడే దేవుడని ధర్మము బోధించును. నీవు జపము చేయదలంతు వేని "ఓం, సత్, చిత్, ఏకం బ్రహ్మ"మను మహా మంత్రమును, నిత్య నిరంతరము జపించుచుండుము. కాని కడుజాగ్రతతో మెలం గుము, నేను, అతడు ఒకటే. ద్రష్ట, దృశ్యమంతయు ఒకే బ్రహ్మము, అను దానిని మరువకుము. సదా దీనిని కడు జాగ్రతతో కనిపెట్టి యుండుము.

## ३०२ శ్రీ వైద్యనాథశాస్త్రి

౧. నీ నియమములలో నీవు స్వతంత్రుడవై యుండుము. సంసార నియమములలో పరతంత్రుడవై ప్రవర్తింపుము. అనగా లోకము నీ యిష్టానుసారము నడువవలెనని కోరకుము.

౨. భగవద్భక్తుడు యెంత గొప్ప వాడగునో, అంత మాష ణము, దుఃఖము, కష్టము సంభవించును. వాటిని సహించి పరీక్షలో నెగ్గిన వాడే పరమ భక్తుడు.

3. తొమ్మిది (9) వలె ప్రేమ గలవాడవు, బలవంతుడవు గమ్ము. అనగా, తొమ్మిదితో, రెండు (2) ప్రేమచే వచ్చికలిసెనా తనలో కలుపుకొని తాను నశించి ఆ రెండును నిలుపును. ఆ రెండు ద్వేషముతో వచ్చెనా, దానిని నశింపజేసి, తాను నిలచి యుండును. ఎట్లన $9+2=11$, $1+1=2$ నిలచియుండును. '౯'

సమాప్తమగును. ఇదే నిజమైన ప్రేమ ఆ రెండు (౨) ద్వేషముతో వచ్చెనా 9×2=18, 1+8=9 అనగా తొమ్మిది స్థిరమగును. రెండు నశించును. ఈ అంకెలవలె ఇతరులను రక్షింపవలయును.

### ౩౦౩ శ్రీ బైరాగి బ్రహ్మచారి

౧. ఓ మానవుడా! నీకనేక కోరిక లుండవచ్చును. అవన్నియు ఫలించవలెనని నీకుండును. కాని నీకవి వాంఛారహితుడవైనప్పుడే సిద్ధించును.

౨. ఎంతకాలము నీ కోరికలను నీలో దాచుకొందువో, అంతకాలము నీకు శాంతి భద్రత లుండనేరవు. నీ కోర్కెలను త్యజించినప్పుడే నీకు రెండు విధముల ప్రశాంతము చేకూరును. ఒకటి, శాంతిని తక్షణమే అనుభవించుట, రెండవది కోర్కెలు తుదకు ఫలించుట.

3. ప్రతి వస్తువులోను ఆనందము కలదు. కాని ప్రతివాడు దానిని కనుగొన లేడు.

### ౩౦౪ గీతాచార్య అగ్రజ సత్యనారాయణశాస్త్రి

౧. అహంకారము తొలగనంతవరకు అద్వైతము బోధపడదు. అద్వైత మలవడనిదే మోక్షము ప్రాప్తించదు. వైరాగ్యము లేనిదే ముక్తి చేకూరదు.

౨. భగవంతుని గురించి ఏడ్చిన ఏడ్పు విషాదయోగమనబడును. స్వార్థమును గురించి ఏడ్చిన ఏడ్పు దుఃఖమనబడును.

3. సంసార సముద్రమును దాటుటకు నవరంధ్రములు గల శరీరమను నావ ప్రాప్తించినది. కావున ఆలసించక దీని ద్వారా శీఘ్రముగా దాటుము. ఎందుకనగా ఈ చిల్లుల పడవ ఎప్పుడు మునుగునో ఎవరి కెరుక?

౪. ప్రారబ్ధకర్మ నెమరించక అనుభవించుచు, దానిలో చిక్కక, 'అహం బ్రహ్మాస్మి' యను భావముతో ధ్యానించువాడే స్థితప్రజ్ఞుడు. అని గీతా సిద్ధాంతము. ఇదే సరళ సాధన.

౫. కర్మలోని బాధలు ఆత్మపై పడకుండ, వివేకముతో కర్మలొనర్చుటే కర్మయోగ మనబడును.

౬. ఆది, అంతములందు సమబుద్ధికలిగి స్థిరమై యుండుటే సమాధి యనబడును.

౭. ఆత్మ భావముతో జేయబడు కర్మయే నిష్కామకర్మ. ఆత్మ భావాభ్యాసమున, మనస్సు బాహ్యమున తిరుగనేరదు. ఆత్మను దర్శించుదామను కొన్నను దానికి ఆత్మస్థితి తెలియదు. అప్పుడు దానికి అటుయిటు యేమియు ఆధారము కనిపించక కట్టెలు లేని అగ్నివలె ఉన్నదున్నట్లే నశించును. అనగా మనస్సు శాంతిని పొందును, స్థిరమగును.

౮. ద్వారకావాసా, అనగా శరీరమే ద్వారక, దానిలో నివసించువాడే ద్వారకావాసుడు.

౯. దీపమును మ్రింగుటకు వచ్చిన మిడుతలు, ఆ దీపజ్యోతిలోపడి చచ్చునట్లు, రాక్షసులు భగవంతుని చంపుదామని వచ్చి వారి క్రోధాగ్నిలో పడి వారే చత్తురు. కాని భగవంతుడు చంపువాడు కాని,పక్షపాతము వహించువాడు కాని కాడు. అతడు కేవలము సాక్షిమాత్రుడే.

౧౦. విద్యకు మొదలు "అ" అంతమునకు "హ" ఈ రెంటి మధ్యనగల అక్షరములన్నియు నామమాత్రములే. దీనిచే 'అహం' నేను అను తత్త్వము బయలుపడును. కాన ఇదే సత్యమైన విద్య. ఈ విశ్వమంతట (నేను) 'అహం' బ్రహ్మము తప్ప మఱొకటి లేదు.

౧౧. ఘటాసక్తి గలవానికి మట్టియందు తొందరగ బుద్ధి పోనట్లు, దేహాసక్తిగల వానికి నిరాకారోపాసన చాలకష్టము.

౧౨. కలము పాళీ రెండు చీలికలు గల్గియున్నను, వ్రాయునప్పు డది ఒకే గీత గీయును. ఇదే అద్వైతము. అటులే జగత్తు

## ३०३ యస్. ఆర్. యోగి

౧. కామి బద్ధుడగును. నిష్కామి ముక్తుడగును. అమితాశ దరిద్రమును, యథాలాభ సంతుష్టి ఐశ్వర్యమును ఇచ్చును.

౨. దేహాభిమానము బాధకు హేతువగును. నేను నాది యను అభిమానమే దుఃఖమునకు హేతువు.

౩. వనితా విత్తభ్రాంతులు నీచత్వము నిచ్చును. అపకీర్తి కన్న మృత్యువు మేలగును.

౪. మనోజయుడు జగజ్జయుండగును. సత్ప్రవర్తన మలంకారమై ఉత్తమ జీవితము నిచ్చును.

౫. కామ వికారము నొందనివాడు మహా శూరుడగును. ఇహపరములను చక్కబెట్టువాడు గురువగును.

౬. స్త్రీలచే నాకర్షింపబడనివాడు ధీరుడగును. దాన ధర్మ సత్సంగాది, సంతసోల్లాసములు పరమాత్మని జూపును.

౭. విషయానందములెల్ల ఘనవిషములగును. ధైర్యసాహసోల్లాసములు కార్యజయము నిచ్చును.

౮. వినయ విధేయత ఉత్తమ వ్రతమగును.

౯. నిర్మలత్వముచే ఆత్మసాక్షాత్కారముకలిగి ఇహపరము లెల్లయు గోచరించును.

౧౦. దయాపూరితమైన సద్వాక్కు ముఖాలంకారమై యొప్పును.

౧౧. మనస్సు నశించిన మోక్షమబ్బును. మనోవాక్కాయములను జయించినవాడు జితేంద్రియుడగును.

౧౨. దానము పరిమితినిబట్టి ధనము, శీలసుఖము లుండును.

౧౩ స్వాత్మను గన్నవాడు సర్వజ్ఞుడగును. ఆత్మానందము నిచ్చు కార్యములు సదా చేయదగియుండును.

౧౪. నీ సర్వ శ్రేయము నీ వీర్యముపై ఆధారపడియున్నది. దానిని పెంపు చేయుము.

౧౫. బ్రతికియున్నంతవరకును నీ అవసరములను తగ్గించు చుండుము.

౧౬. ఓర్పు, ప్రేమలతో క్రోధ నిరోధివి కమ్ము.

౧౭. పరిచారకులను మానివేసి పరిచర్య చేయుము.

౧౮. నిద్రించునపుడు, దినచర్య నెల్ల జ్ఞప్తికి తెచ్చుకొని దైవధ్యానము చేయుము.

౧౯. ద్వేషరాహిత్యము అహింసాచిహ్నమై యున్నది.

౨౦. మనోవాక్కులను నిష్క్రియగా నుంచువాడు మౌని యనబడును. నోటి మాట నాపి, మనస్సుతో పని చేయువాడు మౌన భ్రష్టుడగును.

౨౧. నీ సంకల్పము లెట్టివైన నీ కర్మలును అట్టివే యగును. ఆ సంకల్ప సమూహములే నిన్నావరించి, నీతో తమ పనులను జేయించుచుండును.

౨౨. నిర్జనారణ్యమున దైవధ్యానము సలిపిన, సఫలమనస్కుడ వగుదువు. లేనిచో అన్యసంకల్ప స్పర్శచే భ్రష్టుడవై నిరర్థకుడ వగుదువు.

౨౩. ఏ దేవునైనను స్మరించినతోడనే వారు ప్రసన్నులై మన యెదుట నిలుతురు. కాని వారిని దర్శించుశక్తి మనకన్నులలో లోపించియుండును. ఈ దర్శనశక్తిని పెంపుజేయుటకై వెలుతురును బడయుము. ఆ వెలుతురుకు మూలము విద్యుత్తు. దానికి నిధి సూర్యుడు. కాన ఆయన నర్చించుట పరమ ధర్మమై యున్నది. సాకారమున కాది రూపమీ నారాయణుడే.

౨౪. పరితాప దుఃఖములందు నివాసస్థలమును మార్చుము. దానిచే సుస్థిరతయు దుఃఖశమనమును కలుగును.

౨౫. దేహ స్థిరత్వమును బట్టి మనోస్థిరత్వముండును. కాన ఆరోగ్యముపై ధ్యానముంచుము.

౨౬. ఆరోగ్య విద్య మొదటిదియు, మానసిక విద్య రెండవదియు, ఆత్మ విద్య మూడవదియునై యున్నది. కావున సక్రమముగా విద్యలను బడయకున్నచో అక్రమ జీవితులమై భ్రష్టులము కావలసియుండును.

౨౭. నీకు కావలసినదెల్ల నిన్ను నీ వడుగుము. మనోఫలసిద్ధి నొంది సంతసింతువు. సమయమును, స్థానమును, విధానమును సైతము నీ యాత్మయే నీకు బోధించును.

౨౮. ధ్యాన నిష్ఠలందు శరీరమున వేడిమి కలుగును. ఆహార విహారాదులు ఉష్ణశమనముగా నుండవలయును.

౨౯. సూర్య స్వరము వేడిగాను, చంద్రస్వరము చలువగాను నుండును. భగవధ్ధ్యానపరులు వీనిని సదా ఆచరణలో నుంచవలయును. ధ్యాన సమయమున చంద్ర నాడి నడుపవలెను.

౩౦. షడ్రుచులలో ఉప్పు, కారము, పులుపు, వగరు, చేదు–ఇవి ఉష్ణముగాను, మధురము చలువగాను నుండును.

౩౧. ఉషః పానము ఆరోగ్యదాయినియై యున్నది.

౩౨. షట్చక్ర సంయమముచే శారీరిక, మానసిక వ్యాధులెల్లయు నిర్మూలింపబడును.

౩౩. ఎల్లప్పుడును, మనరూపమును అద్దమున జూచుచు మరువకుండిన, ఆత్మ దర్శిత్వము కల్గును.

౩౪. మన పనులనెంత తగ్గించిన నంతయే మనోస్థిరత్వము కల్గును.

౩౫. ప్రాణులెల్లయు, నిద్రించునపుడు నిస్సంకల్పాభ్యాసము సలిపిన సమాధి కలుగును.

౩౬. జితేంద్రియత్వముచే భగవత్సాక్షాత్కారము కల్గును.

౩౭. హృదయస్థానము భగవదాలయమై యున్నది. దానినపవిత్ర పరచువాడు శిక్షాపాత్రుడగును. పవిత్రముగా నుంచువాడు వాని అమృత పుత్రుడై ప్రకాశించును.

1. సూర్యనాడి (కుడి ముక్కు) నుండి వచ్చు శ్వాసవేడిని కలిగించును. చంద్ర నాడి (ఎడమ ముక్కు) నుండి వచ్చు శ్వాస చల్లదనమిచ్చును. అభ్యాసమునకు మొదట సాధకుడు భోజన సమయమునను, మలవిసర్జన సమయమునను ఎడమ ముక్కులో దూది పెట్టవలయును. దానిచే సూర్యనాడి నుండి శ్వాస వెడలుటచే భోజనము సులభముగా జీర్ణమగును. జపధ్యానాది సమయములందు కుడిముక్కులో దూదినుంచి, చంద్రనాడిని నడిపించిన చలువ గల్గును.
2. రాత్రి పరుండు నప్పుడును, తెల్లవారి నిద్ర లేవగానే చల్లని నీటిని త్రాగవలెను.
2. ఉదయమున లేవగానే నాభిపై దృష్టినుంచు చున్నచో జఠరాగ్ని పెరుగును.
4. ఆకలి లేకున్నను, అజీర్ణము మలబద్ధమున్నను సూర్యనాడినే నడుపవలయును.
5. పసుపు పచ్చని రంగుగల సీసాలో నీళ్లు పోసి, నాలుగు గంటలు యెండలో నుంచుము. అందు ఆవిరి జనించిన పిదప, చల్లార్చికొని, రాత్రివేళ అట్టి నీటిని త్రాగిన మలబద్ధము పూర్తిగా నివారితమగును.
6. ఆహారము. 4 తులములు పెసలు, 2 తు. సెనగలు, 1 తు. గోధుమలు వీని నన్నిటిని నీళ్లలో నానబెట్టి మొలకలెత్తిన పిదప భుజించినచో మంచిది.

## ౩౦౭ శ్రీ బి. యస్. మూర్తి

౧. మనలో రెండు విధముల అహంకారములు గలవు. ఒకటి సత్యమైన ఆత్మ, రెండవది అసత్యమగు మనస్సు.

౨. మౌనముద్వారా లోక కల్యాణము చేయవచ్చును, ఇదే నిజమైన ప్రచారము. దీనిచే ప్రజలపై బాగుగా ప్రభావముపడును. శక్తిహీనమైన పొల్లుమాటలతో ప్రభావముపడదు. ఇప్పటియుగమునకు, మెహర్ బాబావంటి సత్పురుషు డవసరము.

3. నిజమైన "అహ"మే ఓంకారస్వరూపము.

४. సంసారారంభము కూడా మౌనమునుండే యైనది. దీని అంతముకూడ మౌనములోనే యగును.

ჯ. ఏకాంత వాసము, ఉపవాసము, సహవాసము, ఈ మూడును సాధనలే. ఏకాంత వాసమనగా ఏకాంతములో నే నెవడ నని విచారించుకొని తన్నుతాను తెలిసికొనుట. ఉపవాసమనగా మనస్సులో విచారములు, సంకల్పములు లేకుండజేసి నిర్మలము జేయుట. సహసవాసమనగా పై రెండింటిని ఆచరించిన ఈశ్వర సహవాసము చేకూరును.

౬. నీవు నీ నుండి అసంగుడవు గాక నిన్ను నీవు విచారించు కొనుము.

౭. మొదట నీవు శూన్యుడవు కమ్ము. గుణాతీతుడవు కానంతవర కేదియు సిద్ధించదు.

## ३०८ా శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

పరమార్థ సాధన :

౧. భగవంతుడు పరిపూర్ణ ప్రభావము గలవాడు. ఇది వివిధ రీతులందు వ్యక్తమగును. సత్యమ్, శివమ్, సుందరమ్ అను పరమాదరము లందు ప్రకటితమగును. వీనిపై మనస్సు నిలిపినపుడు వీని శక్తులు జిజ్ఞాసువు హృదయమునందు ప్రభాకలితములై పరిఢ విల్లును. ఏకాగ్రదృష్టి అవిచలితధ్యానము, అచంచలనిది ధ్యాస నము, గభీరసమాధి- ఈ శక్తు లంతరంగ మందు ప్రవేశించుటకు నిమిత్తము లగును.

౨. సృష్టికర్తచే 'శభాస్' అనిపించుకొను మహనీయుడే ఆదర్శసాధకుడు. సాధకుని ధృతి నవలోకించి దుర్దాంతారిష్టములు సిగ్గువడి చీకటి మూకలతో పటాపంచలుకావా? "నేను నీ దానను" అని విజయలక్ష్మి సుగంధ బంధుర ప్రసవమాల్యముతో నాతని కంఠసీమ నలంకరించును కదా!

౩. మానవుడు స్వతస్సిద్ధముగ దైవీవిభూతి గలవాడు. దైవీ శక్తికసాధ్యమైన దేది? ఈ శక్తి భక్తుని హృదయమున పరంజ్యోతి వలె కాంతిల్లును. ఈతని భావశక్తి అనిర్వచనీయము. భావనాప్రజ్ఞ అత్యద్భుతము. ఈ శక్తి సంస్పర్శవలననే కదా! స్తంభము నుండి నృసింహస్వామి వెడలెను. ఈ ప్రభావము వలననే కదా శివలింగము నుండి పరమశివుడు ప్రత్యక్షమైనాడు! ఈ దైవీబలము వలననే గదా రాతినుండి నాతి గోచరించెను.

౪. సాధుపుంగవుల సంస్పర్శ, సంసర్గ, సాంగత్య, సహచర్య ప్రభావము వలన దుష్టులు శిష్టులగుచుందురు. పంకిలము అపరంజి యగును.

౫. నేటి ప్రపంచ నాగరికత ఉష్ణభావములతో నుడుకు చున్నది. అనంతయుగముల నాటి మానవ సంస్కృతి దావానల మందలి కణమువలె (ఆటమ్ బాంబుల ప్రయోగమువలన) జ్వలింప నున్నది. సభ్యతా పీఠమునుండి ఈ ఘోరవిపత్తును తుడిచివేయవలె ననిన సమస్త సాధకుల సంయుక్త సమధిక ప్రయత్నము నేడెంతేని అవసరమై యున్నది. మన దేవస్థానములును, మఠములును, ఆశ్రమములును, విశ్వకళాపరిషత్తులును చెప్పనేల, సమస్త జీవన వ్యవస్థలును సాధనాలయములు కావలసిన ముహూర్త మిది. మహర్షి విశాల జీవన దిశావలయమునుండి తేజరిల్లు అధ్యాత్మశక్తివలె పరమార్థ సాధన సముద్భవ ప్రభావము మనుష్యలోకమున నీశ్వర సామ్రాజ్యమును వెలయించును గాక!

౬. హృదయశక్తి లేక కేవలము ఒకే మేధాశక్తి గల వాడు రాబందు వంటివాడు. హృదయశక్తియు, మేధాశక్తియు రెండును కలవాడు హంసవంటి వాడు.

## ౩౦౯ యతి, శ్రీ నిర్మల్ కుమార్‌జీ

౧. ఓ మానవుడా! నీవు తొలుత మానవుడవు కమ్ము. నీకు ఎవ్వరును ద్వేషులుగా నుండరాదు. ఈర్ష్యా గర్వములు

పనికిరావు. అహంకారము నరకమున పడద్రోయును. ధనసంపత్తు లకు యజమానివి కాబోకుము. వాటికి ధర్మకర్తవుగా వ్యవహ రింపుము.

౨. ఒకడు నీటిలో మునుగునపుడు వానిపై నీరు ఆవరించి యుండును. కాని వానికి ఆ నీరు ఏ మాత్రము భారము (బరువు)గా తోచదు. దానిలోనుంచి కొంచెము నీటిని ఒక పాత్రలో నింపి దానిని తనదని భావించి నెత్తిపై పెట్టుకొని పోవుచో ఆ కొద్ది జలమే గొప్ప భారమై తోచును. అటులే సీమితమైన అహంకారమే భారభూతమైనది. నీదనునది యేదియు నుండరాదు. దేనికిని నీవు కర్తవు భర్తవు కాబోకుము. అంతయు భగవంతునిదిగా భావింపుము. అందరిలోను భగవంతుని దర్శింపుము. అందరిని నీ ఆత్మగా తలంచి వారిని గౌరవింపుము.

౩. ఓ సోదరా! ప్రేమచేతనే ముక్తి లభించును. భేద భావమును వదలుము. ద్వైతభావమును వీడుము. క్రోధమే చండా లము. కావున, క్రోధమును త్యజింపుము.

౪. విరక్తుడవై ధనసంపత్తులను, స్త్రీ పుత్రాదులను త్యజింప కలుగుదువు. కాని కీర్తి, ప్రతిష్ఠలను విడనాడుట నీకు మిక్కిలి కష్టముగా తోచును. మాన మర్యాదలను విడచుటే నిజమైన త్యాగమును, విరక్తియును. వాసనా త్యాగములే ముక్తికి మూల ములు. వీనివలన అంతఃకరణము నిర్మలమగును. నిత్యము పరోప కారివై వర్తింపుము.

## ३౧० జోడ్పూరులోని ఒక టాంగావాలా

స్వయముగా మనము కష్టము లనుభవింపవలయును. కాని పరులకు బాధ కలిగింపరాదు. ఇట్లు ప్రవర్తించుటే పరమ ధర్మము. ఇదియే మత సిద్ధాంతము.

## ౩౧౧ భక్త గండయ్య

[వీరు మొదట సైన్యములో ఉద్యోగిగా నుండిరి. ఉద్యోగ వృత్తియం దిచ్ఛలేక కులవృత్తియగు మంగలి పనిని చేయుచు దానిలో లభించు ద్రవ్యమునుండి కొంత భాగము, దరిద్రులకు గుప్తముగా దానము చేయుచుండువాడు]

౧. మంచి మంచి, రుచిగల పక్వాన్నముల కాశించి పరుల సొత్తు తినుటకంటె స్వయముగా కష్టపడి సంపాదించిన యెండిపోయిన రొట్టెముక్కలను తినుట మంచిది. విందు గుడుచుటకు పరుల గృహములకు జనుట ఉచితము కాదు.

౨. భగవంతుడు నాయందు కృప తలచి నన్ను ధనవంతుని గృహములో పుట్టించ లేదు. ఇది అతని దయయే. ధనముచే, అహంకారాభిమానములు కలిగి మానవుడు పతితుడగును.

౩. కష్టపడి సంపాదించి ఇతరులకు పెట్టి పిదప తాను భుజించుటే ఆత్మ సంతోషము. ఆత్మసంతోషమే వెలలేని ధనము.

౪. ప్రపంచ ప్రజలు, స్వార్థపరులు. మన వెంట వచ్చు వారొకరును లేరు. అట్టి అనిత్యమైన సంసారముతో సంబంధము పెట్టుకొనుట వెర్రితనము.

౫. నేను సేనలో ఉద్యోగిగా నున్నపుడు అనేక దేశములను తిరిగితిని కాని, నా కెందును సారమేదియును కనుపించ లేదు. ఎక్కడను శాంతియు లభించ లేదు.

## ౩౧౨ శ్రీ గోపాలకృష్ణయ్య

ప్రార్థన:

౧. ప్రార్థన అనగా, అంతర దైవబంధము. ఆత్మ శుద్ధికి, పవిత్రతకు దేవునకు పెట్టుకొను మొర. అజ్ఞానము నుండి ఆత్మను విడిపించుట. నిత్యజీవితము భగవంతునితో జోడించుట. ఆత్మను జాగరణ చేయనిచో, జపమెంత చేసినను వ్యర్థమే. హృదయము లేని

మాటలు సారహీనములు. హృదయముతో ప్రతిక్షణమును, జీవితమంతయు ప్రార్థించవలసినదే! ప్రార్థనతో దినచర్య మొదలిడుము. ప్రార్థన క్రియారూపమున నిన్ను సాయంకాలము వరకు విడువకుండును గాక! నీ దినచర్యను అలాగే ప్రార్థనతో ముగించుము. ప్రార్థన యేరూపముతో నున్నను దైవముతో సంబంధము కలిగించునదిగా నుండవలయును. మనము నిరహంకారులుగ, బోలుగ మారవలయును. భగవంతుడు మనలనుండి పూర్ణ ఆత్మత్యాగము కోరును గాని, బేరముకాదు. ఆత్మకు ఆహారము ప్రార్థన. ప్రార్థన లేక ఆత్మ నిలువలేదు. ప్రార్థన లేని జీవితము సారహీనము.

౨. ప్రార్థన యనగా తన అయోగ్యతను, శక్తి హీనతను ఒప్పుకొనుట, నిరహంకారమును పొందుట, భగవంతునిపై ఆధారపడుట. ఆయనకు అనంతనామములు కలవు. కావున ఆయనను మన యిష్టము వచ్చిన పేరుతో పిలువ వచ్చును. ప్రార్థన చేయువారు, హృదయమును పరిశుద్ధము చేసికొనవలయును. ప్రార్థనమయహృదయమే, సాధనము.

౩. న్యాయధర్మములతో జీవించుటే ప్రార్థనకు సరియైన రూపము. హృదయపూర్వక ప్రార్థన ఒక్క నిమిషమయినను చాలును. హృదయపు తీవ్రవాంఛ ముఖ్యము. ప్రార్థనలో గడపిన కాలమే ప్రశస్తమైనది. ఇది, మానవ జీవితమును నిర్మలము, వినయ పూర్ణముగ మార్చి భగవంతునియెడ విశ్వాసమును కలుగజేయును.

౪. భగవంతుని సత్యము, ఆస్తికతతో నిండిన మహానుభావులకు సేవచేయుటయే ప్రార్థన యగును. స్వార్థపరులకు, పాపులకు భగవానుని అనుభవము లోనికి తెచ్చుకొనువరకు ప్రార్థన అత్యవసరము.

౫. ప్రార్థనలోని ప్రతియంశము ఆచరణలోనికి వచ్చుటే నిజమైన ప్రార్థన.

౬. మనము నమ్మకమువల్లనే జీవించుచున్నాము. నమ్మకమునుండి ప్రార్థన బయలుదేరుచున్నది. భగవంతుని వద్దకు నిరహంకారివిగ జేరుము. ఏ దాపరికము లేకుండా భగవంతుని ఆశ్రయించుము. అతడు నిన్ను ఎట్లు ఉద్ధరించునో యను విచారము, అనుమానము వదలుము. సత్యమే భగవంతుడని నమ్ముము, సత్యవ్రతుడవు గమ్ము.

## ३౧३ భక్తసరస్వతి గోవిందరాజు

౧. భగవత్కృపచేతను, బహుజన్మార్జిత పూర్వ పుణ్యముచేతను దుర్లభమైన మానవజన్మ లభించినందులకు గాను మానవులు ధర్మప్రవర్తకులై, సంపద, సంతతి ఋణానుబంధ రూపమని గ్రహించి అహంకార మమకారములకు లోబడక, చేసిన పాపమునకు పశ్చాత్తాపపడి, యికముందు అట్టి దుష్కృత్యములను జేయక, విషయ విరక్తులై భగవదాసక్తులై ఈ ప్రపంచమనే భవరోగమును బాపుకొనుటకు భగన్నామమనేఔషధము, సత్పురుషులు సద్గ్రంథములనే అనుపానము, సత్యము ధర్మమనే పథ్యము, నిష్కామసేవ సత్కర్మములనే బలవర్థక ఆహారమున స్వీకరించి తరించగలరని మనవి.

ఓం శాంతిః శాంతిః శాంతిః

